# సింగిడి

తెలంగాణ ముస్లిం ప్రత్యేక సంచిక

ద్వితీయ సంచిక

ఆఖరి విద్రోహదినం 2010

**సంపాదకులు**

సంగిశెట్టి శ్రీనివాస్

సుంకిరెడ్డి నారాయణరెడ్డి

స్కైబాబ (ఎస్.కె. యూసుఫ్‌బాబ)

పసునూరి రవీందర్


సింగిడి

తెలంగాణ రచయితల సంఘం

తెలంగాణ


www.etelangana.org

SINGIDI
Telangana muslim special issue
Last betrayal day
November 1, 2010

Editors:
sangisetti srinivas
sunkireddi narayana reddi
skybaba
pasunuri ravinder

Editorial Board :
Shajahana
Ashala Srinivas
Eleshwaram Nagabhushanacharya
Kasula Prathap Reddy
Jilukara Sriniva

cover painting: akbar
cover design: rowshni graphics
illustrations: akbar

price: 20/-

copies available at
sangisetti srinivas, 13-6-434/B/38,
Himagiri avenue, flat No. 305,
Omnagar, Mehdipatnam ring road,
Hyderabad, 500 008.
mobile: 9849220321

and
all leading shops

Feed back:
www.singidi.telangana@gmail.com

Printed at:
Rowshni graphics,
amberpet, Hyderabad.
mobile: 9246172133



**బహుజన మేధావి, విద్యాధికుడు, అస్తిత్వ ఉద్యమాలకు, వెన్నుదన్నుగా నిలిచిన కొత్రున్నను, అతివెనుకబడిన కులాల నుండి వచ్చి కవిగా, వ్యాసకర్తగా, వక్తగా, యూనివర్సిటీలో ఇంగ్లీష్ ప్రొఫెసర్‌గా ఎదిగిన కొత్రున్నను తలుచుకుంటూ...**

# తండ్లాటకు సలాం...

కనుకొనల మీద దుఃఖం
సముద్రమై కొట్లాడుతంది..
రగిలి పొగిలిన బాధంత
గొంతు అరల్లోనే గడ్డకడుతంది!

సావు ఎవలకు మాత్రం తప్పదని...
ఈ కుములుడు..?

డప్పు మీద దరువు
ఎందరి దుఃఖాన్ని పలికిస్తుంటే వినలేదని
అందరూ మట్టి కలిసెటోళ్ళేనని
ఎన్ని బొందలు తవ్వుతుంటే చూడలేదూ..
కాలుతున్న శవాల పక్కన
కాపలా కాసే కాటికాపరి గుండెలకు
ఎన్ని సొర్లు లోలోపలే సలాం చెప్పలేదు...
ఇన్ని సావులను చూసి... ఏడుపును
నాలోనే సమాధి చేసుకోవాలనుకున్న!
నిర్ణయం నీటి మీద రాతైంది..

చేతిలో చెయ్యేసి... మనమంతా ఒక్కటని
కలిసే కడదాకని... బాస చేసి
మూడువేల యేండ్ల కుత్రల మీద
అప్రకటిత యుద్ధం ప్రకటించి
అన్నల్లమ్ముల్లమై నడిసినం..
ఇదిగో, ఇక్కడిదాకే అన్న గొంతుక
అర్ధాంతరంగా అదృశ్యమైనప్పుడు
కరుడుగట్టిన హృదయం
పచ్చికుండై నిలువునా కూలిపోతున్నది

అచ్చరం అందలమెక్కించినా
సాకిరేవు గోసను యదల్లమరువని గుండె
దండుగట్టి మందిల ముందు నడిచింది

చాకిరేవు బండకాడి.. సప్పుడు దెబ్బకు
జంధ్యాలు జడుసుకున్నయి
అగ్రహారాలు అదిరిపడ్డయి
పీఠాధిపతుల పునాదులు కదిలినయి
నిద్రలేని రాత్రులే వాళ్ళకు మిగిలినయి

మైలదీసే మర్మమెరిగిన యోగి
చాతుర్వర్ణ సిద్ధాంతం
చెంపలు వాయగొడుతుంటే
డప్పులు, చెప్పులు, చాకిరేవు బండల
గుండెలు మురిసినయి
ఊరవతలి గుడిసెల ఎదలు ఎగిసిపడ్డయి
మాకో చాకలి ఐలమ్మ వారసుడు పుట్టిండని
సంబురపడ్డయి

పొద్దు..
పొడిసిన తావుల్నే మాయమైంది..
మనువాద మైలతీసే పని మా భుజాల మీద పెట్టి
అలిసిన మస్తిష్కం... శాశ్వతనిద్రలోకి ఒరిగింది!

మనువుగాడు లేని రేపటి లోకంలో
చాకిరేవుకు చెదరని స్తూపం కడుతం..
మా డప్పుల మీద మన బహుజన పాటకు పట్టాభిషేకం
చేస్తం..
కొత్రున్న... నీ తండ్లాటకు సలాం...
నీ తగువులాటకు మరీ మరీ సలాం...

– పసునూరి రవీందర్

www.etelangana.org




తేనెలాంటి తెలంగాణ సంస్కృతి

ఈ సంచిక ఇంత అందంగా,
అనుకున్న సమయానికి రావడానికి
ఆర్థికంగా అండదండలందించిన
తెలంగాణ ఎన్ ఆర్ ఐ అసోసియేషన్‌కు
కృతజ్ఞతలు

## ఫేరిజ్



www.etelangana.org

సంపాదకీయం

# ముస్లింలకు తెలంగాణ అత్యవసరం

*కిసీ ఖౌమ్‌కో బర్బాద్ కర్నా హైతో*
*పహ్‌లే ఉస్ కీ జబాన్ ఖీంచ్‌లో...*

అంటారు. తెలంగాణ ముస్లింల పరిస్థితి ఇలాగే ఉంది. మా నుంచి మా భాషను దూ
చేశారు.

ముస్లింలు తెలుగులో కవిత్వం రాస్తూ అవసరమైన చోట ఉర్దూ పదాలు వాడితే, టైటి
ఉర్దూలో పెడితే ఆంధ్రావాళ్లు తెలంగాణ ముస్లిం కవుల మీద విమర్శలు చేశారు. ఉర్దూ పదా
వాడే బదులు ఉర్దూలోనే కవిత్వం రాయవచ్చు కదా అని అపహాస్యం చేశారు. వాళ్లు మాత్రం త
కవిత్వంలో ఇంగ్లీషు పదాలు విరివిగా వాడతారు. ఉర్దూ విషయంలో మాత్రం ఎన్నో అభ్యంతరా
వ్యక్తం చేస్తారు. ఇదంతా ఎందుకు జరుగుతుందంటే వాళ్లకు ఉర్దూ మీద ఏ మాత్రం ప్రేమ లేద
తెలంగాణ వారికి ఉన్న ప్రేమ ఆంధ్రావారికి ఉండదు అని ఈ విషయంలో అర్థమయ్యింది..

నిజాం రాజుల కాలంలో ఉర్దూ రాజభాషగా ఉండేది. దాంతో ఇక్కడివాళ్లంతా ఉర్దూ
చదువుకున్నారు. హైదరాబాద్ రాజ్యాన్ని ఇండియన్ యూనియన్‌లో బలవంతంగా కలుపుకున్నా
ఇక్కడి ప్రజల మనోభావాలను పరిగణలోకి తీసుకోకుండానే రాజభాషగా ఉర్దూను రద్దు చే
తెలుగును ప్రవేశపెట్టారు. కొన్నాళ్ల సమయమిచ్చి తెలుగుగానీ, ఇంగ్లీషుగానీ నేర్చుకోవాలని ఆంక్ష
పెట్టారు. చుట్టూ ఉన్న ఉర్దూ వాతావరణంలోంచి ఒక్కసారిగా ఇతర భాషలు నేర్చుకోవడం అం
సులువు కాదన్న విషయం తెలిసిందే. నేర్చుకోలేని ఉద్యోగస్తులు ఉద్యోగాలు కోల్పోవాల్సి వచ్చిం
ఆ తరువాత నుంచి తెలుగు మీడియం స్టార్ట్ అయ్యింది. అప్పటివరకు ఉర్దూ చదువుకుని ఉ
వాళ్లందరూ ఏమయ్యారో ఏ లెక్కలూ మనకు చెప్పవు. వాళ్లంతా చిల్లర వ్యాపారాలు చేసుక
దుస్థితిని నెట్టబడ్డారు. రిక్షాలు తొక్కే పరిస్థితి కల్పించారు.

నేటి తరాలు ఇంట్లో ఉర్దూ మాతృభాషగా మాట్లాడుతున్నప్పటికీ ఉర్దూలో చదివే అవకాశా
లేక తెలుగులోనే చదువుకోవాల్సి వచ్చింది. అయినప్పటికీ దేశంలోనే ప్రసిద్ధి పొందిన ఉర
కవులు, రచయితలు తెలంగాణలో ముఖ్యంగా హైదరాబాద్‌లో ఉన్నారు. వారికి ఆంధ్రా వల
పాలకులు ఏ మాత్రం గౌరవమిచ్చింది లేదు. వారు వేరొక లోకంగా బతకాల్సి వస్తున్నది. నిజాం
కాలంలో భారత ఉపఖండంలోనే ఉర్దూ కవులు, రచయితలకు హైదరాబాద్ రాజ్యం ప్రసిద్ధి పొందిం
వారిని ఎంతో ఆదరించింది.

200 ఏళ్లు నిజాంల పాలనలో ఉండడం వల్ల రాజభాషగా ఉర్దూ ఉండడంతో ఇక్క
తెలుగు డిఫరెంట్ యాక్సెంట్‌ను తీసుకుంది. వేల ఉర్దూ పదాలు తెలుగైజ్ అయ్యాయి. తెలు

www.etelangana.org

ఉర్దూ మిక్స్‌డ్ లాంగ్వేజ్‌లో ఇక్కడివాళ్లు మాట్లాడుకోవడం చూస్తాం. ఆ మిక్స్‌డ్ భాష ఇక్కడివారి జీవితంలో భాగమైంది. నిజానికి తీయని ఉర్దూ సమ్మిళిత తెలుగు వల్ల ఇక్కడి తెలుగువారికి ముస్లింలపై, ముస్లింలకు తెలుగువారిపై అప్రకటిత ప్రేమ, వాత్సల్యం ఉండేవి. అంటే సమ్మిళిత భాష అనేది హిందూ ముస్లింల మధ్య సహజీవనానికి తోడ్పడింది. తెలంగాణ ఏర్పడడం వలన మళ్లీ ఆ వాతావరణం వస్తుందని మేం ఆశిస్తున్నాం. ఆంధ్రావారి ఉర్దూ వ్యతిరేకత, ముస్లిం వ్యతిరేకత నుంచి తెలంగాణ ముస్లింలు తప్పించుకోగలుగుతారు.

జనాభా పరంగా తెలంగాణలో ముస్లింల శాతం ఎక్కువ. కానీ స్థానిక ఉద్యోగాలు ఇక్కడి ముస్లింలకు దక్కకుండా పోయాయి. ఇవాళ ముస్లింలకు ఏమైనా ఉద్యోగాలు దొరుకుతున్నాయంటే కేవలం ఫోర్త్ క్లాస్ ఉద్యోగాలే. అవి కూడా చాలా తక్కువ. అందుకే చాలామంది ముస్లింలు భార్యాపిల్లల్ని వదిలి దేశం కాని దేశాలకు వలసలు పోయే పరిస్థితి ఏర్పడింది. విద్యా, ఉద్యోగ రంగాల్లో ముస్లింల బాగోగుల గురించి ఆంధ్రా వలస ప్రభుత్వాలు ఏమాత్రం శ్రద్ధ చూపడం లేదు.

తెలంగాణలోని ముస్లింలంతా తెలంగాణ కోరుతున్నారు. ఒక్క హైదరాబాద్ పాతబస్తీకి పరిమితమైన ఎంఐఎం మాత్రమే వ్యతిరేకంగా మాట్లాడుతున్నది. తెలంగాణ ముస్లింలకు ఎంఐఎం ప్రతినిధి కాదు. ప్రతినిధిగా మాట్లాడడాన్ని ముస్లింలు వ్యతిరేకిస్తున్నారు. వారు తెలంగాణ మీద ప్రేమ లేకుండా తెలంగాణకు వ్యతిరేకంగా మాట్లాడుతున్నారు. నిజానికి ఎంఐఎం వల్ల పాతబస్తీ ముస్లింలకు ఒరిగిందేమీ లేదు. వారిని గరీబుల్లాగే ఉంచి, నిరక్షరాస్యులుగానే ఉంచి తమకు తమ పబ్బం గడుపుకుంటున్నారనే విషయం అందరికీ తెలిసిందే.

ఆంధ్రావారు వచ్చాకే హైదరాబాద్‌లో మత ఘర్షణలు జరిగాయి. అంతకు ముందు వందల ఏళ్లుగా తెలంగాణలో హిందూ ముస్లింలు కలిసిమెలిసి సహజీవనం కొనసాగిస్తున్నారు. ఆంధ్రా రాజకీయ నాయకులు ముఖ్యమంత్రులను మార్చడానికి హైదరాబాద్‌లో మత ఘర్షణలు సృష్టించిన చరిత్ర తెలిసిందే. తెలంగాణలోని తెలుగువారికీ, ముస్లింలకూ మధ్య సహజీవనం పెంపొందించుకోవాలన్నా వీలైనంత త్వరగా ఆంధ్రావారి నుంచి విడిపోయి తెలంగాణ ప్రత్యేక రాష్ట్రం ఏర్పడడం అవసరం.

ఈ నేపథ్యంలో – తెలంగాణ రాష్ట్ర ఉద్యమాన్ని తీవ్రతరం చేయాల్సిన సందర్భంలో ఈ సంచికను తెస్తున్నాం. విస్మరణకు గురయిన ముస్లింల చరిత్రను, సాంస్కృతిక చిహ్నాలను అనేక ఉద్యమాల్లో ముస్లిం పాత్రను వెలుగులోకి తెస్తున్న ఈ సంచిక ముస్లిం లందరిలో ఒక ఉత్తేజాన్ని కలిగిస్తుందని ఆశిస్తున్నం. శతాబ్దాలుగా తెలుగువారితో సహజీవనం చేస్తున్న ముస్లింలందరూ ఆ గతాన్ని ఈ సంచిక ద్వారా గుర్తుకు చేసుకోని తెలంగాణ ఉద్యమంలో మూకుమ్మడిగా పాల్గొనాలని ఆశిస్తున్నం.




**ఎం.టి.ఖాన్**

# కాఫిర్‌ను కాను! అవిశ్వాసిని

ఇంటర్వ్యూ : యాకూబ్ పాషా

**సాహిత్యకారులకు,** సామాజిక-పౌరహక్కుల ఉద్యమకారులకు ఆయన ఖాన్ సాబ్! పాతబస్తీవాసులకు ఆయన బడే భాయి! ఇటు తెలుగు, అటు ఉర్దూ సాహిత్యాన్ని ఎరిగినవాడు. ఉద్యమాలతో నడిచినవారు. ఆయన విలువైన అనుభవసారం ఆయన మాటల్లోనే..

నాన్న బద్రోద్దిన్ కాంగ్రెస్ కార్య[illegible]. రజాకార్ల పాలిటిక్స్‌ని వ్యతిరేకించాడు.

○ పాతబస్తీలో మా ఇరుగుపొరుగు అంతా దళితులే. బాగా కలిసిపోయే వాళ్లం. నేను పుట్టిన తరువాత మా అమ్మకు పిచ్చెక్కింది. అప్పుడు ఆమె నాకు పాలు ఇచ్చే స్థితిలో కూడా లేదట. ఆ సమయంలో నాకు ఒక మాదిగామె పాలు ఇచ్చేదట. అందుకే నావన్నీ మాదిగ బుద్ధులని మా చుట్టాలంటుంటారు.

○ మత సాహిత్యానికి ముస్లిం సామాజిక సాహిత్యానికి మధ్య ఎప్పటికైనా విభజన రావాల్సిందే. అది ఎప్పుడో ('జల్‌జలా' ముస్లింవాద సంకలనం వచ్చినప్పుడే) జరగాల్సిన పరిణామం. ఇప్పుడు జరిగింది అంతే.

○ మత ప్రాతిపదికన సాహిత్యం ఏర్పడడం మంచిది కాదు. ఎందుకంటే మతం అనేది పూర్తిగా వ్యక్తిగత విషయం.

○ తెలంగాణ సాయుధ పోరాటంలో నన్ను ఆకట్టుకున్న అంశం హిందూ-ముస్లిం ఐక్యత. భూమి కోసం, భుక్తి కోసం, విముక్తి కోసం హిందూ-ముస్లింలు కలిసి పనిచేశారు. వీళ్ల ఐక్యతకు బందగీ లాంటి వాళ్లు ప్రతీక.

తెలంగాణ సాయుధ పోరాటాన్ని బిజెపి మత కోణంనుంచి చూసే ప్రయత్నం చేస్తుంది.

○ **పోలీస్ యాక్షన్ తరువాత హైదరాబాద్ ముస్లిం జీవితాలను చీకటి కమ్మేసింది. 60 శాతం మంది ముస్లింలు ఉద్యోగాలు కోల్పోయారు. నిజాం ఆర్మీ రద్దయిన తరువాత దాంట్లో పని చేసే**



www.etelangana.org

పదివేలకు పైగా ముస్లింలు నిరుద్యోగు లయ్యారు. కొందరు చిన్న చిన్న వ్యాపారాలు చేసుకొని బ్రతికారు. మరికొందరు పేదరికంలో మగ్గిపో యారు. పేదరికంతో దొంగతనాలు, నేరాలు పెరిగిపోయాయి. దాంతో పాతబస్తీ అనగానే అందరూ సమస్యాత్మక ప్రాంతం అనే అభిప్రాయం వచ్చేసింది. ఆర్థికంగా ఉన్నవాళ్లు బంజారాహిల్స్, జూబ్లిహిల్స్‌కు తరలిపోయారు. కేవలం పేదవాళ్లు మిగిలిపోయారు.

ఇక రాజకీయ పార్టీలు, పాతబస్తీ పేదరికాన్ని దూరం చేయడం కంటే తమ రాజకీయాలకే ప్రాధాన్యత ఇచ్చాయి. దీంతో పరిస్థితి ఎక్కడ వేసిన గొంగడి అక్కడే అన్నట్లుగా తయారైంది.

○ పాతబస్తీలో ఫ్యూడల్ ప్రభావం ఎక్కువగా ఉంది.

○ ముస్లింలు విద్యను చిన్న చూపు చూడడం కూడా పాతబస్తీ పేదరికానికి మరో కారణం.

○ ఒకప్పుడు పాతబస్తీ అభివృద్ధి చెందిన ప్రాంతం. నగరం విస్తరించడం వలన కొత్తగా ఏర్పడిన ప్రాంతాలు అభివృద్ధి చెందాయి. పాతబస్తీ పరిస్థితి మాత్రం అక్కడే ఉంది.

○ 1908లో మూసీనది వరదల వలన పాతబస్తీ మునిగి పోయింది. వేలాదిమంది చనిపోయారు. చాలామంది నిరాశ్రయు లయ్యారు. అప్పుడు సిటీ ఇంప్రూవ్‌మెంట్ బోర్డ్ ఏర్పడింది. పునర్నిర్మాణం మొదలైంది.

○ బై బర్త్ మతాలు అంటించబడతాయి. దాని నుంచి వేరు కావడం ఇంపాజిబుల్. ఏదో మేరకు మన మీద మత ప్రభావం ఉంటూనే ఉంటుంది.

పాతబస్తీ అనగానే అందరూ సమస్యాత్మక ప్రాంతం అనే అభిప్రాయం వచ్చేసింది. ఆర్థికంగా ఉన్నవాళ్లు బంజారాహిల్స్, జూబ్లిహిల్స్‌కు తరలిపోయారు.

○ మతాల మధ్య పరస్పరం మానవ సంబంధాలు ఉండడం అవసరం. దీని వల్ల మతాలవరంగా వాళ్ల అభిప్రాయాలు ఎక్స్‌ఛేంజ్ అవుతాయి. ఈ అభిప్రాయ మార్పిడిలో ఒక మానవతా దృక్పథం ఏర్పడుతుంది.

○ మత ప్రవక్తల కాలంలో కూడా పరమత ద్వేషం ఎక్కడా లేదు. ఎవరి మతాన్ని గురించి వాళ్లు చెప్పుకునేవారు తప్ప ఇతర మతాలను చిన్న చూపు చూడడం ఎక్కడ లేదు.

మత ప్రవక్తలలో ఆకర్షించే అంశం– 'సహనం'.

సహనమే వారి ఆయుధం. ప్రాణం.

ఉదా.కు మహమ్మద్ ప్రవక్త పొరుగు వారు యూదు. ఆమెకు ఎందుకో మహమ్మద్ అంటే నచ్చేది కాదు. రోజూ మహమ్మద్ తన ఇంటి ముందు నుంచి నడిచివెళ్తుంటే ఆ ఇంటి యజమానురాలు పై నుండి మహమ్మద్‌పై చెత్త వేసేది. అయినాసరే మహమ్మద్ ఎప్పుడూ చలించలేదు. ఒకరోజు ఆమె ఎందుకో మహమ్మద్ మీద చెత్త వేయలేదు. కారణం ఏమై ఉంటుందా అని మహమ్మద్ ఆ ఇంటి తలుపు కొట్టి ఆమె ఆరోగ్యం బాగుందా లేదా? అని అడిగాడు. నిజానికి ఆమె ఆరోగ్యం బాగలేకనే ఆమె కనిపించలేదు.

కాని మహమ్మద్ ఆ విధంగా స్పందించేసరికి ఆమె కదిలిపోయింది. దాంతో ఆమెలో పూర్తిగా మార్పు వచ్చింది. ఆమె ఇస్లాం స్వీకరించింది. కేవలం తన సహనంతో మహమ్మద్ ఆమెలో మార్పు తీసుకొచ్చాడు. పరమత ద్వేషంతో రగిలిపోయే వాళ్లందరికి ఈ కథ ఒక గుణపాఠం. మతం ప్రేమను పంచాలి. ద్వేషాన్ని కాదు.



క్రైస్తవమైన, ఇస్లాం అయినా ఆ మత పునాదుల్లోనే సహనం ఉంది.

○ హిందువులైనా, ముస్లింలైనా పాతబస్తీలో నన్ను 'బడే భాయి'గా చూస్తారు. నాన్-ముస్లింలు నన్ను చూసి సలాం చేస్తే ముస్లిం మిత్రులు మిస్-అండర్‌స్టాండ్ చేసుకుంటారు. 'ఇతను మా మతానికి సంబంధించిన వ్యక్తి కాదు. ఎప్పుడూ నాన్-ముస్లింలతో కలిసి ఉంటాడు' అనుకుంటారు.

'ఇతనెప్పుడూ నమాజుకు రాడు' అని కూడ వాళ్లు నన్ను చూసి అసహనం చెందుతారు. ఇక్కడ గమనించాల్సిన విషయం ఏమంటే– నాన్-ముస్లింలతో మాట్లాడినంత మాత్రాన, వాళ్లతో చనువుగా ఉన్నంత మాత్రానా నేను ముస్లింను కాకుండా పోతానా?

అలాగే నేను నమాజుకు పోనంత మాత్రాన నాకు ఇస్లాం గురించి ఏమీ తెలియదనుకోవడం కూడా తప్పు. నిజానికి నమాజుకు వెళ్లేవాళ్ల కంటే ఎంతో కొంత ఎక్కువ నాకు ఇస్లాం గురించి తెలుసు.

○ సూఫీయిజంలోని లిబరలిజం, ఓపెన్‌నెస్ ఇవ్వాళ అవసరం.

'మత విభేదాలు అవసరంలేదు. మానవులంతా ఒకటే అనే ఉన్నత భావన సూఫీయిజం పునాది'.

○ 'సారే ఇన్సాన్ ఏక్ హై' అని ఇస్లాం ఎప్పుడో చెప్పింది. కాని పెట్టుబడిదారి విధానం వలన సమాజం వేరువేరు వర్గాలుగా చీలిపోయింది. మనుషుల్లో విభజన ధోరణి పెరిగింది.

○ బుర్ఖా అనేది ఆయా సామాజిక, భౌగోళిక పరిస్థితుల మధ్య పుట్టింది. ఇది తప్పనిసరి అని ఎక్కడా లేదు. ఇస్లాం దేశాల్లోనే కొన్ని దేశాల్లో బుర్ఖా ఉంటే కొన్ని దేశాల్లో లేదు. మహమ్మద్ కాలంలో కూడా బుర్ఖా లేదు. పాకిస్తాన్‌లో కూడా అందరూ బుర్ఖా ధరించరు.

బుర్ఖా అనేది అవసరాన్నిబట్టి ఏర్పడింది. ఆచారాన్నిబట్టి ఏర్పడింది కాదు.

○ ప్రతికాలంలోనూ, ప్రతి దేశంలోను ప్రగతిశీల శక్తులకు, ఛాందసులకు మధ్య యుద్ధం జరుగుతూనే ఉంటుంది. ప్రగతిశీల ఆలోచన ఉన్నవాళ్లు ముందుకు నడుస్తుంటే వెనక్కి లాగేవాళ్లు ఎప్పుడూ ఉండనే ఉంటారు. ఈ క్రమంలో ప్రగతిశీల శక్తులు వెనకపట్టు పట్టినట్లు, ఛాందసులు ముందంజలో ఉన్నట్లు అనిపిస్తుంది. కాని ఇది నిజం కాదు. భ్రమ. ఎప్పటికైనా ప్రగతిశీల శక్తులదే విజయం.

○ ముస్లిం సమాజం మతానికి ఎంత ప్రాధాన్యత ఇస్తుందో మెయిన్‌స్ట్రీమ్ ఎడ్యుకేషన్‌కు కూడా అంతే ప్రాముఖ్యత ఇవ్వాలి.

○ ఇతరులను తక్కువ చేసి చూడడం ఇస్లాం స్ఫూర్తికి విరుద్ధం. ఇస్లాంలో కులభేదాలు లేవు. అలాంటప్పుడు బుర్ఖా వేయలేదని, ఉర్దూ రాదని ఇతరులను తక్కువ చేసి చూడడం తప్పు. ఇస్లాంను క్షుణ్ణంగా చదువుకున్న వారెవరూ ఇలాంటి తప్పులకు పాల్పడరు. మిడిమిడి జ్ఞానం ఉన్నవాళ్లే సాటి మతస్థులను 'లదాఫ్' అంటూ చిన్నచూపు చూస్తారు.

○ ముస్లిం సామాజిక జీవనం వాళ్ల ఆర్థిక జీవనం నుంచి వేరు కాదు. ఒకదానికి ఒకటి ఆధారంగా ఉంటాయి.

○ మహమ్మద్ స్త్రీలను చిన్నచూపు చూడలేదనేది ఖురాన్ చదివినవారి కెవరికైనా అర్థమవుతుంది. ఆయన స్త్రీల చదువుకు ప్రాధాన్యత కూడా ఇవ్వడం జరిగింది. కాబట్టి ఆచారాల పేర్లతో, కట్టుబాట్ల



www.etelangana.org

పేర్లతో స్త్రీ హక్కులను గుర్తించ నిరాకరించడం అనేది తప్పు. సామాజిక మార్పులను గుర్తెరిగి దానితోపాటు మనమూ మారాల్సి ఉంది.

○ నేను దేవుడిని పూజించను. అలా అని వ్యతిరేకించను. తటస్థంగా ఉంటాను. అంటే నేను నాన్-బిలీవర్‌ను. అంతమాత్రం చేత నేను కాఫిర్‌ను కానక్కర్లేదు. ఖురాన్ ప్రకారం కాఫిర్ అంటే దేవుని యొక్క ఉనికిని ప్రశ్నించేవారు. ప్రతివాళ్లను కాఫిర్‌గా చూడడం తగదు. నాన్-బిలీవర్‌కు, కాఫిర్‌కు మధ్య ఉన్న తేడాను గమనించాలి.

○ మతం ద్వేషాన్ని కాదు, ప్రేమను పోషించాలి.

○ మతపరమైన విభేదాలు మనుషుల మనసులను కలుషితం కూడా చేయవచ్చు. కాని సెక్యులర్ భావనల సహకారంతో కలుషిత భావనలు పూర్తిగా నిర్మూలించబడతాయి.

○ ఒకప్పుడు హిందూ-ముస్లిం అందరూ ఒక మీడియం అంటే ఉర్దూ మీడియంలో చదువుకునే వారు. దీనివలన వారిమధ్య సామరస్య వాతావ రణం ఉండేది. ఒకరి గురించి మరొకరు అపోహ పడే స్థితి ఉండేది కాదు. తెలుగు మీడియం వచ్చిన తరువాత హిందు-ముస్లింలు వేరువేరుగా చదువు కోవడం మొదలుపెట్టారు. దీనివలన వారిమధ్య దూరం పెరిగింది. ఆ దూరం ఎన్నో అపోహలను సృష్టించింది. వదంతులు నమ్మడానికి కారణ మైంది. అలానే రెండు మతాలమధ్య సోషల్ ఇంటరాక్షన్ పోయింది. రెండు కమ్యూనిటీల మధ్య కమ్యూనికేషన్ లేకుండాపోయింది. దీనివల్ల యాంటి ముస్లిం- యాంటి హిందూ సెంటిమెంట్లు అంతకంతకూ పెరుగుతూపోయాయి.

..హిందు-ముస్లింలు వేరువేరుగా చదువుకోవడం మొదలుపెట్టారు. దీనివలన వారిమధ్య దూరం పెరిగింది. ఆ దూరం ఎన్నో అపోహలను సృష్టించింది.

○ **36 ఏళ్లపాటు పౌరహక్కుల ఉద్యమంలో పనిచేశాను. కొన్నిసార్లు నిర్బంధం కూడా ఎదుర్కొన్నాను. అయినా సరే.. హక్కుల ఉద్యమంలో సుదీర్ఘ కాలం పని చేసినందుకు, పని చేస్తున్నందుకు చాలా తృప్తిగా ఉంది. ఇవాల్టి నా గుర్తింపుకు పౌరహక్కుల ఉద్యమమే కారణం.**

**..హిందు-ముస్లింలు వేరువేరుగా చదువుకోవడం మొదలుపెట్టారు. దీనివలన వారిమధ్య దూరం పెరిగింది. ఆ దూరం ఎన్నో అపోహలను సృష్టించింది. వదంతులు నమ్మడానికి కారణమైంది. అలానే రెండు మతాల మధ్య సోషల్ ఇంటరాక్షన్ పోయింది. రెండు కమ్యూనిటీల మధ్య కమ్యూనికేషన్ లేకుండాపోయింది.** ■

---

'సింగిడి' నల్లగొండ జిల్లా కమిటీ సభ్యుడు, దళిత కవి యెడవల్లి ఏడుకొండలు
7-10-2010న అకాల మరణం చెందిండు. ఆయన అనేక కవితలు, వ్యాసాలు వ్రాసిండు.
ఖిల్లాపురం ప్రభుత్వం పాఠశాలలో ఉపాధ్యాయుడుగా పనిచేసేవాడు.
ఆయన అకాల మరణానికి చింతిస్తూ కుటుంబ సభ్యులకు
'సింగిడి' ప్రగాఢ సంతాపాన్ని తెలుపుతున్నది.






# ముఝె నఖో ఏ రోన

● మహమ్మద్ హనీఫ్ అలీ

ముఝె నఖో ఏ రోన
ముఝె హోన తెలంగాణ ॥ముఝె॥

తెలంగాణ భాయియో తెలంగాణ బహెనోఁ
తెలంగాణ లడాయికో ఆవో మేరే భాయియోఁ
తెలంగాణ లాయింగే ఆవో మేరే భాయియోఁ ॥ముఝె॥

గోలా గోలా గోలా హై-గల్లీ గల్లీ గోలా హై
గాంవ్ గాంవ్ గోలాహై-గోల్కొండ ఖిల్లాహై
ఖేల్ మేరా కుల్లాహై-తెలంగాణ లానాహై
లాఠీ గోలీ ఖానా హై-తెలంగాణ పానా హై
జై తెలంగాణ జైజై తెలంగాణ (2) ॥ముఝె॥

సాట్‌సాల్‌కా సోనాహై-జిందగీ భర్‌కా రోనా హై
ఫుట్‌పాత్‌కా జీనా హై
మేరీ తమన్నా తడప్ రహీ హై
నసీబ్‌కి లఖీర్ టేడి హోగయీ
తీర్ బనాకర్ దిల్‌పే చలాదూవ్ఁ
ఆంధ్రాకో అంగార్ లగాదూవ్ఁ దుశ్మన్
దిల్ మేరా జల్‌రహా హై



www.etelangana.org

జిగర్/ రో రహాఁ హై మేరా
జీనా మేరా ఉజడ్ తయాహై ॥ముఝె॥
జై తెలంగాణ జైజై తెలంగాణ (2)
జమీన్ మేరీ హడప్ గయీ హై
నౌకరీ హమారీ దఫన్ హోగయీ
పానీ మేరా పరాయి హోగయా
సాగర్ మేరా ఖబ్జా హోగయా (2) ॥ముఝె॥

జై తెలంగాణ జైజై తెలంగాణ
మేరీ ఖేతిబాడి చదల్ లగీహై-ఖానా మేరా ఖూన్ పసీనా
పీన్చ్ దానా మోటా చావల్
జులుంకా తూటా నహీఁ చలేగా నహీఁ చలేగా
ఆఖ్రి సాన్స్ రహెతక్ లడేంగే (2) తేరా పీచ్చా కభీనా ఛోడేంగే (2)
లేకె రహేంగే లేకె రహేంగే (2) తెలంగాణ పాకె రహేంగే (2)
ముఝె హోన తెలంగాణ (2)
జై తెలంగాణ జైజై తెలంగాణ
అజాదీ కే ఖదమ్ బడేంగే (2) నీన్ద్ చైన్ ఛోడ్ దేంగే (2)
ఖూన్‌పానీ కర్‌కె లడేంగే (2)
అజాది లాకె రహేంగే (2)
మాంగ్‌నేసే నహీఁ మిల్‌తా హక్ హమారా
ఛీంచ్‌కర్ హాసిల్ కరేంగే ॥ముఝె॥

జై తెలంగాణ జైజై తెలంగాణ (2)
తెలంగాణ భాయియోఁ తెలంగాణ బహెనోఁ
తెలంగాణ లడాయికో ఆవో మేరే భాయియోఁ (2)

---

హిందీ సినిమా రంగానికి హైదరాబాద్ ముస్లింలు చేసిన సేవ ఎక్కడ రికార్డు కాలేదు. మక్దూమ్ రాసిన సినిమా పాటలేవి ప్రత్యేకంగా సిడిల రూపంలో రాలేదు. అజిత్, ముంతాజ్, ఫర్హానాజ్, టబ్బులు హిందీ సినిమా రంగంలో పోషించిన పాత్రలు అద్వితీయమైనవి. టబ్బు తెలుగులో కూడా అనేక చిత్రాల్లో నటించింది. హైదరాబాద్ ముస్లింలకు సంబంధించిన సమాచారాన్ని ఇకనైనా సోయితో తెలంగాణాభిమానులు చేయాల్సి ఉంది.





# ఛోటీసీ ఆశ

• షాజహానా

"చందన సా బదన్... చంచల్ చిత్ వన్... ధీరే సే తేరీ ఏ ముస్కానా..." బాత్‌రూంలో స్నానం చేస్తూ హమ్మింగ్ చేస్తున్నట్లు మెల్లగా పాడుతున్నది హసీనా.

"అగే ఓ హసీనా...! ఏందో తీగరాగాలు తియ్యబడ్తివి? ఇయ్యాల పనిమనిషి సుతరాలె. ఒక్కదాన్ని బండెడు అంట్లు తోమలేక ఛస్తున్నా. రాణీ సాహెబా... జరవచ్చేడ్దున్నదా లేదా?" అంట్లతో సతమతమవుతూ విసుగ్గా అన్నది ఫాతిమా.

"మాఁ...! ఇయ్యాల అంట్లు గింట్లు జాన్తానై... బాలోత్సవ్ ముగింపురోజట... అబ్బా జాన్‌తో నేను గూడపోతున్నా...' తన కిష్టమైన గులాబిరంగు కమీజు, చుడీదార్ వేసుకుంటూ బాత్‌రూంలోంచే తల్లికి వినిపించేట్టు పెద్దగా అన్నది హసీనా.

"అంట్ల తోటి, వంటింటి తోటి, పర్దాల తోటి, చీకటింటి తోటి నువ్వు చేస్తున్నవ్ కద కాపురం? చాలదా? అది నీలాగా చదువూ సంధ్యాలేంది కాదు. తొమ్మిదో తరగతి చదువుతున్నది. దాన్ని కూడా గాలీ వెలుతురూ సోకకుండా ఎందుకు చంపుతావ్?" బిడ్డ తరఫున వకాల్తా పుచ్చుకొని అన్నాడు అన్వర్.

"అంటే... నేను కావాల్ననే యీ వంటింటికి అతక్కపోతన్ననా?" కోపం నసాళాని కంటుతుంటే అతి ప్రయత్నం మీద తమాయించుకుంటూ అన్నది ఫాతిమా.

"ఇప్పుడు నీతో గొడవ పెట్టుకునే తీరికా లేదు. ఓపికా లేదు. హసీనా నాతో వస్తున్నది అంతే" అన్నాడు అన్వర్ దృఢనిశ్చయంతో.

ఇక చేసేది లేక నిస్సహాయంగా తనలో తానే ఏదో గొణుక్కుంటూ తిరిగి అంట్లతో మమేకమైంది ఫాతిమా.

హసీనా అయిదు నిమిషాల్లో తయారయింది. తెల్లగా వెన్నెలలా వుండే ముఖానికి లాక్టోకేలమైన్ పట్టించింది. షైన్ రోజ్ పౌడర్ అద్దుకుంది. ఐబ్రో పెన్సిల్‌తో కనుబొమ్మలు తీర్చుదిద్దుకుంది. కళ్ళకు



www.etelangana.org



తండ్రీ కూతురూ కొత్తగూడెం క్లబ్ దారి పట్టారు. రోడ్డు కిరువైపులా బాలోత్సవ్‌కు వస్తున్న ప్రముఖులకు స్వాగతం పలుకుతూ రంగు రంగుల బ్యానర్‌లు దర్శనమిస్తున్నాయి.

సుర్మా పెట్టుకుంది. పెదాలకు లిప్‌స్టిక్ పూసుకుంది. జడలో గులాబి పువ్వు తురుముకుంది. సన్నటి మబ్బు తెరమీద నక్షత్రాలు మెరుస్తున్నట్టున్న పల్చటి చునరీ తలమీంచి కప్పుకుంది. పన్నెండు సంవత్సరాల హసీనా చందనపు బొమ్మలా వుంది.

తండ్రీ, కూతురూ కొత్తగూడెం క్లబ్ దారి పట్టారు. రోడ్డు కిరువైపులా బాలోత్సవ్‌కు వస్తున్న ప్రముఖులకు స్వాగతం పలుకుతూ రంగు రంగుల బ్యానర్‌లు దర్శనమిస్తున్నాయి. మెయిన్ రోడ్డుమీంచి క్లబ్ లోపలి వరకు మినీ విద్యుత్తోరణాలు వేలాడుతూ ఆకాశం మీంచి తారలు నేలకు దిగి వచ్చినట్టు భ్రాంతి గొల్పుతున్నాయి.

బాలోత్సవ్‌లో జరిగే అంతర్ పాఠశాలల సాంస్కృతిక పోటీల్లో పాల్గొనేందుకు వచ్చిన బాల బాలికలతో క్లబ్ ఆవరణంతా ఒక సముద్రం విస్తరించినట్టుగా వుంది. ఎగిసిపడే రంగు రంగుల కెరటాల్లా, కదిలే రంగు రంగుల పొదరిండ్లలా, నేలమీద నడయాడుతున్న రంగు రంగుల బెలూన్లలా ఎక్కడ చూస్తే అక్కడ కేరింతలతో... తుళ్ళింతలతో పిల్లలే పిల్లలు... సందడే సందడి... అంతా ఒక పండుగ వాతావర ణాన్ని తలపిస్తున్నది...

కాసేపట్లో ముగింపు ఉత్సవం ప్రారంభమవుతుందని ఎనౌన్స్ చేశారు.

బాలబాలికలు, వారి తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు, పాత్రికేయులు, సాహితీవేత్తలు, ప్రసిద్ధ నాట్యాచార్యులు, సంగీత విద్వాంసులు, అధికార్లు, అనధికార్లు, పట్టణ ప్రజలతో ఓపెన్ ఆడిటోరియం కిటకిటలాడుతున్నది.

రంగు రంగుల తెరలతో, వెలుగులు విరజిమ్మే విద్యుద్దీపాలతో వేదిక నయనా నందకరంగా వుంది.

వేదిక మీద ప్రముఖులంతా ఆసీనులై వున్నారు. వందేమాతరం గీతాలాపనతో సభ ప్రారంభమైంది.

మొదట బాలోత్సవ్‌కు రూపకల్పన చేసిన డాక్టర్ రమేష్ బాబు లేచి మైక్ అందుకున్నాడు.

"కొత్తగూడెం అనగానే బొగ్గు గనులు, విద్యుత్ కేంద్రాలు మాత్రమే గుర్తు కొస్తాయి. కాని యిక్కడ 'పసి వజ్రాల'ను గుర్తించి వాటికి సానపట్టే కార్యక్రమం కూడా మొదలైంది. నేటి యాంత్రిక యుగంలో బాలలు కోల్పోతున్న తమ అమూల్య బాల్యాన్ని తిరిగి వారికి యివ్వాలన్న తపనతో, వారిలో అంతర్గతంగా దాగి వున్న సృజనాత్మక శక్తిని, కళా నైపుణ్యాన్ని వెలికి తీసుకురావాలన్న కోరికతో బాలోత్సవ్ కార్యక్రమాలు రూపొందించబడ్డాయి. మా ప్రయత్నానికి రాష్ట్రమంతా స్పందించింది. పద్దెనిమిది జిల్లాలకు చెందిన ఎనిమిది వేల బాల బాలికలు ఈ బాలోత్సవ్‌లో పాల్గొన్నారు. అంతమంది ఒకేచోట కలిసి మెలిసి కార్యక్రమాల్లో పాల్గొనడం వల్ల పిల్లల్లో ఏకత్వ దృష్టి, సహజీవనంలో వున్న ఆనందం, తద్వారా వారిలో మానసిక వికాసం పెంపొందుతాయి. ఈ మహా యజ్ఞానికి సహకరించిన వారందరికీ పేరు పేరునా ధన్యవాదాలు" అని చెప్పి కూచున్నాడు రమేష్‌బాబు.

"రమేష్‌బాబు గారు క్షణం తీరిక లేని బిజీ డాక్టర్. మీ అమ్మీకి కడుపులో కణితి పెరుగుతుంటే ఆపరేషన్ చేసి తీసివేసింది ఆ డాక్టరే. బాలోత్సవ్ కోసం రెండు నెలలుగా నిద్రాహారాలు మానేసి శ్రమిస్తున్నాడు" అంటూ నెమ్మదిగా హసీనా చెవిలో చెప్పాడు అన్వర్.



'నిజమా?' అన్నట్టు కళ్ళు విప్పార్చి చూసింది హసీనా.

తరువాత ఒక ఎన్నారై – మోహన్ – మైకు ముందుకొచ్చాడు.

"బాల్యంలో నేను ఎన్నో కష్టాలు పడ్డాను. భద్రాచలంలో మా నాన్న నడిపే చిన్న హోటల్లో కప్పులు కూడా కడిగాను. ఇవ్వాళ ఈ స్థితిలో యీ చిన్నారుల మధ్య నేను పొందుతున్న అనుభూతి మాటలకందనిది. నేను ఎలాంటి అందమైన, ఉత్సాహపూరితమైన, చైతన్యపూరితమైన బాల్యాన్ని కోల్పోయానో మిమ్మల్ని చూస్తుంటే అర్థమవుతున్నది. బాల్యంలో వేసే పునాదే భావి జీవితాన్ని ప్రభావితం చేస్తుంది. అందుకే చిన్నారుల కోసం ఏదన్నా చేయాలన్న సంకల్పంతో మా 'మోహన్ ఫ్రెండ్స్ ఫౌండేషన్' ప్రతి సంవత్సరం నిర్వహించే యీ బాలోత్సవ్‌కు ఆర్థికంగా, హార్దికంగా సహాయ సహకారాలందించాలని నిర్ణయించింది" అని చెప్పి హర్షధ్వానాల మధ్య కూచున్నాడు.

"చిన్నారులలో దాగి వున్న ప్రతిభను వెలికి తీసుకురావడానికి కొత్తగూడెం క్లబ్‌వారు నిర్వహిస్తున్న ఈ బాలోత్సవ్‌ను హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను" అంటూ ముఖ్య అతిథిగా విచ్చేసిన మంత్రి వర్యులూ, ఖమ్మం జిల్లా కలెక్టరూ ప్రసంగించారు.

ఇక పిల్లలంతా ఊపిరి బిగబట్టి ఎదురు చూస్తున్న సాంస్కృతిక కార్యక్రమాలు ప్రారంభమయ్యాయి.

"ఇప్పుడు కుమారి సాగరిక నృత్య ప్రదర్శనతో మన కార్యక్రమం ప్రారంభమవుతుంది" అని రమేష్‌బాబు ప్రకటించాడు.

నృత్యానికి తగిన ఆహార్యంతో సాగరిక స్టేజి మీదికొచ్చింది.

"సాగరిక హైదరాబాద్‌లోని రామంతపూర్‌లో పద తరగతి చదువుకుంటున్నది. ఏడో ఏటనే విద్యుత్ షాక్‌తో తన కుడి చెయ్యిని పోగొట్టుకుంది. కృషి, పట్టుదల, అంకురిత దీక్ష వుంటే సాధించలేనిదంటూ ఏదీ లేదని, అవిటితనం దేనికీ అడ్డుకాదని సాగరిక నిరూపించింది. ఆమె నాట్యం తిలకించి ఆశీర్వదించండి" అంటూ సాగరికను పరిచయం చేసి తప్పుకున్నాడు ఒక నిర్వాహకుడు.

కళ్ళు మిరుమిట్లు గొలిపే ఫ్లడ్‌లైట్ల కాంతిలో ఒక మెరుపుల జలపాతంలా దూసుకొచ్చింది సాగరిక. జవనాశ్వం కదను తొక్కుతున్నట్టు, సుడిగాలి చుట్టి వేస్తున్నట్టు, మహా జలధి ఉప్పొంగుతున్నట్టు తన నృత్యంతో వేదికను దున్ని పారేసింది సాగరిక.

జడివాన కురిసినట్లు చప్పట్లతో ప్రాంగణమంతా మారుమోగిపోయింది.

హసీనా మైమరచి, తన్మయత్వంతో చూస్తున్నది.

"అబ్బా జాన్! ఆ అమ్మాయికి భగవంతుడు అన్యాయం చేసినా పట్టుదలతో తన జీవితాన్ని ఎలా తీర్చిదిద్దుకున్నదో చూడు" అని తండ్రితో ఉద్వేగంగా అన్నది హసీనా.

"అవును బేటీ! అన్నాడు అన్వర్ తను కూడా సానుభూతి చూపిస్తూ.

"ఇప్పుడు లక్ష్మీనాయక్ సంప్రదాయ నృత్యంతో మిమ్మల్ని అలరిస్తుంది. ఈ అమ్మాయి ఒక నిరుపేద గిరిజన కుటుంబంలో పుట్టింది. తనలోని కళాతృష్ణకు పేదరికం అడ్డు రాలేదు. పాల్వంచ ఇందిరా ప్రియదర్శిని పాఠశాలలో తొమ్మిదో తరగతి చదువుకొంటున్నది. ఆశీర్వదించండి" అంటూ లక్ష్మిని పరిచయం చేశాడు నిర్వాహకుడు.

లక్ష్మీనాయక్ నృత్యం ప్రారంభమైంది.



www.etelangana.org



ఆమెను పరీక్షగా చూసి "అబ్బా జాన్! అబ్బా జాన్! ఈ అమ్మాయి జీ టీవీలో లిటిల్ ఛాంప్స్ ప్రోగ్రాంలో టాపర్‌గా నిలనిచిన అమ్మాయే కదూ?" అన్నది హసీనా.

వరుసగా వినాయకత్వం, అష్టపది, దశావతారాలు, తిల్లాన మొదలైన అంశాలు అభినయిస్తూ అలవోకగా ఒకదానిలోంచి మరొక దానిలోకి పరకాయ ప్రవేశం చేస్తున్నది లక్ష్మి.

కన్నార్పకుండా, ట్రాన్స్‌లోకి వెళ్ళినట్టు, సమ్మోహితురాలై చూస్తున్నది హసీనా.

కేరింతలతో, చప్పట్లతో అవధులు దాటిన తమ సంతోషాన్ని తెలియజేశారు బాలబాలికలు.

"అప్పుడు నవభారత్ పబ్లిక్ స్కూల్లో నాలుగో తరగతి చదువుతున్న చిన్నారి సుమిత సత్యభామ అభినయాన్ని చూస్తారు" అని అనౌన్స్ చేశారు.

క్షణాల్లో బ్రహ్మాండమైన రంగు రంగుల సెట్టింగ్ ప్రత్యక్షమయింది. ఆ సెట్టింగ్ మధ్య చిన్నారి సత్యభామ వయ్యారంగా వాలుజడను విసురుకుంటూ "మీరజాలగదా నా యానతి, వ్రత విధాన మహిమన్ సత్యావతి" అని పాడుకుంటూ, వగలు పోతూ దర్పంగా నృత్యం చేస్తున్నది. తన హావభావాలతో, అంగిక అభినయంతో, మేని విరుపులతో, చురకత్తిలాంటి పదునైన చూపుతో ప్రేక్షకులను మంత్రముగ్ధుల్ని చేస్తున్నది.

చప్పట్లతో తమ ఆనందాన్ని తెలియజేశారు ప్రేక్షకులు.

"అంత చిన్న అమ్మాయి ఎంత బాగా నృత్యం చేసింది అబ్బాజాన్?" అసలే పెద్దగా వున్న కళ్లను ఇంకా పెద్దవి చేస్తూ ఆశ్చర్యంగా అన్నది హసీనా.

"చిన్నప్పటి నుండే తల్లిదండ్రులు ఆమెకు మంచి శిక్షణ యిప్పించారు" అని పైకి అన్వర్ అన్నాడు గానీ తనకీ ఆశ్చర్యంగా వుంది.

ఇప్పుడు వరంగల్‌కు చెందిన కుమారి అలేఖ్య తన గాన మాధుర్యంతో మిమ్మల్ని పరవశింపచేస్తుంది" అన్న అనౌన్స్‌మెంట్ వినిపించింది.

అలేఖ్య స్టేజిమీదకి వచ్చి సభకు నమస్కరించింది.

ఆమెను పరీక్షగా చూసి "అబ్బా జాన్! అబ్బా జాన్! ఈ అమ్మాయి జీ టీవీలో లిటిల్ ఛాంప్స్ ప్రోగ్రాంలో టాపర్‌గా నిలనిచిన అమ్మాయే కదూ?" అన్నది హసీనా.

"అవునవును" తనూ ఉత్సాహంగానే అన్నాడు అన్వర్.

అలేఖ్య ఒక్కొక్క రాగాన్నే వివరిస్తూ కీర్తనలు ఆలపించడం మొదలెట్టింది.

మొదట ముత్తుస్వామి దీక్షితార్ కీర్తన 'వాతాపి గణపతిం భజే'ని హంసధ్వని రాగంలో ఆలపించింది. తరువాత 'పాహిమాం శ్రీ రాజ రాజేశ్వరి' అన్న త్యాగరాజ కీర్తనను సంతువరాళి రాగంలో భక్తి పారవశ్యంతో శ్రావ్యంగా పాడింది. 'ఎందరో మహానుభావులు' అన్న కృతి శ్రీరాగంలో ఆమె గళం నుండి జాలువారింది. ఆ తరువాత 'సామజవరగమనా' అన్న కీర్తనను జనరంజకంగా వినిపించింది. చివరగా 'పలుకే' బంగారమాయరా – కోదండరామా' అన్న భక్త రామదాసు కృతిని రసరమ్యంగా రక్తి కట్టించింది.



సముద్రపు హోరు శ్రుతి చేసుకున్నట్టు, జలపాతం సప్త స్వరాలతో గమకాలు పలికించినట్టు, ఎవరో దేవకన్య వేయితంత్రుల వీణను మధురాతి మధురంగా మీటుతున్నట్టు తన గాంధర్వగానంతో మంత్రముగ్ధుల్ని చేసింది అలేఖ్య.

సముద్రం ఉప్పొంగినట్టు చప్పట్ల రణగొణధ్వని ప్రాంగణాన్ని ముంచెత్తింది.

విజయవాడకు చెందిన విద్యార్థినులు 'కోటి కోటి జెండా...' అన్న దేశభక్తి గేయం ఆలపిస్తుంటే పరవశంతో ప్రేక్షకుల రోమాలు నిక్కబొడుచుకున్నాయి.

రాత్రి ఒంటి గంట కావస్తున్నా ఒక్కరూ ప్రాంగణాన్ని విడిచిపెట్టిపోలేదు.

వివిధ పోటీలలో విజేతలైన బాలబాలికలకు మంత్రివర్యులు జ్ఞాపికాలూ, ప్రశంసాపత్రాలూ బహూకరిస్తుంటే వేదిక ముందు కూచున్న చిన్నారులు వింత వింత ధ్వనులతో, ఈలలతో, కేరింతలతో, చప్పట్లతో కోలాహలంగా మిన్నుముట్టే హర్షధ్వానాలు చేశారు.

చివరగా 'జనగణమణ' ఆలపిస్తుంటే కార్యక్రమం అప్పుడే అయిపోయిందా అనిపించింది. ఒక స్వర్గమేదో జారిపోయినట్టు, ఒక స్వప్నమేదో తొణికిపోయినట్టు ఏదో తెలియని దిగులు హసీనా మనసంతా ఆక్రమించింది.

క్రిక్కిరిసిన ప్రేక్షకులు ప్రాంగణం విడిచిపెట్టి బయటికి వెళ్ళడానికి కొంచెం ఇబ్బంది పడాల్సి వచ్చింది. జనం పలచబడ్డాక వెళ్లొచ్చని హసీనా, అన్వర్ తన సీట్ల ముందు అలానే నుంచున్నారు.

"అబ్బా జాన్!" అని మెల్లగా తండ్రిని పిలిచింది హసీనా.

"ఏంటి బేటీ?" అన్నాడు అన్వర్.

"రాష్ట్రమంతటి నుండి ఇన్ని వేలమంది బాల బాలికలు వచ్చి బాలోత్సవ్‌లో పాల్గొన్నారు కదా... మరి... ఒక్క ముస్లిం అమ్మాయి కూడా కనబడినట్లు లేదు..." లోలోన ఏదో అసంతృప్తి తనను తొలిచి వేస్తుండగా అన్నది హసీనా.

నిజమే. తనకా ఆలోచనే రాలేదు అనుకున్నాడు అన్వర్. రాష్ట్రమంతటికీ పరివ్యాప్తమైన ఈ ఉత్సవానికి ఒక ముస్లిం అమ్మాయి కూడా రాకపోవడం ఆశ్చర్యంగానే వుంది. ప్రపంచమంతా ఎటు పోతున్నది? ముస్లిం సమాజం ఎటు ప్రయాణిస్తున్నది? మనసులో ఏవేవో ప్రశ్నలు.. ఏవేవో జవాబులు... గొలుసుల్లా అతుక్కుంటూ విడిపోతున్నవి. తన కూతురు అడిగిన ప్రశ్నకు ఒక్క ముక్కలో జవాబు చెప్పగలడా తను...?

"తర్వాత మాట్లాడుకుందాం లే బేటీ!" అని సమాధానం దాటవేశాడు అన్వర్?

ఇద్దరూ మౌనంగా ఇంటి దారి పట్టారు.

అయిదారు రోజుల దాకా హసీనా ఆ మౌనంలోంచి బయటపడలేకపోయింది.

ఆ లేత మనసులో ఏదో పెనుగులాట, ఏదో అలజడి, అల్లకల్లోలంగా ఆలోచనలు ఎగిసిపడుతున్నాయి. ఏదో విచారం ఆమెలో సుళ్ళు తిరుగుతున్నది. ఆ దిగులులోంచి, ఆ అలజడి లోంచి ఏవో కలలు పురివిప్పుకుంటున్నాయి. ఏవో ఆశలు రెక్కలు విప్పుకుంటున్నాయి.

"ఏంటే హసీనా? బాలోత్సవ్‌కు పోయి వచ్చిందగ్గర్నుంచి ఏందో దయ్యం పట్టిందాన్ని లెక్కవున్నవ్? ఒక మాటలేదు, ముచ్చట లేదు, మూగిదాని తీర్గ ఖామోష్ గున్నవ్? నీకు నువ్వే ఏందో



www.etelangana.org



ఓసారి తల్లివైపు చూసింది హసీనా. తన చూపు గిరికీలు కొట్టుకుంటూ తిరిగి తన కళ్ళకే చేరుకున్నట్లు అనిపించి చూపు నేలకు దించుకుంది.

గొణుక్కుంటున్నవ్... ఏంది సంగతి?" అన్నది ఫాతిమా ఆరాతీస్తూ.

ఓసారి తల్లివైపు చూసింది హసీనా. తన చూపు గిరికీలు కొట్టుకుంటూ తిరిగి తన కళ్ళకే చేరుకున్నట్లు అనిపించి చూపు నేలకు దించుకుంది.

"ఏందే? ఏం జరిగింది?" రెట్టించింది ఫాతిమా.

"ఏం లేదు... ఏం లేదు" తడబడింది హసీనా.

"ఏం లేదంటవ్. మల్ల మూగి ముత్యాలమ్మోలై మాట్లాడవ్...? ఏం జెయ్యాల్నె నీతోటి?" విసుక్కుంది ఫాతిమా.

"అమ్మీజాన్...!" హసీనాకు గొంతు పెగిలి మాటలు రావడం లేదు.

"జల్దీ చెప్పి చావు" అసహనంగా అన్నది ఫాతిమా.

"అమ్మీజాన్... నేను... నేను... సంగీతం నేర్చుకుంట" ఒక్కొక్కమాటే కూడ గట్టుకొని చెప్పేసరికి బ్రహ్మ ప్రళయమైంది హసీనాకు. కొన్ని క్షణాలు ఆమె మెదడు పనిచేయలేదు. నెమ్మదిగా తేరుకోవడానికి ఐదారు నిమిషాలు పట్టింది.

"సంగీతం నేర్చుకుంటదట... సంగీతం... మసీదులు నడుపుతున్న 'మదరసా'కు పోవే... తరీఖా నేర్చుకోవే... అని నెత్తిన నోరుపెట్టుకొని మొత్తుకుంటున్నా అది మాత్రం చాతకాదు..." హసీనాను మింగేటంత కోపం వస్తున్నా అతి ప్రయత్నం మీద తమాయించుకుంటూ అన్నది ఫాతిమా.

అప్పుడే బజార్నుంచి యింట్లోకొస్తున్న అన్వర్‌కు ఫాతిమా అన్న మాటలు చెవిన పడనే పడ్డాయి. తల్లీ కూతుళ్ళకు ఏదో యుద్ధం జరుగుతున్నదని గ్రహించాడు.

"దానికి కల్మలు వచ్చు. నమాజు చెయ్యడం వచ్చు. ఖురాన్ చక్కగా చదువు తుంది. ఇంకెందుకే మదరసాకు వెళ్ళడం?" బిడ్డను వెనకేసుకొస్తూ అన్నాడు అన్వర్.

"అహా... మదరసా కొద్దు. బిడ్డకు గానా భజానాలు కావాల్నంట. పంపండి..." అన్నది ఫాతిమా వెటకారంగా.

"అదన్నదా?" అన్వర్ కనుబొమ్మలు ముడిపడ్డాయి.

"అడగండి దాన్నే" అన్నది ఫాతిమా.

"అవునా?" అన్నట్టు కూతురువైపు చూశాడు అన్వర్.

"అవును" అన్నట్టు కళ్ళు కిందికి దించుకొని నేలమీద కాలి బొటనవేలితో రాస్తూ తలపంకించింది హసీనా.

కొన్ని క్షణాల పాటు అవాక్కయ్యాడు అన్వర్. వెంటనే తేరుకున్నాడు. ఇన్నాళ్ళూ తన కూతురు మనసులో ఏముందో తను తెలుసుకోలేకపోయినందుకు కొంచెం అపరాధ భావనకు లోనయ్యాడు. బాల్యోత్సవ్‌లో సీతాకోక చిలుకల్లా, తూనీగల్లా స్వేచ్ఛగా విహరించిన చిన్నారులు అతని మనసులో



మెదిలారు. హసీనాది కూడా అలా ఆడేపాడే వయసే కదా అనుకున్నాడు. ఆ పసి మనసులో అంకురించిన ఉత్సాహాన్ని చిదిమేసే హక్కు తమకు లేదని భావించాడు.

"పోనీ... దానిష్ట ప్రకారమే సంగీతం నేర్పిస్తే పోలే..." అన్నాడు అన్వర్ మెల్లగా.

గయ్యిమని ఇంతెత్తు లేచింది ఫాతిమా.

"మన ఖాన్‌దాన్, మన సిల్ సిలా, మన ఖౌమ్.. మన మజహబ్ ఏంటో తెలిసే మాట్లాడుతున్నారా...?" అన్నది అరచినట్టు పెద్దగా.

కాసేపటిదాకా అన్వర్ ఏం మాట్లాడలేదు.

"మజహబ్.... ఖౌమ్... యీ పెద్ద పెద్ద మాటలు వల్లించే పెద్ద మనుషులంతా ఏం చేస్తున్నారు...? తమ సంతానాన్ని అమెరికా, ఇంగ్లండ్ లాంటి పెద్ద పెద్ద దేశాల్లో చదివిస్తున్నారు. డాక్టర్లుగా, ఇంజనీర్లుగా, లాయర్లుగా తయారుచేసి డాలర్ల పంట పండించుకుంటున్నారు. పేద ముస్లింలు మదరసాల్లో మత విద్యలు నేర్చుకుంటూ, కార్ఖానాల్లో గ్రీజు పూసుకుంటూ, హోటళ్ళలో ఛాయ్‌లందిస్తూ, హారేక్‌మాల్ బండ్లతో, పాన్ డబ్బాలతో ఫుట్ పాత్‌ల మీద కాలక్షేపం చేస్తున్నారు. మతం పేరుతో రాజకీయాల్ని నడుపుతూ తమ ప్రయోజనాలకోసం సామాన్య ముస్లింలను పావులుగా వాడుకుంటున్నారు యీ ఘరానా మనుషులు. భగవంతుణ్ణి చేరేందుకు మతం ఒక మార్గం మాత్రమే. అదొక విశ్వాసం. ఒక జీవన శైలి. ఏ మత పిచ్చయినా ముదిరితే ప్రమాదమే. మక్కా మసీదు. లుంబినీ పార్కు, గోకుల్ చాట్‌లలో ఏం జరిగింది? గుజరాత్ గాయం అప్పుడే మానిపోయిందా? మతం పేరుతో మనుషులు విడిపోవడం భావ్యమా....?

కాశీపట్టణం ఒకవైపు గంగా ప్రవాహంలో – మరోవైపు బిస్మిల్లాఖాన్ సహనాయీ నాదస్వర లహరిలో ఓలలాడి తరించలేదా? మడికట్టుకొని కూచోని వుంటే సానియా మీర్జా ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన స్టార్ టెన్నిస్ క్రీడాకారిణి కాగలిగేదా? షేక్ అదం సాహెబ్, మహబూబ్ సుభాని, షేక్ చినమస్తాన్ నాదస్వర విద్వాంసులుగా అంత కీర్తి గడించేవారా? కళలకు ఎల్లలు లేవు. కులమతాల పట్టింపులు లేవు. ఎవరిలో ఏ సృజనాత్మక శక్తి, ఏ కళా నైపుణ్యం దాగున్నదో? ఎవరు చెప్పగలరు – రేపు తన కూతురు ఒక లతా మంగేష్కరో... ఒక నూర్జహానో... కాగలదేమో! మన ప్రయత్నం మనం చెయ్యాలి కదా... తనలో జరుగుతున్న అంతర్మథనం లోంచి తేరుకొని ఒక నిర్ణయానికొచ్చాడు అన్వర్.

"ఏయ్ ఫాతిమా! నీ ఫాల్తు మాటలు కట్టిపెట్టు. హసీనా రేపటినుంచి సంగీతం నేర్చుకుంటుంది" అని గంభీరంగా అన్నాడు అన్వర్. అతని గొంతులోని దృఢ త్వాన్నీ, తీవ్రతనూ గమనించిన ఫాతిమా ఇక అతని నిర్ణయానికి తిరుగుండదు అని గ్రహించింది.

"యా అల్లా...! యా ఖుదా...!" అని పెద్దగా నిట్టూర్చి, నొసలు బాదుకుంటూ వంటింట్లోకి దూరింది ఫాతిమా.

అంతసేపూ ఏమవుతుందో అన్న ఉత్కంఠతతో, ఆందోళనతో, ఉద్వేగంతో ఊపిరి బిగబట్టి వున్న హసీనా తండ్రి మాటలకు సంతోషంతో ఉక్కిరి బిక్కి రయింది. ఆ చిన్నారిలో తొంగిచూస్తున్న చిన్ని ఆశ ఊపిరి పోసుకుంది. కనుగుడ్ల మీద పల్చటి నీటిపొర కదలాడుతుండగా "అబ్బా జాన్...!" అంటూ తండ్రిని బిగ్గరగా కౌగిలించుకుంది.

■



www.etelangana.org

# కరెంట్ కంచే తీద్దాం

● షహనాజ్ ఫాతిమా

సొంతింట్లో దొంగల్ దూరి
మన "పట్నం" మన పల్లెకు దూరపు సుట్టమైపాయె
ఓషినీ! నా ఇంట్ల నేనే సుట్టమైపోతిని!!
నా భూం జాగల్నే
నాది గోసగోస బతుకైపాయె

కడుపుల కవతల సడిమె
కరెంట్ కంచె మొలిపించె
పరాయి ముచ్చట జూసి
షోకుపడి నక్క వాతలు పెట్టుకుంటిమి

మన పద్ధతులల్ల పోరుగోడు
పచ్చగడ్డి మంట పెట్టె
ఆమ్దాలోల్లం కదే మనం
మల్ల నువ్వు నేను ఒకటైపోదాం

పక్కోడు మన చెవులల్ల
ఇసం పోయదానికస్తే
వాడి చెవులల్ల సీసం పోద్దాం
"ఉన్నోడు" మల్ల మనుషుల్ని
వేరు పడేసే ఇకమతి సేస్తే!
వాడి ముచ్చట మోర్ల తొక్కేద్దాం
మన తెలంగాన బతుకు మనం
"ఇప్పుడు" సల్లంగా బతుకుదాం. ■



# ఉర్దూ ఉసురు తీసిన ఆంధ్రులు

● జయ శంకర్



తెలంగాణా సమస్యలో ఆర్థిక, రాజకీయ అంశాలతో పాటు సాంస్కృతిక అంశాలు కూడా ఇమిడి ఉన్నాయి. తెలంగాణ వైతాళికుడు ప్రజాకవి కాళోజి ఎప్పుడూ అనేవాడు "ఆర్థికంగా వెనుకబడిపోతే మళ్ళీ నిలదొక్కుకోవచ్చు. రాజకీయంగా నిర్లక్ష్యానికి గురి అయితే మళ్ళీ నిలదొక్కుకోవచ్చు, రాజకీయంగా నిర్లక్ష్యానికి గురిఅయితే మళ్ళీ తెప్పరిల్లుకోవచ్చు, కానీ సాంస్కృతిక గుర్తింపు చెరిగిపోతే అస్తిత్వాన్నే కోల్పోతాం". యాభై ఏళ్ళ సమైక్యాంధ్రలో తెలంగాణా భాషా సంస్కృతిలు నిరాదరణ, అవహేళనకు గురి అయి కనుమరుగైపోతున్నాయి. చివరకు తెలంగాణ తన అస్తిత్వాన్నే కోల్పోయే దశకు చేరుకున్నది. ఈ విషయంలో కూడా అంబేడ్కర్ సూత్రీకరణను అన్వయించుకోవాలి. "ఒక రాష్ట్రంలో రెండు భాషలు మాట్లాడే వాళ్ళుంటే, మెజారిటీ నిరంకుశత్వం వల్ల మైనారిటీ అణచివేతకు గురవుతుంది." ఈ తర్కాన్ని ఇంకా కొంత విపులీకరిస్తే, ఒక రాష్ట్రంలో అందరు ఒకే భాష మాట్లాడుతున్నప్పటికీ, ఆ భాషలో మాండలిక వైవిధ్యాలు ప్రస్ఫుటంగా వుంటే, ఇక్కడ కూడా మెజారిటీ, మైనారిటీ సమస్య తలెత్తుతుంది. తెలంగాణలో సరిగ్గా అదే జరుగుతున్నది. తెలంగాణ మాండలికం ఎంత తీవ్రమైన అవహేళనకు గురిఅయిందో ప్రతిరోజూ సినిమాల్లో టీ.వీలలో చూస్తూనే ఉన్నాం.

తెలంగాణ వారు మాట్లాడే తెలుగు గురించి ఆంధ్రప్రాంతం వారికి కొన్ని విచిత్రమైన అభిప్రాయాలున్నాయి. ఇక్కడ మట్లాడే తెలుగు అసలు తెలుగే కాదని కొందరు, కాకపోతే కల్తీ తెలుగు, నకిలీ తెలుగు, ఉర్దూ మయమయిన తెలుగని మరికొందరు అంటారు. ఈ సందర్భంగా ఒక సంఘటనను



www.etelangana.org

ప్రస్తావించడం ఉచితంగా ఉంటుందనుకుంటున్నాను. 1968-69లో ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర ఉద్యమం ఉధృతంగా నడుస్తున్నప్పుడు ఒక అనుభవం ఎదురైంది. ఆ రోజుల్లో జంధ్యాల పాపయ్య శాస్త్రి ఒక గేయంలో, ఒకవేళ ప్రత్యేక తెలంగాణ ఏర్పడితే, అది దక్షిణ పాకిస్తానం అవుతుందని రాశాడు. అది అర్థం కాక నేను, ఇంకో మిత్రుడు ఆయన దగ్గరికి వెళ్ళి 'శాస్త్రి గారూ, మీ బాధేమిటని' అడిగాము. దానికి ఆయన సమాధానమిస్తూ ప్రత్యేక తెలంగాణలో తెలుగంతా భ్రష్టుపట్టిపోయి, అది పూర్తిగా తౌరక్యాంధ్రం అవుతుందని అన్నాడు. తౌరక్యాంధ్రం అంటే తురకలు మాట్లాడే ఉర్దూమయమయిన తెలుగు అని ఆయన వివరించాడు. దానికి మేము స్పందిస్తూ ఉర్దూ కేవలం తురకల భాషే కాదని, అది ఒక సంపన్నమైన, మధురమైన భారతీయ భాష అని చెప్పాము. అంతేకాక మతానికి భాష అవసరం కావచ్చు కానీ, భాషకు ఒక మతమంటూ ఉండదని అన్నాము. ఒకవేళ ఉర్దూ ముస్లింల భాషైతే, ఇంగ్లీషు ఏ మతం వారి భాష అవుతుంది? అది కేవలం క్రైస్తవుల భాషే అని అనగలమా? అటువంటప్పుడు హిందువులది ఏ భాష అని చెప్పాలి? ఈ దేశంలో మాట్లడే భాషలన్నీ హిందువుల భాషలు కావా? ఉర్దూ కూడా భారతదేశంలోనే పుట్టి, విస్తరించి అనేక భారతీయ భాషలను ప్రభావితం చేసి, వాటితో ప్రభావితమైన భాషే కదా! నిజానికి తెలంగాణ వారికంటే, ఆంధ్రప్రాంతం వారు మాట్లాడే తెలుగులోనే ఎక్కువ ఉర్దూ పదాలు ఉంటాయి అని పాపయ్య శాస్త్రి గారికి వివరించే ప్రయత్నం చేశాము. కానీ ఆయన నమ్మే పరిస్థితిలో లేరు. అప్పుడు ఒక తెలుగు దినపత్రికను తీసి మొదటి పేజీలో ఉన్న ఒక హెడ్‌లైను ఆయనకు చూపించాము. అది "నిజామాబాదు జైలు నుండి 5 గురు ఖైదీల పరారి" అని వుంది. ఇందులో జైలు, ఖైదీ, పరారీ, అన్నీ ఉర్దూ పదాలే. దానికి శాస్త్రిగారు "అట్లానా" అన్నారు. మా చర్చను కొనసాగిస్తూ, శాస్త్రిగారితో మీ కవిత్వంలో కూడా ఉర్దూ పదాలున్నాయి కదా అన్నాము. "ఎక్కడ"? అని ఆయన ఆశ్చర్యంగా అడిగాడు. అప్పుడు మేము పాపయ్యశాస్త్రి గారి రచనల నుండే కొన్ని ఉదాహరణలు చూపించాము. ఒక పద్యంలో "రాజాజీ మున్నగు పెద్దలకు మా రాష్ట్రమ్ము మాటంటేనే బేజారెత్తును గుండె" అని అన్నాడు. బేజారు అన్నది ఉర్దూ పదమే కదా! అదే విధంగా విజయశ్రీలో జెండా, పంఖా అనే పదాలను వాడాడు. ఇవి కూడా ఉర్దూ పదాలే! ఈ చర్చను మరింత కొనసాగిస్తూ మీరే కాదు, చాలా మంది ప్రసిద్ధ తెలుగు కవులు అనేక ఉర్దూ పదాలను వాడినారు. ఉదాహరణకు గుర్రం జాషువా "ఫకీరుల, బీదల శూన్యపాత్రలన్" అని రాశాడు. ఫకీరు కూడా ఉర్దూ పదమే కదా! ఇక మహాకవి శ్రీశ్రీ మహాప్రస్థానంలో పారశీ భూయిష్టమైన ఉర్దూ పదాలను చాలా విరివిగా వాడినాడు. తారీఖులు, దస్తావేజులు, మతలబులు, కైఫీయత్తులు, కదం, దగా మొదలగు పదాలు శ్రీశ్రీ కవిత్వానికి సౌందర్యంతో పాటు అమరత్వాన్ని కూడ ప్రసాదించాయి.

ఇక వ్యవహార భాష విషయానికి వస్తే ఆంధ్ర ప్రాంతపు తెలుగువారు, తెలంగాణ ప్రాంతపు తెలుగు వారికంటే ఉర్దూ పదాలను చాలా విరివిగా వాడతారు. ఈ వాస్తవానికి తెలుగు ప్రసార మధ్యమాలు దర్పణం పడతాయి. తెలుగు వాడుక భాషలో మిళితమైన ఉర్దూ పదాలు కోకొల్లలు. కానీ అవి ఉర్దూ పదాలనే విషయం వాటిని వాడే వారికి బహుశ తెలియదు. ఈ సందర్భంగా మచ్చుకి కొన్ని పదాలు పాపయ్యశాస్త్రి గారికి వినిపించాము. అవి –

దరఖాస్తు, మంజూరు, ఫిర్యాదు, అర్జీ, పైరవీ, తనిఖీ, తనఖా, ముసాయిదా, వకాల్తా, వకీలు, తర్జుమా, జవాబు, సవాళ్ళు, తాఖీదు, తయారు, తాలూకు, ఇలాకా, సిఫార్సు, నకలు, సిపాయి, మహజరు, కదం, కందకం, బురుజు, ఖాతరు, బేతరు, బేఖాతరు, బేవార్సు, హైరానా, నజరానా, పేషీ, అజమాయిషీ, రాజీ, రాజీనామా, జమీందారు, ఖబర్దారు, జబర్దస్తీ, కలేజా, కుస్తీ, దగాకోరు, దగుల్బాజీ, ఖాలీ, ధోకా, నామోషీ మజాకా, బహదూరు, బినామీ, బేకారు, బాపతు, బద్‌నామ్, తడాక, వాపసు, పరారీ, గోరీ, పంచాయితీ, ఫైసలా, కసరత్తు, మద్దతు, వాయిదా, ఆదా, బందు, గూండా, పహిల్వాన్, బద్మాష్, దాదాగిరీ, కితాబు, నమూనా, నకిలీ, నగిషీ లడాయి, కబ్జా, తమాషా, షికారు, జల్సా, పుకారు, నిషా, ఖుషీ మజా, మిఠాయి, ఖారా, ఖూనీ, ఖజానా, ఖాతా, జమా, ఖర్చు, చిల్లర, నగదు, బాకీ, వసూళ్ళు, దుకాణం, బజారు, చందా, జరిమానా – ఇంకా ఎన్నో వందల పదాలు ఉన్నాయి.

ఆంధ్ర అంతటా వాడే తెలుగు భాషలో ఉర్దూ పదాలు ఇంత విరివిగా ప్రవేశించిన నేపథ్యంలో, తెలంగాణలో మాట్లాడే తెలుగును తౌరక్యాంధ్రం అనడం ఎక్కడి న్యాయం. ఎంతటి న్యాయం అని అంటే, పాపయ్య శాస్త్రి నిష్ఠురపోయాడు. అధిక సంఖ్యలో ఉన్న ఆంధ్రులు ఏమి అన్నా చెల్లుతుంది. కానీ అల్పసంఖ్యలో ఉన్న తెలంగాణవారు నిజం చెప్పినా చెల్లదు. దీనినే అంబేద్కర్ పరిభాషలో చెప్పాలంటే మైనారిటీ వర్గం పై మెజారిటీ పెత్తందారీతనం అవుతుంది. ■

---

# తెలంగాణ అజాఁ

● వలీ హుసేన్

మౌనం బద్దలయ్యి
మాటగానో, పాటగానో
భావ నినాదం ఉప్పొంగేలా పల్లవించి
ప్రతిధ్వనించాలని ఉంది

చావుని ఎక్కుపెట్టకుండా త్యాగాల కాగడాలతో
ఒకరి నుండి మరొకరికి
వేల నుండి కోట్ల గొంతులోంచి
తరతరాల తల రాతల్ని మార్చే
కొత్త దృశ్యం ఆవిష్కరించాలని ఉంది
గాయాలు మానేల, ఉత్తేజం కెరటాల్లా
తెలంగాణ తల్లి రథచక్రాలను
హృదయాలలో తిరగాడించాలని ఉంది
పంజరం వీడి పావురం విహంగ వీక్షణం చేస్తుంటే
స్వేచ్ఛాగీతం జయ...జయ నినాదాలతో మారు మ్రోగుతుంటే
పిడికిళ్ళు బిగించి తెగించాలని ఉంది
ఇప్పుడు నా మసీదు అజాఁ
నమాజ్ కోసమే కాక
తెలంగాణ రణభేరిలా వినిపించాలని ఉంది ■





www.etelangana.org

# కమురు వాసన

● సంపతి సోమయ్య

మా ఇంటి ఆడపడుచు-మా జీవనది మూసీ
బుడి బుడి అడుగులతో-గలగల పారేదమ్మా
తెలంగాణ గుండెల పైన-చెంగు చెంగున ఎగిరేదమ్మ
గలగల గాజుల నాదంతో-జలజల పారుతుంది
పక్షుల కిలకిల శబ్దం-ప్రకృతే పులకించేది
వానలొస్తే వరదలొస్తే -ఇల్లంతా బురద బురద
పూసిన వరములన్ని-అలికిన అరుగులుండె
తెల్లని మడికట్లన్నీ-పచ్చని ముగ్గులయ్యేది
చిన్ని చిన్ని చేతులతో-చేప పిల్లల తెచ్చేది
ముసి ముసి నవ్వులతో-తెలంగాణను ముద్దాడితె
చిగురించే, చింత చిగురే-చేపల పులుసయ్యేది
ఎదుగుతున్న బిడ్డోలే - ఏరు వెడల్పు అయితే
వయసొచ్చిన మూసిగంగకు-పన్నెండు మూరల పట్టుచీరలు
పల్లె పల్లె పొలిమరల్లో-తెలంగాణ గంగమ్మ పండుగలు
ఈడొచ్చిన బిడ్డని-పలసోనికి అంటగడితె
పిల్లజెల్ల ఏమిలేదు-కడుపంత ఎండిపోయే
ఆంధ్ర కబ్జదారులతో-ఏటిఒడ్డున బంగ్లాలాయె
అరువై ఏండ్ల కాపురంలో -అభివృద్ధి అసలే లేదు
నిత్య కూలి జీవితాలు-నిత్యము తెల్లారుతుండె
కామందు విష కాలుష్యపుతో-మూసి మురికిదాయె
కండ్లుండి మూసుకుంటె-బిడ్డ కాష్టానికి దగ్గరౌతుంది
సచ్చినంక ఏడిస్తే-కమురు వాసన మనల కబళిస్తుంది
బతికి ఉండంగానే విడాకులు తీసుకుందాం



# విముక్త తెలంగాణ కోసం ఉద్యమించిన ప్రజాకవి మగ్దూం

● బెల్లంకొండ సంపత్ కుమార్

మానవుని జనన మరణాల మీద కూడా కుటుంబ సామాజిక, ఆర్థిక, రాజకీయ ప్రభావం ఉంటుంది. ఆటు పోట్ల సహవాసంతో జన్మించి కష్టనష్టాలు అనుభవాలు పొందుతూ జీవనం సాగించిన అతనికి జీవితమే ఒక పాఠశాల. ప్రయోగశాల అటువంటి జీవితం నుండే అలవోకగా విప్లవాలు పుట్టుకొస్తాయి. మగ్దూం మొయినుద్దీన్ ఈ కోవలోకి వచ్చిన మహనీయుడు. మహాకవి అని కీర్తించడం కంటే, ప్రజాకవి అని గౌరవించడం మన తెలంగాణా సంస్కృతిలో భాగం.

మగ్దూం మొయినుద్దీన్ మెదక్ జిల్లా అందోల్ లో 1908 ఫిబ్రవరి 4వ తేదీన పుట్టాడు. వారిది పేద కుటుంబం. తండ్రి గౌస్ మొయినుద్దీన్ తహసిల్ ఆఫీసులో సాధారణ ఉద్యోగి. మగ్దూం నాల్గవ యేటనే తండ్రిని కోల్పోయాడు. పినతండ్రి బషీరుద్దీన్ మగ్దూంను పెంచే బాధ్యత స్వీకరించాడు. ఇది ఆయన కుటుంబ పరిస్థితి అయితే ఆ సమయంలో బ్రిటిష్ వారి పరోక్షపాలనా పీడన, నైజాం ప్రభువుల ప్రత్యక్ష ఫ్యూడల్ పాలన కొనసాగుతుంది. శ్రమకు తగిన ఫలితం లేక, పండిన పంట, చేతికొచ్చింది నోటి దాకా రాని దైన్యం, అసమానతల సమాజం, అవిద్య, నిస్సహాయత ప్రజలలో పేరుకపోయింది.

పుట్టిన శిశువు సాంఘికీ - కరణ చెందుతున్న క్రమంలో కుటుంబం ప్రధాన పాత్ర వహిస్తది. కుటుంబం శిశువుకుతొలి సమాజం అవుతుంది. కుటుంబం, బంధువులు, మిత్రులు, వారి వ్యవహారిక తీరు మగ్దూంను ప్రభావిత పర్చాయి. తన నాల్గో యేట తండ్రి దూరం కావడంతో ఒడిదుడుకులకు లోనైన మగ్దూం మసీదు అరుగుల మీద అరబ్బీ, ఖురాన్‌తో ప్రాథమిక విద్యలో ప్రవేశించాడు. ఈ దశలో బషీరుద్దీన్ పోషణ, మగ్దూంను తీర్చిదిద్దింది. బషీర్ ధార్మిక చింతన గలవాడైనప్పటికీ కమ్యూనిజాన్ని అభిమానించేవాడు. ప్రపంచ పరిస్థితులను చదివేవాడు. అవగాహన పొందేవాడు. ఇంట్లో అందరూ కలిసి భోజనం చేసే సమయంలో ప్రపంచ రాజకీయ పరిస్థితులను నేపథ్యాలను, అక్టోబర్ విప్లవాన్ని



www.etelangana.org

ప్రస్తావించేవాడు. ఈ కారణంగా మగ్దూం బాల్య దశ నించే ఆలోచనాపరుడైండు. మగ్దూం పిన తండ్రి కొడుకు నిజామొద్దీన్ మంచి అధ్యయన శీలి కావడం వలన ఆయన ప్రభావం మగ్దూంపై పడ్డది. బాల్యం నుండే అందరూ కలిసి ఒకే దస్తర్ ఖాన్‌పై భోజనం చేసే సమానత్వపు రోజుల గురించి మగ్దూం పరితపించాడు. కమీజులపై బ్రిటిష్ వారి చిహ్నాలను గానీ, నిరంకుశ పాలకుల ప్రతీకలను గాని ధరించడాన్ని బాల్యంనుండే అసహ్యించుకున్నాడు కలాన్ని ఆయుధంగా ఎక్కుపెట్టాడు. విద్యార్థి దశలో, స్కూలుకు వెళ్తున్నప్పుడు కలవారు గుర్రపు భగ్గీలలో పోతుంటే బగ్గీ వెనక తన సహవాస మిత్రులతో వేలాడుతూ కలవారి ఆగ్రహాన్ని చవిచూశాడు. వార్ల కట్టెతో దెబ్బతిని బేధాన్ని అనుభవించాడు. నలుగురు కలిసి అంగడికి పోవడం, జాతర్లలో తిరగడం మిఠాయిలు తినాలనుకోవడం పతంగుల కోసం ఆరాటపడడం సహజంగా తన బాల్యంలో జరిగినై. ఇంటర్మీడియట్ విద్యాస్థాయి నుండే మగ్దూం చిన్న చిన్న ఉద్యోగాలు చేస్తూ చదువుకున్నాడు. ఉస్మానియా యూనివర్సిటీలో చదువుతున్న సమయంలో ప్రపంచ ప్రఖ్యాత రచనలను ముఖ్యంగా నాటకాలను ఉర్దూలోకి అనుసృజన చేసి మంచి పేరు తెచ్చుకున్నాడు. మగ్దూం రచనలను, నాటకాలను చూసి టాగూరు, సరోజిని నాయుడు, నిజాం నవాబు, సర్ కిషన్ ప్రసాదులు ముగ్ధులయ్యారు. 1937 సంవత్సరానికి ఎం.ఎ. పూర్తి చేశాడు. 1939లో సిటీ కాలేజిలో ఉర్దూ ఉపన్యాస కారుడిగా చేరి, సాహిత్య కళారంగాల ద్వారా విద్యార్థుల హృదయాలను ఆకట్టుకున్నాడు. 1939 వరకే నాటకాలు, ఏకాంకీలు, అనువాదాలు, కవిత్వం, కథ, ఉపన్యాసాలు విరివిగా సృజన చేసి సాహిత్య రంగంలో స్థిరపడ్డ మగ్దూం 1941 సంవత్సరానికి పూర్తి కాలం ప్రజల కోసం పనిచేయడానికి నిర్ణయించుకున్నాడు. అధ్యాపక జీవితం నించి కవిగా, గాయకునిగా, రాజకీయాలు అధ్యయం చేసిన మేధావిగా, నాయకునిగా, నటునిగా, శ్రామికులను అమితంగా ప్రేమించే మానవతా వాదిగా క్రమంగా ఎదుగుతూ శాసన సభ్యుడు అయ్యాడు. సమాజం మార్పుకోరే వానిగా, తెలంగాణా దీనత్వాన్ని చూడలేని విప్లవకారునిగా చిరస్థాయిని పొందాడు ఆంధ్రమహా సభ ఆవిర్భావం, తర్వాతి పరిణామాలు ప్రజల చేతిలోకి వెళ్ళడం అది రైతాంగం వైపు మొగ్గుచూపి ఫ్యూడల్ విధానాలకు దోపిడి పాలనకు వ్యతిరేకమైన అడుగుతీసుకోవడం ఈ రాజకీయాల వెంట మగ్దూం పయనం ఆయనకు ప్రజాపక్షపాతిని చేసింది. ఈ క్రమంలో భారత భూమికే తెలంగాణ మార్గదర్శకత్వం అవుతుందన్న మగ్దూం కల ఆశయం విశ్వజనీనమైంది.

"దియారే హింద్ కావో రాహో బర్ తెలంగాణా
బనారహా హై నయా ఇక్ సహర్ తెలంగాణా
బులారహా హై బాసిమ్తే దిగర్ తెలంగాణా
వో ఇన్‌కలాబ్ కా పైగంబర్ తెలంగాణా" అంటూ నవోదయాన్ని కొత్త దిక్కును చూపించే తెలంగాణా విప్లవ సందేశాన్ని ప్రజలకు ఇచ్చాడు. అంతే కాకుండా త్యాగజీవులను, అమరవీరులను పాడుతూ.

సలాం సుర్ఖ్ షహీద్‌కి సర్‌జమీన్ సలాం
సలాం అజ్మె బులంద్ అహనీయకీన్ సలాం
ముజాహీదోంకి చమక్తీ హుయీ జబీన్ సలాం
దియారే హింద్‌కి మహబూబ్ అరజ్ చీన్ సలాం



అరుణారుణ అమర వీరులకు 'సలాం' గానం చేశాడు. అభ్యుదయకాలాన్ని విప్లవ శిఖరాలకు తీసుకపోయిన ఘనత ఆయనది.

మగ్దూం మొయినుద్దీన్ కవిత్వంలో "ఆచరణ గొప్పదే కేవలం రాస్తూపోవడం మాత్రమే కాదు నిజజీవితంలో నమ్మిన సిద్ధాంతాన్ని ఎలా ప్రతి ఫలన చేస్తూ జీవిస్తున్నారోనన్నది ముఖ్యమని తన జీవితాన్ని ఆదర్శంగా చూపాడు. ఆయన ఈ వ్యవస్థను ధిక్కరించే ధైర్యంలో ఒక భగత్ సింగ్ కన్పిస్తాడు. 1934 సంవత్సరం వరకే విస్తృతంగా సాహిత్య అధ్యయనం చేసి ఉండడం వలన కమ్యూనిజాన్ని ప్రేమిస్తూ ఫాసిజాన్ని యుద్ధోన్మాదాన్ని వ్యతిరేకించే చైతన్యం పొందడం వలన జీవితంలో నిత్య సంఘర్షణలు ఎదుర్కోవడం వలన బానిసత్వాన్ని, పెట్టుబడిదారి – తనాన్ని భూస్వామ్య ఫ్యూడల్ వ్యవస్థను ధిక్కరించి సమానత్వం గల ప్రజా ప్రాధాన్యత గల మరొక వ్యవస్థ అవసరమని నమ్మాడు విప్లవం పురిటిగడ్డ తెలంగాణా విశ్వానికే ఆదర్శం కావాలని గొంతెత్తి, గిరిజన ఆదివాసిలను రైతులను కలుపుకొని ముందుకు పోయాడు. ఇది నాది, నా సొంతం అనేది లేకుండా మగ్దూం ప్రజల కోసం నిబద్ధునిగా ఉంటూ "ఎ జంగ్ జంగే ఆజాదీ" వంటి అమూల్యమైన రచనలు చేశాడు. ఇటువంటి రచనలకు సామాన్య మానవుడే కేంద్ర బిందువు. పల్లె జనం బాధలు గాధలు ఆయనకు తెలుసు. ఈ శిధిలాల మీద స్వాతంత్ర్య పతాకం ఎత్తుమని, రక్తపతాకాన్ని ఎత్తుమని సామాన్యునికి. తన రచనల ద్వారా పిలుపు నిచ్చాడు. మానవుని నిర్వీర్యుల్ని చేసిన దుష్ట వ్యవస్థపై "మౌత్ కా గీత్" (మృత్యుగీత) రచించాడు. అందమైన భవిష్యత్ కోసం యుద్ధం మీద యుద్ధాని ప్రకటించాడు. అందుకొరకు భూకంపాలను, విలయ ఝంఝు ప్రభంజనాలను, జ్వాలా ముఖోద్గత లావా ప్రవాహాలను ఆహ్వానిస్తూ తెలంగాణా దిశా నిర్దేశానికి తొలి సారి ఆచరణాత్మకమైన ఒక శ్రీశ్రీగా అంకురార్పణ అయ్యాడు.

'సిపాయి' గీతంలో ఎగురుతున్న "మార్పు" పతాకాన్ని చెరిగిపోయే చీకట్ని జయించే స్వాతంత్రాన్ని, ప్రజా స్వేచ్ఛను పాడుతూ యుద్ధం చేసే సిపాయిని చేరదీసుకున్నాడు. "విద్య" సామాన్యుని విముక్తుని చేసే శక్తివంతమైన ఆయుధమని ప్రజా చైతన్యం కోసం కృషి చేశాడు. ఉన్నత విద్యలు, పదవులు అన్నీ జాగీర్దార్లే ఆ క్రమించుకుంటూంటే మగ్దూం సహించలేకపోయాడు ఈ అసమానతలు రాజ్యంలో అందరికీ సమానంగా ఉండే రోజులవి. ఇందుకు హిందూ – ముస్లిం భేదం లేదు. ప్రజలందరూ ఒకే రకమైన సామాజిక రాజకీయ ఆర్థిక అసమానతలు అనుభవించడం వలన నిజాం నిరంకుశత్వానికి వ్యతిరేకంగా పోరాటంలో పాలుపంచుకున్నారు. ఒకవైపు భారతదేశంలో ఉవ్వెత్తుతున్న స్వాతంత్ర పోరాటం జరుగుతుంది. మరో వైపు నిజాం రాజ్యంలో ఆంధ్రమహా సభ ప్రజాపర రాజకీయ పోరాటం – తెలంగాణా రైతాంగ పోరాటం గెరిల్లా పోరాటాలు ఇక్కడ జరుగుతున్నాయి 1948 సంవత్సరంలో మగ్దూం తెలంగాణా ప్రజల స్వేచ్ఛా స్వాతంత్రాల కొరకు తళతళా మెరిసే కొడవలిని, ఎగసి ఎగసి విస్తరిల్లే నాగలిని, పొలాల పొత్తిట పెరిగిన పాపలను ముద్దుగా ఎత్తుకున్నాడు, గుండెలకు హత్తుకున్నాడు. ప్రజలను ప్రజాసాహిత్యాన్ని ప్రేమించాడు. నీతి మాలిన రాజకీయాలను అసహ్యించుకున్నాడు.

"శేర కుభేరుల మేడలు మిద్దెలు
గడ గడ గడగడ వణకుచు కూలెను
హాలకూల జారుల పాలన
వజ్రాలు వారి బదాబద్దలయ్యెను" అంటూ రజాకార్ల ప్రభుత్వం పై సాగిస్తున్న సాయుధ పోరాటం మధ్యలో ఉన్నామని బాధ్యతలను గుర్తుచేస్తాడు. పోలీసు యాక్షన్ సామ్రాజ్యవాదుల మిలాఖత్‌గా ప్రజలపై



www.etelangana.org

దాడిగా విశ్వసించాడు.

"చాంద్ తారోంకాబన్" (1958) గీతం ద్వారా మగ్దూం స్వాతంత్ర్య పూర్వం, స్వాతంత్ర్యం తర్వాత, ప్రస్తుతం మూడు కాలాలను ప్రభావిత పరుస్తాడు. ప్రజలకు ఇంగా వెలుగు రాలేదని ఇంకా చీకటి ఉంది. రాత్రి అవశేషాలు పోలేదు. అట్లా అని నిరాశలేదు. ప్రభాత కాంతి పొడసూపుతుంది. అని ప్రజలను కర్తవ్యోన్ముఖలను చేస్తాడు.

"చేయి చేయి పట్టుకో

గమ్యము చేరికో" మ్మని తెలంగాణా ప్రజలు సాగవలసిన తోవను చెప్పడంలో మగ్దూం స్పష్టత తేటతెల్లమవుతుంది. ప్రణయ, శృంగార కవిత్వాలను, పలాయన వాదాన్నీ, అహేతుకత్వాన్ని ఆయన విశ్వసించలేదు మతతత్వానికి అడ్డకట్టవేసి విశ్వజనీనతను చాటాడు.

"యే జంగ్ హై జంగ్ ఇ – ఆజాదీ

ఆజాదీ పర్చమ్‌కే తాలే

హమ్ మజ్‌దూరోంకి.." అనే విశ్వాసంతో మానవతపై ప్రగాఢమైన ప్రేమ కల్గిన మగ్దూం ప్రజా తెలంగాణా కాముకుడు.

మగ్దూం మొయినుద్దీన్ 1969 అగస్టు 25వ తేదీన ఆశయాలను నెరవేర్చే బాధ్యతలను తర్వాతి తరంపై ఉంచాడు. సాహిత్య సాంస్కృతిక వారసత్వమున్న భారతీయ ఉర్దూ భాషలో తనదైన చెరగని ముద్రవేసి, శ్రమ జీవుల ఆకాంక్షలను సాహిత్య ప్రక్రియలలో పొందు పరిచి కారాగార వాసాన్ని, రహస్య జీవితాన్ని లెక్కచేయని మగ్దూం అమరుడు. విముక్త తెలంగాణ కోసం జీవితాన్ని ఉద్యమ రంగంగా మార్చుకున్న ప్రజాకవి. కనుకనే అమరుడు. ■

### నివాళి

హైదరాబాద్ చరిత్రను సంస్కృతినీ దేశవిదేశాల్లో ప్రచారం చేసిన అలీయావర్‌జంగ్, మెహదినవాజ్‌జంగ్, అక్బర్‌హైదరీ అందరూ ఇప్పుడూ ఎవ్వరికీ పట్టని వాళ్ళయ్యారు. ప్రపంచ ప్రసిద్ధి గాంచిన ఇంజనీర్ అలీయావర్‌జంగ్ కట్టించిన పోచంపాడు, హైదరాబాద్‌లో ప్రజాసంక్షేమం కోసం, పేదవారి కోసం క్యాన్సర్ హాస్పటల్‌ని కట్టించిన మెహదినవాజ్‌జంగ్, వివిధ దేశాల్లో రాయబారిగా పనిచేసిన అక్బర్‌హైదరీలు హైదరాబాద్ సంస్కృతిని దేశవిదేశాల్లో చాటి చెప్పారు. వారి కృషికి, ఇలాంటి విస్మరణకు గురయిన హైదరాబాదీలందరికి 'సింగిడి' నివాళి అర్పిస్తుంది.



## తల్వార్

• స్కైబాబ

అరే.. ఆంధ్రోడా!
పువ్వు రాయి బోనం బతుకమ్మ
డప్పు దరువు ఆట పాట
ప్రకృతి అంతా మీకు ఎదురుతిరిగిందిరా
ప్రకృతికి విరుద్ధంగా నిలిచిన మీ ఉనికిని
వేర్లతో సహా పెరికెయ్యడమే ఇక తరువాయి



మొహంపై పువ్వు
మనసులో ముల్లు
ఇంకా ఎన్నాళ్లు ఆడతార్రా నాటకం
ఇన్నాళ్లా మేస్త్రిరి గదరా..
మనిషి ముసుగుల్లో ఉన్న పందికొక్కుల్లాగా
థ్వా.. నీ యవ్వ
మొహంపై ఉమ్ముతున్నా ఇంకా వేలాడుడేంద్రా
సిగ్గూ శరం లేనోళ్లలాగా..
నీతి తప్పినోళ్లార్రా – నియ్యతి లేనోళ్లార్రా
నిప్పుల మీద నీళ్లు సల్లుదామని చూస్తున్నార్రా
ఇక్కడ నీళ్లే నిప్పై మండుతయ్ బిడ్డా
కన్నీళ్లే నిప్పు రవ్వలై లేస్తయ్
జా...
మా కణం కణం రాజుకుని
అణువణువూ నిప్పై ఎగుస్తున్నది
మా నేల తల్లి నేర్పిన ఓర్పే
మమ్మల్నింకా ఆగబడ్తున్నది
ఓపికకూ హద్దుంటుంది బిడ్డా
ఇంకా మా ఓపికను పరీక్షించొద్దు
దేహాలు తల్వార్‌లై లేస్తయ్
నంగి నంగి వేషాలొద్దు
నక్క తెలువులు ఇంకా చూపెట్టొద్దు
కనలి కనలి అగ్నిగుండమై ఉన్నోళ్లం
రగిలి రగిలి రక్త కాసారమై మరుగుతున్నోళ్లం
ఇంకొక్క చాన్సిద్దామనే ఊకున్నం
లేదంటే – ఒంటితో మంటను రాజేస్తున్నోళ్లం కదా



www.etelangana.org

కత్తిసాము చెయ్యడం కష్టమేం కాదు మాకు
దేహాన్ని చిటికెలో భస్మం చేస్తున్నవాళ్లం
అడ్డొస్తే అడ్డంగా నరకడం పెద్ద పనేం కాదు మాకు
గోస తీస్తున్నది మేము
తీర్పులు మీరు చెప్తాన్రా!
మేడలు కట్టుకున్న మీ అధిపత్యం
మేము నినదిస్తే బీటలు వారుతుంది
మా శ్రమశక్తిని మా సంపదను దోచి
ఎన్ని అక్రమ నిర్మాణాలు చేసిన్రో
లెక్కలు తేలాలి బిడ్డా

బేవఖూఫుల్లారా
ఇంకా ఐక్యత గురించి మాట్లాడకుర్రా
మీరు మెక్కిన మా ఆస్తినంతా కక్కిస్తాం
మా నేల మీకు ఉమ్మడీ ఆస్తి ఎట్లా అయ్యిందిరా
మీ ఇంటినో మీ ఇంటోన్నో
ఉమ్మడి ఆస్తి అంటే ఊరుకుంటాన్రా
చాలు మీ నఖరాలు - తట్టా బుట్టా సర్దుకోవాలె
బెజవాడకు మెయిలు కడతం
బద్మాష్‌లంతా భగాయించాలె
మళ్లీ సూడొద్దు మా హైదరాబాద్ దిక్కు
మజాకైతున్నాద్రా..!
ఇజ్జత్ తక్కువ నా కొడకల్లారా..
ఊకుంటుంటే ఉపాయాలెక్కువ జేస్తున్నరేంరా
బొక్కలిరగ తంతమ్
ఉచ్చ పడాలె బిడ్డా
అష్టదిగ్బంధనం చేస్తాం
ఎటూ పారిపోలేరు - పాతరేస్తం కొడకా!

ఇదే మా ఆఖరి పోరాటం
ఈ మోఖా తప్పించిర్రో
మా ఓపికల బంధనాలు విప్పుతాం
నాలుకలు చీల్చడం కాదు
అవసరమైతే అడ్డొచ్చే దుర్మార్గుల్ని
పచ్చివేపల్ని చీల్చినట్లు చీలుస్తాం
ప్రజాస్వామ్యం మా నమ్మకాన్ని కూలదోస్తే
మేము దాన్నే కూలదోస్తాం
ఖబర్దార్! ■







# అక్బర్... ఈ తరం తెలంగాణ చిత్రకారుడు!

• యం.డి.యాకూబ్ పాషా



కోయగూడెం ఎలా ఉంటుంది?

పోనీ, ఆ పల్లెలో చాకలి బూదెమ్మ, మంగలి బుచ్చక్క, లంబాడి లక్ష్మి, దూదేకుల బూబమ్మ, మాదిగ మారెమ్మ... ఎలా ఉంటారు?

గుడిసె మీద పచ్చని చిక్కుడు పాదు చుట్టూ తిరిగే ఉడత కళ్ళలో మర్మం ఏ రంగులో ఉంటుంది?

గౌండ్ల రాములు ముత్తాడుకు వేలాడే లొట్టిని చూశారా ఎవరైనా?

పొద్దు పొద్దున్నే లొట్టిలో పొంగే కల్లు మైకపు కళను చూశారా ఎప్పుడైనా?

అసైె ఘూ...లా అడుగుల్లో వేడివేడి పాటలు విన్నారా?

ఊరు అనేది ఊరు కమాత్రమే కాదు. విశాలమైన కళా ప్రపంచం. అది తన బిడ్డల్ని పిలుచుకుంటుంది. బిడ్డలు దాని ఒడిలోకి పావురంగా వెళతారు.

అలా వెళ్ళిన ఒక బిడ్డ అక్బర్.

కొన్ని రోజుల క్రితం మా ఆఫీసులో ఒక పుస్తకం చూశాను. రోజూ చాలా పుస్తకాలు చూస్తుంటాం కాబట్టి ప్రత్యేకంగా దేని మీదికి దృష్టి పోదు. కానీ ఆ రోజు పుస్తకం మీదికి దృష్టి పోవడానికి ప్రధాన కారణం ముఖచిత్రంగా అక్బర్ గీసిన బొమ్మ.

"అక్బర్‌గారు గీసింద్రు అంటే సరుకు ఉన్న పుస్తకం" అని ఒక నమ్మకం. దాంతోనే ఆ పుస్తకాన్ని చాలా సేపు చేతుల్లోకి తీసుకున్నాను.

ఆ 'నమ్మకం' వెనుక అక్బర్ సంవత్సరాల కష్టం ఉంది. దాన్ని ఒకసారి తలుచుకోవడంలో ఉత్తేజం ఉంది.



www.etelangana.org



ఖమ్మం జిల్లా కోయగూడెంలో అక్బర్ వాళ్ళ నాన్న మున్వరుద్దీన్ టీచర్. మూడవతరగతి రోజుల్లో అక్బర్‌కు పాఠ్యపుస్తకాల్లోని పాఠాల కంటే అందులోని బ్లాక్ అండ్ వైట్ బొమ్మలు అంటేనే ఇష్టం. ఎప్పుడూ ఆ బొమ్మల్ని గీస్తూ ఉండేవాడు.

"మస్త్ గీసినవ్‌రా" అని ఎవరైనా అంటే మరిన్ని బొమ్మలు ఉత్సాహంగా గీసేవాడు. ఇదంతా చూసి పెద్దవాళ్ళు ఏమనుకున్నారంటే–

"పోరడు ఆర్టిస్ట్ అయ్యేటట్టున్నడు" అని.

పైనుంచి 'తథాస్తు' అనే సౌండు రిసౌండులో వినిపించలేదుగానీ అదే నిజమైంది.

ఇంటర్‌లో చిత్రకళను సీరియస్‌గా తీసుకున్నాడు అక్బర్.

"జూటని, జువాలజి బొమ్మలతో నువ్వు ఒక రికార్డ్ తయారు చేయాలి. అది మోడల్ రికార్డ్‌లా ఉండాలి" అని లెక్చరర్ చెప్పాడు.

చెప్పింది వినయంగా చేయడం అక్బర్ అలవాట్లలో మొదటిది.

"అలాగే" అనడమే కాదు టీచర్ చెప్పిన చాలా ఫాస్ట్‌గా చేశాడు.

"శభాష్" అన్నాడు టీచర్.

ఎవరైనా కుర్రాళ్ళు రికార్డులో వంకరటింకర గీతలు గీసి కాలేజికి వస్తే టీచర్ తిట్టేవాడు...

"ఒరేయ్, రికార్డ్ అంటే అక్బర్ రికార్డ్‌లా ఉండాలి. కోతిగీతలు గీయడం కాదు" అనే వాడు.

కళ అనేది ప్రశంస, మానసిక ఉల్లాసానికి మాత్రమే ఒక మంచి పనివైపు ఇతరులను మోటివేట్ చేయడానికి ఉపకరించే ఉపకరణం అనే విషయం అక్బర్‌కు మొదటిసారిగా అర్థమైంది.రికార్డుల్లో పిచ్చి గీతాలు గీసే పోరడు ఎవడైనా 'మోడల్ రికార్డ్' ను చూసి "నేను అక్బర్‌లా ఎందుకు గీయకూడదు?" అనుకుంటే వాడిలో పట్టుదల పెరిగినట్లే కదా! తన పూర్వపు పని లోపాన్ని సరిదిద్దుకొని నాణ్యమైన పని కోసం ఆరాటపడే అవకాశం వచ్చినట్లే కదా!!

***

ఒకసారి ఖైరతాబాద్‌లోని అక్బర్ వాళ్ళ ఇంటికి వెళితే పికాసో దగ్గరి నుంచి ఎందరెందరో గొప్పవాళ్ళ పుస్తకాలు కనిపించాయి. మరికొన్ని పుస్తకాలు ప్రత్యేకంగా రంగులు గురించి ఉన్నాయి. మొత్తానికైతే అక్బర్ తన సంపాదనలో సగం ఆర్ట్, లే–అవుట్ పుస్తకాలకు ఖర్చు చేస్తున్నాడని గుట్టలుగా కనిపించిన ఆ పుస్తకాలు రహస్యంగా చెప్పాయి.

"ఇప్పుడంటే ఇవన్నీ ఉన్నాయిగానీ ఒకప్పుడు సత్తుపల్లిలోని సైన్ బోర్డ్‌లే నాకు ఇన్‌స్పైరింగ్ మెటీరియల్" అన్నాడు అక్బర్.

స్కూల్‌కు పోతున్నప్పుడో, కాలేజికి పోతున్నప్పుడో, ఫ్రెండ్ ఇంటికి పరుగెత్తుతున్నప్పుడో ఎక్కడైనా అందంగా రాసిన సైన్‌బోర్డు కనిపిస్తే మంత్రం వేసినట్లు ఆగిపోయేవాడు. మౌనంగా ఆ అక్షరాలతో సంభాషించేవాడు. ఇంటికి వచ్చి ప్రాక్టీస్ చేసేవాడు.





సత్తుపల్లిలోనూ, పాల్వంచలోనూ కనిపించే ప్రతి సైన్‌బోర్డ్ ఆర్టిస్ట్ అక్బర్‌కు పికాసోలాగే కనిపించేవాడు. వాళ్ళతో మాట్లాడడానికి ఆరాటపడేవాడు. వాళ్ళ మాటల్లో నుంచి తన ఆర్ట్‌ను మెరుగుపరుచుకునే విషయాలేమైనా ఉన్నాయా అని వేయికళ్ళతో వెదుక్కునేవాడు.

సైన్‌బోర్డ్ రైటింగ్ గ్లామర్ ప్రొఫెషన్‌గా కనిపించింది అతనికి.

తాను కూడా గోడలెక్కి రాయడం ప్రారంభించాడు.

అలా రాస్తున్నప్పుడు తనకు తృప్తిగానూ, గొప్పగానూ ఉండేది. లోకానికి మాత్రం అలా ఉండేది కాదు. లోకం ముక్కు మీద వేలు వేసుకుని ఏమనుకునేదంటే...

"ఈ పోరడేంది? డిగ్రీ చదివి సైనుబోర్డులు రాస్తున్నడు. ఎవలన్న సూస్తే ఇజ్జత్ బోతది" లోకాన్ని పట్టించుకున్నవాడు ఎవడూ బాగుపడడు. బాగుపడ్డవాడెవడూ లోకాన్ని పట్టించుకోడు. (సొంత గ్రంథం ఆరో అధ్యాయం. నాలుగో ప్రవచనం)

అక్బర్ కూడా ఈ టైపే!

తన మానాన తాను సైన్‌బోర్డులు, బ్యానర్లు రాసుకుంటూనే ఉన్నాడు. 'నేడే విడుదల మీ అభిమాన థియేటర్‌లో' సినిమాహాల్ల గోడలమీద రాతలు రాస్తూనే ఉన్నాడు.

సత్తుపల్లిలో డిగ్రీ చేస్తున్నప్పుడు, ఫ్రెండ్స్‌తో కలిసి రూమ్ తీసుకున్నప్పుడు....

"నెల నెల నువ్వు అడిగినంత డబ్బు పంపలేను" అని చేతులెత్తేశారు వాళ్ళ నాన్న మున్వరుద్దీన్. నాన్న కష్టాలు తనవి. నాన్న తన కష్టాలు తీర్చుకోవడానికి మ్యాజిక్‌లాంప్ దొరకలేదు. తన కష్టాలు తీర్చడానికి మాత్రం అక్బర్ దగ్గర 'మ్యాజిక్ బ్రష్' ఉంది. ఒక నెల రూమ్ రెంట్‌కు యాభై రూపాయలు తక్కువైతే...తన చేతిలోని మ్యాజిక్ బ్రష్‌ని "ఏదో ఒకటి చెయ్" అనేవాడు.

బ్యానరో, పోట్రాయిటో ఏదో ఒకటి....

బస్.

ఆ నెల కష్టం తీరి పోయేది!!

***

ఒకసారి మా పత్రిక తరఫున పైడి తెరేష్‌బాబును ఇంటర్వ్యూ చేయడానికి ఆకాశవాణి....హైదరాబాద్ కేంద్రానికి వెళ్ళాను. ఆ మాటా ఈ మాటా మాట్లాడిన తరువాత అక్బర్ గురించి ప్రేమగా కొన్ని విషయాలు, గొప్పగా కొన్ని విషయాలు తన మార్క్ నవ్వులతో చెప్పాడు తెరేష్. ఇదే విషయాన్ని అక్బర్‌తో చెబితే...ఆయన మనసు హైదరాబాద్ నుంచి కొత్తగూడెంకు నిమిషానికి అయిదు వందల కిలోమీటర్ల వేగంతో ప్రయాణం చేసింది.

"అప్పుడు తేరేష్ బాబు, మద్దూరి నగేష్‌బాబు ఆకాశవాణిలో పనిచేసేవారు. ఇద్దరికీ అప్పటికింకా పెళ్ళి కాలేదు. నేను నా తమ్ముడు ఖాజా ఇంకొందరం ఎప్పుడూ వీళ్ళ ఇంట్లోనే ఉండే వాళ్ళం వండుకునే వాళ్ళం. తాగేవాళ్ళం. తినేవాళ్ళం. వాళ్ళ బట్టలు తొడుక్కునే వాళ్ళం. వాళ్ళ పుస్తకాల్లో



www.etelangana.org

...మార్చేవాళ్ళం. వాళ్ళ తలలో పుట్టే చిత్రమైన ఆలోచనలలో గొంతు కలిపేవాళ్ళం. వాళ్ళ కవిత్వంలో ...త్వమయ్యేవాళ్లం. వాళ్ళ ధిక్కారచూపులతో దిక్కుల్ని ప్రశ్నించేవాళ్ళం" కొత్తగూడెం గొంతుతో మాట్లాడాడు అక్బర్.

అప్పుడు సమయం సుమారు రాత్రి ఏడు అనుకోండి.

ఆంధ్రజ్యోతి పత్రికాఫీసు దగ్గర అక్బర్ నల్లటి సాంత్రో కారును చూసి....

"సార్...కారు మస్తున్నది" అని అంటే ఆయన సన్నగా నవ్వారు. సుతి మెత్తగా డ్రైవింగ్ చేస్తూ, చేస్తూ జూబ్లిహిల్స్ చెక్ పోస్ట్ దగ్గర లైట్ ఎర్రగా నవ్వినప్పుడు కారు ఆపి అక్బర్ ఇలా అన్నాడు...

"నీకో విషయం తెలుసా? చిన్నప్పుడు కాంపాస్‌బాక్స్ కొనుక్కోవాలనుకున్నాను. తీరలేదు. కాలేజి రోజుల్లో డిసెక్షన్ బాక్స్ కొనాలనుకున్నాను. తీరలేదు.డిగ్రీలో సైకిల్ కొనాలనుకున్నాను. తీరలేదు. ఉద్యోగపు తొలిరోజుల్లో బైక్ కొనాలను కున్నాను. తీరలేదు. ఇలా తీరని కోరికలు చాలా ఉన్నాయి. కానీ ఏ రోజు కూడా కారు కొనాలనుకోలేదు. కాని ఇప్పుడు కారు కొనుక్కున్నాను. చూశావా? లైఫ్ అనేది ఎంత చిత్రమైనదో" పచ్చ లైట్ వెలిగింది.

నల్లటి కారు గుసగుసమంటూ వెళుతుంది.

" ఇంకా ఇట్లాంటి చిత్రాలేమైనా ఉన్నాయా?" అన్నాను ఆయన ముఖంలోకి ముఖం పెట్టి చూస్తూ. కారును రైట్ సైడ్ మళ్ళిస్తూ ఆయన మాట్లాడ్డం ప్రారంభించారు.

"బి.యఫ్.ఏ చేయాలనేది నా బిగ్‌డ్రీమ్. హైదరాబాద్‌లో రెండుసార్లు ఎంట్రెన్స్ టెస్ట్ రాశాను. వైస్- చాన్సలర్ కలపిచ్చికి, ధనపిచ్చికి, బంధుత్వ పిచ్చికి రెండు సార్లు నాకు సీటు రాలేదు. వైజాగ్ అయితే బెటర్. ఇట్లాంటి చిల్లర వ్యవహారాలు ఉండవు. శాంతినికేతన్‌లో చదువుకున్న టీచర్లు అక్కడ ఉన్నారు. నీకు న్యాయం జరుగుతుంది అని ఎవరో చెప్పారు. అలాగే చేశాను. ఆంధ్ర యూనివర్సిటీలో నాకు ఫస్ట్ ర్యాంక్ వచ్చింది. ఫస్ట్‌ర్యాంకు వచ్చినందుకు ప్రోత్సాహంకంగా, 3 సంవత్సరాల్లో నా చదువుకు అయ్యే ఖర్చు మొత్తం భరిస్తామని ఒక కలర్ కంపెనీ ముందుకు వచ్చింది. బ్యాడ్‌లక్ ఏమిటంటే ఆ సమయంలోనే మా నాన్న చనిపోయాడు. ఇక చదివింది చాలు, ఏదైనా ఉద్యోగం చెయ్ అన్నారు ఇంట్లో వాళ్ళు. వాళ్ళ మాట విని ఎంట్రన్స్ రాసి హెల్త్ ఇన్‌స్పెక్టర్ ట్రైనింగ్ తీసుకున్నాను. ట్రైనింగ్ పూర్తయిన తరువాత జాబ్ నోటిఫికేషన్ వచ్చింది. నా మార్కులను చూసి జాబ్ రావడం గ్యారంటీ అనుకున్నారు అందరూ. కానీ ఉద్యోగాలను టాలెంట్ ప్రాతిపదిక మీద కాకుండా డబ్బు మూటల బరువు ప్రాతిపదికగా తీసుకున్నారు.

సైకిల్ కొనడానికే డబ్బులు లేనోడిని... నా దగ్గర ఎక్కడుంటాయి అన్ని డబ్బులు!!

ఇష్టపడ్డ బి.ఎఫ్.ఏను కష్టంగా దూరం చేసుకున్నాను.

కష్టపడ్డ హెల్త్ ఇన్‌స్పెక్టర్ ఉద్యోగం చేయలేకపోయాను.

***

" మా ఊళ్ళో ఉన్నప్పుడు ఆంధ్రజ్యోతి సండెస్పెషల్లో మీ బొమ్మలు చూసి మురిసిపోయేవాడిని" అని నేను అంటే అక్బర్ త్రిపురనేని శ్రీనివాస్ ముచ్చట్లలోకి తీసుకువెళ్ళాడు.

"చలం శతజయంతి సందర్భంగా పాల్వంచలో సభ ఏర్పాటు చేసినప్పుడు కవులు రాసిన కవితలతో బొమ్మలు వేశాను. అవి చూసి శ్రీనివాస్ బాగున్నాయి అన్నారట. తేరేష్ నన్ను శ్రీనివాస్



దగ్గరకు తీసుకెళ్ళి 'ఇతనే బొమ్మలు గీసింది' అని చెప్పారు. అలా త్రిపురేని శ్రీనివాస్ తో పరిచయం అయింది.

"ఇంకా ఎన్నిరోజులు సైన్‌బోర్డ్‌లు, పోట్రాయిట్లు గీస్తావు. నువ్వు ఉండాల్సింది ఇక్కడ కాదు. పత్రికల్లో" అని నన్ను హైదారాబాద్‌లోని ఆంధ్రజ్యోతి ఆఫీసులో ఉన్న త్రిపురనేని శ్రీనివాస్ దగ్గరికి తీసుకువెళ్ళారు. అప్పుడు ఆయన ఆంధ్రజ్యోతి వీక్లి ఎడిటర్. ఆయన తక్కువగా మాట్లాడతారు. నేను అంతకంటే తక్కువగా మాట్లాడతాను. సరే, ఈ మాటల సంగతి పక్కనపెడదాం.. ఎండ్లూరి సుధాకర్ మల్లెమొగ్గల గొడుగు స్క్రిప్ట్ చేతిలో పెట్టి బొమ్మలు గీయండి అని చెప్పారు. అలా ఫ్రీలాన్స్ ఆర్టిస్ట్‌గా పత్రికా ప్రపంచంలోకి అడుగుపెట్టాను. హైదరాబాద్‌లో ఉండటం మాటలు కాదు కదా? డబ్బు సరిపోయేది కాదు. అందుకే ఆంధ్రజ్యోతిలో స్టాఫ్ ఆర్టిస్ట్‌గా తీసుకోమని శ్రీనివాస్‌ని అడిగాను. ఆయన ఓకే అన్నారు. అలా నన్ను ఆంధ్రజ్యోతి సంస్థలోకి తీసుకునే ప్రయత్నాలు జరుగుతుండగానే దురదృష్టవశాత్తు త్రిపురనేని శ్రీనివాస్ యాక్సిడెంట్‌లో చనిపోయారు. ఒక మహాశూన్యం నాముందు కనిపించింది. చాలా ఆందోళనకు గురయ్యాను.

"ఎలా బతకాలని" అనే వణుకు మొదలైంది.

ఆ సమయంలో వసంతలక్ష్మిగారు ధైర్యం చెప్పారు.

"మూసివేసిన ఉదయం పేపర్‌ను త్వరలోనే తెరుస్తున్నారు. కార్టూన్స్ ప్రాక్టీస్ చెయ్. కార్టూనిస్ట్‌గా జాయిన్ చేయిస్తా" అన్నారు.

కార్టూన్లు ప్రాక్టీస్ చేయడం మొదలుపెట్టాను.

ఒక వైపు కార్టూన్లు గీస్తూనే మరోవైపు ఆంధ్రజ్యోతి చుట్టూ చక్కర్లు కొట్టేవాడిని.

తేరేష్, ఆర్.ఎం.ఉమామహేశ్వరరావుకు పరిచయం చేశారు. అప్పుడు ఆయన ఆంధ్రజ్యోతి సండే స్పెషల్ ఇన్‌చార్జ్, 'నిశాని' 'నల్లకలువ' పుస్తకాలకు, 'మల్లెమొగ్గల గొడుగు' కు నేను వేసిన బొమ్మలు ఇదివరలోనే చూసి ఉన్నారు ఉమ.

"నీ స్టయిల్ బాగుంది. ఉద్యోగంలోకి తీసుకుంటాను" అన్నారు. 'సండే'లోకి తీసుకున్నారు. ప్రతివారం కవర్‌పేజి వేయడం, కవిత్వం, కథలకు బొమ్మలు వేస్తుండడంతో మంచి గుర్తింపు వచ్చింది. అక్కడే నాకు ఖదీర్, గీత పరిచయమయ్యారు. గీతను ప్రేమించాను. ఆ తరువాత చాలా సింపుల్‌గా వదిరూపాయల పూలదండతో మాపెళ్ళి జరిగిపోయింది.

***

సరే, ఇప్పుడు అక్బర్ సెటిలయ్యాడు.

సైకిల్ కూడా కొనలేని స్థితి నుంచి కారు కొనుక్కున్నాడు.....కథ ఇదే అయితే ఆయన గురించి పదాలు, పదాలుగా, వాక్యాలు, వాక్యాలుగా అదేపనిగా చెప్పుకోవాల్సిన పనిలేదు.

ఏ ప్రపంచం నుంచి వచ్చామో ఆ ప్రపంచాన్ని గుర్తుపెట్టుకునేవాడు, ఆ ప్రపంచానికి మేలు చేయాలనుకునేవాడు,రుణం తీర్చుకోవాలనుకునేవాడు....అలాంటి మొనగాడి గురించి ఎంతసేపయినా మాట్లాడుకోవడంలో ఎలాంటి తప్పులేదు.

అక్బర్ చాలా గుప్తదానాలు చేశాడు.

ఆర్టిస్ట్‌గా పరిపూర్ణమైన 'గుడ్‌విల్' వచ్చినప్పటికీ దాన్ని కరెన్సీ రహదారుల వైపు మళ్ళించకుండా అస్తిత్వ ఉద్యమసాహిత్యానికి తన వైపునుంచి కంట్రిబ్యూషన్ ఇస్తున్నాడు. ముఖ్యంగా ముస్లిం సాహిత్యానికి



www.etelangana.org

అతని కళాసహకారం ఎప్పుడూ మరవలేనిది.

"కవిత్వం తప్ప నా దగ్గర డబ్బు లేదు భయ్యా" అనే చాలా మంది కవులకు ఆయన బొమ్మలు గీసి ఇచ్చాడు. వాళ్ళ జేబులో డబ్బులో పెట్టాడు.

'ఉద్యమ రాక్షసుడు' స్కైబాబ ఏదో ఒక ఉద్యమాన్ని భుజాన వేసుకొని "ఫలానా బొమ్మ గీయాలే అక్బరు" అని ఏ అర్ధరాత్రి వచ్చినా ఓపికగా బొమ్మ గీసి ఇచ్చేవాడు.

మళ్ళీ ఇప్పుడు....

ఇప్పుడు తెలంగాణ ఉద్యమం కీలకమైన దశలో ఉంది. తన పనేదో తాను చేసుకోకుండా ఆ ఉద్యమానికి తనవంతుగా ఏదైనా చేయాలని అక్బర్ తపిస్తున్నాడు.

ఆ తపన వెనుక తన జీవితపు లోతుల నుంచి పుట్టుకు వచ్చిన కథలు ఉన్నాయి. వాటి ప్రభావం ఉంది. 'తెలంగాణ ఆర్టిస్ట్ ఫోరం' తరఫున నిజామాబాద్ జిల్లాకు వెళ్ళి ఆర్ట్ క్యాంప్‌లో పాల్గొన్నారు. ఢిల్లీకి వెళ్ళాడు. ఇంకా ఎక్కడెక్కడికో వెళుతున్నాడు. ఏవో పుస్తకాలు రాస్తానంటున్నాడు. తెలంగాణ కళా చరిత్ర గురించి ఆసక్తి పెంచుకుంటున్నాడు.

సాయంత్రం ఆఫీసు పూర్తి కాగానే మనికొండలోని తన అద్దె ఇంట్లో విశ్రాంతి తీసుకుంటూ 'మనీ కలలు' కంటనూ హైదరాబాద్ ఆర్టిస్ట్ గ్యాంగ్ తో చేతులు కలుపుతూ వాళ్ళ జయంతుల సందర్భంగానో, వర్ధంతుల సందర్భంగానో నానా రాతలు రాస్తూ చేతివాటం ప్రదర్శించుకోవచ్చు. కానీ ఇలాంటివేమీ అక్బర్ చేసినట్లు కనిపించడంలేదు. అందుకే అతని పట్ల అల్లా కృప అపారంగా ఉంది.

***

"అక్బరుతో వచ్చిన చిక్కేమిటంటే అతను తక్కువగా మాట్లాడతాడు" అని కొద్ది కాలం క్రితం ఎవరో ప్రేమ పూర్వకంగా ఆరోపణ చేశారు.

కాని అదేమి చిత్రమో! అతని కుంచె అనర్గళంగా మాట్లాడుతుంది.

మట్టిమనుషుల గురించి మాట్లాడుతుంది.

గట్టి మనుషుల గురించి మాట్లాడుతుంది.

లంబాడి తండల గురించి మాట్లాడుతుంది.

మాదిగ గూడెం గురించి మాట్లాడుతుంది.

మొక్కజొన్న తోటలో గాలి గంతుల గురించి మాట్లాడుతుంది.

మాదిగ వాళ్ళు చేసే ఉద్యమాల గురించి మాట్లాడుతుంది. ముస్లింల మూగగొంతు గురించి మాట్లాడుతుంది.

స్త్రీల కన్నీళ్ళ గురించి మాట్లాడుతుంది. సబ్బండవర్ణాల చరిత్ర గురించి మాట్లాడుతుంది. ఇప్పుడు తెలంగాణ ఉద్యమం గురించి మాట్లాడుతుంది. మాట్లాడుతూనే ఉంటుంది......

కృతజ్ఞతలు; అక్బర్‌తో ఆర్ట్‌మీయంగా (ఆత్మీయంగా) మాట్లాడి, తనతో ఊరూరూ తిప్పుకున్న కృష్ణకు, అక్బర్‌ను పత్రికా ప్రపంచానికి పరిచయం చేసిన పైడి తెరేష్ బాబు, మద్దూరు నగేష్ బాబు, త్రిపురనేని శ్రీనివాస్‌కు, అక్బర్ కుంచెకు కొత్త ఉత్సాహం ఇచ్చిన ఉమామహేశ్వరరావుకు, తమ స్నేహం తోటలో అక్బర్ ను తిప్పిన ఖదీర్, గీతలకు, అక్బర్ నాకు పరిచయం చేసిన స్కైబాబాకు మరియు చాలా ఇష్టపడి అక్బర్ మీద ఇదంతా రాసిన నా మనసుకు కృతజ్ఞతలు. ■



# జల్వా




● కె. ఇక్బాల్

"అమ్మీ హైదరాబాద్ ఎవరిదమ్మా" - ? ఎనిమిదో తరగతి చదువుతున్న ముస్తఫా తన తల్లిని అడుగుతున్నాడు. చేతిలో న్యూస్ పేపర్ పట్టుకున్నాడు.

వంట పనిలో నిమగ్నమయిన తల్లికి తెలుసు కొడుకు మనస్తత్వం. ఏదైనా అనుమానం వస్తే అది తీరేదాకా అడుగుతూనే ఉంటాడు. అందుకే "నాకేం తెలుసు బేటా. నీ పుస్తకాల్లో రాసి ఉంటుంది కదా చదువుకో" తనకు తెలిసిందంతే. చిన్నప్పుడు నాయన బడిలో వేస్తే చదవలేదు మరి. మసీదులో చదివిన చదువు కూడా నానాకాలం చదువే.

తను నాలుగో తరగతిలో చదివిన జ్ఞాపకం, లీలగా గుర్తుకు రాగానే పాత పుస్తకాల అట్టడబ్బాలో వెదికాడు. దుమ్ము పట్టి ఉన్నాయి. అడుగున కొన్ని చెదలు తిన్నవి ఉన్నాయి. వాటి దుమ్ము దులిపి ఎట్టకేలకు నాలుగో తరగతి సాంఘిక పుస్తకం వెదికి పట్టుకున్నాడు. అందులో "చార్మినార్" పాఠం చదివాడు. కుతుబ్‌షాహీలు కట్టినట్టు రూఢీకి వచ్చాడు. మళ్ళ అనుమానం. తన చేతిలోని న్యూస్ పేపర్స్‌ను మళ్ళీ చదివాడు.

హైదరాబాద్ ఎవడబ్బ సొత్తు?

హైదరాబాద్ అందరిదీ! అందరి కష్టార్జితం.

హైదరాబాద్ తెలంగాణ గుండెకాయ.

హైదరాబాద్ తెలంగాణలో అంతర్భాగం.

ఇలా రకరకాల వ్యాఖ్యానాలు, వార్తలు, వ్యాసాలు ఉన్నాయి. అంతా గందరగోళం. బుర్ర వేడెక్కిపోతోంది. ప్రభుత్వం ప్రచురించిన పాఠ్య పుస్తకంలో హైదరాబాద్ నగరాన్ని కుతుబ్‌షాహీ రాజు కట్టించినట్టు ఉండగా ప్రభుత్వాన్ని నడిపించే మంత్రులు, ప్రజా ప్రతినిధులు వాటికి భిన్నంగా అనేక సందర్భాల్లో మాట్లాడుతున్నారు. పాఠ్య పుస్తకంలో ఉన్నది నిజమా? వార్తా పత్రికల్లో రాస్తున్నది వాస్తవమా? మరి ప్రభుత్వంలోని ప్రజా ప్రతినిధుల మాటేమిటి?



www.etelangana.org

"బేటా ముస్తఫా, బజార్‌మే జాకే తర్కారీ లావో"

తల్లి పిలుపుతో తల విదుల్చుకున్నాడు. ఈ లోకంలోకి వచ్చాడు. అమ్మ ఇచ్చిన సంచి, డబ్బులు తీసుకుని సంతకు వెళ్ళాడు. ఊరిలో సూపర్ మార్కెట్‌లు వచ్చినా సంతకున్న ప్రాముఖ్యత ఇంకా పోలేదు. ఈ సంతను చూస్తుంటే "సంతో మా ఊరి సంత" అంటూ గోరటి వెంకన్న రాసిన పాట గుర్తుకు వచ్చింది.

అయిదేండ్లకోసారి మన గల్లీకొచ్చే చిన్నాచితకా లీడర్లు కూడా "జై తెలంగాణ" అంటూ సంతలో తిరుగుతున్నారు. వారి ముందు కుండెడు బొజ్జ ఉన్న నాయకులు తెల్లటి బట్టలు ధరించారు. రెండు చేతులెత్తి దండాలు పెడుతున్నారు. గుంపు ముందర తప్పెట కొడుతున్నారు.

సంతలో మధ్యన మూడు రంగుల పార్టీ, పచ్చ చొక్కాల పార్టీ, గులాబీ కండువాల పార్టీ, ఎర్ర జెండాల పార్టీ, – ఇలా తలో దిక్కున సంతలో ప్రచారం – "జై తెలంగాణ" అంటూ.



హైదరాబాద్ ఎవడబ్బ సొత్తు?
హైదరాబాద్ అందరిదీ!
అందరి కష్టార్జితం.
హైదరాబాద్ తెలంగాణ
గుండెకాయ.

పాత బస్టాండు వైపు వెళ్ళాడు. అక్కడ ఓ ముసలోడి విగ్రహం ముందు టెంటు. టెంటులో – మెడలో పూల దండలతో కొందరు. టెంటుకు పై భాగంలో "తెలంగాణ జెఏసి" అని రాసిన బ్యానర్. దగ్గరికెళ్ళి చూసాడు. ఒక బోర్డు వేలాడదీసి ఉంది. ఈ రోజు నిరాహార దీక్షలో కూర్చున్నావారు అని కొన్ని పేర్లు అందులో రాసి ఉన్నాయి.

ఇంకొస్త ముందుకెళ్ళాడు. సంతలో అంతా తిరిగి తొందరగా తనకు కావాల్సినవి కొన్నాడు. బట్టలమ్మే చోట ఇంకో టెంటు. అక్కడా అదే సీను. బోర్డు, బ్యానరు వేరు. "తెలంగాణను తెచ్చేది మేమే. తెలంగాణను ఇచ్చేది మేమే." అని రాసి ఉంది చదివాడు. అర్థం కాలేదు. చివరికి మనసులో అనుకున్నాడు – "ఈలోగా మధ్యన సచ్చేది మేమే". అని.

"ఇంత పెద్ద సంతలో ఎన్నడూ లేంది ఈ వింత లొల్లి ఏందో? ఈ దుకాణాలేందో? ఈ టెంటులేందో? ఈ జెండాలేందో? మనసులో అనుకుంటూ ఇంటికి తిరుగు ముఖం పట్టాడు. ఇంతలో ఏదో గుర్తుకు వచ్చి తిరిగి అదే టెంటుకు వెళ్ళాడు. అక్కడ మూడు రంగుల జెండా పట్టుకున్న ఒక వ్యక్తి దగ్గర ఆగి "అన్నా, ఓ అన్నా.. హైదరాబాద్ ఎవరిది? హైదరాబాద్ ఎవరు కట్టారు?" అని అడిగాడు. ఉత్సాహంగా ఉన్నట్టు కనబడ్డాడు. "ఇంకెవర్ది తమ్మీ, మనదే మనపార్టీ వాళ్ళు కట్టారు" అని సంతోషంగా చెప్పుకున్నాడు. అంతా అయోమయం. తనలో తానే నవ్వుకున్నాడు.

దారిలో ఇంకో టెంటు – పసుపురంగు బ్యానర్లతో – అదే సీను. "మేం తెలంగాణకు ముమ్మాటికీ కట్టుబడి ఉన్నాం" అని బ్యానరుంది. అందులో ఒకాయన ఒళ్ళంతా పసుపు పూసుకుని ఉన్నాడు. ముస్తఫా అతన్ని అడిగాడు. "అన్నా, హైదరాబాద్ ఎవరిది, ఎవరు కట్టించారు." ? అని. "మనదే భై, మనపార్టీ వాళ్ళే కట్టించారు. అభివృద్ధి చేశారు." ఈ సారి అవాక్కయ్యాడు. నవ్వలేక ఏడ్వలేక ఇంటి ముఖం పట్టాడు.

ఇంటికి పోతా ఉంటే దగ్గరలో ఉన్న దర్గా దగ్గర పిల్లలు, పెద్దలు అరుస్తున్నారు. ఇంట్లోకి వెళ్ళి సంచి ఓ మూలన పెట్టాడు. అమ్మని అడిగాడు. "పిల్లల ఆట – పెద్దల కొట్లాటకు దారి తీసింది. మీ



మేనత్త కొడుకులు మీ చిన్నాన్న పిల్లల్ని కొట్టింర్రు"ని చెప్పింది.

సాయంత్రం టాంగా బండి తోలుకుని నాన్న ఇంటికొచ్చాడు. బాగా అలసినట్టున్నాడు. ముఖం కడుక్కుని చాయ్ తాగిండు. ఇంటి ఖర్చుల కోసం అమ్మ అడిగితే ఎర్రటి ఇరవై రూపాయల నోటిచ్చిండు. జేబులో నుండి రూపాయి బిళ్ళ తీసి నాకిచ్చాడు.

బయట గేరి పిల్లలతో ఆడుకుంటున్న బీబీ (చెల్లి) ఇంట్లోకి రాగానే నాయన ఒళ్ళో వాలింది. చెల్లికీ రూపాయి బిళ్ళ ఇచ్చాడు. నాన్న ముఖం చూస్తే బాగా అలిసిపోయినట్లున్నడు. కొస్త సేద తీరాక అడిగాను. "అబ్బా హైదరాబాద్ ఎవరిది?" మనసులో తొలుస్తున్న ప్రశ్నను అడిగాను. బీడీ తాగాక చెప్పడం మొదలు పెట్టిండు.

"హైదరాబాద్ నవాబులు కట్టించిన నగరం బేటా. కులీ కుతుబ్‌షాహీ కా బేటా భాగ్యమ్మ అనే హిందూ లడ్కీ సే ప్యార్ కియా. ఉస్‌సే షాదీ కియా. బాద్‌మే ఉస్కా నామ్ భాగ్యమ్మ సే హైదరీ బేగం రఖ్‌కే ఏక్ షహర్ బనాయా. హైదరాబాద్ హిందూ ముస్లింల ప్రేమకు ప్రతిరూపం బేటా. షహర్ నిర్మాణంలో సైతం అందరూ కూడా భాగస్వాములయినారు. సమందర్ లో చేపల లాగా ఆబాదీ బఢ్‌గయీ. హైదరాబాద్ హిందూ ముస్లింలది బేటా. హైదరాబాద్‌లోని ప్రధాన కట్టడాలన్నీ నవాబులు కట్టించినవే. ఇక్కడ బతకడానికి వచ్చిన అందరూ హైదరాబాద్ మాది అంటున్నరు. ఇంటికి చుట్టమై వచ్చినోళ్ళు దయ్యమై కూసున్నరు." నాన్న కొస్త ఆగిండు.

"ఇందాకా నువ్వు వచ్చేముందు మన ఇంటి ముందు దర్గా దగ్గర లడాయి జరిగిందట నువ్వు విన్నావా బేటా." నాయన అడిగిండు "ఔనయ్యా పిల్లల ఆట పెద్దల కొట్లాటకు దారి తీసింది" అని అమ్మ చెప్పింది. నాకు మాత్రం లడాయి ఎందుకో అర్థం కాలేదు."

మీ మేనత్త కొడుకులు మాటికి మన మీదికే లడాయికి వస్తుంర్రు. ఈ ఇల్లూ, ఈ దర్గా, ఈ దందా అంతా మాదే అంటరు. నిజంగా ఇవి మనవి కాదా అబ్బా జాన్" ఎన్నో ఏళ్ళుగా మనసులోని మాటను అడిగాడు. – సందర్భం కొబట్టి.

నాయన నిట్టూర్చాడు. గతం నెమరేసుకున్నాడు. చెబుతున్నాడు. "ఏం చెప్తాం బేటా. స్వదేశంలో కాందిశీకుల్లాగా బతుకుతున్న వాళ్ళం. ఈ ఇండ్లూ, ఈ దర్గా, ఈ దందా అంతా మాదే, మనదే. నేను పుట్టక ముందు "దాదా" కు రెండు టాంగాలు, రెండు పండ్ల అంగళ్ళూ ఉండేవి. గీ ఊళ్ళో ఎవరికి ఏ అవసరమున్నా మన టాంగాలే కావాలి. ఎవరింట్లో ఏ కార్యమైనా పండ్లు మన అంగడివే. ఉర్సు వచ్చిందంటే ఊరు ఊరంతా మన ఇంటి దగ్గరే. గీ విషయాలన్నీ మానాయన చెబుతుండేవాడు.

"అలాంటిది గిపుడు గిట్ల బతుకుతున్నం. మన అంగళ్ళు, మన టాంగాలు మనకు గింత తిండి పెడ్తలేవు. ఉర్సూ, ముల్లాగిరీ పోయింది. అంతా పరాయివాళ్ళకే దక్కింది". చన్నీళ్ళతో ముఖం కడుకున్నాడు. ఓ గ్లాసుడో చన్నీళ్ళు తాగాడు, కొస్త సేద తీరాక వక్క నోట్లో వేసిండు

"ఎందుకిట్లయ్యింది అబ్బా జాన్. గీ పరిస్థితి మనకు ఎందుకొచ్చింది"?

"మేం చిన్నగున్నపుడు మీ పుప్పా (మేనత్త మొగుడు) సయ్యద్ జలీల్ రాయలసీమ నుండి బతకటానికి గిక్కడికొచ్చిండు. మాది బాగా సంపద ఉన్న కుటుంబం గాకపోయినా మంచి పేరున్న కుటుంబం. ముస్లిం పిల్లోడు గదా అని దయ తలచి మా నాయన ఇంట్లో పెట్టుకున్నాడు. గప్పట్లో మాకు సేద్యం ఉండేది. ఇంట్లో పశువులు ఉండేవి" – గుర్రం గుర్తుకు వచ్చి బయటికెళ్ళి గుర్రానికి కొస్త మేత పెట్టిండు.



www.etelangana.org

"కుట్టు మిషను పని నేర్పింద్రు. ఓ మిషను ఇప్పించి ఇంటి ముందర వరండాలో పెట్టించినం. ఊళ్ళో అందరూ "చాంద్‌పాష చుట్టం" అని అనుకునేవారు. మిషను సాయిబుగా పేరు పడింది. ఏదీ లోటు లేకుండా చూస్కున్నం. మళ్ళీ బయటికి వెళ్ళి గుర్రం మూతి దాణా సంచి కట్టి వచ్చిండు.

"కొన్నాళ్ళకు ఊరోళ్ళ మాటలకు – మాట పడని మా నాయన – మా అక్కనిచ్చి షాదీ చేసిండు. మా ఇంట్లోనే సగానికి గోడ కట్టి ఉండటానికి జాగా ఇచ్చినం. పండిన పంటలో కొంత భాగం తిండి గింజలు తీసడానికి ఇచ్చినం. నీళ్ళు కూడా రోజూ మేమే పోసేవాళ్ళం. మా బావ కొస్త చదువుకున్నాడు. మా చదువులు అంతంత మాత్రమే." తాగడానికి మరో చాయ్ అడిగాడు నాయన. ఓ గ్లాసు చల్లని మంచి నీళ్ళిచ్చి, చాయ్ అందిచ్చింది అమ్మ.

"గిద్రున పాతికేళ్ళు తిరిగేసరికి మా ఇంట్లో పెద్దలు కాలమైనారు. ఈలోగా వాళ్ళింట్లో డజను మంది పిల్లలు. మీ ఇండ్లల్లో ఆరుగురే. మా ఊరికి వలస వచ్చిన లీడర్ల సాయంతో మా ఇంటిని, పొల్లాన్ని మా అక్క పేరున – పసుపు కుంకుమల కింద అన్చెప్పి మార్చుకున్నారు. కోర్టులో కేసు వేస్తే మేం ఓడిపోయినం. కర్నూలు ప్రాంతానికి చెందిన తాసీల్దారు వారికే మదత్ చేసిండు. పండ్లంగడి కూడా వాళ్ళ గుంజుకున్నరు. దర్గా మీద పెత్తనం, ముల్లాగిరీ వారే చూస్కుంటున్నరు. గీ టాంగా, ఒక అంగడి మిగిలింది. గిదే బతుకు తెరువయ్యింది".

"కుట్టు మిషను పని నేర్పింద్రు. ఓ మిషను ఇప్పించి ఇంటి ముందర వరండాలో పెట్టించినం. ఊళ్ళో అందరూ "చాంద్‌పాష చుట్టం" అని అనుకునేవారు.

ఇల్లూ, పొలం, దర్గా, దందా మొత్తం వాళ్ళదే అంటున్నరు. మొత్తంపై కబ్జా వాళ్ళదే అయ్యింది. గట్లే హైదరాబాద్ సంగతి బేటా. ఇలా బతకడానికి వచ్చి అధికార దౌర్జన్యాలతో దర్జాగా కబ్జాలకు పాల్పడిన మన సీమాంధ్రులు 'హైదరాబాద్ మాదంటున్నరు. హైదరాబాద్‌ను మేమే కష్టపడి ఈ స్థాయికి తెచ్చినం అంటున్నరు."

చీకటి అవుతుంటే చెల్లి దీపం వెలిగించింది. కరెంటు లేదు. "ఎప్పుడూ ఉండే కతనే. సాల్సాల్లే. బువ్వ తిందురు రండి" అమ్మ విసుక్కుంటూ పిలిచింది. ఇది కథ కాదు అమ్మకు అనుభవం. అమ్మ విసుగూ నాన్నకు అలవాటే. మళ్ళీ చెప్పటం మొదలుపెట్టిండు.

"నేను టాంగా నడపాలే. మీ అమ్మీ డబ్బాలో కూసుని పండ్లంగడి నడపాలే. మనం గట్టిగా మాట్లాడలేం. కొట్లాడలేం. కోర్టుల చుట్టూ తిరగలేం. నాలిక కింద తడి లేని వాళ్ళం. మట్టిని నమ్ముకున్నోడు నోట్లో మట్టి కొట్టుకుని మట్టిలో కలిసిపోయినట్లున్నది మన పరిస్థితి. అన్నదమ్ములు దాయాదులైనారు. మా పెద్దోడు తన బిడ్డల్నిద్దరినీ వాళ్ళ కొడుకులకే ఇచ్చి బంధుత్వం కొనసాగిస్తుండు. మనం మాత్రం బలహీనులైనాం. బలహీనుడికి ఎవడూ సాయం రాడు – ఒక్క అల్లా తప్ప. అల్లా తప్పక తన ఖుదరత్ చూపిస్తడు బిడ్డా." మళ్ళీ బయటికి వెళ్ళి గుర్రానికి కుడిది పెట్టి వచ్చి చెబుతున్నాడు "మన ఆత్మగౌరవాన్ని తాకట్టు పెట్టిన మీ పెద్దనాన్న పొలం కాడ కరెంటు షాకుతో పోయిండు. మన కూడూ, మన గూడూ కాజేసిన వాడు – మీ మామ కర్నూలు వెళ్ళినపుడు వరదల్లో కొట్టుకుపోయిండు. కనీసం శవమైనా కానరాలే. దొంగనోట్ల చలామణీ కేసులో అందరినీ జైల్లో పెట్టారు. ఒక్కగానొక్క ఆడ పిల్ల మాదిగోల్ల పోరడితో లేచిపోయింది. గీ సంగతి ఊరంతా తెల్సిపోయింది. అందరినీ దూరముంచారు. గీ అవమానం భరించలేక మిగిలినవారు రాయలసీమలోని వాళ్ళ సొంతూరుకు వెళ్ళిపోయినారు. గిదీ బేటా మన కథ." తిరగవాత వేసిన వాసన పొయ్యి దగ్గర నుంచి వచ్చింది ఘాటుగా.



అమ్మ ఇంకా విసుక్కుంటూనే ఉంది. భోజనానికి పిలుస్తూనే ఉంది. ఇంట్లో కరెంటు పోయింది. కందీలులో నూనె లేదు. ఆరిపోయింది. వెలుగుతున్న ఒక కొవ్వొత్తి కూడా ఆరిపోతే చీకట్లో కష్టమని అమ్మ బెంగ – ఇలాంటి రాత్రిళ్ళు అలవాటయినా కూడా.

"మన కథకు, హైదరాబాద్ కథకు, మన కథకు తెలంగాణ కథకు పెద్దగా ఫరక్ లేదు బేటా. తెలంగాణ మనదే. గీ మూడు రంగుల పార్టీ, గా పసుపు రంగు పార్టీ, ఎర్ర రంగు పార్టీ, గా సిన్నోడి పార్టీ అందరూ మోసగాళ్ళే. అందరూ మన బలహీనతతో బాగా ఆడుకున్నోళ్ళే. పబ్బం గడుపుకున్నోళ్ళే. బతికి బట్టకడ్తున్నరు. గిపుడు తెలంగాణ బజార్‌కా మాల్ హోగయా బేటా. ఆంధ్రోళ్ళను వెళ్ళ గొట్టకపోతే మన కహానీ లాగే అవుతుంది చివరికి."

మన కుటుంబానికి, మన హైదరాబాద్‌కు ఇంత చరిత్ర ఉందా! చరిత్ర లేని, చరిత్ర తెలియని బతుకుకు స్ఫూర్తి, కీర్తి ఉండవు. అందుకేనేమో మన చరిత్రను పాలకులు మనకు తెలియకుండా చేస్తున్నారు.

అమ్మ బెట్టింది గింత తిని తల్లీ ఓ వైపు తనూ నాయన మరో వైపు బొంతలు పరుచుకుని పడుకున్నరు. ఆలోచిస్తూ ఉండగానే నిద్ర పట్టేసింది.

*(మహబూబ్ నగర్ జిల్లా దో ఆబ్ (నరిగడ్డ)లో జరిగిన యథార్థా సంఘటనకు అక్షర రూపం ఈ కథ)*

---

# గరిక పూలు (మినీ కవితలు)

• బషీర్

- మల్లె శయ్యపైన
చల్లని రాత్రి గడిచిపోయింది
తెల్లవారుతుంది
అల్లాను స్మరించు

- బురఖా
ముఖం కనపడకుండా ఉండటానికి
కప్పుకొనే వస్త్రం
చెడు నుంచి స్త్రీని రక్షించే అస్త్రం

- మసీదు కట్టి
కూలిన పడకు
'ఆజాద్' చేసినపుడే
ఆనందం

- చేప ఎప్పుడూ నీట్లో వున్నా
చెడు వాసన పోదు ఎంత కడిగినా
మనిషి ప్రతి రోజూ స్నానం చేసినా
మనసులోని మైల పోదు



www.etelangana.org

# సిగ్గుపడుతున్నా

● సయ్యద్ ఖుర్షీద్

నేను సిగ్గుపడుతున్నాను
మీలో ఒకడ్ని కాలేకపోయినందుకు
మీతో పాటు నేనోరాయి వేయలేక పోయినందుకు
మా నీళ్ళు మాక్కావాలని – మా కొలువులు మాకేదక్కాలని
మా భూములు గనులు మావేనని
మొత్తంగా మా తెలంగాణ మాక్కావాలని
వందల మంది పసిపిల్లలు పిట్టల్లా రాలిపోతే
'అయ్యో, పాపం!' అన్న పాపానికి పోనోడు
మా అభిప్రాయాలను పిసరంత కూడా పట్టించుకోనోడు
నిండు సభలో సమైక్యతావాదమంటూ
సొల్లు కూతలు కూసినోడు.
మా సగటు చావుల్నే
తన రాజకీయ ఖాతాలో వేసుకొని
'చారానా కోడికి బారానా మసాల' అన్నట్లు
ఓదార్పు అంటూ ఊరేగుతానంటే...
కులమతాలకతీతంగా
వందలు వేలు కలిసికట్టుగా...
మీరంతా నిలబడి కలబడ్డ తీరు చూసి
వలసవాదాన్ని ఎదిరించిన
మానుకోట తెగువకు ముచ్చటపడి
మీలో ఒకడ్ని కాలేక పోయినందుకు
నేను సిగ్గుపడుతున్నాను.
'ఇంటి దొంగను ఈశ్వరుడైనా పట్టలేడంటారు'
ఇప్పుడిక్కడ ఇంటిదొంగలే ఈశ్వరావతారులు!
మన నీళ్ళు – మన ఊళ్ళను దోచి
మన భూముల్ని బీళ్ళుగా మార్చి
మన కొలువుల్ని కార్పోరేట్ పరంచేసి
మన సేద్యాన్ని సెజ్‌లకిచ్చి
మన వాదాన్ని వెక్కిరించే వెధవలకు
వంత పాటే తాటేదార్లను
వెంటబడి.... తరిమి... తరిమి...
తెలంగాణ తెగువ చూపిన 'మానుకోట'ను చూసి
మీలో ఒకడ్ని కాలేకపోయినందుకు
మీతో పాటు ఓ రాయి వేయలేక పోయినందుకు
నేను చాలా సిగ్గుపడుతున్నాను.

■







# అహమదొద్దీన్ ఆత్మతత్త్వాలు

● సేకరణ : సంగిశెట్టి శ్రీనివాస్

ఈ తత్త్వాలను ఖ్వాజా అహమదొద్దీన్‌గారు రచించారు. ఇతన జన్మస్థానం మహబూబ్‌నగర్ జిల్లాలోని వసంతాపురం. ఈ తత్త్వాలను శాస్త్ర వేదాంత రహస్య తత్త్వాలుగా పేర్కొన్నారు అల్లాజీదాబా అమీరొద్దీన్‌గారి. దయవల్ల ఈ తత్త్వాలను వ్రాసినారు. అమీరొర్దీన్‌గారు వీరికి గురువు, ఈ గ్రంథం 250 పుటలు గలది. ఇందులో తత్త్వాలు, తత్త్వానికి అనుబంధంగా ఒక్కొక్క వృత్తం కలిగి మొదటి భాగమున్నది. రెండోభాగంలో కందార్థదర్వులు ఉన్నవి.

మొదటి భాగము తత్త్వాలు 65, వృత్తాలు 65
రెండవ భాగము కందార్థ దర్వులు 160
మూడవ భాగము కేవలతత్త్వాలు 198 మంగళాంతం చేయబడ్డవి
శాస్త్ర వేదంత రహస్య తత్త్వాలు 102
నాలుగవ భాగము సుజ్ఞాన సూచన పద్యాలు 281

ఇతని తత్త్వాలందు నీతి, సద్గురువు పై ప్రీతి, సమాజ సంస్కరణోద్దేశంతోపాటు జ్ఞాన సందర్శన చేసి జీవుడు తరించటమే ప్రధానాంశముగా చెప్పడమయింది.

కందార్థం  కులవాదము మన కేలను
మలమూత్రములోనగూడె మాయాఘటముల్
ఇలలో సద్గురు మంత్రము
కలనైనను మరువబోకు
కోరి దల్చుమురా అల్లరీతనము
విడచి నిల్చుముర, అంటూ

కులవాదమును చేయరాదంటారు, కనుపాపల నడుమన చిద్రూపం వ్యాపించి ఉంది. అది సృష్టికి తల్లి అని నొష్టిలోచేరి సమస్తమును చూచుచున్నది. అని చెపుతూ జ్ఞానమును కాంతిప్రతీకగా



www.etelangana.org

సంభావించాడు. వీరి తత్త్వాలు భజనకీర్తనలకు తెలుగులో తత్త్వకవులు వలెభ జనలపై ఉపయోగించుకోవచ్చును. రాగతాళాలు నిర్దేశించి ఉండవు కొన్నిటికి తాళాలు నిర్దేశించినాడు "లేదురా కర్మలు జ్ఞానులకు నిజబోధ తెలిసితే రాదురా నరకంబు ఇక మనకు"

అన్న తత్త్వంలో గురుపాదాలను శ్రద్ధగా సదుపాయంగా కొలిమితిత్తులచే ఊదీ ఊదీ నాదంవింటూ అష్టవిద మదములనే ఏనుగల్ని బరిమార్చి 14 భవనాలను ఉరుముగాగని త్రివేణీ సంగంమంలో స్నానంచేసి కొంచెపు గుణాలను ఖండించే వైరాగ్యమనే గదను చేపట్టి సాధనలో బ్రహ్మతత్త్వం చేజిక్కించుకొనే బుధులకు లేదురా కర్మంబు అని చెప్పినాడు. వీరి దృష్టిలో బ్రహ్మతత్త్వం చేజిక్కించుకొన్నవాడే బుధుడనీ వానికే కర్మలేదని భావించినాడు. ఇట్లా ఆనంద పారవశ్యంలో పాడిన తత్త్వాలు చాలా ఉన్నాయి. సర్వోన్నతస్థాయికి చేరినభావాలు ఈ తత్త్వాలలో చోటుచేసుకొనడం మన భాషీయుల అదృష్టమనే చెప్పవచ్చు.

నే పండూకుంటా
బ్రహ్మానదంలో మునుగుచుంటా
చూపిందూ గురూమూర్తి
మాసిందూ అజ్ఞానం ¬ అన్నదీనిలో

నిద్రపోయే సమయాన్ని సంభావించిన తీరు ఇట్లా ఉన్నది. గురుపాదాలనుతల దిండుగా చేసుకొని ప్రణవమనే నిద్రను గణ గణ నాదంతో గుర్కాపెట్టి చిద్రూపమనే స్వప్నంలో తద్రూపు చూస్తూ జ్ఞానమనే పరుపు పై శాంతమనే శాలువ కప్పుకొని భావంలో యోగముద్రను భద్రపరచి "నే పండుకొంటా - బ్రహ్మానందంలో మునుగూచుంటా" అంటాడు.

గురువుకన్న హరి వేరేలేదని గురువే ప్రధానమని
"అనుమానమేలనూ
సొద్గురువు కన్న హరి వేరే లేదు ఇక
అనూమానమేలనూ
అల్లాజీకన్న హరి వేరే లేదు ఇక
అనూమానమేలనూ

అంటూ అట్టి గురువును అంతరంగంలో కలిసి తనను శాంతంగా ఉంచినందులకు ధన్యుడనని, ఆ దినాన్ని స్తుతిస్తారు, కామక్రోధాలను జయించుటకు కోపాన్ని వదలమని గురువు చెపుతాడని చెపుతూ సేవే దైవమంటాడు, వాదభేదాలు వదలి వేస్తేనే నిలుకడ కుదురుతుంది అని చెప్పి గురువు మాటను నమ్మక ఫలము లేదంటాడు.

తిండికి రచులను గోరితె
కుండలొ తన భావముండు - కుదురున యోగం?
యెండయు నీటయు నొక వని
నిండుగ భావించువాడే నిజమైనాజనుడూ

అని నిజమైన నరున్ని గూర్చి తిండి చింత లేనివానిగా భావిస్తాడు.

మానసహంసా! మనవిచేకొనవే
మానక నిలలో కనుగోను బ్రహ్మం



జోటీరో సద్గూరు సూటీను బల్కవే
కోటీ ప్రకాశూడు సాటిరారెవ్వారు ॥మా॥
భూతదయాళూడు - పాతాక హరుణాడు
ఏ తీరునైనా వాన్నిక్షితిలో గవ్వావే॥మా॥

పరులామ వేడాకు పాపాము గోరాకు
గురుహరుడొకడాని మరువాక నమ్మావే ॥మా॥

నిరతాము వాసంత పురమూనవెరువాక
స్థిరమూగ అల్లాజీని కోరిసేవించాలే ॥మా॥

అని తనగురువైన అల్లాజీని సంస్మరిస్తాడు.

కందార్థం
బాటకు ముండ్లేయుచుంటె బాగొనఇక
తీటబావును కాలుడు
మాటీ మాటీకి నీకూ చెప్పనేరనురా ఆటలుగావూ
కొట్టీనేర్పనురా
కోటీవ హోల మూటా గురువూచెప్పిన మాట
గట్టిగాక నిపెట్టి నూటీగను గొనునీలో చెప్పానేరనురా
అని ఈ తత్త్వము చెప్పినాడు.

కందార్థము
ఎక్కడిది మళ్లి జన్మము
నిక్కముగా గురునిమాట గుర్తెరిగుంటే
దక్కును జ్ఞానంబప్పుడు

చక్కగయా బ్రహ్మపురము
చేరీపోదురురా క్కడెదైవామని నమ్ముకోరా

చొక్కాము దెలియాక మళ్లీ జన్మముతిరిగీ
ఇక్కాడి కొచ్చానునుట కల్లయనుకొమ్మి చేరిపోదురురా
వక్కడెదైవామని నమ్ముకోరా!

పునర్జమ్మ లేదని గురువునాశ్రయించి గుర్తెరిగితే జ్ఞానం లభిస్తుందని దైవమొక్కడేనని చాటిచెప్పినాడు.

మాయను విడగొట్టువాడు మనుజుడు పు. 35
కాయములోనే జ్యోతిని కనుగొన్నవాడు భక్తుడు పు. 35
తల్లిగర్భములో చదివిన చదువును మళ్లీ చదువుచు హరిని కలిసి గర్వము విడచి పండువెన్నెల సమానమైన చిత్కళను పొందమంటాడు. పు. 35, 36



www.etelangana.org

తనుమాయంబైతే తానేతానవుతాడట
కపటముబుడుగాలంటాడు                                    పు. 37

ఏమిమందు పెట్టినో గురుడూ అన్న ఈ తత్త్వంలో పుట్టిగిట్టరాదంటాడు.

గురుశిష్య సంవాదంగా వ్రాసిన ఈ తత్త్వంలో పు. 38 కామక్రోధాలు విడిచినమ్మి జపంచేస్తే గురువు లభిస్తాడని, శ్వాసతోనే జిహ్వ అయిందని, బ్రహ్మమనేది అంత తేలికగా తెలిసేదికాదు ప్రేమతో భూమధ్యమందు వెల్గే చిత్కళను సాధన చేయక చూడలేరని చెపుతాడు.

మాతృభావముకన్న మనుజులకు మారువేశాలు వేయ పనిలేదంటాడు. తనలోనే హరియాని అంతుగానక మీరు కన్నా ప్రతిమెల కాళ్ళు మ్రొక్కేరయా అంటు విగ్రహారాధన నిరసిస్తాడు. తల్లిదండ్రులను విడవరాదంటాడు.

తుర్కావారమయ్యా మేము నర్కామందనేరామయ్యా
తర్కావాడామెందుకయ్యా
ఎర్కాసంగతెరుగరయ్యా
సంచితాన్నిద్రుంచే ఎరుక సంగతి తెలుసుకొనవలెనంటాడు.

లేస్తవ ఎక్కడ బోదువు
వాస్తవమైనట్టి వక్క సంగతి వినుమా
మస్తుగ పుస్తకాలు చదువుచు
పుస్తెలు అమ్మింపచేసే పనిమంచిదౌనా
చస్తెను వెంటావచ్చున వినరా !

వ్యర్థమైన విద్యలనార్జించేటందుకు ధనం వ్యయం చేసుకోరాదంటాడు,

దారితాపములు విడక
స్వామిని దలచితే కరుణాగల్గునహరికి
వివరమెరుగరు యిలలో

ఒక్కడే సర్వమై ఉండగా తిక్క కుక్కలవలె భ్రాంతితో అక్కదక్కడ తిరుగ పనిలేదంటాడు.

తత్త్వము
ఏమిరా ఈ భూమిలోపల వేషభాషలుయాలరా
కామితార్థము లిచ్చుస్వామిని ప్రేమతోడుతగానరా          ॥ఏ॥

పుట్టినప్పుడు యుండెనా యిక గిట్టినప్పుడు యుండునా
బట్టబయలై నట్టి అద్వయ గుట్టుగనుగొని నిల్వరా          ॥ఏ॥
ఆలినిడుచుట ఎందుకూ మన తల్లినిడుచుటఎందుకూ
ఆలుపిల్లల విడిచితే మన వీర్యమెవ్వరి పాలురా          ॥ఏ॥

ఈ శునీకను గోసరాకలివానసల్ తెగగోయరా అంటూ
అల్లాజి మాట నమ్మమంటారు.
లోకమంత మనలోనగంటె యాలోకేశ్వరుదయ్యా



మక్కువతోడుత నక్కము కనుగొని నిలచియుండరయ్యా
అంటు ముట్టులని అదురుటేమియా
ఆశలు విడరయ్యా
అంటు లో శ్రీహరి అంటుకనున్నడు అంతుదెల్యరయ్యా

అని విశ్వాన్ని అంటియున్న శ్రీహరిని ఎడబాసి ఉండలేరనే సత్యాన్ని చెప్పినాడు. ఆలుపిల్లల విడువరాదంటాడు.

44వ తత్త్వం
వినేగురుడు నను మానకున్నట్టి వాడే          ॥వి॥
తనూమాన ధనముల తాగొన్నవాడే
తనుతానే తత్త్వమైజనుమన్నవాడై అన్నా
తాడేవిన మళ్ళీ కనుచున్నవాడే          ॥వి॥
పాపపుణ్యములవద్ద పవళించినాడే
రంగూగాక రంగయ్యి భంగాముచేసి
పొంగి తానే జ్యోతిర్లింగా మయ్యినాడే          ॥వి॥
మొల్ల తానే పూజారి శిలప్రత్మెలాకూ
పూలలోనా తా మొగిలి పూవయ్యినాడే          ॥వి॥
అంత తానెయై వెల్గు సర్వంతర్యామి
యింతంతాన బాసంతాపురిలున్నవాడే          ॥వి॥
మోహంబాపి అల్లాజి బహుప్రీతి చేసే
సోహమానే అహమదొద్దీనయ్యినాడే          ॥వి॥

ఈ తత్త్వములో అల్లాజి (దేవుడు) అంతా తానై వెలుగునని సర్వంతర్యామి కూడా తానే అని, సోహం అనే అహమదొద్దీనై ఉన్నాడని పూలల్లో మొగలి వలె, జనంలో అహమదొద్దీను వలె ఆ దేవుడున్నాడని, 'జ్యోతిర్లింగం' అయినాడని మతాతీతంగ ఉన్న దైవాన్ని కొలిచినాడు.

45వ తత్త్వం
యీడివెరా మాయాభ్రమలూ
జోడుభాసితె యిల్లాలు యెవ్వారి పాలూ          ॥యీ॥
పుడమీకి దూరమై పాడేలోన పండి
అడవిమార్గము బట్టీ నడువాగనూ
చేడేలంతా గూడీ గోడాడీ యేడ్చేరూ
తోడు ఎవ్వరురారు గురునీకిదప్పా          ॥యీ॥

ఈ తత్త్వములో నా భార్య, నా ఇల్లూ అనే భ్రమలన్నీ యీడివెరా, అనగా ఈ లోకసంబంధమైనవేరా అని అర్థము. శవాన్ని పాడెలో పెట్టి శ్మశానానికి తీసకొని వెళ్ళేవేళ స్త్రీలు గోదాడి యెంతేడ్చినా ఆ శవం లేచిరాదు. ఆ శవంతోబాటు గురుడొక్కడే ఉంటాడట. ఈ గురుడు దైవప్రతీక. ఈ తత్త్వంలో



www.etelangana.org

సంసారసంబంధమైన వావి వరుసలు తెలుపుతూ ఎడ్కడేమి లేదూ హక్కు నాదనేది ఏదీలేదూ అని ఈ తత్వాన్ని పెంచి వ్రాసినాడు, 46వ తత్త్వంలో

మురికిదేహమిది స్థిరమని మురుపకు మంచీ చెడ్డలెరుగక... మేరమీరి, పరనారీ సంగమం కోరరాదంటాడు. కోరితే వ్యభిచారంగా భావించినాడు.

చిత్తశుద్ధిలేక వేదవేత్త ననుచు పలుకబోకని సత్తూ చిత్తూ తెలియక వృత్తముని తీరుగా ఉండటం సత్యమగునా అన్న ప్రశ్నవేసి నీలో జ్యోతిని చూడమంటాడు.

"యేక ధ్యాన ఉంచలేక శోకమోమందుజిక్కి
మాకెమేం గొప్పాయని లేకేశుని గానకను
తిక్కబట్టి తిరిగి రాళ్ళ మొక్కటెందుకు ధరలో

అని విగ్రహారాధనము నిరసిస్తాడు, 47వ తత్త్వంలో మానవ కర్తవ్యాన్ని ప్రబోధిస్తూ "దోషమనెడిముల్లె, దోసి ధన్యులజేసి దాసూలదరిచేర్చే" మార్గం చూడమంటాడు. 48వ తత్త్వలో హితమతీ అని మానవున్ని సంబోధించి సద్గురుని స్తుతించడం నీ పని అని సెలవిస్తాదు. 49వ తత్త్వంలో హద్దుదప్పి తిరగ రాదంటూ ఉన్నతాపును తెలియమంటాడు. పన్నెచిన్నెల్ని కోరి కానిపోని పనులకు పూని తంటాలు పడకంటాడు. తల్లిదండ్రుల ఆజ్ఞ మీరరాదంటాడు. లెక్కలేనన్ని మాటలు ఎక్కసంగా నేర్చి బుక్కబుక్కకు వాదులాడే కుక్క గుణాలను మానమంటాడు.

50వ తత్త్వంలో జాతిబేధాలెన్నటం నీతికాదంటాడు. స్వాతి వానలురాక ముత్యాలుకావని శ్రుతులస్థితులెరుగక ప్రకృతులు సహకరించవని ధాత వ్రాలెరుగ కుంటే శాస్త్రీకుడుకాదని తెలుపుతూ కులంగురించి జాతిగురించి భేదాలు విడనాడమంటాడు.

యీ కులమే వ్యాకులమూ
లోకులమే నా కులమూ
ఆకులేని తోలుమాకు మ్యాకలన్నీమేసి పోతే
రాకపోక మధ్యనున్న యేకభావమందుకుంటే ॥యీ॥

ఈ కులవ్యాకులత్వాన్ని జ్ఞానంతో ఖండించుకోకపోతే అల్లాజి కృపకు పాత్రులు కాలేరంటాడు. ఏక భావం పొందమంటాడు.

53వ తత్త్వలో గురుడా నీ పాదములనే మరువా అని తారకంబు తీరుగన్నట్లు తెల్పుకొన్నాడు. 54వ తత్త్వంలో నరులను నిర్లేపనం తెలుసుకొమ్మని అరుగిరులు (అరిషడ్వర్గాలు) దాటి జీవనం చేయవలెనంటాడు. మతులుదప్పి మరణించరాదంటాడు జ్ఞానస్థితుల్ని నిల్పమంటాడు. రాగాలుదీసి రమ్యంగా బహు వగలు చేసేవిధంగా పాటలు బాడితే చాలదు యోగులైనవారు వైరాగ్యంతో భోగరోగాలను మాన్పవలెనంటాడు.

'అసల్ అందు నిజ ఉసూల్ వుంచితమ
రోసాల్ద్రుంచి కర్మ దోషాల్ మాన్పవలె" నంటాడు.

55వ తత్త్వంలో నదులు నిర్లేపానందం కనక గొర్లతీరు జనమర్లు అని వొర్లి భజనలుచేస్తే ముక్తి లేదంటాడు. శ్రుతులు కనక సతిసుతుల విడచి మతి మంతులము మేమని కవితలు వ్రాసినా వ్యర్థమేనంటాడు. గడ్డము, జడలు పెంచి అడ్డబట్టలు కట్టి యెలగొడ్డులతీరై దొడ్డగా తిరిగినా బొట్లుబెట్టి



చిట్లుడుతలవలె గట్లు చెట్లు అట్లీట్లు దిరిగినా నిర్లేపానందం తెలియక వ్యర్థమేనంటాడు. ఇంట్లోని దుర్గుణం బాపుకోక హరిబంట్లమని రంగులో అద్దిన అంగీ (జుబ్బా) తొడుక్కొని బంగూ పత్రి అధికంగా త్రాగినా కొండెగట్టి యోగదండం చేతపట్టినా వేషంవేసి హరి దాసులమని దేశాల్దిరిగినా వంగనామల్ పెట్టి ఆత్మ ప్రసంగాన్ని తెలియక అంగుగా తిరిగినా 'తీర్థయాత్ర' అనే అర్థంతెలియక పలుప్రార్థనలు చేసినా సార్థకంలేదని గుంపులుగాకూడి యింపుగా మద్దెల తాళాలు మ్రోగిస్తూ సొంపుగా పాడినా అచ్చు గ్రంథాల్ తెచ్చి చదివి హెచ్చుగా జపమాచరించినా వ్యర్థమేనని దైవాన్ని (గరుణ్ణీ) ఆశ్రయించమంటాడు.

56వ తత్త్వంలో సద్గురు కల్పంబు దండిగా పొంది అండమందున ఉండేపాపాన్ని తీసి పిండంలోనిల్పిన దీపంతో నిర్లేప అచల ప్రతాపం పొందితే వైరాగ్యం కలుగుతుందని వెంటనే జీవుడు తారకాన్ని పొందుతాడని అదేమోక్ష మంటాడు. (ఈ తత్త్వం చాలా పెద్దగా ఉన్నది).

57వ తత్త్వంలో
"గురుశిష్యులైతె మీరు హరిజాడ తెలుపరయ్యా!
క్షరమందు అక్షరంబూ యేతీరుగలిగెనయ్యా!
స్థిరమాస్థిరంబుతెలిసీ పరిపూర్ణమైన నరులూ
తెరువాక నిల్చినారు పరికించికానరయ్యా

ముల్లోకములు తనలో యేలోకులై తకనరో
జలమందు అగ్నిదాగీ కలిసిందీ చూడరయ్యా
అల్లాజి సద్గురుండూ యుల్లామునిల్పినేడూ
యిలలోన ఫాలభాగం కళలెల్ల జూపెనయ్యా!

అని శరీరశోధన చేసి తత్త్వాన్ని తెలియమంటాడు.

60వ తత్త్వంలో
భావమందున నిత్య సేవచేసెదగురుడా
బ్రహ్మ స్వరూపాయ మోక్షాధిపతుడా...
నరులందరినీ ఏకంబుగా భావించుచుంటివీ
నేరుపుగ జీవాత్మచదివెటి తారక మునెరనమ్ముచు
మంటివి – అని సర్వమానవుల్ని సమదృష్టితో దర్శించ మంటాడు.

61 తత్త్వంలో
జీవుణ్ణి మేలుకో అని ఏ విధంగానైనా ఆత్మనంటవలె నంటాడు.

"పొడుజోలీమానీ హరిని చూడావాలె – మేలుకో
మింటీ మంటీ కంటీ వెలుగుచున్నావాణ్ణి అంటుకో
వెంటూరాదూ తనువూచూడా మంటీ కుండా మేలుకో
యెనిడానీడా ఒక్కొటంచు నిండూగా భావించుకో


www.etelangana.org

అంటూ ఈ తత్త్వంలో పిండమందుండే బ్రహ్మాండాన్ని తెలుసుకొని అర్థం లేని తీర్థయాత్రలను మానుకొమ్మంటాడు. నీలోనీవే ప్రార్థించుకో అని 63వ తత్త్వంలో "మబ్బుదట్టీమందీ సొమ్ము దాఖ్ఖితిని నస్తే యముడు నిర్భరంబుగాను దెబ్బల్ దబ్బా దబ్బా కొడ్తూబోతే అబ్బబ్బొ అని గొబ్బున యేడ్చేరని" తెలుపుతూ.

తల్లి దండ్రుల్నివదలి ఆలుపిల్లలనే తనవారని భావించరాదంటాడు. పొంగుతున్న లొట్టి కల్లుత్రాగి దొంగతనం చేయరాదని వేశ్యలనుకూడరాదని చెబుతాడు.

64వ తత్త్వంలో

మోహంలో పడి తండ్లాడవద్దంటాడు. నిర్గుణ భావం కనుగొని "కుమ్మరి పుర్గూలతీరుండు" మంటాడు.

65వ తత్త్వంలో

"లుచ్చులు జేసే దీబోధ? రచ్చకెక్కె లోకులబాధా! అన్న ఈ తత్త్వంలో మెచ్చేదేమో పెద్దలను వొచ్చేదేమో మాద్దుల్ల వినేదివేదం అనేది వేరొకటి. తినేది పొత్తుల - కనేది వేశ్యల, చెప్పేది శాస్త్రం - దెప్పేది దావుకు, వొప్పేది ఎదురుంగ, కప్పేదికోపం. చేసేది వైద్యం. రాసేదికుప్పె పోసేది విషం, మోసేది దోషం, ఎదురుంగ ఏడ్వటం, విడిచేదేమోరవికెలు, కూటికోసం ఎన్నోమాటలునేర్చినా, సాటివారులేరని ద్వేషాలు కలిగేటట్లు మోసాల్‌చేస్తూ ఉండే నానారకాల జనాల్ని ఈసిడించుకొన్నాడు ఈ తత్త్వకవి.

67 తత్త్వంలో

ఈషణత్రయాలను ఈడ్చే భాషనేర్వాంటాడు. గురుడే హీరుడని - హరుడే గురుడని గుర్తుతెలియాలంటాడు.

68వ తత్త్వంలో

శిష్యుడిణ్ణి సంబోధించి అచల సువర్ణాన్నిపొంది నిశ్చింతగా కాలంగడపమంటాడు. యోగులిదే అనుసరించినారని చెబుతాడు.

70-71వ తత్త్వంలో దుర్బుద్ధుల్ని విడనాడమన్నాడు.

"లద్మాతనము మాను గొప్పొ
దుద్మావునీస్తితిని గంటి"

అద్మాలిరుగ త్రొక్కి నీదుపద్మ బాయజాలయిఘు అని గురువును ఆశ్రయించమన్నాడు.

72వ తత్త్వంలో జ్ఞానం గుర్తుమానకున్నవాణ్ణి. కపటం లేనివాణ్ణి మానాభిమానాలు కొట్టు, తిట్టు, గట్టు, పట్టు, తప్పు, ఒప్పు, రూపు, చూపు, చిన్న, పెద్ద, కెంపు, రత్నం, కంచు, ఇనుము, కర్మ, ఖూతం, మంత్రం, తిండి, రుచి వంటి పదార్థాన్ని కానునేను అల్లాజి తత్త్వం నుంచి వెల్లుతున్నవాణ్ణిని తన్నుతాపరిచయం చేసుకొన్నాడీ తత్త్వకవి.

74వ తత్త్వం

"జ్ఞానయోగామార్గములు వేరూ - గురుసేవగానని
మనుజులెవ్వరు జ్ఞానులైనారు ॥జ్ఞా॥



మానభీమానములు మానక నేనునీవనియునుచువన్నుగ
తనకుతానేగొప్పజేసుక - అనలమందునకాలిపోదురు ॥జ్ఞా॥
ద్వేషులందరు వేషములువేసీ - గురు సేవగానక
దానులామని కవనములువ్రాసీ
లశ మైనను రోసమిడువక - దూషణాడుచుజనుల
నెల్లను - మోసగించియవీ వాసికెక్కిన
కోసి వేతురు యములువేగా ॥జ్ఞా॥
గ్రంథములు యెన్నెన్ని చదివిననూ మనుసందుల
అనుమాన బంధము తొలుగునా మున్నా
పంధితెలిసియు తన్నుతా సాధించినా సమమౌన
యిలలో - మందిమాటల సందుజిక్కియ ...
రాగద్వేషము లోనబడిపొర్లి - చిత్తంబు యెర్గని
కవిని బాగుగ వ్రాసి బహుఅర్లీ సొగసుగా రాగాలుదీయుచు
యెగసి యెగసి భజన చేసిన రోగములు విడనాడకుండును
యోగులేదుర మాయలోకులు.

అని వేషానికి మోసానికి తావీయని విధంగా సాగించుకొనేదే స్వచ్ఛమైన జీవితమని. ఉద్ఘాటిస్తాడీకవి.

75వ తత్త్వంలో

గురుకీలుగంటె ఊరూరుతిరుగరాదంటాడు. తారతమ్యాలు ఎందుకంటాడు. రాగద్వేషాలు వదలమంటాడు. బాగుగా రాజయోగమంది పరమభోగమెరుగమంటాడు.

అజ్ఞానుల స్నేహం విడిచిపెట్టమని మోహానపడబోకని చెబుతాడు.

చిత్తశుద్ధిలేక సంసారం అంతా ఉత్తదనే వారితో కూడరాదంటాడు.

77వ తత్త్వం

పెర్గెనన్న మనసంసారం - అంటు జర్గెనన్న తప్పులుదూరం
వొర్గెదుర్గుణము లిర్గెమదములిటు - తర్గె వ్యసనములు
కర్గెభూమిపై. ॥పె॥
బెర్కికావరము నర్కిగురుని కడకుర్కి జ్ఞానమును
దొర్కబడ్డియిటు ॥పె॥

ఈ తత్త్వం బహుచక్కని దర్వులో వ్రాయడం అయింది, అట్లాంటిదే మరోతత్త్వం. 78. ది నీల్గబోకు గుల్గబోకరా? - జీవ వెల్గువెల్గు తుంది నీవు అల్గబోకురా ॥ నీల్గ ॥

ఓర్పువుంచు పొందుగాను దర్పమిస్వరా - జీవ
మర్పులేని మంత్రాముంది నేర్పుయెర్గురా
మాట్కిమాట్కి ఆటపాట కూట్కిబోకురా - జీవ
నాట్కి ఉనన తొల్లిచద్వునేట్కిజద్వరా



www.etelangana.org

ఇస్త తెన్కయనెడి మస్తీ వొదిలి వుండురా – జీవ
నర్కమంద బోకు కర్కురాళ్ళ మ్రొక్కకూ జీవ
ఉమ్నబాదువిడ్చి సుషుమ్నజేరరా జీవ
గుమ్మామామయ్యి గంగాస్నాదమాడరా!

ఈ తత్త్వంలో ఉమ్నాబాద్ భక్తుణి బట్టి సంబోధించి జ్ఞానాన్ని ఆశ్రయించమని ప్రబోధించినాడు 'గుమ్నామా, అయి గంగాస్నానంచేయమన్నాడు'.

80వ తత్త్వంలో

తనలోని మోహంకోలిపోయిందని – మహాత్ములను దర్శించినానని చిదాత్మను కనులగాంచినానని.
81వ తత్త్వంలో అహమదొద్దీన్ మాటనమ్మి అల్లాజిని (గురువి) కొల్వమంటాడు.

82వ తత్త్వంలో

అన్నా ఇది ఆశ్చర్యం. గురుని కన్నా నరులెల్లకనుగొనే కార్యం ॥అన్నా॥
ఉన్న ఆర్దురిగూడి ఒనమాలు జదువంగ
దున్నపోతూలన్ని వేదాలు బలుకంగ
విన్నవారాలెల్ల పకపకా నవ్వంగ
కన్నవాడూ కూడీ కడతేర్చునంటా.

ఈ తత్త్వంచాలా మర్మంగాచెప్పి మోసకారుల్ని నిరసించినాడు.

88వ తత్త్వంలో

గురుడొక్కడే చూడ హరుడొక్కడేనయ్యా! నీరులోపల నారు బట్టి నీరును గుంజి పెరిగే రీతిగ సారమెరుగమంటాడు.

91వ తత్త్వంలో

అనూమానమేలనూ – సద్గురువు కన్న హరి వేరేలేదయిక ॥అనూ॥
అనారాదు దాన్ని – వినారాదు చూడకన్నూ లోని కళకన్నూ వెల్గగనూ ॥అ॥
మూడుదాటు మనముకే బాట దాన్నిచూడూ అచలమని వేడీనారు యిల ॥అ॥
కులంబెన్ననిష్ఫలం – సద్గురుని బలంవలన నిజఫలం తెలిసినది.
చింతాలేదు నిశ్చింతాచూడు – వాసంతా – పూరమనే కాంతా వెల్గగను ॥అ॥

అల్లాజీని నమ్మిన ఏ బాధ లేదంటాడు. కులం ఎన్నరాదంటాడు.

ఈ కవి గురుకటాక్షంపొంది తాను తరించి తనశిష్యుల్ని తరించ వలెనని తత్త్వాలెన్నో వ్రాసి పరమపదించినాడు. ఈయన వ్రాసిన ఏ తత్త్వాన్ని పొల్లుదిగా చెప్పలేము చక్కని వ్యవహారభాషలో జ్ఞానామృతాన్నినింపినాడు.

ఈ తత్త్వాలలో వాడిన భాషను ఆధారం చేసి – వ్యాకరణజ్ఞులు – వ్యాకరణ విషయజ్ఞులు – పరిశోధనలు చేయ వచ్చును – ఈ రకమైన తత్త్వసాహిత్యాల్ని జనం కాపాడుకోవాలనిచో మనం ఎంతో కోల్పోతున్నామనేచెప్పవీలున్నది ఈ కవి తత్త్వాలమీద పరిశోధన గ్రంథమేరావలని ఉన్నది. ఆంధ్రదేశంలోని ఈరకమైన తత్త్వాలను సేకరించి పది గ్రంథాలుగా ప్రకటిస్తే సాహిత్యజగత్తుక –



విద్యాశాలకు గౌరవం సిద్ధిస్తుందని మరోమాటచెబుతూ ఈ తత్త్వాలను పాడేవారితోపాడించి రికార్డులుచేయిచవలసి ఉన్నది.

వీరి భావనలో గురువే సమస్తము. గురుపూజ ద్వారానే తరించవలెనని నరజన్మ కంతకుమించిన సార్థకత ఇహమందులేదని స్పష్టపరచినారు.

అహమదొద్దీన్ గారి ఆత్మతత్త్వాలు నాలుగుభాగాలు ఒకే గ్రంథంగా అచ్చుఅయి ఉన్నది. మొదటి ముద్రణ 1947కు పూర్వమే అయింది. రెండో ముద్రణ 1952లో అయింది.

వీరితల్లి పత్రూబీబి, తండ్రి షేక్‌బాలె, ఉపదేశం పొందిన గురువు అమీరొద్దీన్, అవలంభించిన మతం అల్లాజీ, నివాసం నాగార్‌కర్నూలు తాలూకాలోని వసంతాపురం. ఈ తత్త్వాలు తెలుగులో గ్రామభాషలో వ్రాసినారు. కందార్థాలు ఒక భాగంగా వ్రాశారు. 'శాస్త్రవేదాంతరహస్య తత్త్వములు, అని అదొక భాగంగా వ్రాశారు. మిగిలిన రెండు భాగాలు కేవలం తత్త్వాలుగా వ్రాసినారు.

అహమదొద్దీన్ గారి తత్త్వాలలో కుల, మత ప్రాంత భాషాది భేదాలు నిరసించినారు. అల్లాజిని గురువుగా సేవించవలెనని బోధించినారు. కందపద్యం చెబుతూనే అర్థం చెప్పేది కందార్థం – ఆ కందం దర్వుతొమేళవింప చేస్తూ చెబితే కందార్థ దర్వు అవుతుంది. కందార్థాలు, కందార్థదర్వులు చాలా మంది తత్త్వకవులు చెప్పారు. తత్త్వ సంబంధ రచనకీబాణీకుదిరేదిగా ఉంటుందని భావించవచ్చు. అందుకే అహదొద్దీన్‌గారు కందార్థాలు, కందార్థదర్వులు రచించినారని భావింతాం పదాలలో యడాగమాలునుగాగమాలు అధికంగా ఉంటాయి. ఉ. కుమారుగావు వాడటం ఇత్యాదులెన్నో కనిపిస్తాయి. ఈ దృష్టితో తత్త్వకవుల భాషను ప్రత్యేకంగా పరిశీలించవలసి ఉంటుంది.

తారకామృత సారం

గుజ్జుల నారాయణదాసు, పీర్ మొహిద్దీన్ సాహెబ్, బోర అప్పలస్వామి కలిసి పలికిన తత్త్వాలే (కీర్తనలే) "తారకామృతసారం" పేరుతో గ్రంథమయి గొప్ప ప్రచారంలోకి వచ్చింది. ఈ కీర్తనల్ని గ్రామ గ్రామాన జనం పాడుకొంటున్నారు. వందలసార్లు ముద్రణ జరిగింది. ముముక్షజనోపయుక్తంగా ఈ తత్త్వాలు గానవేద్య మయ్యాయి. భక్తి, జ్ఞాన, వైరాగ్యానందభరితమైన భావాలు ఈ తత్త్వాలలో నిండి జనాన్ని దు:ఖముక్తుల్ని జ్ఞానాసక్తుల్ని చేస్తున్నాయి.

గుజ్జుల నారాయణదాసు

వీరి నివాస గ్రామం ధవళేశ్వర పురం (ధవళగిరి) గోత్రం గంగ గోత్రం. వంశం సూర్య వంశం. తల్లి లక్ష్మీదేవి. తండ్రి సూరయ్య గురువు పీర్ మొహిద్దీన్ సాహెబ్. శ్రీరామ తారకోపదేశం పొంది ఈ తత్త్వాలు రచించేరు. విష్ణుభక్తులు.

బోర అప్పలస్వామి దాసు

వీరి నివాసం కొటన్‌పేట. తండ్రి సింహన్నదాసు. ఈ కవిత్రయం తారకమంత్ర రాజసిద్ధులు. జన్మ జరా మృత్యు దేహాంతర్గత మైన జీవవేదనకు సరైన త్రోవ సంకీర్తన స్మరణ స్తుతి అనితెలిసి పాడిన పాటలే తెలుగువాణిని పవిత్రం చేస్తున్నాయి. ఇందులో వేదాంతరహస్యాలు వెల్లడయ్యాయి. మూఢనమ్మకాలను తెగటార్చాయి. జన్మసాఫల్యం అంటే ఏమిటో తెలియచేశాయి.

దానము చేయని చేతులును – గానము చేయని గొంతును – ఉండినను లేనివిగానే చెబిప్పినాడు.

■



www.etelangana.org

# బరిగీసి పోరాడాలె

● డా. దిలావర్

బిడ్డలాల! గిట్ల అగస్తమార్గంగ
ఏ సుక్కలల్ల సుక్కలైపోతాంద్రు?
చావును కావులించుకొనుడేంది?
మనం సచ్చుడంటే
జులుంను, దోపిడిని, అణిచివేతను
బతికిచ్చుడేకదా?
మన నారాలల్ల పిరికి నెత్తురు కాదు
మిత్తవతోని తొడగొట్టి సవాల్ చేసే రక్తం కావాలె.
సాకలి అయిలమ్మ, దొడ్డి కొమరయ్య,
కొమురం భీమ్, బందగీలను
యాది మర్సిన్రా నాయినలాల? →
మనం ఏ సుఖాలు అనుబగిచ్చినమని
మా యిల్లైనె బతుకంటే యాష్టకొస్తోంది?
మన సెమటతోని తడిసిన చెల్కలు,
మన కలల పంటపొలాలు
వాళ్ళ జంతర్ మంతర్ జాదూతోని
సక్కాల పత్తా దొరక్కుంట పోతన్నయ్.
మన మూతులకు చిక్కాలు బిగిచ్చి
మన తల్లి రొమ్ముల పాలు-కృష్ణాగోదారుల్ని
వాళ్ళు దొర్జన్యంగ తాగుతాంద్రు
మన బయ్యారం గనులు, సింగరణీ బొగ్గు గుట్టలు,
ఫెర్రో ఎల్లాయిస్‌లు, కెటిపియస్‌లు
వాళ్ళ వలలల్ల చాపల్లెక్క తండ్లాడుతన్నయ్
మన చాపల్ని మనమే పట్టియిచ్చే
లేబర్‌గాండ్లమయినం
కువకువలాడే మన వుద్యోగాలను
వాళ్ళు గద్దల్లెక్క తన్నుక పోతాంద్రు
మనం పెట్టుకున్న పుట్టలల్ల
వాళ్ళు బుసకొడుతాంద్రు
మన కంటి పాపలు పొదిగిన కలల్ని
వాళ్ళు ఆగమాగంగ చిదిమి పారేస్తాంద్రు
మనం ఏ కుషామతి పరుపుల్ల దొర్లుతున్నమని
గిప్పుడే తనువులు సాలిచ్చ బట్టింద్రు తండ్రులాల!
పాండవులోల్ల కత- దాయాదుల నడ్మ జరిగిన జంగును
జర యాజ్జేసుకోండ్రి
అజ్ఞాతపు వేషాలు తీసేసి
జమ్మిచెట్టు జాడ కనుక్కోండ్రి
రాజోలి బండ షట్టర్ల సాక్షిగా
మన కలల చుట్టూతా వాళ్ళు కట్టిన
మన కలల చుట్టూత వాళ్ళు కట్టిన
యినుప గోడల్ని కూలగొట్టాలె
మన అమ్మను బాంచెతనపు బతుకునుంచి
ఆజాద్ చెయ్యాలె
అరె...మన పెయ్యి మంచుముద్దలెక్క
సప్పంగ సల్లారుడేంది?
మన నరాలల్ల బిజిలీ ప్రవహించాలె
మన గుండెలు అగ్గిగుండాలు కావాలె
మన వూపిరి నిప్పుల వుప్పెన కావాలె
మన జై తెలంగాణ నినాదాలు
పిడుగులై దద్దరిల్లాలె
బలిదానం కాదు బిడ్డలాల!
బరిగీసి పోరాడాలె – పాతాళం లోపటికెల్లి
మీరు ఆజాదీని పైకి తెచ్చేదాంక
అంపశయ్యమీద భీష్ముని లెక్క
పానాలు ఉగ్గబట్టి బత్కుత
సంకెళ్ళు తెగిన మన తల్లి రామసక్కని రూపం
కళ్ళార సూసినంక పానం యిడుస్త
నా బిడ్డలాల! గప్పుడు మీరు
పరాయితనం లేని మన సొంతగడ్డ మీద
నాకు తలకొరివి బెట్టనీకి రావాలె
గని– తరీకకు ఖిలాఫ్‌గ
మీరు బలిదానం చేస్తే
వొణుకుతున్న ముసలిచేతులతోని
నేనే మీకు ఎట్ల తలకొరివి పెట్లాలె బిడ్డా!
గప్పుడు నేసనబగిచ్చే కడుపుకోత
కలికలి అయ్యే మనసు తండ్లాట
అల్లడ తల్లడమై అవిసిపోయే గుండెల బాధ
గోడుగోడుగ గోసగోసగ
సుడులు తిరిగిపైకి పెకలని దుక్కం
ఎవరికి చెప్పుకుంటె ఎవరు యింటరు తండ్రీ! ■



### తెలంగాణలో

# తెలుగు - ముస్లింల సహజీవన సంస్కృతి

● దేశపతి శ్రీనివాస్




హిందువులు మహమ్మదీయులు ఉమ్మడిగా ఎగురవేసిన సహజీవన పతాకం తెలంగాణ. ఇది చరిత్ర ఏర్పరచిన పవిత్ర బంధం. ఉత్తర దక్షిణ భారతదేశానికి నడుమ వారధిగా నిలిచింది కనుకనే ఈ దక్కన్ పీఠభూమి విభిన్న సంస్కృతులవీ విరబూసే వూదోటగా పరిమళిస్తున్నది. విభిన్న సంస్కృతుల విలువలను సంలీనం చేసుకున్న విలక్షణ జీవితమై ప్రవహిస్తున్నది.

తెలంగాణ ప్రజల భాషలో అడుగడుగునా ఉర్దూ పదాల అత్తరు వాసన అలముకోని గుబాళిస్తుంటది. పల్లె అయినా పట్నమయినా అలైబలై తీసుకునే అనుబంధం వలెనే ఉర్దూ తెలుగుల చెలిమి చెమ్మ చెక్కలాడుతుంటది. పీరీల దర్గా ముందు అలువా ఆడుకుంట ఆత్మీయంగా అల్లుకునే చేతులలోనూ పెద్దగుట్ట దేవునికి మొక్కు చెల్లించుకున్న పేద బిడ్డను ఆశీర్వదించే నెమలీకల వింజామర మృదుస్పర్శలోనూ ఈ సహజీవన సంస్కార సూత్రం ఊదుపొగ వలె వ్యాపించి వుంటది.

చరిత్ర పుటలలో వెదికితే ప్రజలలో నెలకొన్న ఉమ్మడితనాన్ని కాపాడేందుకు పాలకులు చేసిన దోహదం కనిపిస్తది. 'మాలిక్ ఇబ్రాహీం కులీకుతుబ్‌షా' తెలుగు కవుల పద్యాలలో మల్కిభరాముడుగా ముచ్చట గొలుపుతడు. శ్రీరామ కల్యాణానికి భద్రాచలానికి ముత్యాల తలంబ్రాలు మోసుకపోయే సత్సంప్రదాయాన్ని నెలకొల్పిన తానీషా చక్రవర్తిలోనూ మూసీ నది వరదలు తగ్గ ముఖం పట్టేటందుకు జంధ్యం వేసుకోని యజ్ఞం నిర్వహించిన నిజాం ప్రభువులోనూ హిందూ ముస్లిం ప్రజల అనుబంధాన్ని పెంచే తాపత్రయమే కనిపిస్తది.



www.etelangana.org



**నగర ప్రజలు చల్లగ బతకాలెనని తన నాలుగు చేతులెత్తి అల్లాను ప్రార్థించే చార్మినార్ కట్టడం ఆకాశాన్నంటిన హైద్రాబాద్ చారిత్రక వైభవానికి చెరగని సంకేతం.**

దక్షిణ భారత మహమ్మదీయ సంస్కృతికి నిరుపమానమైన కేంద్రం మన హైద్రాబాద్. ఈ నగర ప్రజలు చల్లగ బతకాలెనని తన నాలుగు చేతులెత్తి అల్లాను ప్రార్థించే చార్మినార్ కట్టడం ఆకాశాన్నంటిన హైద్రాబాద్ చారిత్రక వైభవానికి చెరగని సంకేతం.

ఘుమఘుమలతో నోరూరించే హైదరాబాదీ బిర్యానీ, గరంగరంగా హుషారు తెప్పించే ఇరానీ చాయ్ హైదరాబాద్ పహెచాన్‌గా ప్రపంచంల ప్రసిద్ధి పొందినయి. ఇరానీ చాయ్‌ల బన్ను అద్దుకోని తిన్నాంక పనిపాటలకు పోవుడు హైద్రాబాద్ శ్రమజీవులకు అలవాటు. కష్టించి కడుపు నింపుకునే దగ్గర కలిసి బతికినట్లే, కడుపుమీద తన్నే అణచివేతల మీద కలెబడె కాడ కూడా తెలంగాణ ప్రజలు కలిసే పోరాటాలు చేసిన్రు,

తన మాటల మంత్రాలతో హైద్రాబాద్‌లో సిపాయిల తిరుగుబాటు జ్వాలలు రేపిన మౌల్వీ అలావుద్దీన్, బ్రిటిష్ రెసిడెన్సీ మీద ఫిరంగి గుండ్లు పేల్చిన తుర్రేబాజ్ ఖాన్ ఈ నేల వీర చరితకు గుర్తులు. మంటలతోని మాట్లాడించి రక్తంతోటి రాగాలాపన చేయించిన కవియోధుడు మగ్దూం మొహియొద్దీన్ తెలంగాణ ప్రజల పోరాటానికి వేగుచుక్క. హిందూ, ముస్లిం ప్రజల ఉమ్మడి జ్ఞాపకాలతో నిండిన తెలంగాణ గతం ఉదాత్తమైనది. ఎంతో ఉద్వేగభరితమైనది. నిజాం పరిపాలన నుండి హైద్రాబాద్ రాష్ట్రం ఏర్పాటు దాకా ఈ జీవన సూత్రం అవిచ్ఛిన్నంగా కొనసాగింది. నడుమన నాలుగునాళ్ళ పీడకల తప్ప చరిత్ర అంతా చెలిమి చెలిమెలో ఊరిన తియ్యని జ్ఞాపకాలతో నిండిపోయింది. ఆ జ్ఞాపకాల జాడలు చెరిపేస్తూ ఈ చరిత్రకు చెదలు పట్టినట్లే ఆంధ్ర పాలన ముంచుకొచ్చింది. తమను తాము పరిపాలించు కోవాలనుకుంటున్న తెలంగాణ ప్రజల ఆకాంక్షలమీద క్రూరమైన పరిహాసంగా విశాలాంధ్ర ప్రతిపాదన ముందుకొచ్చింది.

తెలంగాణ జీవన విధానం కానీ, ఆ జీవనంలో అంతర్భాగమై అమరివున్న హిందూ ముస్లిం సంస్కృతీ సంస్కారం కానీ ఎంత మాత్రం అర్థం కాని, ఈ నేల చరిత్రతో ఏ సంబంధమూలేని ఆంధ్ర వలస పాలకుల పంచనలోకి తెలంగాణాను ఈడ్చింది. ఫలితంగా తెలంగాణ ప్రజా జీవితం చిందరవందరయి-చిత్ర వధయి పోయింది. సమైక్య జీవన పుష్పగుచ్ఛం కకా వికలై పోయింది.

1953లో మద్రాసు రాష్ట్రం నుండి విడిపోయి కర్నూలు రాజధానిగ ఆంధ్ర రాష్ట్రాన్ని ఏర్పాటు చేసుకున్న ఆంధ్ర ప్రాంతీయుల నీజర్ వనరుల కుప్ప అయిన తెలంగాణ మీద, ప్యారే మహబూబు వంటి హైద్రాబాద్ నగరం మీద పడ్డది. లోటు బడ్జెట్‌తో క్రుంగి పోతున్న ఆంధ్ర రాష్ట్రాన్ని గట్టెక్కించుకునేందుకు అధిక ఆదాయంతో మిగులు బడ్జెట్‌తో సంపన్నంగా వున్న హైద్రాబాద్ రాష్ట్రాన్ని కలుపుకోవాలనే కుతంత్రం పన్నిన్రు ఆంధ్ర పౌరులు. తమకు రాజధానిగా పనికొచ్చే నగరమేదీ లేది కనుక తెలంగాణను కలుపుకోవడం ద్వారా అందివచ్చే హైద్రాబాద్ నగరం మీద పట్టు బిగించవచ్చనే పన్నాగం. రానించిన్రు తమ ప్రాంతంలో ఖనిజ వనజ వనరులు లేకపోవడం వల్ల హైద్రాబాద్ రాష్ట్రంలో పుష్కలంగా వున్న బొగ్గు నిల్వలు వాడుకోని ఆంధ్రరాష్ట్రానికి కరెంటు అవసరాలు తీర్చుకోవచ్చనే కుట్రతోని ఆంధ్రప్రదేశ్ ఏర్పాటును కోరుకున్నరు. అందుకు నిరాకరించిన తెలంగాణ ప్రజను మోసగించేందుకు తెలుగు భాష మాట్లాడే వాళ్ళంతా ఒక్కటేనని బుకాయించిన్రు. తెలంగాణ వనరులను



ఉద్యోగాలను, విద్యావకాశాలను నిధులను దోచుకోమనీ, ధోకేబజీ చేసి, తగిన రాజకీయ ప్రాతినిధ్యం కల్పిస్తామని నమ్మబలికిన్రు నమక్ హరామ్ లై తేలిన్రు. 1956 నవంబర్ 1 తెలంగాణ భవిష్యత్తుకు మరణ శాసనం ప్రకటిస్తూ ఆంధ్రప్రదేశ్ ఏర్పాటయింది.

ఉమ్మడి రాష్ట్రంలో తెలంగాణా నిలువునా దోపిడి చేయబడ్డది. నదీ జలాలలో చుక్కనీరు దక్కలేదు, సరికాదా గతంలో రాజులు నిర్మించి రక్షించిన చెరువులు నిర్లక్ష్యానికి గురై పూడుకపోయి ప్లాట్లుగా మారిపోయి మాయమైనయి. భూగర్భ జలాలు అడుగంటి బావులు నీళ్ళు లేక వుసురు మంటే బోరు చావుల బలిపీఠమెక్కిండు రైతు. రాజ్యాంగాన్ని ఉల్లంఘించి చట్టాలను చట్టుబండలు చేసి తెలంగాణా ఉద్యోగులలో ఆంధ్రులు నిండిపోయిన్రు. ప్రాజెక్టు పారకంల నీళ్ళు, ఆంధ్రకు పారినట్లే, నిధుల వరద ఆంధ్రకే పారింది. ఒక్క మాటల చెప్పాల్నంటే ఆంధ్ర అభివృద్ధికి తెలంగాణ ఎరువుగా మారిపోయింది. తిరగబడ్డ తెలంగాణకు తుపాకులే జవాబిచ్చినయి 1969 ఉద్యముల 369 మందికి పైగా విద్యార్థి అమర వీరుల రక్తంతో ఆంధ్ర పాలకులు హోలీ ఆడుకున్నరు.

సన్నకారు రైతులుగా చిన్న చిన్న వ్యాపారస్తులుగా, వ్యవసాయ రంగం మీద ఆధారపడ్డ చిన్న వృత్తులలో స్థిరపడ్డ పనివాళ్ళుగా బతికే తెలంగాణ ముస్లింల జీవితాలు చితికి పోయినయి. షీర్‌ఖుర్మా ఖజానీల తీయందనాలు తీరిపోయినయి. గజల్ గంధర్వ రాగాల గొంతులు ఉరితాళ్ళకు వేలాడినయి. ముషాయిరాలు మూగబోయినయి. ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రంలో తెలంగాణా తెలుగు వాళ్ళు ద్వితీయ శ్రేణి పౌరులుగా కుంచించుక పోతే, తెలంగాణ ముస్లిం ప్రజలు తృతీయ శ్రేణి పౌరులుగా కుదించుకు పోయిన్రు. అభివృద్ధికి అవలివైపు పారేయబడ్డరు.

ఆంధ్రప్రదేశ్ ఏర్పాటు కాంగనే ఆంధ్రపాలకులు మొదట పరిపాలనల తెలంగాణ ప్రాతినిధ్యాన్ని రద్దు చేసిన్రు ఉర్దూ చదువులు చదివిన తెలంగాణా వాళ్ళు ఉద్యోగాలకు పనికి రారన్నరు. ఇంగ్లీషు వస్తదనే సాకుతోటి ఆంధ్రావాళ్ళకు ఉద్యోగాలు కట్టబెట్టిన్రు. ఇయ్యాల పరిపాలనకు గుండెకాయ అయిన సెక్రటేరియట్‌ల తెలంగాణ ఉద్యోగులు 10% ఇంక అండ్ల ముస్లింల ఎందరుంటరో ఊహించుకోవచ్చు. అయితె ఆంధ్రతో విలీనం కాకముందు హైద్రాబాద్ రాష్ట్రంలో 42% ముస్లిం ఉద్యోగులుండేవారనే చారిత్రక సత్యాన్ని మనమిక్కడ యాజ్జేసుకోవాలె. ఉద్యోగ రంగంల తెలంగాణ ప్రజల, తెలంగాణ ముస్లిం ప్రజల ప్రాతినిధ్యాన్ని పూర్తిగా రద్దు చేసిన ఆంధ్ర వలస పాలన దుర్మార్గ స్వభావాన్ని గుర్తించాలె.

ఉర్దూ కలిసిన తెలుగునే ఓర్వని ఆంధ్రా పాలకులు ఉర్దూను ఇంకా అసహ్యించుకున్నరు. ఆంధ్ర ప్రాంతంల వుండే మహమ్మదీయులు తమ అస్తిత్వాన్ని కోల్పోయిన్రు. ఎక్కువ శాతం ఉర్దూను మాట్లాడలేరు. కానీ తెలంగాణ ప్రాంతంలో మహమ్మదీయులే కాకుండా తెలుగు ప్రజలు కూడా ఉర్దూను గొప్పగ మాట్లాడుతరు. ఈ గొప్పతనాన్ని తక్కువతనంగా అవహేళన చేసి మాట్లాడుతరు ఆంధ్రులు. తెలంగాణ ప్రజలకు తౌరక్యాంధ్రులు అని పేరు పెట్టి ఎద్దేవా చేసిన్రు. అంటే తురకం కలిసిన తెలుగు మాట్లాడేవాళ్ళు అని అర్థం. ముస్లింలను తమలో ఒకరుగా చూసే తెలంగాణా సంస్కృతికి భిన్నంగా ముస్లింలను అందరిలో ఒకరుగా కూడా కాకుండా కేవలం ముస్లింలుగా చూసే పద్ధతికి తెరలేపింది ఆంధ్రాపాలకులే.

ఆంధ్రా నాయకులెవరికీ ఉర్దూ రాదు. కనీసం నేర్చుకోవాలనీ వాళ్ళకు అనిపించదు. వాళ్ళ దృష్టిలో ఉర్దూ పరాయిభాష ముస్లింలు పరాయి దేశస్తులు. అంతకన్నా భయంకరంగా వాళ్ళ ఆలోచనలో కేవలం ఓట్లు వేసే మిశిన్లు ఆ మిశిన్లు తమకు నడుపరాదు. కనుక నడిపే ఆపరేటర్లుగా ఒకరిద్దరు



www.etelangana.org

ముస్లిం నాయకులు తయారయిన్రు. అట్ల ఓట్లేయించే ఒకరిద్దరు ముస్లింనాయకులే కాలేజీలు, దవాఖానాలు, పరిశ్రమలు మంజూరు చేయించుకోని కోట్లకు పడగలెత్తిన్రు. మిగతా ముస్లిం ప్రజానీకం బిర్యానీల పత్తా లెక్క, ఖూరల కలియ మాకు లెక్క అవసరం తీరినాంక అవతల పారేయబడ్డరు.



అధికారంల వాటా ఇయ్యరు !
సంక్షేమంల కోటా ఇయ్యరు !!
సమానమున హోదా
ఇయ్యరు !!!
అది కాంగ్రేసైనా తెలుగు
దేశమైన చేసిందొక్కటే!

50 సంవత్స ఆంధ్రా పాలన ముస్లిం బతుకులు ఏ అభివృద్ధికి నోచుకున్నయి. మురికి మొహల్లాలలో పాతబస్తీ ఇరుకు సందుల్లో గోనెపట్టాలే గోడలై, పాత దుప్పట్లే పర్దాలై, బీడీలు చుట్టుడే బతుకు దెరువై వెలవెల బోతున్నయి. ముస్లింలకు లభించిన అభివృద్ధి వలాలేవి? జీవితం గడుపునేందుకు మిగిలిన ఉపాధి మార్గాలేంటియి. మైనారిటీ సంక్షేమ మనే అబద్ధాల మాట సాక్షిగా ముస్లింలంటే హారేక్ మాల్ అమ్మే అక్బర్ పాషాలు, బ్యాండు మేళం వాయించే బాబామియాలు అరటి పండ్లు అమ్ముకొని బతికే అఫ్జల్‌లు సైకిల్ పంక్చర్లులేసే సయ్యద్ మియాలు 'పానా'లతో ప్రాణాలు నిలుపుకుంటున్న మెకానిక్ మహబూబ్ అలీలు. బేకరీ కేఫుల్లో పనిచేసే బేకార్ బతుకుల మక్బూల్ పాషాలు, ఇరానీ హోటల్ సర్వర్లుగా మిగిలిపోయినా ఇక్బాల్ పాషాలు. నౌకరీ దొరకని నయీంపాషాలు, షాదీ నోచుకోని షాహెదాలు బర్‌బాదయిపోయిన బతుకులు బద్ నసీబ్ అనుకునే నిట్టూర్పులు.

50 సంవత్సరాల ఆంధ్రాపాలన సాధించిన మైనారిటీ సంక్షేమం సాక్షిగా ఈ రోజున ముస్లింలతో అక్షరస్యతా శాతం –? ఉద్యోగ రంగంలో ముస్లింలకు దక్కిన వాటా ? భూముల పంపిణీలలో ముస్లింలకు జాగలేదు. చెప్పులరిగేటట్లు తిరిగినా ఏ బ్యాంకుల గూడ పైసా లోను పుట్టదు. విసిగి వేసారి మర్ల పడితె రౌడీలుగా గూండాలుగ ముద్రలేస్తరు. ఎక్కువ అవాజ్ చేస్తె తోటి చుట్టరికం కలుపుతరు.

నెత్తిమీద టోపీలతో నమాజులు చేస్తున్నట్లు పేపర్లకు ఫోటోలకు ఫోజులిచ్చిన ఆంధ్రా కపటనాయకులు అధికారంలో భాగస్వామ్యం దగ్గర మాత్రం అస్సలు టోపీ ముస్లింల తలల మీద తాము పెట్టిన్రు. జిల్లాలలో నాయకులను మైనారిటీ సెల్‌లకు పరిమితం చేసిన్రు ఇఫ్తార్ విందులలో తియ్యగ తిని పుల్లగ త్రేన్చుతున్న ఈ నాయకుల కాలర్ పట్టి ముస్లింలు ఈ రాష్ట్రంల సర్పంచులుగా మండలాధ్యక్షులుగా జిల్లా పరిషత్ చైర్మన్లుగా, కార్పోరేషన్ చైర్మన్లుగా ఉండరెందుకంటే జవాబిచ్చే ఖలేజా వుందా?

అధికారంల వాట ఇయ్యరు !
సంక్షేమంల కోటా ఇయ్యరు !!
సమానమన హోదా ఇయ్యరు !!!

అది కాంగ్రేసైనా తెలుగు దేశమైన చేసిందొక్కటే! దొంగలు దొంగలు ఊళ్ళు పంచుకున్నట్లు, వక్ఫ్ ఆస్తులు ఆంధ్ర పెట్టుబడిదార్ల వ్యక్తిగత ఆస్తులుగ మార్చేస్తడు. నాడు హైటెక్ సిటీ భూములు చంద్రబాబు ఆంధ్రా రియల్టర్‌లకు, ఐటీ కంపెనీలకు కట్టబెట్టితే, ఇవాళ దర్గా భూములను లగడపాటి ల్యాంకోహిల్స్‌కు రాజశేఖర్ రెడ్డి కట్టబెట్టిండు.



కాంగ్రెస్ తెలుగుదేశంలు అమ్మిన మైనారిటీల ఆస్తుల విలువ నాలుగు లక్షల కోట్లు తెలంగాణల నివసిస్తున్న ముస్లిం కుటుంబాలు 8 లక్షలు అంటే అమ్మిన ఆస్తులను ప్రజలకు పంచితే కుటుంబానికి అరకోటి వచ్చేవి. ముస్లిం ప్రజల పేదరికం రూపు మాసి పోయేది.

మైనారిటీలకు భద్రత కల్పిస్తున్నాయని దంభాలు పలికే ఈ పార్టీలు, ప్రపంచంల ఎక్కడ బాంబుపేలినా పాతబస్తీని అనుమానంగ చూస్తయి. జైలు ఊచలను ముస్లిం యువకుల నుదుటి గీతలుగా మార్చిన ఘనత ఈ పార్టీలదే.

తెలుగుదేశం పార్టీ పట్టు బిగిసిన తర్వాత మన తెలంగాణ శాన్ నిషాన్ జానేమనే షహర్ హైద్రాబాద్ పుర్తిగా ఆంధ్రా ఆక్రమిత ప్రాంతమైపోయింది. దక్కన్ సంస్కృతీ సుగంధం అవిరైపోయింది. ఎటుచూసినా గుంటూరు బస్తులు, ఆంధ్రా మెస్సులు, బందరు లడ్లు స్వగృహాఫుడ్లే అయినయి. అందాల మూసీ మురికికి మారుపేరయింది. నిజాం నిర్మించిన తటాకాలు ఆంధ్రా పరిశ్రమల కాలుష్యంతో ఉగల్‌దాన్‌లయిపోయినయి. చార్మినార్‌ను మింగేసి హైటెక్‌సిటీ హైద్రాబాద్‌కు కొత్త గుర్తుగా పొడుగుమకోని వచ్చింది. నౌబత్ పహాడ్ నీజర్ కందకుండాపోయింది. పొద్దంత కూచున్నా పొమ్మనకుండా ఆదరించే ఇరానీ హోటళ్ళ స్థానంలో నిల్చొండి తినే ఆంధ్రా వ్యాపార దర్శనులే దర్శన మిస్తున్నయి.

పాతబస్తీ దరిద్రానికి గుర్తయింది అబిడ్స్ కోఠీలు కళదప్పి మరో పాత బస్తీగ మారినయి. ఇవాళ హైద్రాబాద్ అంటే ఆంధ్రా నాయకులు ఆంధ్రా వ్యాపారులు, ఆంధ్రా ఉద్యోగులు మాత్రమే నివసించే కూకట్‌పల్లి, జూబ్లీహిల్స్ మీదుగా నల్లగొండ శివార్ల దాకా విస్తరించిన ఆంధ్రా కాలనీల కొత్త నగరం. ఫైఓవర్ దారులు బట్టర్ ఫై లైట్ల వెలుగులు ఈ కొత్తనగరం సొంతం.

ఎన్నినాళ్ళు మనల్ని రద్దు చేసిన ఆంధ్రా వలస పాలనలో లాపతా బతుకులు బతుకుదాం? మన బతుకు మన భాష ఓర్వని నేతల చేతుల్లో తీరని వెతల పాలైపోదామా? వక్ఫ్ ఆస్తులు ఆంధ్రా పెట్టుబడిదార్ల పాలైపోతుంటే చేతకాక చేతులు నలుపుకుంట ఊరుకుందాం? అన్ని రంగాలలో తెలంగాణ ప్రజల ప్రాతినిధ్యం లేకుండా పోతున్నా ఎట్ల రోశం లేకుండ జీవిద్దాం?

తెలంగాణ తెలుగు ప్రజలు పేదముస్లింల సమస్యలకు దరిదాపులలో వున్న పరిష్కారం తెలంగాణా రాష్ట్రం ఏర్పాటు. తెలంగాణ రాష్ట్రంలోనే దక్కనీ సంస్కృతి పూర్వ వైభవాన్ని పొందగలుగుతుంది. తెలంగాణ ముస్లిం ప్రజానీకం ప్రధాన రాజకీయ శక్తిగా ఎదగ గలుగుతుంది. తెలంగాణ ప్రజల దృష్టిలో తెలంగాణ ముస్లిం ప్రజానీకం తమలో నగం, తమతో సమానం. కనుకనే రేపటి తెలంగాణ రాష్ట్రానికి ఉపముఖ్యమంత్రిగా మైనారిటీ నాయకుడే ఉండి తీరలె. ఉర్దూను రెండవ అధికార భాషగా అమలు చేసి తీరాలె!

ఇది ఓర్వలేకనే రాజశేఖర్ రెడ్డి వంటి నాయకులు, తెలంగాణా వస్తే ముస్లింల రాజ్యం వస్తదని విష ప్రచారం చేయించిస్తూ తెలంగాణల రాజ్యాధికారంలో ముస్లింలకు న్యాయ సమ్మతమైన వాటా లభించటం తప్పా? అది రాజ్యాంగ స్ఫూర్తికి అనుగుణం కాదా? నిజమైన ప్రజాస్వామ్య సూత్రం కాదా? అసలు ముస్లింలు మనుషులు కాదనా వీళ్ళ అభిప్రాయం? ఇంకో నాలుక తోటి తెలంగాణా రాష్ట్రంల ముస్లింలకు భద్రత వుండదని ప్రచారం చేసిన్రు. తెలంగాణా వాళ్ళు ముఖ్యమంత్రి అయితే భరించలేక వాళ్ళని కుర్చీమీంచి దాచేతందుకు మతకల్లోలాలను సృష్టించింది రాజశేఖర్ రెడ్డి కాదా? హైద్రాబాద్ మధురకవి గులాం యాసిన్‌ను పొట్టన పెట్టుకున్నది వీళ్ళు సృష్టించిన కృత్రిమ మతకల్లోలాలే కాదా?



www.etelangana.org

ఇగ బిజెపితో జతకట్టి తెలంగాణను అడ్డుకున్న చంద్రబాబు సెక్యులరిజం స్పెల్లింగు కూడ మర్చిపోయిండు.

ముస్లింల సమస్యలను మత పరిధిలోంచి కాకుండా సామాజిక ఆర్థిక రాజకీయ దృక్కోణంలోంచి చూచే విధంగా సచార్ కమిటీ సిఫార్సులను నిజాయితీగా అమలు చేయగలిగే విధంగా రేపటి తెలంగాణా రాష్ట్రంలోనే పాలక వర్గాల మీద ఒత్తిడిని సృష్టించ గలుగుతాం. రేపటి తెలంగాణలో మాత్రమే ముస్లింలు ఒక బలమైన రాజకీయ శక్తిగా ఎదగడం సాధ్యమవుతుంది.

తెలంగాణకు నదీజలాలులో సమానమైన వాటా సమైక్య రాష్ట్రంలో రాదని 50 సంవత్సరాల చరిత్ర రుజువు చేసింది. స్వంత రాష్ట్రంలో మాత్రమే తెలంగాణకు అవసరమైన సాగునీటి ప్రాజెక్టుల నిర్మాణం జరుగుతది. ఫలితంగా గ్రామీణ ముస్లిం జీవితంలోకి కొత్త వసంతం ప్రవేశిస్తది. రక్తం అమ్ముకోని జీవిస్తున్న ఈనాటి దీన స్థితి నుంచి విముక్తి కలుగతది.

మంజిల్ హై తెలంగాణ
మక్సద్ హై తెలంగాణ
షోయబ్ ఉల్లా ఖాన్ నెత్తురు అక్షరాలమై
బందగీ త్యాగాలలో విరిసిన మందారాలమై
మగ్దూం అక్షరాల కవన కుతూహల రాగాలమై
కులీకుతుబ్‌షా గజల్ గానా గమకాలమై
మన తల్లి భాగమతి గజ్జెల సవ్వడులమై

చార్మినార్ గూళ్ళలో కువకువలాడే శాంతి కపోతాలమై జీవిద్దాం. సుర్మాదిద్దిన కండ్లలో సుఖశాంతులు విరిసే తెలంగాణను సృష్టిద్దాం. సామరస్యతకు శాశ్వత చిరునామాగా తెలంగాణాను ప్రకటిద్దాం.

జై తెలంగాణ!
జై జై తెలంగాణ

## 'సింగిడి' నెలనెల సమావేశాలకు ఆహ్వానం

సింగిడి ప్రతినెల మొదటి ఆదివారం సాహిత్య సమావేశాలను నిర్వహిస్తున్నది. వర్తమాన సాహిత్య, సామాజిక అంశాలపై అభిప్రాయాలను పంచుకోవడానికి చర్చించడానికి ఈ సమావేశాలాను నిర్వహిస్తున్నది. ప్రతి సమావేశం చివర కవితాపఠనం, కథాపఠనం ఉంటుంది. అందరూ హాజరై సమావేశాల్ని అర్థవంతం చేయాల్సిందిగా కోరుతున్నాం.

సమావేశ స్థలం : జెన్ కాలేజీ, లక్డికపూల్, హైదరాబాద్.

సమయం : సా॥ 5 గం॥లు



# నిహాలెసుఖన్ సంస్థ - ఉర్దూభాషాసేవ

• 'శ్రీ అలంపూరు రాఘవేంద్రరావు జడ్జ్'

**అలంపురము** పూర్వమునుండియు విద్యాంసులకు ఆటపట్టుగా వుండినది. ఇచట భూస్వాములు, శ్రీమంతులు అయిన ముస్లిములుండినందున వారి నాశ్రయించుకొనివుండిన ముస్లిములలో ఫారసీ, అరబ్బీ భాషా పండితులుండిరి. ఫారసీ రాజాదక్షణము పొందియుండినందుకు ఆ కాలమున ఇచటి హిందువులలో గూడా ఫారసీ విద్వాంసులుండిరి. స్థానికులు భావసార క్షత్రియ సంఘమునకు చెందినవారయిన కీ.శే. రాజారాం మాష్టరుగారు సంస్కృతము - ఫారసీ - హిందీ - మరాఠీ భాషలలో పండితులై యుండిరి. మేము వారికడ విద్య నభ్యసించి యుంటిమి. తరువాత నైజాం రాజ్యములో ఫార్సీకి బదులు ఉరుదూ రాజభాష అయ్యెను. అందు వలన ఉర్దూ తర్వగా వ్యాప్తిం జెందెను.

అలంపూరు తాలూకాకు కేంద్రము. ఇచట తహసీలుకచేరి, మున్సిఫ్ కోర్టు మొదలైన తాలూకా కార్యాలయములన్నియు వున్నవి. సాధారణముగా రెవిన్యూ అధికారులలో సాహిత్యాభిరుచి తక్కువ. మున్సిఫులు మాత్రము మంచి విద్వాంసులు వచ్చుచుండిరి. జనాబ్ నిహాలె అహమద్, ఎం.ఏ., ఎల్.ఎల్.బి. గారు ఇక్కడికి మున్సిఫ్‌గా వచ్చిరి. వారు అరబ్బీ, ఫార్సీ భాషలలో ఉద్దండ పండితులు. సాహిత్యాభిరుచియే గాక మధురమైన కవితా రచనలును చేయుచుండిరి. వీరి జన్మస్థలము ఉత్తర భారతము. అలంపూరులో అదివరకే నేను ఉర్దూ సాహిత్య రంగములో కృషి చేసి ప్రసిద్ధుల దృష్టిలో పడియుంటిని. రచనా వ్యాసంగముతో బాటు మున్సిఫ్ కోర్టులో వకాలతుగూడ చేయుచుంటిని. అందువలన ఈ మున్సిఫ్‌గారితో వెంటనే పరిచయ మేర్పడినది. ఆది వరకే నా పేరు వినియుండినందున వారును ఇచటికి వచ్చినందుకు చాల సంతోషమును వ్యక్తపరచిరి. అలంపూరులో రచనా వ్యాసంగమును పెంచి నూతన రచయితలకు ప్రోత్సాహము కలిగింపవలెనని మేమిరువురమును ఆలోచించితిమి. 1937 సం॥న అలంపూరు క్లబ్బులో ముషాయిరా (కవిసమ్మేళనము) ఏర్పాటు చేసితిమి. ఆనాడు ముగ్గురు కవులు మాత్రమే పాల్గొనిరి. కాని నాడు వచ్చిన శ్రోతలలో పలువురికి కావ్యాభిరుచి, కవిత్వాసక్తి వున్నట్లు తెలిసి కొంటిమి. దానితో వుత్సాహముపొంది త్వరలోనే రెండవ కవి సమ్మేళనము నేర్పాటు చేసితిమి. ఈసారి 10 మంది కవులు పాల్గొనిరి, ఈ కృషికి ప్రోత్సాహకులగు మున్సిఫ్‌గారి పేర "బజ్మె-నిహాలె-సుఖన్" అను సంస్థ స్థాపించబడెను. నిహాల్ అనగా వృక్షము. నిహాలెసుఖన్ అనగా



www.etelangana.org

కల్పవృక్షము. మున్సిఫ్ గారి పేరుగూడ అదే అయినందున ఈ నామకరణము సముచితముగా కుదిరినది. ఆ సంస్థలో 20 మంది సభ్యులు చేరిరి.

ప్రతినెల మున్సిఫ్‌గారి ఇంటిలో 'కవితాసభ' జరుగుచుండెను. స్థానిక కవులే 20-30 మందివరకు పాల్గొనుచుండిరి. రానురాను ఈ సంస్థ పేరు పరిసర పట్టణములలో వ్యాపించెను. కర్నూలు, నంద్యాల అదవేని రాయచూరు, హైదరాబాదు, పాలమూరువంటి పట్టణముల నుండి కవిసమ్మేళనములలో పాల్గొని దొదగిరి, మాస సభలేగాక స్థానికముగా జరుగు ఉరుసు సమయములో వార్షికోత్సవ సభలు గూడ జరుగుచుండెను. ఆ మహాసభలకు శ్రీ అంజద్, వఫా, మహవీ, హాషిమీ, రాజా నరసింగరాజ బహాదూర్, బొఖారీ వంటి విద్వత్కవులు అధ్యక్షత వహించుచుండిరి. ఇందువలన ఈ సంస్థ దక్షిణ భారతమందేగాక ఉత్తర భారతమునగూడ ప్రఖ్యాతి గాంచెను. అప్పుడప్పుడు ఈ సంస్థపక్షమున కుల మత విచక్షణ లేకుండా అక్బర్ - ఇక్బాల్ - మహరాజ బహాదూర్ 'బర్క్' వంటి మహాకవుల స్మారక సభలు గూడ వైభవో పేతముగ జరుపబడుచుండెను. కొంతకాలమునకు సంస్థకు అధ్యక్షులుగా వుండిన మున్సిఫ్ నిహాలె అహమద్ గారు బదిలీ అయి వెళ్ళిపోయిరి. ఆ స్థానమున నవాబు బద్రుద్దీన్ అలీఖాన్‌గారు వచ్చిరి. అప్పుడే సాహిత్యప్రియులు శ్రీ కొండపల్లి వాసుదేవరావుగారు అలంపూరికి తహసీల్దారుగా వచ్చిరి. వీరు ఉరుదూ... తెలుగు భాషలలో ప్రవీణులుగా వున్నందున ఈ సంస్థ అభివృద్ధికి తోడ్పడిరి. మున్సిఫుగారు అధ్యక్షులుగా, శ్రీ వాసుదేవరావుగారు ఉపాధ్యక్షులుగా ఎన్నుకోబడిరి. ఈ సమయమున ప్రాంతీయభాష అగు తెలుగునకు గూడ ప్రోత్సాహ మొసగవలెనని నిర్ణయింపబడెను. ఉరుదులో సమస్య ఇచ్చినట్లే తెలుగులోగూడ సమస్య ఈయబడుచుండెను. తెలుగు కవులుగా స్థానికులైన శ్రీ గన్నమరాజు రామేశ్వరరావు, శ్రీ అకుమళ్ళ మల్లికార్జునశర్మ, శ్రీ గడియారం రామకృష్ణశర్మ గారలు పాల్గొనుచుండిరి. దూరప్రాంతాలనుండి గూడ తెలుగు కవులు సమస్యాపూరణలు చేసి సభలో చదువుటకై పంపుచుండిరి. ఈ సంస్థ నిర్విఘ్నముగా ఒక దశాబ్దకాలము ఉరుదూ సాహిత్య సేవ కొనసాగించినది. ఎందరో కవులుదయించిరి. 1947 లో భారతదేశము స్వతంత్రమయ్యెను, హైదరాబాదు రాజ్యములో ప్రజలు స్వాతంత్ర్య సంగ్రామము సాగించుచుండిరి. ఈ సంస్థతో సన్నిహిత సంబంధముగల కొందరు స్వాతంత్ర్యోద్యమమునకు విరుద్ధముగా రజాకార్ ఉద్యమములో చేరి తీవ్రచర్యలు సాగించిరి. అందువలన సంస్థ కార్యకలాపాలు స్తంభించిపోయినవి. సాహిత్యాభిమానులగు అధికారులు పోయి మత దురహంకారులు వచ్చిరి. కేవలం భాషాసేవకులు ఊరు విడిచి తమ అనుకూల స్థలములు చేరుకొనిరి. ఈ విధముగా సంస్థ కొంతకాలము స్తబ్ధత వహించెను.

పరిస్థితులు అనుకూలించినందున 1967 నుండి స్థానికయువకులగు శ్రీ అంజద్‌పాషా, బి.ఏ., ఎల్.ఎల్.బి. వంటి వారి ప్రోత్సాహముతో మరల నిహాలె సుఖన్ సంస్థ తలయెత్తినది. ఉరుసు సమయములలో వార్షిక మహాసభలు జరుపబడుచున్నవి. చెదరిపోయిన పాతసభ్యులు మరల వచ్చి పాల్గొనుచుండుట సంతోషదాయకము.

ఈ సంస్థ కృషివలన ఉత్తేజితులై సాహిత్యసేవ చేసిన, చేయుచున్న స్థానిక ఉర్దూకవులను వారి లేఖినీ నామములతో పరిచయము చేయుచున్నాను.

**(1) ఆజాద్**

పూర్తిపేరు శ్రీ మహమద్ హుసేన్ ఫారూఖీ. జన్మస్థలము మానవపాడు. న్యాయశాస్త్రము నభ్యసించి అప్పుడు అలంపూరులో వకాలతు చేయుచుండిరి. ఉరుదూ - ఫార్సీ - తెలుగు భాషలలో ప్రవేశముకలదు. పోలీసుచర్య తరువాత హైదరాబాదు చేరి ఎల్.ఎల్.బి పాసై హైకోర్టులో న్యాయవాదిగా



ఉన్నారు. మంచిపక్త. చక్కగా రచన చేయగలరు. వీరి కవితలలో నీతి - సామరస్య భావము లెక్కువ. రచనలు గ్రంథరూపమున వెలువడలేదు.

**(2) అత్‌హర్**

పేరు శ్రీ అబ్దుల్ అజీజ్, జన్మస్థలము అలంపూరు. మెట్రిక్ పాసై మున్సిఫుకోర్టులో నాజరుగా ఉండిరి. ఈ సంస్థ సభలలో పాల్గొని ఉత్తేజితులై మధుర కవిత్వము వ్రాయుచుండిరి. ఈ సంస్థతో బాటు ఆయన రచనా వ్యాసంగము గూడ ఆగిపోయినది. ప్రస్తుతము ఎటనున్నది తెలియదు.

**(3) బషీర్**

పూర్తి పేరు శ్రీ బషీరుద్దీన్ అహమద్. సయ్యదు ఇంటి తనమునకు చెందినవారు. మెట్రిక్ పరీక్షలో నెగ్గి రెవిన్యూశాఖలో ప్రవేశించి పలుపదవులు అనుభవించి ప్రస్తుతము తహసీల్దారుగా ఉన్నారు. ఉత్తమ సాహిత్యాభిరుచి గలవాడు. రమణీయశబ్దములతో రచనలు చేయుదురు, దైవదత్తమగు శ్రావ్యకంఠమున్నందున మనోహరముగ కవితాగానముచేసి శ్రోతల నుర్రూతలూగించెదరు. వీరి కవితలు భాషాసౌందర్యముతో, ప్రేమపూరిత భావములతో నుండును.

**(4) జర్**

పేరుశ్రీ అబ్దుల్ ఖాలిక్. జన్మస్థలము అలంపూరు. ప్రాథమిక విద్య పూర్తి చేసి మున్సిఫుకోర్టులో కాపీరైటర్‌గా ఉండిరి. స్వయంకృషిచే సాహిత్యములో ప్రవేశము కలిగించుకొనిరి. వీరికి చిన్న కథలు వ్రాయుటలో ఆసక్తి, కవిత్వముపై అభిరుచి కలదు. కొన్ని పత్రికలలో వీరి రచనలు ప్రకటింపబడినవి. కొంతకాలము పోలీసుశాఖలో ఉద్యోగము చేసి నివృత్తులైనారు. వీరి కవిత్వమున మహమ్మదు ప్రవక్తస్తుతి - మత విషయిక భావములు ఎక్కువగా ఉండును. తెలుగులో కొంత ప్రవేశము కలదు. వీరు ఉరుదూలో 'అలంపూరు చరిత్ర' 'అలంపూరు మొహరము' అను గ్రంథాలు వ్రాసినారు. త్వరలో వీరి కవితా సంపుటి అచ్చుకానున్నది.

**(5) సిరాజ్**

పేరు సిరాజుద్దీన్‌ఖాన్ ఖలీల్. ప్రాచీన పద్ధతిలో ఫార్సీ, ఉర్దూ సాహిత్యములు చదివినారు. ప్రాచీన కవుల పద్యములెన్నో కంఠస్థములై యుండెను. వీరి కవిత్వమున నీతిభావము లెక్కువ. ప్రసంగించు నేర్పు ఉండినందున అధికారులను త్వరగా ఆకర్షించుచుండిరి. 15 సంవత్సరముల క్రింద తమ 80 సంవత్సరాల వయసులో మరణించినారు.

**(6) షేఖ్ అలి**

వీరు లేఖనీనామము పెట్టుకోలేదు. మాధ్యమిక పాఠశాలా విద్యను పూర్తిచేసి మున్సిఫుకోర్టులో ఉద్యోగిగా ఉండిరి. రాష్ట్ర విభజన సందర్భములో రాయచూరికి వెళ్లిరి. ప్రస్తుతము నివృత్తులైనారు. శృంగారభావ కవిత్వము వ్రాయుచుందురు. సాహిత్యాభిరుచి ఉండినందున కవి సమ్మేళనములలో పాల్గొనుచుందురు.

**(7) ఆశి**

పేరు శ్రీ అబ్దుల్లాషా, జన్మస్థలము అలంపూరు. వీరి తండ్రి సయ్యద్ జహరుద్దీన్ సాహెబ్. ఫార్సీ, అరబ్బీ భాషలలో విద్వాంసులు, తండ్రికడ విద్యాభ్యాసము చేసినారు. అలంపూరు ప్రాథమిక పాఠశాలలో ఉపాధ్యాయులుగా పనిచేసిరి. సరళమైన శైలిలో నీతి, సూఫీ మత భావములతో కవితలు అల్లినారు. 1967లో చనిపోయిరి.



www.etelangana.org

**(8) అజీమ్**

పేరు శ్రీ అబ్దుల్ అజీమ్. జన్మస్థానము అలంపూరు. సంపన్నకుటుంబమున పుట్టినారు. భూస్వాములు, మాధ్యమిక పాఠశాలా విద్య పూర్తిచేసి ప్రత్యేక శ్రద్ధతో చిత్రలేఖన పరీక్ష నెగ్గినారు. అలంపూరు మాధ్యమిక పాఠశాలలో డ్రాయింగు టీచరుగా ఉండిరి. చిన్నకథలు, వ్యాసములు, ఖండకావ్యాలు వ్రాసినారు. వీరి కవితలలో ప్రేమభావము లెక్కువ. భాష సరళము, వీరి కవితాగురువు "జబ్బ్". సరళ స్వభావులైనను దౌర్భాగ్యవశమున రజాకార్ వుద్యమములో చేరి ప్రముఖపాత్ర వహించిరి. పోలీసు చర్య తరువాత పాకిస్తానుకు ప్రవాసము పోయినారు.

**(9) ఫాష్**

పూర్తి పేరు శ్రీ వి. నారాయణరావుగారు. జన్మస్థలము అలంపూరు. న్యాయశాస్త్రము చదివి పట్టా పుచ్చుకొని న్యాయవాదులుగా పనిచేయుచున్నారు. ప్రస్తుతము అడ్వొకేటు అయినారు. జబ్బ్ సాహచర్యమువలన పుర్దూభాషా పరిచయము, సాహిత్యాభిరుచి, కవితా వ్యాసంగము కలిగినవి. వీరు ఎన్నో కవితా ఖండికలను వ్రాసిరి.

**(10) మిర్జా**

పేరు శ్రీ హసన్‌బేగ్ సాహెబ్. జన్మస్థానము అలంపూరు. వీరి తండ్రిగారు ఉర్దూ, ఫారసీలలో విద్వాంసులు తండ్రికడ విద్యాభ్యాసముచేసి మాధ్యమిక విద్యను పూర్తిచేసిరి. అలంపూరు మాధ్యమిక పాఠశాలలో ఉపాధ్యాయులుగా ఉండిరి. వీరికి కవిత్వాసక్తి అనువంశికముగా వచ్చినది. మొదటి కవితాగురువు జబ్బ్. తరువాత సీమాబ్‌గారు. వీరి రచనాశైలి మృదుమధురమైనది. ఉపమాద్యలంకారములు, ఉదాత్త భావములు వీరి కవితలలో వెల్లివిరియుచుండును. పండిత పామర రంజకముగా వ్రాయుగల నైపుణ్యము కలదు. ఉర్దూ ఛందస్సులో ఒక రుబాయి తప్ప అన్ని విధములైన ఛందఃప్రక్రియలను సాధించి రచనలు చేసినారు. వీరి 100 కవితల సంపుటిని ఈ సంస్థయే ప్రకటించినది. 1967లో 'రాహత్-ఎ-జరాహత్' అను వీరికవితా సంకలనము ముద్రించబడినది. ప్రస్తుతము హైదరాబాదులో నివసించుచున్నారు.

**(11) నిజాము**

పేరు శ్రీ యం. శ్రీనివాసాచార్యులు. జన్మస్థానము అలంపూరు. సంస్కృతము, ఉర్దూ చదివినారు. వైదిక విద్యలో నిపుణులు. న్యాయశాస్త్రము నభ్యసించిరి. పరీక్షలో నెగ్గలేదు. వీరికి ధారణాశక్తి, ధారాళముగా ప్రసంగించు నేర్పుకలదు. ఇతరుల రచనలెన్నో కంఠస్థములై యుండెను. 'జబ్బ్' శిష్యులలో ముఖ్యుడు. చమత్కార ప్రసంగములచే, చాటు పద్యములచే శ్రోతల నానందపరచుటలో దిట్టలు, అదవేనిలో జరిగిన కవి సమ్మేళనమున సన్మానింపబడినారు. వీరి కవితా సంపుటిని సంస్థ పక్షమున ప్రకటింప నుద్దేశించినారు. వీరి రచనాశైలి మధురము. కవిత్వమున హాస్యరసము, నైతిక భావములు చూపుచుండును. తమ ర్గవ యేట స్వర్గస్థులైరి.

**(12) వెంకటరంగాచార్యులు**

వీరికి లేఖినీ నామము లేదు, జన్మస్థానము ఆత్మకూరు సంస్థానములోని అమ్మాపురము. కాని అలంపూరు మాధ్యమిక పాఠశాలలో జీవితాంతము ఉపాధ్యాయులుగా ఉండిరి. ఉరుదూ కన్నడము తెలుగు భాషలలో ప్రవేశము కలదు. ఈ సంస్థ వలన ఉత్తేజితులై కవితా వ్యాసంగమున ఆసక్తి పూనిరి. 'జబ్బ్' సహకారమువలన కవితారచన మొదలు పెట్టిరి. వీరి కవిత్వమున నీతి, తాత్త్విక



భావములు విశేషముగ ఉండును. వీరి రచనావైశిష్ట్యము ప్రత్యేకముగ పేర్కొనదగినది. ఉరుదూ కవిత్వమున అంత్య ప్రాస నియమముండును. ఆ ప్రాస చరణ చరణనకు మారుచుండుట సామాన్యము. వీరు ఆ విధముగా మార్చక పద్య మంతయు ఒకే ప్రాసతో నిర్వహించెడివారు. అది కష్టము. వీరి కవితా సంపుటిని ఈ సంస్థ ప్రకటింపనెంచినది. 1842లో స్వర్గస్థులైనారు.

**(13) మక్‌బూల్**

పూర్తి పేరు సయ్యద్ ఇమాదుద్దీన్ సాహెబ్. జన్మస్థలము హైదరాబాదు. ఫార్సీభాషలో మున్షీపరీక్ష ఇచ్చి న్యాయశాస్త్రపట్టము తీసికొనిరి. ఉరుదూ, సాహిత్యములో చాలకృషి చేసినారు. సాహిత్యాభిరుచి ఎక్కువగా ఉండెను. అలంపూరులో మున్సిఫుకోర్టు ఏర్పడినప్పటినుండియు ఇచటికి వచ్చి న్యాయవాదిగా ఉండిరి. అనేక ముస్లిం మతసంస్థలకు అధ్యక్షులుగా వుండిరి. మృదుభాషి, మంచివక్త. ఈ సంస్థకు కొంతకాలము కార్యదర్శిగా వుండిరి. దౌర్భాగ్యవశమున 'అంజుమనె – ఇత్తెహాదుల్ ముసల్మాన్' సంస్థకు అధ్యక్షులై అలంపూరులో రజాకార్ ఉద్యమమునకు నాయకత్వము వహించిరి. పోలీసుచర్య తర్వాత ప్రజావిశ్వాసము కోలుపోయి హైదరాబాదు చేరికొని అచట మరణించిరి. వీరి రచనలేవియు ముద్రింపబడలేదు.

ఈ విధముగా 'నిహాలెసుఖన్' సంస్థ అలంపూరులో క్రమాభివృద్ధిని పొంది పలువురు కవి కుమారుల నుత్తేజితమొనర్చి ఉర్దూ భాషాసేవ చేసి చేయుచున్నది.

– అలంపూరు సంచిక నుంచి

# సై దోడు!

● ఎం.డి. మహమద్‌అలీ

తోలుగోసి నోళ్ళంతా నవాబులె!
నిజాంని నిల్దీసిన సాయిబెవడు?
పటేలు పట్వారీలపై
పళ్ళుగొరికి తొడగొట్టిన తురకెవడు?
ఆకలికి చిరునామాలు
అప్యాయతకి ఫర్మానా వాళ్ళు
గడీలు దాటి పైరగాలి సైదోడై
అద్దిన అత్తర్ను ఆస్వాదించి నోళ్ళు
పారేసిన 'పలావు' ఘుమఘుమల్ని
మనసారా ఆఘ్రాణించి
పొట్టనింపుకునే స్వాంతనులు వాళ్ళు.
చినిగిన అతుకుల బురకాల మాటున
చివికి చిలుం పట్టిన గుమ్మాలకు
సోకులద్దిన దాపరికం వార్ధి.

బతుకులో మెతుకులో సగాన్ని
దూరతీరాల కంపి
ఎదుర్చూపుల అగరు వెలిగించి
నిశిలో నేల రాలిన కలల మసిలో
చూపుడు వేలుతో తొలిపొద్దు
నసీబు రాస్తూ
పిల్లలకు – ముసలి తల్లులకు
ఆశలు సీతాకోక రంగుల్ని సృజిస్తూ
సుదూర ఎడబాట్ను క్షణాల్లోకి ఏమారుస్తూ
బతుకు బండి ఈడుస్తున్న
తెలంగాణా ఫాతిమా బీలకి
ఈ సీమాంధ్ర కవిత బరోసా!
యం.డి. మహమ్మదాలి. ■



www.etelangana.org

# తెలంగాణ బిడ్డ

● మహమ్మద్ బషీరుద్దీన్

'ఆత్మహత్య వద్దు తెలంగాణ బిడ్డ
పోరాడి సాధించు తెలంగాణ బిడ్డ' ॥ఆత్మ॥

హన్మకొండ, గోలకొండ
నల్లగొండ, దేవరకొండ
తెలుగు తల్లిది తెలంగాణ బిడ్డ
రాజులు ఏలిన ఈ గడ్డ బిడ్డ ॥ఆత్మ॥

సావు ముఖ్యము కాదు బతికే సాధించు
వాదించి వాదించి తెలంగాణ సాధించు
ఆంధ్ర రాష్ట్రము పగులగొట్టుకొని
తల్లిదండ్రుల గుండెలు పగుల గొట్టవద్దు॥ఆత్మ॥
లక్షలు పెడుతుండ్రు నీ సదువు కోసం
సదువుతు పోరాడు తెలంగాణ కోసం
వద్దుబిడ్డ నీకు ఇంత పౌరుషం
తెలంగాణనే సాధించు ముఖ్యం ॥ఆత్మ॥

సదివి నీవు పేరు నిలబెట్టు బిడ్డ
వస్తుంది వస్తుంది తెలంగాణ బిడ్డ
నీ చేతికి వస్తుంది అధికారం బిడ్డ
తొలగిపోతుంది అంధకారం బిడ్డ ॥ఆత్మ॥

నాలుగు కోట్ల జనంతో ఉద్యమం సాధించు
నాలుగు కోట్ల జనము నీ ఎంట వస్తుంది
అందరి గుండెల్లో తెలంగాణ వచ్చింది
ఆంధ్ర ఓడింది తెలంగాణ గెలిచింది ॥ఆత్మ॥

నల్లగొండ, మెదక్, మహబూబ్‌నగరము
ఖమ్మం, ఓరుగల్లు, నైజాం, కరీంనగరము
నీ చేతికే వస్తుంది ఆదిలాబాదు
నీ చేతికే వస్తుంది హైద్రాబాదు ॥ఆత్మ॥
అన్నతమ్ములకు అక్కచెల్లెళ్ళకు
బంధుమిత్రులకు దు:ఖము పెట్టకు
ప్రాణంతోను చెలగాటం ఆడకు
తల్లిదండ్రులకు అనాధలు చేయకు ॥ఆత్మ॥

గొప్ప సదువుతో ముందుకు సాగు
పోరాడి పోరాడి ముందుకు సాగు
సదువులోనే ఉన్నది గొప్పతనము
అప్పుడే వస్తుంది నీ ఎంట జనము ॥ఆత్మ॥

గుండెధైర్యంతో తెలంగాణ సాధించు
సైనికుల్లా పోరాడి తెలంగాణ సాధించు
దేశ చరిత్రలో నీ పేరు సాధించు
ఆత్మహత్య వద్దు జీవించి సాధించు ॥ఆత్మ॥

కృష్ణా, మానేరు, గోదావరి, మూసి
నదులెన్నో ఉన్నా లాభము లేదాయే
వానలు లేవాయే పంటలు లేవాయే
ఎంత సదివినా ఉద్యోగం లేదాయే.... ॥ఆత్మ॥

తెలుగు తల్లిగడ్డ తెలంగాణ బిడ్డ
ప్రాణం ఉన్నదాక పోరాడు బిడ్డ
ఆత్మహత్య వద్దు తెలంగాణ బిడ్డ
జై తెలంగాణ జైజై తెలంగాణ ॥ఆత్మ॥

■



# ముస్లిం ఐడెంటిటీ - అభ్యుదయ రాజకీయాలు

● కె. బాలగోపాల్

ముస్లింలు తమను తాము ముస్లింలుగా భావించుకునే రాజకీయ స్పందనకు భారతదేశంలో తావు వుందా? భావించుకోవడం జరుగుతున్నది, భావించుకొని స్పందించడమూ జరుగుతున్నది. ముఖ్యంగా, బాబ్రీమసీదు కూల్చివేత తరువాత. దానిని ఏవిధంగా స్వీకరించాలన్నదే సమస్య. దానిని అభ్యుదయవాదులు అర్థవంతమైన రాజకీయ భావనగా స్వీకరించాలా (విమర్శనాత్మకంగానైనా సరే) లేక వాస్తవిక పునాది లేని తప్పుడు అవగాహన అని తిరస్కరించాలా లేక మతోన్మాదానికి బీజం వేయగల పెడదృష్టి అని నిందించాలా?

ఒక మైనారిటీగా ముస్లింలు ఎదుర్కొంటున్న వివక్షనూ సాంస్కృతిక అణచివేతనూ భౌతిక దాడులనూ అర్థం చేసుకోలేని అభ్యుదయ వాదులెవరూ ఉండరు. దానినుండి పుట్టే నిరసనను అందరూ తప్పక ఆహ్వానిస్తారు. అంతవరకు అభిప్రాయ భేదాలుండవు. కానీ ఈ నిరసన ఒక నెగెటివ్ భావన మాత్రమే. అది ఇచ్చే 'ఐడెంటిటీ' ఒక నెగెటివ్ భావన మాత్రమే. 'మేము వివక్షకు గురి అవుతున్న మైనారిటీ' అనే భావన మాత్రమే. 'మేము' అనే సంపూర్ణమైన భావన కాదు. మరి ఆ సంపూర్ణ భావనకు ఏ విధంగా స్పందించాలి? అది ఉనికిలో ఉంది. కేవలం మైనారిటీ భావనకు దానిని పరిమితం కమ్మంటే అది కాదు. మరయితే ఏం చేయాలి? ముస్లింలు ముస్లింలుగా స్పందించే రాజకీయ చైతన్యాన్ని అభ్యుదయ వాదులు ఆమోదించడం, ఆహ్వానించడం, సాధ్యమా అసాధ్యమా? అది మతోన్మాద రూపం తీసుకుంటే అసాధ్యమే. సంప్రదాయాన్ని చెక్కు చెదరకుండా కాపాడాలని భావించే ఛాందసవాద రూపం తీసుకుంటేనూ అసాధ్యమే. కానీ మతోన్మాదాన్ని తిరస్కరిస్తూ, సంస్కరణలను ఆహ్వానిస్తూ అదే సమయంలో 'ముస్లిం రాజకీయం'గానే ఉండేది ఆహ్వానించదగినదేనా? మతాతీతమైనది మాత్రమే ఆమోదనీయమా?

ఈ ప్రశ్నకు జవాబు చెప్పేముందు 'ఐడెంటిటీ' అనే దానికి మానవ అస్తిత్వంలో ఉండే పాత్రను గుర్తించడం అవసరం. ఐడెంటిటీని ఎవరో తెలుగులో 'గుర్తింపు' అని అనువాదం చేసారు. అది అసంతృప్తికరమైన అనువాదం. కానీ ఇప్పుడు 'గుర్తింపు రాజకీయాలు' అనే ప్రయోగం కూడా



www.etelangana.org

అలవాటయిపోయింది. కులం, మతం, భాష, జాతి ప్రాంతం, లింగం మొదలయిన సాంఘిక వర్గీకరణల ప్రాతిపదికన జరిగే రాజకీయ కృషిని ఈ పేరుతో పిలుస్తున్నారు. మనుషులను అమూర్తమైన 'పౌరులు'గా భావించే లిబరల్ బూర్జువా రాజకీయ దృక్పథానికీ మనుషులను వర్గాలుగా విభజించే మార్క్సిస్ట్ రాజకీయ దృక్పథానికీ ఈ 'గుర్తింపు రాజకీయం' భిన్నమైనదని చెప్పడం ఇక్కడ ఉద్దేశ్యం. పై రెండు దృక్పథాలలోనూ మనుషులు ('పౌరులుగా'నయినా 'వర్గం'గా నయినా) తమ అవసరాల ప్రాతిపదికన హేతుబద్ధమైన వివేచనతో ప్రవర్తిస్తారనీ, గుర్తింపు రాజకీయాలు అందుకు భిన్నమైనవనీ ఇక్కడ అర్థం. ఇది సరయిన విశ్లేషణేనా అన్న ప్రశ్న అటుంచి, 'గుర్తింపు రాజకీయాలు' అన్న పేరులో ఈ భావం స్ఫురించదు.

కానీ ముందు మానవ అస్తిత్వంలో ఈ 'ఐడెంటిటీ' అనే దానికి ఉండే స్థానాన్ని పరిశీలిద్దాం. ఏ విషయాన్ని గురించి ఆలోచించేటప్పుడయినా దాని సామాజిక పార్శ్వాన్ని – సామాజిక ఆర్థిక పునాదిని లేక ప్రాతిపదికన లేక ప్రాముఖ్యాన్ని – అర్థం చేసుకోవడం రాడికల్ రాజకీయ సిద్ధాంతాలు నేర్పాయి. కానీ దానితోపాటు ఆ విషయానికుండే మానవ పార్శ్వాన్ని – మనిషి ఉనికిలో దానికుండే పాత్రనూ ప్రాముఖ్యాన్నీ – కూడా అర్థం చేసుకోవడం అవసరం. అప్పుడే మన అవగాహన సంపూర్ణం అవుతుంది. 'ఐడెంటిటీల' సాంఘిక ఆర్థిక పార్శ్వాన్ని (కులం, మతం, వర్గం, లింగం, ప్రాంతం, భాష వగైరాల ప్రాతిపదికన ఏర్పడే 'నేను' 'మేము' అనే భావనలను) రాజకీయంగా అర్థం చేసుకోవడం, విమర్శించడం నేర్చుకుంటున్నాం. రాజకీయ ఐడెంటిటీలను శాస్త్రీయం, వాస్తవికం, అశాస్త్రీయం, భ్రమాజనితం, తప్పుడు చైతన్యం అని వర్గీకరిస్తున్నాం. ఆ పని చేసే ముందు ఐడెంటిటీల మానవ మూలాలలోకి పోవడం. మనిషికి సంబంధించినంత వరకు అన్ని విషయాల మూలం మనిషేనని మార్క్స్ తన తొట్టతొలి రచనలలో ఒకచోట అంటాడు. విలువైన ఈ సూచనను ఆ తరువాతి కాలంలో ఆయనే ఎల్లప్పుడూ జ్ఞాపకం పెట్టుకోలేదు. కానీ దానిని జ్ఞాపకం పెట్టుకోవడం అవసరం.

ఐడెంటిటీల మానవ మూలాలలోకి పోవడం. మనిషికి సంబంధించినంత వరకు అన్ని విషయాల మూలం మనిషేనని మార్క్స్ తన తొట్టతొలి రచనలలో ఒకచోట అంటాడు.

ఇతర జంతువులకూ మనిషికీ ఉండే ఒక ముఖ్యమైన తేడా ఏమిటంటే ఇతర జంతువుల వ్యక్తిత్వం చాలావరకు పుట్టుకతోనే నిర్ణయించబడుతుంది. దాని 'జీన్స్' చేత నిర్ణయింపబడుతుంది. మనిషి అట్లా కాదు. మనిషిలో పుట్టుకతో – అంటే జీన్స్ ద్వారా – నిర్ణయించబడే అంశం కొంచెమే. ఆపైన ఆ క్రమంలో పరిసరాల చేత తాను రూపొందించబడడం జరుగుతుంది. ఈ విధంగా ఎదిగే క్రమంలో మనిషి వ్యక్తిత్వం ఏర్పడుతుంది. ప్రవర్తనను నిర్ణయించడంలో ఇతర జంతువులలో 'జీన్స్' నిర్వహించే పాత్రను మనిషిలో వ్యక్తిత్వం నిర్వహిస్తుంది.

ఈ వ్యక్తిత్వానికి కేంద్రం 'నేను' అనే వ్యక్తి భావన (ఇంగ్లీషులో సెల్ఫ్ లేక ఐడెంటిటీ). ప్రతి మనిషిలోనూ వ్యక్తావ్యక్తమైన ఐడెంటిటీ ఉంటుంది. దీనిలో కొన్ని పూర్తిగా వ్యక్తిగతమైన భావనలుంటాయి. 'నేను క్రమశిక్షణ గల మనిషిని' 'నాది దయార్ద్ర హృదయం' మొదలైన భావనలు. కాని అవేకాక, వివిధ సాంఘిక సమూహాలలో భాగంగా తనను తాను గుర్తించడం కూడా 'నేను' అనే ఐడెంటిటీ ఏర్పడే క్రమంలో భాగమే.

ప్రపంచాన్ని నా వాళ్లు – పరాయివాళ్లు అని విభజించుకొని తనవారిగా తాను భావించి వారితో మమేకం కావడం మనిషికి ఉన్న అత్యంత స్వాభావికమైన లక్షణాలలో ఒకటి. ఐడెంటిటీ అనే వ్యక్తి



భావన ఏర్పడే క్రమంలో దీనికి ముఖ్యస్థానం ఉంటుంది. మనుషులకు ఒకేసారి పలు సాంఘిక ఐడెంటిటీలు ఉండగలవు. ప్రాంతం, భాష, కులం, మతం మొదలయినవే అయినా దీనికి ప్రాతిపదిక కాగలవు. ఇవికాక పైన చెప్పినట్టు, వ్యక్తిగతమైన ఐడెంటిటీ భావనలు కూడా ఉంటాయి. వీటన్నిటి సమాహారమే 'పోస్టుమోడరన్' దృక్పథంతో ఏకీభవించనవసరం లేదు. అయితే అందులో వివిధ అంశాలుంటాయనేది కార్మికునిగా, ముస్లింల మధ్య ముస్లింగా, మగవాళ్ళ మధ్య మగవాడిగా ఉండటం సాధ్యమే. అన్ని సందర్భాలలోనూ ఏదో ఒక అంశమే ప్రబలంగా ఉండేవాళ్ళు కొద్దిమందే ఉంటారు. అయినప్పటికీ 'నేను' అనే వ్యక్తి భావన నిర్దిష్టతలేని అస్థిర భావన కానవసరం లేదు. వైవిధ్యంలోనే దానికి (సాపేక్ష) స్థిరత్వం ఉండగలదు. ఉంటుంది.

ఇదంతా మనిషికి స్వాభావికం అంటే అర్థం విమర్శకు అతీతం అని కాదు. మనిషికి ఉండే వ్యక్తి భావనలో ఆధిపత్య స్వభావం కలిగినవి కొన్ని ఉంటాయి. వాటిని అభ్యుదయవాదులు విమర్శించడమే కాక తిరస్కరించాలి కూడా ఉదాహరణకు తానొక ఆధిపత్య వర్గానికి లేక కులానికి చెందిన వ్యక్తినన్న భావన. లేదా 'నేను అందరినీ దాసోహం చేసుకోగలను' అనే వ్యక్తిగత ఆధిపత్యభావన. కానీ ఆధిపత్యస్వభావం నుండి పుట్టినవి కాని 'ఐడెంటిటీల' పట్ల ఏ వైఖరి ఉండాలి? అవన్నీ అణచివేత నుండి పుట్టినవే కానవసరం లేదు. ఒకవేళ అయినా అన్ని అణచివేత రూపాల స్వభావము ఒకటి కాదు. ఈ (సాంఘిక) ఐడెంటిటీలు రాజకీయ ఆచరణకూ సాంఘిక సమీకరణకూ ప్రాతిపదిక కాగలవు. వాటిపట్ల ఏ వైఖరి ఉండడం ఉచితంగా ఉంటుంది?

ఇప్పటికీ మూడు వైఖరులు ఉనికిలో ఉన్నాయి. మరీ సంప్రదాయక మార్క్సిస్టులు 'వర్గం' ఒక్కటే శాస్త్రీయమైన వ్యక్తిభావన అనీ తక్కినవన్నీ తప్పుడు చైతన్యం నుండి పుట్టినవనీ, ప్రజలు వాటిని వదులుకొని వర్గచైతన్యం పొందాలనీ అంటుంటారు. ఐడెంటిటీని వ్యక్తిత్వం ఎదిగే క్రమంలో రూపొందే 'నేను' అనే స్వీయభావనకు సంబంధించిన విషయంగాకాక, కేవలం చైతన్యానికి (ఆలోచనలకూ అవగాహనకు) సంబంధించిన విషయంగా అర్థం చేసుకోవడం వల్లనే దానిని 'శాస్త్రీయం', 'అశాస్త్రీయం' అనీ 'సరయిన చైతన్యం', 'తప్పుడు చైతన్యం' అనీ వర్గీకరించడం, అశాస్త్రీయమైన తప్పుడు ఆలోచనలను వదులుకొమ్మనడం సాధ్యం అవుతున్నది. ఇక్కడ మళ్ళీ నా ఉద్దేశ్యం ఐడెంటిటీలు విమర్శకు అతీతం అనికాదు. కానీ అది పదార్థ జ్ఞానానికి సంబంధించిన తప్పొప్పుల విమర్శ కాజాలదు. ఆ ఐడెంటిటీలో వ్యక్తమయ్యే విలువలకు సంబంధించిన తప్పొప్పుల విమర్శ కాగలదు.

రెండవ వైఖరి ఏమటంటే, వర్గేతర పీడిత భావనలన్నీ వర్గ భావనలో భాగంకావాలి (లేక దానికి లోబడి ఉండాలి, లేక దానిలో మిళితం కావాలి) అని చెప్పడం. ఇది ఈ రోజు కమ్యూనిస్టులు ఎక్కువగా అనుసరిస్తున్న వైఖరి. కానీ స్వభావరీత్యా 'వర్గం' కంటే చాలా భిన్నమైన ఐడెంటిటీలు వర్గభావనలో 'భాగం' కావడం, లేదా దానికి లోబడి నడవడం, ఏ విధంగా సాధ్యం కాగలదు? తన నాయకత్వంలోనే అందరి సమస్యలూ పరిష్కారం అవుతాయనీ అన్ని న్యాయమైన ఆకాంక్షలు తీరుతాయనీ కార్మికవర్గం సకల పీడిత ప్రజా శ్రేణులను నమ్మించి వారి విశ్వాసం పొందాలని గ్రాంసీ అన్నాడు. ఆయన ప్రధానంగా రైతాంగాన్ని ఉద్దేశించి ఈ మాట అన్నాడు గానీ దాన్ని అన్ని రకాల పీడనలకూ అన్వయించుకోవచ్చును. వర్గేతర పీడిత భావనలను తప్పుడోవ పట్టి చైతన్యం అని తిరస్కరించే వైఖరి కంటే ఇది మెరుగయినదే. కానీ కార్మిక వర్గం ఇతర పీడిత ప్రజలలో ఈ విశ్వాసం కలిగించగలదని



www.etelangana.org

నమ్మడానికి హేతుబద్ధమైన కారణం ఏమైనా ఉందా? మెజారిటీగా మగవాళ్ళయిన పారిశ్రామిక కార్మిక వర్గం నాయకత్వంలో లైంగిక అణచివేత తొలగిపోతుందని స్త్రీలు ఎందుకు నమ్మాలి? నిజానికి పారిశ్రామిక కార్యవర్గం మెజారిటీగా మగవాళ్ళయి ఉండడానికి లైంగిక అణచివేత ఒక ముఖ్యకారణం. అటువంటప్పుడు, ఆ కారణంగా 'మగ' స్వభావం సంతరించుకున్న కార్మిక వర్గం నాయకత్వంలో స్త్రీల సమస్యలు పరిష్కారమవుతాయని స్త్రీలెందుకు నమ్మాలి? అటువంటి ప్రశ్నలే దళితులూ ఆదివాసీలూ కూడా కార్మిక వర్గం గురించి అడగవచ్చు.

పారిశ్రామిక కార్మికులు మెజారిటీగా మగవాళ్ళా, దళితేతరులా అన్న ప్రశ్న అటుంచి, అసలు స్వభావ రీత్యానే చాలా భిన్నమైన అసమానతలన్నీ ఏదో ఒక్క జీవిత అనుభవం నుండి పుట్టిన చైతన్యం ద్వారా, అది ముందుకు తెచ్చే ఆలోచనల ద్వారా, తొలగిపోగలవని నమ్మడానికి హేతుబద్ధమైన కారణం ఏముంది? కార్మిక వర్గానిది (తత్పూర్వకాలపు విప్లవ వర్గాల లాగా) ఒక ప్రత్యేకమైన లక్ష్యం కాదనీ దాని లక్ష్యమే సార్వజనీనమనీ మార్క్స్ భావించాడు. (ఒక్కొక్కసారి కార్మిక వర్గమే ఒక సార్వజనీన వర్గం – యూనివర్సల్ క్లాస్ – అంటాడు). కార్మిక వర్గం తాను ఎదుర్కొంటున్న శ్రమదోపిడీకి పరిష్కారంగా ముందుకు తెచ్చే వర్గరహిత ఉత్పత్తి వ్యవస్థలోనే అన్ని న్యాయమైన ఆకాంక్షలు సాధ్యమవుతాయని దీనిని వివరించు కోవచ్చు. కానీ వర్గరహిత ఉత్పత్తి వ్యవస్థ అభిలషనీయమని అంగీకరిస్తూ కూడా అది అన్ని సమస్యల పరిష్కారానికి పునాది అన్న భావనను ప్రశ్నించవచ్చు. ఆర్థికేతర అణచివేతలకు గురి అవుతున్నవారంతా దీనినే ప్రశిస్తున్నారు. బోల్షెవిక్ ఆచరణ పుణ్యాన కార్మిక వర్గం అన్న మాటకు అసలు అర్థం పోయి కమ్యూనిస్టు పార్టీయే కార్మికవర్గం అన్న అర్థం వచ్చిన తరువాత ఈ సంశయం మరింత బలపడింది. దానికి సంతృప్తికరమైన జవాబు ఇవ్వకుండా వర్గ ఐడెంటిటీలో ఇతర ఐడెంటిటీలు మిళితం కావాలనడంలో అర్థం లేదు.

అందరి శత్రువూ ఒకరు కాదు కదా? స్త్రీలనూ ఆదివాసీలను పారిశ్రామిక కార్మికులనూ 'ఒక్కటి' చేయగల ప్రాతిపదిక ఏముంటుంది?

ఇప్పుడివి రెండూ కాక మూడవ వైఖరి కూడా ముందుకొచ్చింది. ఐడెంటిటీల ప్రాధాన్యతల జోలికి పోకుండా, ఏదో ఒకటే అన్నింటికంటే శాస్త్రీయమైనది అనకుండా, సకల పీడిత ప్రజలు (దళితులు, కార్మికుల, స్త్రీలు, ఆదివాసీలు, మైనారిటీలు వగైరా) ఒక్కటై అందరికీ శత్రువైన 'వ్యవస్థ'ను కూలదోయాలనీ లేదా మార్చుకోవాలనీ ఈ వాదన పిలుపునిస్తుంది. ఇప్పుడు చాలామంది అభ్యుదయవాదులు (కొంతమంది మార్క్సిస్టులు కూడా) ఈ విధంగానే వాదిస్తు న్నారు. పీడిత ప్రజా పోరాటాల మధ్య పరస్పర సంఘీభావం, సహాయ సహకారాలు, సమన్వయం, ఎంత సాధ్యమైతే అంత పెంపొందించవలసిందేగానీ అన్నీ 'ఒక్కటి' ఎట్లా కాగలవు, అన్నీ 'ఒక్కటి' అయి ఎవరిపైన పోరాటం చేయగలవు? అందరి శత్రువూ ఒకరు కాదు కదా? స్త్రీలనూ ఆదివాసీలను పారిశ్రామిక కార్మికులనూ 'ఒక్కటి' చేయగల ప్రాతిపదిక ఏముంటుంది? అందరి ఆకాంక్షలలోనూ సమా నత్వం అనే విలువ ఉంటుంది కాబట్టి విలువల సారూప్యత ప్రాతిపదికన సంఘీభావం సాధ్యం అవుతుంది. కానీ తమ సమస్యలు వేరువేరయినప్పుడు, తాము పోరాడే శత్రువులు వేరువేరయినప్పుడు, ఈ ప్రజలంతా 'కలసి' ఎవరిపైన పోరాటం చేయగలరు? ఈ పోరాటాలకు నైతిక ఐక్యతే గానీ భౌతిక ఐక్యత సాధ్యం అవుతుందా?



ఎవరి సమస్యలేవయినా అన్నింటికీ మూలం రాజ్యంలో ఉంది కాబట్టి (లేదా అన్ని ఆధిపత్యాలకూ దన్ను రాజ్యం నుండి లభిస్తుంది కాబట్టి) అందరూ ఒక్కటై రాజ్యంపైన పోరాటం చేయాలని దీనికి సమాధానం చెప్తారు. కానీ నిజానికి రాజ్యంతో అన్ని పీడిత ప్రజాశ్రేణులకు ఒకే రకమైన శత్రుత్వం ఉండదు. రాజ్యంతో తలపడడం అన్ని పోరాటాలకూ ఒకే రకమైన అవసరం కాదు. ఒకే సందర్భంలో అవసరం కాదు. రాజ్యం సార్వభౌమత్వాన్ని సవాలు చేసే కమ్యూనిస్టు పోరాటాలతో మాత్రమే రాజ్యం ప్రత్యక్ష శత్రువు. కమ్యూనిస్టు పోరాటాల లక్ష్యం స్వంత ఆస్తిని రద్దు చేయడం. స్వంత ఆస్తిని కాపాడే చట్టాలు చేసే సార్వభౌమ అధికారం రాజ్యానికి ఉంది కాబట్టి ఆ సార్వభౌమత్వాన్ని స్వాధీనం చేసుకోనిదే స్వంత ఆస్తి రద్దు కాదని కమ్యూనిస్టులు భావిస్తారు. అందువల్ల తమ పోరాటాలను రాజ్యంపైనే ఎక్కుపెడతారు. (శాసనం ద్వారా స్వంత ఆస్తిని రద్దు చేయవచ్చుగాని స్వంత ఆస్తి లేని వ్యవస్థను శాసనం ద్వారా – అంటే సార్వభౌమ రాజ్యాధికారం ద్వారా – నిర్మించలేమని ఇప్పుడు అర్థం అవుతున్నది కాబట్టి కమ్యూనిస్టు పోరాటాలయినా రాజ్యాధికారానికి అంత కేంద్రస్థానం ఇవ్వడం సబబా అన్న ప్రశ్న ఇప్పుడు వచ్చింది). అది అట్లా వుంచి చట్టాలతో నిమిత్తం లేని సాంఘిక అణచివేత రూపాలకు వ్యతిరేకంగా సాగే పోరాటాలకు రాజ్యం సార్వభౌమత్వాన్ని నేరుగా ప్రశ్నించవలసిన అవసరం వుండకపోవచ్చు. అవి ఎదుర్కొనే శత్రువులు చట్టంతో (అంటే రాజ్యాధికారంతో) పుట్టినవీ చట్టంతో పోయేవీ కానప్పుడు ఆ పోరాటాలకు రాజ్యం కేంద్రబిందువు ఎందుకు కావాలి? పోరాట క్రమంలో, భద్రతను కాపాడే పేరుమీద రాజ్యం బలవంతుల పక్షాన రంగంలోకి దిగినప్పుడే రాజ్యంతో వారు తలపడవలసి వస్తుంది. అంతే తప్ప రాజ్యమే ప్రజల ప్రత్యక్ష శత్రువు కాదు.

అంతేకాదు, సాంఘిక అణచివేతను ఎదుర్కొనే ప్రజలు రాజ్యం నుండి సంస్కరణలు కోరుకుంటారు: అణచివేతను అదుపుచేసే చట్టాలు కోరుకుంటారు. అది పూర్తిగా అసాధ్యమైనప్పుడు మాత్రమే వారు రాజ్యం సాధికారతనూ సార్వభౌమత్వాన్నీ ప్రశ్నిస్తారు. అంతవరకు, రాజ్యం భద్రత పేరిట ఆధిపత్య శక్తులకు అండగా నిలబడి తమ ఆందోళనలను అణచివేసిన మేరకే వారు రాజ్యంతో నేరుగా తలపడతారు. ఆ అవసరం వాళ్ళకు అన్ని సందర్భాలలోనూ రాదు. ముస్లింలనే ఉదాహరణగా తీసుకుంటే, భారత రాజ్యం తన సెక్యులర్ స్వభావానికి కట్టుబడి వుండాలనేది రాజ్యంపైన వారు (ముస్లింలుగా) పెట్టే ప్రధాన డిమాండు. భారత రాజ్యం ఆ స్వభావాన్ని కోల్పోనంత మేరకే వారు రాజ్యంపైన పోరాటం చేయవలసి ఉంటుంది. అప్పుడు కూడా – రాజ్యం పూర్తిగా హైందవ రాజ్యంగా మారితే తప్ప – అదే వారి ప్రధాన పోరాటం కాదు. స్థూలంగా చెప్పాలంటే, రాజ్యం ప్రజాస్వామ్య నియమాలన్నింటినీ తిరస్కరించి ఫాసిస్టు రాజ్యంగా మారినప్పుడు మాత్రమే (లేదా మారిన మేరకు మాత్రమే) అన్ని ప్రజాపోరాటాలకూ రాజ్యంతో తలపడవలసిన అవసరం ఉంటుంది. ఎందుకంటే ఏ పోరాటానికయినా ప్రజాస్వామ్య అవకాశాలు అవసరం కాబట్టి. అయితే అప్పుడు కూడా అందరికీ రాజ్యం సార్వభౌమత్వాన్ని సవాలు చేయవలసిన అవసరం ఉండకపోవచ్చు. దానిని ప్రజాస్వామ్యీకరించడం కోసం పోరాడడంతో సరిపెట్టుకునే ప్రజాశ్రేణులుంటాయి.

కాబట్టి పీడిత ప్రజలంతా భౌతికంగా ఒకటై ఒక ప్రచండ శక్తిగా మారి 'వ్యవస్థ'ను కూలదోయాలి అనే ఆలోచనకు పెద్దగా అర్థం లేదు. ఆధిపత్య శక్తులకు వ్యతిరేకంగా జరిగే పోరాటాల మధ్య ఎంత ఐక్యత ఉంటే అంత మంచిదిగానీ అది అరుదుగా మాత్రమే భౌతిక ఐక్యత కాగలదు. కావడానికి అందరి అవసరాలూ ఆకాంక్షలూ ప్రయోజనాలూ కోరికలూ ఒకటి కావు. వాటిమధ్య అంతస్సంబంధం



www.etelangana.org

ఎంతో కొంత ఉంటుంది కాబట్టి ఆ మేరకు భౌతిక ఐక్యత సాధ్యం కావచ్చు. రాజ్యం నియంతృత్వ రూపం తీసుకుని ప్రజాస్వామ్య అవకాశాలను ధ్వంసం చేసినప్పుడు కూడా భౌతిక ఐక్యత (ప్రజాస్వామ్య పునరుద్ధరణ లేక సాధన కోసం) సాధ్యం అవుతుంది. కానీ సాధారణ పరిస్థితులలో ఉద్యమాల మధ్య ఐక్యత నైతిక సంఘీభావంగానే ఉండగలదు, ఐక్య భౌతిక శక్తిగా కాదు. నైతిక సంఘీభావంగా దానిని అర్థం చేసుకొని పెంపొందించినప్పుడే అత్యవసర పరిస్థితులలోనయినా అది భౌతిక ఐక్యత రూపం తీసుకోగలదు.

నైతిక ఐక్యతకు – సంఘీభావానికి – తావు ఎక్కడినుండి వస్తుంది? అది కేవలం అభ్యుదయవాదుల కోరిక మాత్రమేనా? ఎంత గొప్ప కోరిక అయినా దానికి వాస్తవ ప్రాతిపదిక ఉందనుకుంటున్నాను. మనుషుల ప్రయోజనాలన్నీ పాక్షికమైనవే గానీ వాటిని వ్యక్తం చేసే విలువలెప్పుడూ సార్వజనీనమైనవి (అవి ప్రజాతంత్ర విలువలు కావచ్చు, అధిపత్య విలువలు కావచ్చు). తమ పాక్షిక ప్రయోజనాలలోనే సార్వజనీన ప్రయోజనాలను ఇముడ్చుకున్నవారు (మార్క్స్ ఊహించిన కార్మికవర్గం) ప్రపంచంలో ఎవరూ లేరు, ఉండబోరు. భౌతిక ప్రయోజనాలలో సార్వజనీనత ఉండగలదనుకోవడం వల్లనేనేమో నైతిక సార్వజనీనతకు మార్క్స్ పెద్దగా విలువ ఇవ్వలేదు. ఇవ్వకపోగా, దానిని గురించి మాట్లాడిన కొద్ది సందర్భాలలో దానిని తృణీకరించాడు. కానీ నిజమైన సార్వజనీనత ఉండేది విలువలలోనే, భౌతిక ప్రయోజనాలలో కాదు. దీనికి మూలం కూడా మనిషిలోనే ఉంది. తన పాక్షికమైన అవసరాలను సార్వజనీనమైన విలువల రూపంలో వ్యక్తం చేసే గుణం మనిషిలో ఎందుకుందో, మానవజాతి ఎదుగుదలలో ఏ దశలో అది మానవ నైజంలో భాగం అయిందో తెలీదుగాని, అది మనకు తెలిసిన మనిషి నైజంలో విడదీయరాని భాగం. ఈ విలువల సార్వజనీనతే ఉద్యమాలు మధ్య, ఆరాటాల మధ్య సంఘీభావానికి సహానుభూతికీ తావు కల్పిస్తుంది. అందరి ప్రయోజనాల మధ్య ఒక కృత్రిమ భౌతిక శక్తిగా మారుతారన్న ఆలోచన వదిలిపెట్టి, భౌతిక ఐక్యత ఏ మేరకు సాధ్యమైతే ఆ మేరకు దానిని నిలబెట్టుకుంటూ ఐక్యత ప్రధానంగా నైతికం అనీ దానిని ప్రయత్నపూర్వకంగా పెంపొందించడం ద్వారా ఒకరి సంఘీభావం మరొకరికి అందగలుగుతుందనీ అర్థం చేసుకున్నప్పుడు విభిన్నమైన ఐడెంటిటీలను ఏ విధంగా స్వీకరించాలో అర్థం అవుతుంది.

'మీరిద్దరూ ఒక్కటై మీ ఉమ్మడి శత్రువు అయిన వర్గ - కుల రాజ్యానికి వ్యతిరేకంగా మీ పోరాటం ఎక్కుపెట్టండి, అనడంలో అర్థం లేదు.

ఉదాహరణకు పదిమంది నిరుద్యోగులు కలిసి ఒక నిరుద్యోగ సంఘం పెట్టుకుంటే 'మా పది మందికి ఉద్యోగాలు ఇవ్వండి' అని మాత్రమే అడగరు. 'ఒక ప్రజాస్వామిక దేశంలో నిరుద్యోగం ఉండటానికి వీలులేదు' అన్న జనరల్ సూత్రాన్ని ప్రతిపాదిస్తారు. 'మనిషయి పుట్టిన ప్రతీ ఒక్కరికీ కాయకష్టం చేసుకొని గౌరవప్రదంగా బ్రతికే అవకాశం ఉండాలి' అన్న సార్వజనీన నైతిక విలువ రూపంలో తమ కోరికను వ్యక్తం చేస్తారు. ఇది మనుషులెప్పుడూ చేసేపనే. అదే ఊరిలో ఇంకొక పదిమంది దళితులు అంటరానితనానికి వ్యతిరేకంగా ఒక సంఘం పెట్టారనుకోండి. వాళ్ళు కూడా 'మా వాడలో చాయ్‌ల హోటల్లో వేరే గ్లాసులు పెట్టడానికి వీలులేదు' అని మాత్రమే అనరు. సామాజిక గౌరవాన్ని గురించి మానవత గురించీ సార్వజనీన విలువలనూ సూత్రాలనూ ప్రతిపాదిస్తారు. తద్వారా తమ పాక్షిక డిమాండ్లను వ్యక్తం చేస్తారు. ఇప్పుడు ఈ రెండు సంఘాల మధ్య ఐక్యత కోరుకునేవారు,



'మీరిద్దరూ ఒక్కటై మీ ఉమ్మడి శత్రువు అయిన వర్గ – కుల రాజ్యానికి (లేక ఫ్యూడలిజంతో షరీకయిన పెట్టుబడీదారీ రాజ్యానికి) వ్యతిరేకంగా మీ పోరాటం ఎక్కుపెట్టండి, అనడంలో అర్థం లేదు. ఇద్దరూ తమ పాక్షికమైన కోరికలను వ్యక్తం చేయడానికి ప్రయోగించే సర్వజనీన విలువలలో సంఘీభావానికి తావుదొరుకుతుంది గానీ వారి భౌతిక ప్రయోజనాలలో కాదు. నిజమే, నిరుద్యోగానికి కారణమైన రాజకీయార్థిక వ్యవస్థకూ అంటరానితనాన్ని కాపాడే కులవ్యవస్థకూ మధ్య సంబంధం ఉంది. కానీ అవి రెండు ఒకటి కావు, ఒకే క్రమంలో 'కూలిపోయేవీ' కావు. అస్తి, కులం, పితృస్వామ్యం మొదలయిన వ్యవస్థల మధ్య పరస్పర సంబంధాలున్నాయి. దేనికది ఒక సర్వస్వతంత్రమయిన ద్వీపం కాదు. కానీ వాటినన్నిటినీ కలబోస్తే ముందుకొచ్చే పోరాటాలు వ్యక్తం చేసే సార్వజనీన నైతిక విలువలలోని సామాన్య అంశాలలో సంఘీభావానికి చోటు వెతకడం సబబుగా ఉంటుంది. 'నీకోసం నువ్వు న్యాయం కోరుకుంటున్నావు కాబట్టి ఇతరుల కోసం కూడా న్యాయం కోరుకోవాలి, ఇతరులకు నువ్వు న్యాయం చేయాలి' అనేది హేతుబద్ధమైన వాదన. ఎందుకంటే న్యాయం అనే భావనే (అన్ని విలువల లాగ) సార్వజనీనమైనది. మన అవసరాలను మనం మానవత అనే భాష ద్వారా ఎప్పుడైతే వ్యక్తం చేస్తామో అప్పుడు అదే మానవతాభావనను ఇతరులకు కూడా అన్వయించడాన్ని మనం సులభంగా ఇప్పించుకోలేము. తప్పించుకోవడానికి ప్రయత్నించమని కాదు. కాని తప్పించుకోవటం కష్టం. దానికి అడ్డమొచ్చే సార్వజనీనత ఆ విలువలో (అన్ని విలువల లాగ) ఉంది. భౌతిక ప్రయోజనాలకు (విలువల రూపంలో వ్యక్తం అయ్యేదాకా) అటువంటి సార్వజనీనత లేదు. భౌతిక అవసరాలలో సార్వజనీనత కోసం వెతికే మార్క్సిస్టు సంప్రదాయం స్థానాన్ని మానవ వ్యవహారాలలో ఏ రకమైన సార్వజనీనతా సాధ్యం కాదని నమ్మే 'పోస్ట్ – మోడరన్' దృక్పథం ఆక్రమిస్తున్నది కాబట్టి ఈ మాటలు చెప్పడం అవసరం అయింది.

కాబట్టి ఐడెంటిటీల గురించి ఆలోచించేటప్పుడు ప్రధానంగా లెక్కలోకి తీసుకోవలసింది వాటిలో వ్యక్తమయ్యే విలువలను. అవి ఏ రకమైన సంఘీభావాన్ని వ్యక్తం చేస్తాయి? ఏ దిశగా మనల్ని మన ఆకాంక్షలనూ నడిపిస్తాయి? ఏ ఆచరణకు ఊతమిస్తాయి?

'ముస్లిం ఐడెంటిటీ' గురించి ఈ కోణం నుండే ఆలోచిద్దాం. వివక్షకే, నిర్లక్ష్యానికీ గురవుతున్న మైనారిటీ ముస్లింలు వ్యక్తం చేసే ఆందోళనను మైనారిటీ హక్కుల కోణం నుండి చూసి సమర్థించాలనడం సబబే. కానీ ఆ నిరసనలో వ్యక్తమయ్యే ఆలోచనలలోని విలువలు సమాజం సాంస్కృతిక సంపదను పెంపొందించగలవని అర్థం చేసుకున్నప్పుడే, ఆ నిరసన తన అవసరాలను తీర్చుకుంటూనే ఇతర పౌరగామి ప్రయోజనాలలో ఏ విధంగా భాగం కాగలదో అర్థం అవుతుంది. అప్పుడది 'వాళ్ళ' అవసరం – సమంజసమైన అవసరం – మాత్రమే కాదనీ ఒకరకంగా అందరి అవసరం కూడాననీ అర్థం అవుతుంది. నిత్యం శంకించబడే వ్యక్తులకు అర్థమయినంతగా 'ఆత్మగౌరవం' అనే భావన ఇతరులకు అర్థం కాగలదా? వాళ్ళు నేర్పించినంత గట్టిగా ఆ విలువను వేరెవరు నేర్పించగలరు? కానీ ఆత్మగౌరవం అనే భావన సామాజిక సంస్కృతిలో నిండుగా ఎదగకుండా మనమంతా కోరుకునే కొత్త సమాజం సాధ్యమవుతుందా? తన సంస్కృతినీ అలవాట్లనూ ఆచారాలనూ సార్వజనీనమైన సత్యంగా భావిస్తూ 'బోరవిరుచుకుని' తిరిగే మెజారిటీ మధ్య ఒక మైనారిటీగా బ్రతికే వాళ్ళకు అర్థమయినంతగా భిన్నత్వం, వైవిధ్యాల విలువలు ఇతరులకు అర్థమవుతాయా? కానీ భిన్నత్వాన్ని వైవిధ్యాన్ని కేవలం సహించడమే కాక ఆహ్వానించడం మనమందరం నేర్చుకోక పోతే మనం ఊహించుకునే కొత్త సమాజం సంపూర్ణం



www.etelangana.org

అవుతుందా?

ఇటువంటి విలువలనేకం ఈ 'జల్ జలా' సంకలనంలోని కవితలలో కనిపిస్తాయి. వాటిని మైనారిటీల న్యాయమైన సమస్యల కవితాత్మక (లేక తాత్విక) వ్యక్తీకరణ'గా (మాత్రమే) చూడకుండా, భారతదేశ ముస్లింల భౌతిక పరిస్థితి, దానినుండి పుట్టిన ఆలోచనలు, మొత్తంగా సమాజానికి అందిచ్చే విలువల దృక్కోణంగా అర్థం చేసుకున్నప్పుడు ఈ కవితలు చదివే ముస్లిమేతరులు సానుభూతినీ, సంఘీభావాన్నీ 'ఇచ్చే'వారిగానే కాక తీసుకునేవారిగా కూడా కనబడతారు. 'ఒంటరిపోరాటం ఏమి చేస్తారు, ఇతరులలోకి కలవండి' అనేముందు ఇప్పటికే అందరి అవసరాలకూ వాళ్ళు అందిస్తున్న విలువలున్నాయని అర్థం చేసుకోగలుగుతాము. భౌతికంగా చేతులు కలపడం అన్ని సందర్భాలలోనూ అవసరం గానీ సాధ్యంగానీ కాకపోవచ్చును గానీ విలువల చేయూత ఎప్పుడూ ఉంటుంది. అయితే దానిగురించి స్పృహ అవసరం. అవగాహన అవసరం. ఒక జీవిత అనుభవం నుండి పుట్టిన విలువలు వాటంతటవి ఇతర జీవనరంగాలలోకి వ్యాపించే క్రమం సంక్లిష్టంగానూ నెమ్మదిగానూ జరుగుతుంది. ఆ పని ప్రయత్నపూర్వకంగా చేయటం - విలువల సంఘీభావాన్ని పెంపొందించడం - అవసరం. ఉద్యమాలకు మనం సలహాలు, సానుభూతి 'ఇచ్చే'వారిమే కాక పొందే వారము కూడా అన్న ఎరుక అవసరం.

నిరసన అనే నెగెటివ్ భావనలో కూడా ఇన్ని పాజిటివ్ విలువలున్నాయి. అయినప్పటికీ అది పరిమితమైన భావనే. ముస్లింలను ముస్లింలుగా కదిలించే పాజిటివ్ ఆలోచనలు - 'ముస్లిం ఐడెంటిటీ'లో భాగం కాగలిగినవి - లేవా? ఇస్లాంలు - అందులో ప్రత్యేకించి భారతదేశంలో అది తీసుకున్న రూపం - మన సమాజానికి చేసిన మేలేమి లేదా? అందిచ్చిన సంస్కృతి ఏమీ లేదా? దానిని తనలో ఇముడ్చుకున్న ముస్లిం ఐడెంటిటీ ఒక పాజిటివ్ రాజకీయ భావనకు బీజం కాజాల బ్రాహ్మణీయ హైందవ సంస్కృతి గుప్పిట్లో ఉన్న మన సమాజంలోకి ఇస్లాం కొన్ని కొత్త ఆలోచనలనూ కొత్త సాంస్కృతిక విలువలనూ ప్రవేశపెట్టింది. అవి హైందవ సంస్కృతిలోని రెండు బలమైన దుర్గుణాలను కొంతమేరకు వ్యతిరేకించే విలువలు, సంకుచితత్వం, సాంఘిక అసమానత అనేవి ఆ రెండు గుణాలు. ఇస్లాం వాటికి విరుద్ధమైన విలువలను పెంపొందించిన విషయాన్ని గర్వంగా జ్ఞాపకం చేసుకోవడం ఇప్పటిదాకా ముస్లిం ఛాందసవాదుల వంతయింది. అది వాళ్ల వంతుగానే ఉండిపోతే మంచి కంటే చెడుకే ఎక్కువ ఉపయోగపడే ప్రమాదం ఉంటుంది.

బ్రాహ్మణీయ దృక్పథంలో హెచ్చుతగ్గుల సంకుచిత్వమే కాక 'ప్రాదేశిక' సంకుచితత్వం బలంగా ఉంది. హిందువులగా పుట్టి పెరిగిన వాళ్ళకు తమలో ఈ దృష్టిలోపం ఉందని గ్రహించడం సహితం కష్టం. హిందువుల మానసిక దృష్టి చుట్టూ కొన్ని గోడలుంటాయి. ఆ గోడలను దాటి ఆలోచించడం, సహానుభూతితో స్పందించడం హిందువులకు సహజంగా రాదు. కులం ప్రధానమైన అడ్డుగోడ కాగా అది నేర్పించిన సంస్కృతి ఫలితంగా జాతి, భాష, దేశం మొదలయిన అడ్డుగోడలు కూడా హిందువుల చుట్టూ మొలిచాయి. సహానుభూతికీ స్పందనకూ ఇవి బలమైన పరిమితులు పెడతాయి. ఇస్లామిక్ సంస్కృతి దీనికి పూర్తిగా అతీతమని నా ఉద్దేశ్యం కాదు. ఏ ఎల్లలూ లేకుండా విశ్వసనీయంగా 'మమేకం' కావడం మనుషులెవరికీ సాధ్యం కాదు. కానీ ఆ పరిమితిని వ్యతిరేకించే సాంస్కృతిక విలువలు ఇస్లాంలో ఉన్నాయి. ముస్లింలంతా భౌతికంగా ఒకటేనని నిరూపించడానికి 'ఉమ్మా' అనే భావనను ఛాందస వాదులు వాడుకునే తీరును వ్యతిరేకించవలసిందే. ప్రపంచ ముస్లింలు భిన్న



జాతులలో ఛాందస వాదులు వాడుకునే తీరుని వ్యతిరేకించవలసిందే ప్రపంచ ముస్లింలు భిన్నజాతులలోనూ సంస్కృతులలోనూ భాగమై ఉన్నారనీ ఈ వైవిధ్యాన్ని కాదనడం సంకుచిత దృక్పథమనీ విమర్శించాల్సిందే. కానీ దానిని భౌతికతగా అర్థం చేసుకోకుండా, విశాలమైన సహానుభూతికి (కనీసం తమ మతానికి చెందినవారి వరకైనా) తావు కల్పించే సాంస్కృతిక విలువగా అర్థంచేసుకోవడం, హైందవ సంస్కృతిలోని సంకుచిత దృష్టిని ఎత్తి చూపడం ద్వారా బలహీన పరచడానికి అది ఉపయోగపడుతుందనీ, ఉపయోగపడిందనీ అర్థం చేసుకోవడం అవసరం. ప్రపంచ ముస్లింలలో ఎంత సాంస్కృతిక వైవిధ్యమున్నప్పటికీ అరబ్బీ మాట్లాడే పాలస్తీనా ముస్లింలకు ఇక్కట్లు వస్తే తమిళం మాట్లాడే కోయంబత్తూరు ముస్లింలు ఆందోళన చెందగలరు, గుజరాతీ మాట్లాడే పోర్బందర్ ముస్లింలు బోధపడగలరు. ప్రస్తుతానికిది మతం పరిధిలోనే ఉంది. మత ఛాందసవాదుల అదుపులోనే ఉంది. అయినప్పటికీ, మతం ప్రమేయం లేని సార్వజనీనమైన స్పందనకు ఈ వైఖరి దారి చూపగలదు. 'ఎక్కడో చెచెన్యాలో ఏదో జరిగితే వీళ్ళు హైదరాబాద్‌లో బస్సుల అద్దాలెందుకు పగలగొడతారు' అని విసుక్కొనే హిందువులకు, తమ గడపదాటి స్పందించలేని తమ సంకుచితత్వాన్ని ఇది ఎత్తి చూపుతుందని అర్థం కాదు.

దేవుడి ముందు అందరూ సమానులేననేది ఇస్లాంలోని మరొక విలువ. పురుషాధిక్యత, ఆర్థిక అసమానత దీనికి బలమైన పరిమితులు పెట్టినప్పటికీ, మతమే ఈ సమానత్వ సూత్రాన్ని ప్రతిపాదించే సంస్కృతికి గుణకర్మలను బట్టి దేవుడే మనుషులను అసమానులుగా సృష్టించాడని నమ్మే హైందవ సంస్కృతి చాలా తేడా ఉంది. హైందవ సమాజంలోని శ్రామిక కులాలకు చెందినవారు ఇస్లాంవైపు ఆకర్షితులు కావడానికి ఇది దోహదం చేసింది. ఆ విధంగా మతం మార్చుకున్నవారిలో కనిపించే ఆత్మగౌరవం హిందువులుగా ఉండిపోయిన వారిలో కనిపించదు. ఇస్లాం, క్రైస్తవం, భారతదేశంలోకి రాకపోతే ఈ దేశంలో 'క్రింది కులాల' పరిస్థితి ఇంకెంత దుర్భరంగా ఉండేదో!

భారతదేశంలో ఇస్లాంను ఎక్కువగా ప్రచారం చేసింది కత్తి చేతబట్టిన సుల్తాన్లు కాదు. సమానత్వ విలువను ప్రవారం చేసిన 'సూఫీ' ప్రచారకులు. వీళ్ల ప్రచారం చేసిన ఇస్లాంలో దేవుడి ముందు అందరూ సమానమేనని భావన, ప్రేమ, దయ సహనం సానుభూతి మొదలైన విలువలు ముఖ్యమైనవి. వీళ్లు పేదరికంలో ఉంటూ పేదల మధ్య తిరుగుతూ మతాన్ని ప్రచారం చేసారు. వీరి సమాధులే దేశమంతటా కనిపించే దర్గాలు, మతానికి అతీతంగా ప్రజలందరూ పూజలు చేసి ఏకైక ప్రార్థన స్థలాలు దర్గాలు. 'హిందూ - ముస్లిం ప్రజలను (ముఖ్యంగా శ్రామిక ప్రజలను) ఒక దగ్గరికి తెచ్చాయనడంలో ఎంత మాత్రం అతిశయోక్తి లేదు.

భారతదేశపు ఇస్లాంకు ఉన్న ఈ చరిత్రను సగర్వంగా స్వీకరించే 'ముస్లిం' ఐడెంటిటీకి ఒక వాస్తవికమైన రాజకీయ స్థానం ఉండగలదు. అది సనాతనవాదాన్ని తిరస్కరిస్తూ, 'ముస్లిం'గానే ఉంటూ అభ్యుదయ రాజకీయ స్రవంతిలో భాగం కాగలదని దానిని అభ్యుదయ వాదులెందుకు ఆహ్వానించకూడదు? ఆహ్వానించడమే కాదు, దానికోసం ఎదుకు ప్రయత్నం చేయకూడదు?

(అణగారిన జాతుల గురించి అహర్నిశలూ ఆలోచిస్తూ, పనిచేస్తూ మనలో అనేకంగా పరుచుకున్న బాలగోపాల్‌కి సింగిడి నివాళి) ■



www.etelangana.org

# ఊరు తెలంగాణ

● యాకూబ్



నల్లబంగారం సింగరేణి నా చిరునామా
ఇల్లెందు బొగ్గుబావులు,
కొత్తగూడెం మైనింగ్ షాఫ్ట్‌లు
ఉగ్గుపాలు రుచి చూసినప్పటి నా నెలవులు
చుట్టుముట్టు పరుచుకున్న అడవులు
నన్ను సేదదీర్చిన కొలువులు
ఆదివారం బొగ్గుబావి సంతల్లో
నేనమ్మిన కోళ్ళు, చింతచిగురు కుప్పలు, ఐస్‌క్రీంలు
నా ఆకలి తీర్చిన అమ్మలు

పుట్టిందీ, పరుగులు పెట్టిందీ, గొంతు చించుకొని
గోడలమీద రాతలై మెరిసిందీ
ఊరేగింపులై నినాదాలై రెపరెపలాడిందీ
ఈ నేలమీదే
రాత్రుల్లో కోల్పోయిన నిద్రలూ
కలవరింతలై ఉలిక్కిపడి లేపిన కలలూ
ఒత్తిగిలి పడుకున్నా
చోటు చాలని హాస్టల్ గదుల్లో
కిక్కిరిసిన తోటి పిల్లల నిద్రముఖాల మీద
మారే రంగులు
అనుభవంలోకి వచ్చింది ఇక్కడే–
ఈ తెలంగాణ నేల మీదే
సెలవుల్లో ఆటలాడుకునే ఆనందం లేకుండా
అడుగు అడుగుకీ వెంటాడే వేధించిన దారిద్ర్యం
రెక్కలు ఆడడమే డొక్కలు నిండడానికి
ఒకే ఒక్క మార్గంగా ఎదుట నిలబడిన బాల్యం
ఎర్రటి ఎండను రామగుండం,
గోదావరి ఖని మోస్తున్నా
కనికరం చూపక రోడ్లమీద
ఐస్‌క్రీం బండి దొబ్బుతూ
కిలోమీటర్లు కిలోమీటర్లు తిరగాల్సిన దైన్యం

అన్నీ ఈ నేల మీదే – ఈ తెలంగాణ నేల మీదే
అవును నిజమే
ఈ దుర్భరత్వమే హక్కులకన్నా ముందు
ఆకలిని మాత్రమే చూడమంది
కడుపు గోసని ముందు పట్టించుకోమంది
కడుపు గోస తెలియనివాడు
ఎన్నైనా మాట్లాడతాడు
కాలం తిరిగ్గా దొరికిన వాడే
ఎన్ని వేషాలైనా వేస్తాడు
తెలంగాణ ఇప్పుడు కడుపుగోస గురించే
మాట్లాడుతుంది
కడుపు నింపుకోవడానికే
తన హక్కుల్ని తాను దక్కించుకోవాలని
నోరు విప్పుతుంది
నేను ఇన్నాళ్ళు
ఈ నేలమీద
కొలూనుకోడానికి
చేసిన జీవన యుద్ధాన్నే
ఇప్పుడు తెలంగాణ యుద్ధభాషను
మాట్లాడుతున్నది ■



దక్కనులో

# ఉర్దూ భాష - సాహిత్యం - సంస్కృతి

● డా. ఎస్. సదాశివ

వింధ్య పర్వతాలకు దక్షిణంలో వుండే భారత భూభాగాన్ని దక్కన్ అనటం పరిపాటి. ఉత్తర భారతాన 12వ శతాబ్ది నుంచే ఇరాన్ తుర్కిస్తాన్ ప్రాంతాలనుండి వచ్చిన ముస్లిం సుల్తానుల పరిపాలన మొదలయింది. దక్కనులో మాత్రం 15వ శతాబ్ది ప్రారంభంలో బహమనీ వంశానికి చెందిన ముస్లిం సుల్తానుల పరిపాలన మొదలయింది. ఉత్తరంలోను దక్షిణంలోను ఉన్న సుల్తానుల భాషలు ఫారసీ, అరబీ, తుర్కీలే. ఢిల్లీ సుల్తానులు తమ భాషలనే పరిపాలన వ్యవహారాలలో ఉపయోగించుకున్నారు గాని ప్రజల భాషలకు ప్రాముఖ్యం ఇయ్యలేదు. కాని దక్కను సుల్తానులు మాత్రం మొదటి నుంచే ప్రజల భాషలకు ప్రాముఖ్యం ఇచ్చినారు. భారతదేశ చరిత్ర వ్రాసిన ఫరిష్తా మాటలను నమ్మినట్లయితే బహమనీ సుల్తానుల ఆదాయ వ్యయ వ్యవహారాలు దక్కనీ ఉర్దూలో జరిగేవి. చరిత్రకారుడు ఫరిష్తా మాటలు నమ్మినట్లయితే అని ఎందుకన్నానంటే అతడు రాసిన చరిత్రలో అసత్య కథనం కొంతవున్నదని ప్రామాణికులైన కొందరు ముస్లిం చరిత్రకారులే అంగీకరించినారు. దక్కనీ ఉర్దూ అనే మాట వాడినాను. అది ముస్లిం సుల్తానుల కాలంలో దక్షిణ దేశంలో రూపొందిన ఒక కొత్త భాష. అందులో ఫారసీ, అరబీ, తుర్కీ శబ్దాలతోపాటు, ప్రాంతీయ భాషల శబ్దాలు, ప్రాకృత శబ్దాలు కలిసి ఉండేవి.

13వ శతాబ్దిలో ఢిల్లీని పాలించే అల్లావుద్దీన్ ఖిల్జీ దక్షిణదేశంపై దండెత్తి వచ్చినాడు. అతని వెంట వచ్చిన కొందరు సైనికులు, వృత్తి కళాకారులు, వ్యాపారస్తులు, సూఫీ ఫకీరులు ఇక్కడే వుండి పోయినారు. వాళ్ళ ఉతరంలో రూపుదిద్దుకుంటున్న ఒక నూతన భాషనే కాక ఫారసీ, అరబీ, తుర్కీ శబ్దాలను కూడా తమ వెంట తెచ్చుకున్నారు. ఆ భాషే ఇక్కడి గుజరాతీ, మహారాష్ట్ర ప్రాకృత భాషలలోని కొన్ని శబ్దాలు చేర్చుకొని ద్రవిడ భాషల ఉచ్చారణతో ఒక కొత్త భాషగా రూపొందింది. దక్షిణాన వున్న ద్రవిడ భాషల శబ్దాలు ఈ భాషలో చేరలేదు. యాస మాత్రం చేరింది. దాన్నే మొదట్లో హిందీ అన్నారు, హిందుస్తానీ, తర్వాత దకనీ అన్నారు. అదే కాలక్రమాన దకనీ ఉర్దూ అయింది.

ఇక్కడ మనం అప్పుడు ఢిల్లీలో రూపొందుతున్న భాషను గురించి కొంచెం తెలుసుకోవటం అవసరం. వేరు వేరు భాషలు మాట్లాడే ప్రజలు ఏకారణం వల్లనైనా కొంతకాలం ఒకే ప్రాంతంలో



www.etelangana.org

కలిసిమెలిసి నివసించవలసిన పరిస్థితులు ఏర్పడితే పరస్పర భావవ్యక్తీకరణ కోసం ఒక కలగూర గంప భాషను రూపొందించుకోవటం తప్పనిసరి అవుతుంది. ఒక కలగూరగంప భాష ఏర్పడటానికి చారిత్రక, రాజకీయ, ధార్మిక, సామాజిక, ఆర్థిక పరిస్థితులు కారణాలవుతాయి. 13వ శతాబ్దిలో ఢిల్లీని పాలించే ముస్లిం సుల్తానులకు, వాళ్ల వెంట వచ్చిన మంత్రులకు, సైన్యాధిపతులకు అధికారులకు ఫారసీ, అరబీ, తుర్కీ భాషలుతప్ప ఇక్కడి భాషలు తెలియవు. ఢిల్లీలోను, దాని పరిసర ప్రాంతాలలోను ప్రజలు మాట్లాడుకునే భాషలు ఖడీబోలీ, పంజాబీ, హరియాన్వి, బ్రజ్, అవధి – మాగధి, రాజస్థానీ మొదలైన ప్రాకృతాలు కూడా కావు, ప్రాకృత భాషల అపభ్రంశ రూపాలు. అల్లావుద్దీన్ ఖిల్జీ దర్బారులో అమీర్ ఖుస్రూ అనే ఒక గొప్ప ఫారసీ కవి వుండేవాడు. అతడు ఈ దేశంలో పుట్టిన వాడే. అతని తల్లి ఈ దేశందే. కనుక అతనికి ఈ దేశం పట్ల అంతులేని అనురాగం. రాజసభలో వుండేవాడైనా, పెద్ద అమీరైనా అతడు ఏ మాత్రం తీరిక దొరికినా భారతీయ ప్రజల్లో కలిసిపోయేవాడు. ఇక్కడి భాషల శబ్దాలు కొన్నింటిని ఫారసీ, అరబీ, తుర్కీ శబ్దాలతో కలిపి భావవ్యక్తీకరణం కోసం అతడొక క్రొత్త భాషను తయారు చేసినాడు. అ భాష అతని కంటే ప్రజలకే ఎక్కువ అవసరం. అతడు రాజదర్బారులో వుండేవాడు గనక పలుభాషల ప్రజలు, అతని ద్వారానే తమ అవసరాలను ప్రభుత్వానికి విన్నవించుకొనేవారు. అతడు ఢిల్లీలో నెలవైవున్న హజ్రత్ నిజాముద్దీన్ ఔలియా అనే సూఫీ యోగికి దగ్గరివాడు. తమ ఆధివ్యాధులను గురించి, నివారణోపాయాలను గురించి, పరతత్త్వ జ్ఞానం గురించి అమీర్ ఖుస్రూ ద్వారానే ఆ సిద్ధపురుషుని ఆదేశాలను, ఉపదేశాలను తెలుసుకునే ప్రయత్నం చేసేవాళ్ళు ప్రజలు. ఇలా తయారైన భాషను అమీర్ ఖుస్రూ 'హిందుయీ' అన్నాడు. దానికి ఆ కాలం వాళ్లు హిందీ, హిందుస్తానీ – జబానె హిందుస్తాన్ అని మరికొన్ని పేర్లు పెట్టినారు. ఆ భాష తరువాత ఉర్దూ, హిందీ భాషలకు మూలభాష అయింది.

సుల్తాను సేనలో పలుప్రాంతాల, పలుభాషల సైనికులుండేవాళ్లు. వాళ్లొక ఉమ్మడి భాషను తయారు చేసుకున్నారు. సేనను లష్కరు అంటారు గనుక ఆ భాషను లష్కరీజబాన్ అన్నారు. అది కూడా ఉర్దూకు మూలభాషే అయింది.

రాజమహల్లలో బేగంలకు, అంతఃపుర స్త్రీ జనానికి అవసరమైన వస్తువులను అమ్మే దుకాణాలు వెలసినవి. అక్కడ క్రమవిక్రయాల సందర్భంలో ఒక కలగాపులగం భాష యేర్పడటం సహజం. దానిని మహల్లాతీ జబాన్ అని, బేగమాతీ జబాన్ అని పిలిచేవాళ్లు. అది కూడా ఉర్దూకు మూలభాష అయింది.

ఇన్ని రకాలుగా యేర్పడిన కలగాపులగం భాష పధ్నాలుగవ శతాబ్దిలో సుల్తాన్ మొహమ్మద్‌బిన్ తుగ్లక్ వెంట దక్కనుకు వచ్చింది. తుగ్లక్ దక్కన్‌పై దండెత్తి వచ్చి, దేవగిరిని దౌలతా బాద్‌గా మార్చి, ఢిల్లీ ప్రజలందరిని బలవంతంగా దౌలతాబాద్‌కు తరలించినాడు. దౌలతాబాద్‌నే తన రాజధాని చేసుకున్నాడు. కొన్నాళ్లలోనే అతని మనసు మారింది. మళ్లీ దౌలతాబాద్‌కు చేరుకున్న ఢిల్లీ ప్రజలను ఢిల్లీకి తరలించి దాన్నే రాజధానిగా చేసుకున్నాడు. ఈ సారి వచ్చిన ప్రజలందరూ ఢిల్లీకి వెళ్ళలేదు. చాలా మంది దేవగిరిలోనే వుండిపోయినారు. వాళ్ల వెంట వచ్చిన భాష దక్కను భాషలో కలిసిపోయింది. మహారాష్ట్ర ప్రజలు మాట్లాడేదే మహారాష్ట్ర ప్రాకృతం. దాని మీద హిందుస్తానీ భాష ప్రభావం చాలా పడింది. మరాఠీలో ఫారసీ శబ్దాలు, హిందుస్తాన్ శబ్దాలు చాలా కలిసి పోయినవి. మరాఠీ సంత్ కవుల భావాలు, సూఫీ కవుల భావాలు చాలా వరకు సామ్యం కలవి. కనుక మాట్లాడే భాష మీదనే కాక హిందుస్తానీ భాష సంత్ వాఙ్మయాన్ని కూడా ప్రభావితం చేసింది. తెలుగులో గౌరవ వాచక శబ్దంగా 'గారు'ను ప్రయోగిస్తున్నాము. మరాఠీలో సాహెబ్ అరబీ శబ్దం. హిందుస్తానీ ద్వారా మరాఠీలో



చేరింది. అన్నా సాహెబ్, అప్పా సాహెబ్, బాబా సాహెబ్, రావు సాహెబ్, రాజీ సాహెబ్, అయి సాహెబ్ అంటారు మరాఠీలో, స్త్రీలను సాహిబా అనాలె. కాని మరాఠీలో సాహెబ్ అనే అంటారు. లెక్కలేనన్ని హిందుస్తానీ శబ్దాలు మరాఠీలో మరాఠీ శబ్దల్లాగే ప్రయోగంలో వున్నాయి.

తుగ్లక్ వంశం బలహీనమైనంతనే దక్కనులో ఒక ముస్లిం రాజవంశం తన అధికారాన్ని స్థిరపరచుకున్నది. దాని పేరు బహమనీ వంశం. ఈ వంశం సుల్తానులు పాలించే కాలంలోనే ఇక్కడి ప్రజల ఉమ్మడి భాష (హిందీ, లేదా హిందుస్తానీ) రాజభాషా గౌరవాన్ని పొందనారంభించిందని ఫరిష్తా తన చరిత్రలో రాసుకున్నాడు, కొన్నాళ్లలోనే బహమనీ రాజ్యం ఐదు భాగాలుగా విడిపోయింది. భాషా సాహిత్యాల దృష్టితో మనకు రెండు భాగాలే ముఖ్యమైనవి. బీజాపూర్, గోల్కొండ. కనుక ఈ సంస్థానాల గురించే మాట్లాడుకుందాము.

పధ్నాలుగవ శతాబ్ది చివరి భాగాన ఢిల్లీ నుంచి ఒక సూఫీ యోగి దక్షిణానికి దిగివచ్చి గుల్బర్గాలో స్థిరనివాసమేర్పరచుకున్నాడు. అతని పేరు హజ్రత్ ఖ్వాజా బందా నవాజ్ గేసూ దరాజ్. అతడు సిద్ధ పురుషుడని ప్రతీతి. నలువైపుల నుంచి ఆర్తులైన ప్రజలు అతని ఖాన్కాహ్ చుట్టూ చేరటం సహజమే. ఢిల్లీలో హజ్రత్ నిజాముద్దీన్ ఔలియాను పరివేష్టించే జనాన్ని గురించి మాట్లాడుకున్నాము గదా. ఔలియా సంప్రదాయానికి చెందిన వారే గేసూ దరాజ్. చిష్తియా సంప్రదాయం. ఈ సంప్రదాయాన్ని మొట్టమొదట మన దేశానికి తెచ్చిన మహనీయుడు హజ్రత్ ఖ్వాజా మొయినుద్దీన్ చిష్తీ. ఖ్వాజా గరీబ్ నవాజ్ అంటారు. అతడు ఢిల్లీలో కొన్నాళ్లుండి చివరికి అజ్మీర్ చేరుకున్నాడు. అతని శిష్యుడు హజ్రత్ ఫరీదుద్దీన్ గంజ్ షకర్. అతని శిష్యుడు హజ్రత్ నిజాముద్దీన్ ఔలియా. అతని శిష్యుడు హజ్రత్ నసీరుద్దీన్ చిరాగ్ దహెల్వీ, అతని శిష్యుడు హజ్రత్‌గేసూ దరాజ్.

ఈ సూఫీ ఫకీర్ల గురించ ఇంతగా ఎందుకు వివరిస్తున్నానంటే, దకనీ భాషకు సాహిత్య గౌరవం కలిగించిన వాళ్లు వీళ్లే కనుక. ఈ సూఫీ యోగులు ప్రజల మధ్య తిరగటమే సన్మార్గం చూపటానికి. వీళ్లకు ప్రజలు కావాలె. ప్రజలకు వీళ్లు కావాలె. వీళ్ల మధ్య ఒక భాష కావాలె. హజ్రత్ గేసూదరాజ్ అరబీ ఫారసీ భాషల్లో మహా పండితుడు. ప్రజల భాష దకనీ (దాన్నతడు హిందీ అన్నాడు)లో చక్కగా మాట్లాడగలవాడు. నోటిమాటలు గాలిలో కలిసిపోతాయి. రాబోయే తరాల కోసం రాసి పెట్టాలె. హజ్రత్ ఆ పనే చేసినాడు. అనేక గద్య రచనలు అతనివిగా ప్రచారంలో వున్నవి. "మేరాజుల్ అషిఖీన్" అతని రచన అని నమ్ముతున్నారు. దక్నీ భాషలో మొదటి రచయిత హజ్రత్ ఖ్వాజా బందా నవాజ్ గేసూ దరాజ్. అతని వంశీయులనేక గద్య పద్య రచనలు చేసినారు. బీజాపూర్‌ను పాలించిన ఆదిల్‌షాహీ ప్రభువులు, గోల్కొండను పాలించిన కుతుబ్షాహీ ప్రభువులు ఢిల్లీ సుల్తానుల వలెకాక ఈ దేశాన్ని తమ దేశంగా, ఇక్కడి ప్రజలకు తమ వాళ్లుగా భావించినారు. కీలకమైన పదవుల్లో కూడా ఇక్కడి సమర్థులనే నియమించినారు. ఇక్కడి మట్టిని, నీటిని, గాలిని ప్రేమించినారు. ఈ రెండు రాజ్యాల సుల్తానులు స్వయంగా రాసిన కవితల్లోనూ ఆస్థాన కవుల చేత రాయించిన కావ్యాల్లోనూ ఇక్కడి ప్రకృతినే ప్రవేశపెట్టినారు. చెట్లిక్కడివే, పక్షులక్కడివే, పండుగలు, పర్వాలు ఇక్కడివే. తాను రచించిన కవితలన్నిటిని సంకలనం చేసుకున్న మొదటి కవి సుల్తాన్ మొహమ్మద్ ఖులీ కుతుబ్షా, అతని తల్లి భాగీరథి. అతడు ప్రేమించిన స్త్రీ భాగ్‌మతి. ఆమె పేర ఒక నగరాన్ని స్థాపించాడు. అదే భాగ్యనగరం. ఆమెను వివాహమాడి జనానాలో చేర్చుకున్నప్పుడామెకు హైదర్‌మహెల్ అనే బిరుద నామాన్ని ప్రసాదించినాడు. భాగ్యనగరం హైదరాబాద్ నగరమైంది. చెరువు చేపలతో నిండినట్లు తన నగరం ప్రజలతో నిండి పోవాలని దేవుణ్ని ప్రార్థించినాడు. అతని ప్రార్థనకు దేవుడు ఉదారంగా స్పందించినట్లున్నాడు. ఇతని తల్లి భాగీరథి అన్నాను కదా! ఆమె ఒక నృత్యాంగన. ఆమెను అతని తండ్రి సుల్తాన్ ఇబ్రాహీం కుతుబ్షా ప్రేమించి



www.etelangana.org

పెళ్లి చేసుకున్నాడు. ఇబ్రాహీం సౌందర్య రసికుడే కాక సాహిత్య పోషకుడు కూడా. ఫారసీ దఖనీ తెలుగు కవులను విశేషంగా ఆదరించినాడు. తెలుగు కవులతన్ని మలికిభరాముడు అని అనేక పద్యాలల్లో కీర్తించినారు. అతడు అతని సర్దారు అమీన్ ఖాన్ తెలుగు కావ్యాలను అంకితంగా గ్రహించటమేగాక రచయితలకు మడిమాన్యాలు, ధనకనక వాహనాలిచ్చి సత్కరించినారు. వాళ్లకాలంలో వున్న ముఖ్యులైన తెలుగు కవులు సారంగు తమ్మయ్య - పొన్నకంటి తెలగన - కందుకూరి రుద్రకవి - మరింగంటి సింగరాచార్యులు మొదలైన వారు.

తెలుగు కవులకు అతని పట్ల గల అభిమానాన్ని తెలిపే చాటు పద్యమొకటి లభిస్తున్నది. ఇది అతడు మరణించినప్పుడు రాసింది.

రారా! విధాత! యోరివిసరా! తగురా? తల కొట్లమారి!
నిస్సారపు లోభిరాజులను జంపక మల్కిభరామ భూవరున్
జారు యశోధనున్ సుగుణి జంపితి వర్థుల కేమి దిక్కురా!
చేరిన నింత రాజును సృజింపగ నీ తరమా వసుంధరన్.

సుల్తాన్ ఇబ్రాహీం కులీ కుతుబ్షా కొడుకైన సుల్తాన్ మహమ్మద్ కులీ కుతుబ్షా ఫారసీ, దఖనీ, తెలుగు భాషల్లో కవిత&'౦ రాసేవాడని అతని పద్యాల సంఖ్య లక్ష వరకుంటుందని అతని సాహిత్య చరిత్రకారులు రాసినారు. ఇప్పుడతని దీవానులో అన్ని పద్యాలు లేవు. తెలుగు కవిత అలభ్యం. అతని ధఖనీ కవితలో గజల్ లే కాక అన్ని రకాల ఛందోరీతులున్నవి. అతని గజల్ల లోంచి రెండు మూడు షేర్లు ఉదాహరణగా ఇక్కడ రాస్తాను.

పియావాజ్ ప్యాలా పియా జాయినా
పియావాజ్ ఎక్‌తిల్ జియాజాయినా
నహీ ఇష్క్ జిస్‌కో బడాకోర్‌హై
కభీ ఉస్ సె మిల్ బైసియాజాయినా
కుతుబ్షా న దే ముఝ్ దివానేకు పంద్
దివానేకు కుచ్ పంద్ దియా జాయినా

ఈ మూడు షేర్ల తాత్పర్యమేమిటంటే ప్రేయసి చెంతలేకుండా మద్యపానం చేయరాదు. ఒక క్షణమైనా జీవించరాదు. మనసులో ప్రేమలేని వాడు వ్యర్థుడు. వాని సరసన ఎప్పుడూ కూర్చుండరాదు, కుతుబ్షా పిచ్చివాణ్ణయిన నాకు ఉపదేశం చేయకు పిచ్చివానికి ఉపదేశం చేయరాదు.

పై మూడు షేర్లలో కని ఉపయోగించిన శబ్దాలను గమనించండి. వాజ్ అనే మాట ఇప్పుడు ఉర్దూలో లేదు. కభీ-బైసియా అనే మాటలు మహారాష్ట్ర ప్రాకృతం లోంచి గ్రహించబడినవి.

కుతుబ్షా కవితలో సూఫీల మధురప్రేమ కావలసినంత వున్నది.

రఖ్ ఏక్‌హై వర్ ఏకేక ధన్ లాఖ్ చమన్ హై
లఖ్ జ్యోత్‌హై హార్ ఠార్ వలే ఏక్ రతన్‌హై.

రక్షకుడొక్కడేకాని అతడు రక్షించేవి లక్షలాది తోటలు. రత్నమొక్కటే కాని ఆ జ్యోతి వెలుగు లక్ష దిక్కులకు ప్రసరిస్తున్నది.



కిస్ ఠార్ మె దిస్ తానహీ ఎవర్ ఠార్ హై భర్‌పూర్
దేఖన్ కొ సకత్ కాఉసే బస్ ఏక్ నయన్ హై.

అన్ని వైపుల నిండివున్న అతన్ని ఈ ఒంటి కన్నుతో ఎలా చూడగలం? అతడు లేని దెక్కడ? "దేఖన్ కొ సకత్‌కా" అనే మాటలను ఇప్పటి ఉర్దూలో దేఖ్ సక్తే క్యా? అంటున్నాము.

కులీ కుతుబ్షా ఆస్థానంలో వఝి అనే గొప్ప కవి ఉండేవాడు. అతడు దఖనీ భాషలో ఖుతుబ్ ముస్తరీ అనే మస్నవీని (ప్రబంధం) రచించి తన సుల్తాన్ ప్రేమ వ్యవహారాలకు కల్పన జోడించి ఒక అందమైన ప్రేమకావ్యాన్ని దఖనీ సాహిత్య భాండారంలో నిలిపినాడు. సబ్‌రస్ అనే వేదాంత గ్రంథాన్ని వచనంలో రాసినాడు. తన భాష హిందీ అన్నాడు. అలాంటి రచన హిందీ భాషలో తానే మొదట చేస్తున్నట్లు చెప్పుకున్నాడు.

"అజ్ లగన్ కోయి ఇస్ జహాన్ మె, హిందూస్తాన్‌మె, హిందీ జుబాన్ మె, ఇస్ లతాఫత్ ఇస్ చందానూ నజమ్ ఔర్ నసర్ మిలాకర్ గులాకర్ నహీ బోలియా." అంటే ఇందులో కొన్ని షేర్లు కూడా వున్నవి. ఇది చంపూకావ్యం. గులిస్తాన్ లాంటి వచన కావ్యం. ఖుతుబ్షాహీల కాలం నాటి ఇద్దరు గొప్ప కవులు రమణీయాలైన మస్నవీలు రాసినారు. ఒకడు గొవసీ - ఇంకొకడు ఇబిన్నిషాతీ - అదిల్షాహీ సుల్తానులు గౌరవించిన కవుల్లో రుస్తుమీ, సుస్రతీ, హాష్మీలు గొప్పగొప్ప మస్నవీలు రాసిన మహాకవులు. ఈ చిన్న వ్యాసంలో వాళ్ల కవిత నమోనాలు చూపటం, వాళ్ల రచనలను పరిచయం చేయటం సాధ్యం కాదు.

దఖనీ భాషలో ప్రసిద్ధిగాంచిన కవులెందరో వున్నారు. అందరిలో అధిక ప్రసిద్ధి చెందినవాడు వలీదఖనీ. అతని కాలంలో బహెరీ, షిరాజ్ ఔరంగాబాదీ అనే కవులు కూడా వుండిరి కానీ వలీని దఖనీ ఉర్దూలో కవిబ్రహ్మగా గౌరవించినారు. అతడు కులీ కుతుబ్షా కంటే ఒక శతాబ్ది తరువాతివాడు. అతడు అధికంగా గజల్లే రాసినాడు. అతని గజల్ల సంకలనం అతి సుందరమైనది. ఫ్రెంచి భాషాతత్త్వవేత్త 'గార్సా-ద-తాసా' వలీ దీవాన్‌ను ముద్రించుకొని ఫ్రెంచి భాషలో విపులమైన పీఠిక రాసినాడు. వలీ జన్మస్థలాన్ని గురించి. అతని పేరు గురించి ఇప్పటికీ సరిగా తెలియదు, సాహిత్య చరిత్రలు రాసిన మీర్ తఖీమీర్, మీర్ హసన్, ముస్తఫీ మొదలైన వాళ్లు కొందరు అతని జన్మస్థానం ఔరంగాబాదన్నారు. కొందరు అహమదాబాద్ అన్నారు. అతని పేరు షంషుద్దీన్ అని ఒకరంటే, షంషువలీఉల్లా అని ఇంకొకరన్నారు. తరువాతి కాలంలో పరిశోధనలవల్ల కొన్ని ఆధారాలు దొరికినవి. అతని పేరు షంషుద్దీన్ అని, అతని జన్మస్థానం అహ్మదాబాద్ అని నిర్ణయింపబడింది. దఖనీ భాషను కూలంకషంగా పరిశోధించినవారు ఉస్మానియా యూనివర్శిటీకి చెందిన ప్రొఫెసర్ మొహియుద్దీన్‌జోర్, అతని శిష్యప్రశిష్యులు ప్రొఫెసర్ రఫియా సుల్తానా, ప్రొఫెసర్ సయ్యదాజాఫర్ మొదలైనవారు.

వలీ తొలినాళ్ల కవిత అచ్చులైన దఖనీ కవుల భాషలో వుండేది. కానీ రానురాను అతని భాషలో ఢిల్లీలో తయారయిన భాష అధికంగా చేరింది. అరబీ, ఫారసీ పదాలు కూడా అధిక మయినవి. భారతీయ వాతావరణం బదులుగా ఈరాన్ వాతావరణం దిగింది. హంసలు, నెమళ్లు, చిలుకలు కోయిలలుకాక బుల్‌బుల్ - హుమా - షాహీన్ మొదలైన పక్షులు ప్రవేశించినవి. బంతిపూలు, మల్లెలు, మొల్లలుగాక గుల్, గులేలాలాలు ప్రవేశించినవి. దీనికి కారణం అతడు తరచుగా ఔరంగాబాద్‌కు, ఢిల్లీకి పర్యటించటమే. ఔరంగాబాద్‌లో అప్పటికే ఢిల్లీ భాష చేరింది. ఢిల్లీలో షాహ గుల్షన్ అనే సూఫీ యోగి వలీకి ఆధ్యాత్మిక గురువు. అతని ఆదేశం ప్రకారమే వలీ తన దఖనీ కవిత ముఖాన్ని ఈరాన్



www.etelangana.org

వైపు మరల్చినాడంటారు. అంటే తెలుగులో నన్నయ భట్టు చేసిన పని వలీ చేసినాడు. నన్నయ తెలుగును ప్రక్కకు నెట్టిన సంస్కృతాన్ని అధికాధికంగా తెలుగులో చొప్పించినాడు. వలీ అదనే చేసినాడు. అయితే వలీ కారణంగా దఖనీ ఉర్దూకు గట్టి దెబ్బతగిలినా, వలీ కారణంగానే ఢిల్లీ ఫారసీ కవులు ఉర్దూలో గజల్లు చెప్పే సాహసం చేసినారు. అంతవరకు ఢిల్లీలోని ఫారసీ కవులు గజలులో చెప్పవలసిన గంభీరమైన, సున్నితమైన, శృంగారపరమైన భావాలను హిందూ దేశంలో జన్మించిన ఒకానొక భాషలో చెప్పటం సాధ్యం కాదని భావించేవాళ్లు. దఖనీ ఉర్దూలో వలీ చెప్పే గజల్లు ఫారసీ గజల్లకు తీసిపోకుండా ఉండటం గమనించి వాళ్లు తమ ఉర్దూలో గజల్లు చెప్పటం ప్రారంభించినారు. ఉత్తరాది ఉర్దూను దక్కనుకు తెచ్చిన మొదటి కవి వలీ దకనీ.

ఆసిఫ్జాహీ నవాబుల కాలంలో ఉత్తరాది కవులు హైదరాబాదుకు ఆహ్వానించబడి ఆశించిన దానికంటె ఎన్నో రెట్లు అధికంగా డబ్బు సంచులు పట్టుకవెళ్ళినారు. అలాంటివాళ్లలో జోఖ్ గురువు షాహనసీర్ ముఖ్యుడు. హైదరాబాద్ నగరంలోని షియాల ప్రఖ్యాత మస్నవీ రచయిత మీర్ అనీస్‌ను ఆహ్వానించి కొన్నాళ్లు తమ అతిథిగా నిల్పి గౌరవించినారు. ప్రధాన మంత్రులైన దివాన్ చందూలాల్ షాదా, రాజా కిషన్ ప్రసాద్ షాద్ మంచి కవులే కాక కవులను ఉదారంగా ఆదరించేవాళ్లు. ఢిల్లీ, లఖ్నో కవుల రాకపోకలతో హైదరాబాద్‌లోను చాలా మంది కవులు తయారయినారు. ఆరవ నిజామ్ మహబూబలీ పాషా కాలంలో దాగ్ దహెల్వీ వచ్చి నిజామ్‌కు ఉస్తాదయినాడు. అతని మిత్రుడు లఖ్నోకు చెందిన అమీర్ మినాయి హైదరాబాద్‌కు వచ్చినాడుకాని కొలది కాలంలోనే మరణించినాడు. అతని శిష్యుడు జలీల్ మణిక్‌పూరీ ఏడవ నిజాముగురువయినాడు. జలీల్ కొడుకుల్లో అలీ అహ్మద్ జలీలీ ఇప్పటి గొప్ప కవి. హాలీ కొంతకాలం హైదరాబాద్‌లో నివసించినాడు. సయ్యదలీ బిల్‌గ్రామీ, అబ్దుల్ హలీమ్ షరర్, మిర్జా హాదీ రుస్వా (ఉమ్రావ్ జాన్ అదా అనే సుప్రసిద్ధ నవలా రచయిత) మొదలయినవాళ్లు హైదరాబాద్‌లో ఉన్నతోద్యోగాలు చేస్తూ సాహిత్య రచన చేసినారు. ఉర్దూ మీడియమ్‌లో ఉస్మానియా విశ్వ విద్యాలయం స్థాపించబడినప్పుడు యూనివర్శిటీ వివిధ శాఖలకు సంబంధించిన గ్రంథాలను ఉర్దూలో అనువదించటానికి గాను "దారుత్తర్జుమా" (ట్రాన్స్‌లేషన్ బ్యూరో) స్థాపించబడింది. ఢిల్లీ, లఖ్నోలేకక ఉత్తరానగల అన్ని నగరాల నుంచి కవులూ, రచయితలూ, విద్వాంసులూ, శాస్త్రవేత్తలు హైదరాబాద్‌కు రప్పించబడినారు. ఫానీ బదాయూనీ, జోష్‌మలీహాబాద్, సిద్ధ జాయెసీ లాంటి కవులు ప్రిన్స్ మొఅజ్జం జా దర్బారులో ఆస్థానకవులుగా చేరినారు, ఫానీ హెడ్మాస్టర్‌గా పనిచేసినాడు. ఆ కాలంలో ఉత్తరాది నుంచి ఎందరో కవులు వచ్చేవాళ్లు. హజ్రత్ అమ్జద్‌హైదరాబాదీ, మఖ్దూమ్ మొహియుద్దీన్, వజ్ద్ ఔరంగాబాదీ, సులేమాన్ అరబ్, అలీ అహ్మద్ జలీలీ, నజీరలీ అదీల్, ఖ్వాజా షౌఖ్, మనోహర్‌లాల్ బహార్, బహాదూర్ అఫ్సర్ మొదలైన కవులనేకులు ఇక్కడివాళ్లే. ఇంకా చాలామంది వున్నారు కాని వాళ్లందరితీ గురించిగాని, ఆ ఉర్దూను గురించి కానీ రాయటం నావ్యాసం పరిధిలోకి రాదు. ఉత్తరాది నుంచి వచ్చిన కవులూ, రచయితలూ హైదరాబాద్ ఉర్దూలో దకనీ లక్షణాలున్నందున పరిహసించేవాళ్లు. కాబట్టి హైదరాబాదీయులు తమ భాష దకనీని మాట్లాడటానికి బిడయ పడి ఉత్తరాది ఉర్దూను మాట్లాడటమే గౌరవప్రదమనుకున్నారు. అయినా ఇప్పటికీ హైదరాబాద్ వాసుల వాక్యనిర్మాణం, క్రియలు చాలా వరకు దక్కనీ ఉర్దూనే – ఆంధ్ర ప్రాంతంలో వుండే ముస్లిముల ఉర్దూ భాషలో దక్కనీ యాస, దకనీ వాక్యనిర్మాణం, దకనీ క్రియా ప్రయోగం చాల వున్నది. ఉత్తరాది ఉర్దూవాళ్లు పరిహసించినా దకనీ ఉర్దూ మాట్లాడే వాళ్లు బిడియ పడనవసరం లేదు. అమూల్యమైన, బహువిధమైన సాహిత్య సంపదగల భాష మన దకనీ ఉర్దూ. ఈ భాష ఎవరికైనా గర్వకారణం. ■



# ముస్లిం పాలకుల కాలంలో వెల్లివిరిసిన మతసామరస్యం

• జి. వెంకటరామారావు

ఢిల్లీ రాజ్యం బలహీనమైపోగానే దక్కన్‌లోని అమీర్లంతా మహమ్మద్ బిన్ తుగ్లక్‌పై తిరుగుబాటు చేసి హసన్ గంగూ బహమనీని తమ ప్రతినిధిగా ఎన్నుకున్నారు. 1347లో ఇతడు బహమనీ రాజ్యాన్ని స్థాపించాడు. దీని రాజధాని గుల్బర్గా, దక్కన్‌లోని తొలి ముస్లిం రాజ్యం ఈ బహమనీ సుల్తాన్లదే. బహమనీ రాజ్యం ఉత్తరాన పైన్‌గంగా నుంచి దక్షిణాన తుంగభద్ర నది వరకు, పశ్చిమాన దౌలతాబాద్ నుంచి తూర్పున భువనగిరి వరకు వ్యాపించింది. ఈనాటి తెలంగాణా ప్రాంతమంతా రెండు శతాబ్దాల వరకు బహమనీల పాలనలో ఉంది. బహమనీ రాజుల కాలంలో పర్షా నుంచి వచ్చి స్థిరపడిపోయిన వారి సఖ్యం ఎక్కువ. అలా వచ్చిన అఫాకీలూ, హబాషీలు షియా మతస్థులు. సుల్తాన్లు వీరి ఎడల ఆదరణ చూపి గొప్ప గొప్ప ఉద్యోగాలిచ్చేవారు. వీరు దక్కనుకొచ్చి సూఫీ మతాన్ని అవలంబించారు. ఇస్లాంలోని సాత్విక మత ధోరణికి వీరు ప్రతినిధులు. ఢిల్లీ సుల్తాన్ల ప్రతినిధులుగా దక్కన్‌లో స్థిరపడినవారు సున్నీలు. వీరికి మత ద్వేషం హెచ్చు. బహమనీ రాజ్య విచ్ఛిత్తికి సున్నీ–షియా పోరాటాలే కారణమయ్యాయి. బహమనీ రాజ్యంలో అధిక సంఖ్యాక ప్రజలు హిందువులు. సుల్తాన్లు ప్రజల ధార్మిక జీవనంలో జోక్యం కలిగించుకోలేదు. ప్రజలు ఎవరి ఇష్టానుసారం లింగాయతులై, వీరశైవులై, జైనులై, మహానుభావ పంథానుయాయులై జీవించేవారు. ప్రజలు తమ ఆహారంలో వరి అన్నం, పప్పులు, పెరుగు, మజ్జిగ, ఆకు కూరలు తినేవారు. జొన్నలు, సజ్జలు కూడా ఉపయోగించేవారు. తాంబూలచర్వణం సర్వసామాన్యం. గోధుమలను పాలలో ఉడికించి కిచిడి (పాయసం) చేసుకునేవారు. బ్రాహ్మణులు శాఖాహారులు, మధుపాన విసర్జితులు. రెడ్లు, వెలమలు, మరాఠాలు, మొదలైన పాలకవర్గం వారు మాంసాహారులు. హిందూ స్త్రీలకు పరదా నియమం లేదు. వారిలో బాల్య వివాహాలు ఆచరణలో ఉండేవి. సతీ సహగమనం పాటించేవారు. నౌకా నిర్మాణాన్ని బాగా వృద్ధిలోకి తెచ్చారు బహమనీలు. వారి కాలంలో నిర్మించిన ఓడలు ఇటలీ దేశపు ఓడల కన్నా నాణ్యతలో మెరుగైనవి. ఆకారంలో పెద్దవి. భారతీయ సైనికులు కత్తులు, బల్లెలు,



www.etelangana.org

బాకులు, ధనుర్బాణాలు ఆయుధాలుగా ఉపయోగించేవారు. అంతకన్నా ఎక్కువ ప్రమాదకరమైన ఆయుధాలతో శత్రు సంహారం చేసేవారు. బహమనీలు హిందువుల కోసం వైదిక పాఠశాలలు, ముస్లిం కోసం మక్తబ్‌లు నిర్మించారు. మహమూద్ గవన్ స్థాపించిన మక్తబ్, గ్రంథాలయం ఆనాడు ప్రపంచ ప్రసిద్ధి చెందినవి. వీరు ఉర్దూ భాషను పోషించారు. ఆంధ్ర ప్రాంతంలో క్రీ.శ. ఎనిమిదవ శతాబ్దంలోనే ముస్లింలు నివసించినట్లు తెలుస్తున్నది. అజ్మీరు నుంచి చాలామంది సూఫీ ఫకీర్లు వచ్చి దక్షిణాపథంలో స్థిరనివాస ఏర్పరచుకున్నారు. ఖాజాబందే నవాజ్, కర్నూలులో షహూసేన్, విశాఖపట్టనంలో హస్మిక్ మదీనా, పిఠాపురంలో నివాసం ఏర్పరచుకున్న అఖిల్ అలీష, నాగూర్‌లో నివాసమున్న మీర్జా అలీష వగైరా ముస్లిం ఫకీర్లు ముఖ్యులు. వీరు గాక అనేకమంది సూఫీలు వచ్చి మత ప్రచారం చేస్తుండేవారు. వీరిలో ఖాదర్ వలీ వంటి అనేకులు గోరీలు ఈ నాటికి యాత్రా స్థలాలుగా ప్రసిద్ధి చెంది వున్నారు. దేశంలో జరిగిన అనేక యుద్ధాల సందర్భంగా మహమ్మదీయ సైనిక కుటుంబాలు ఎన్నో వచ్చి తెలుగుదేశంలో స్థిరపడిపోయినాయి. ఈనాటికి వారి సంతతి వారికి ఉర్దూ భాష మాతృభాషగా ఉంటున్నది. ఈ ప్రాంతాలోలని రాజులు, నవాబుల వద్ద నుంచి వారిలో కొందరు యినాములు, జాగీర్లు కూడా సంపాదించుకున్నారు.

## గోలకొండ కుతుబ్‌షాహీలు

పదహారవ శతాబ్ది తుది నుంచి పదిహేడవ శతాబ్ది చివర వరకు గోలకొండ రాజధానిగా అఖిలాంధ్ర దేశాన్ని పాలించినవారు కుతుబ్‌షాహీ నవాబులు. మూర్తీభవించిన ఆంధ్రత్వాన్ని ప్రదర్శించినవారు కుతుబ్‌షాహీలు. వీరు హిందువులకు గొప్ప ఉద్యోగాలిచ్చారు. తెలుగు కవులను పోషించారు. రాజకీయ వ్యవహారాలను స్థానిక తెలుగు భాషలో కొనసాగించారు. అనేకమంది సుల్తాన్లు తెలుగు నేర్చుకొని ప్రజల కష్టసుఖాలను అర్థం చేసుకుని ప్రజాభిమానం పొందారు. మత పక్షపాతంతో రాజ్యాన్ని పరిపాలించడానికి కుతుబ్‌షాహీలు వ్యతిరేకులు. హైందవ నాగరికతను తెగ నరికివేస్తున్న కాలంలో కుచుబ్‌షాహీలు మాత్రమే మత సహనం కనబరిచారు. కుతుబ్‌షాహీలు షియా వర్గీయులు. సుఫీ భక్తులు. సూఫీ మతం భక్తిత్వానికి ప్రేరణ కలిగిస్తుంది. కనుక కుతుబ్‌షాహీలు పాలనలో హిందూ – ముస్లిం మతాచారాలు, నాగరికతలు, వేడుకలు, వినోదాలు విడదీయరానంతగా కలిసిపోయినై. కుతుబ్‌షాహీ రాజులు మహమ్మదీయులై హిందూ దేవాలయాలను పోషించారు. వీరిలో చివరివాడైన అబుల్ హసన్ తానీష కాలంలో భద్రాచల ప్రాంతానికి తహసీల్దారుగా ఉన్న కంచర్ల గోపన్న భద్రాచల రామాలయ నిర్మాణానికి ప్రభుత్వ ధనాన్ని వినియోగించి సీతారాములకు అనేక అమూల్యాభరణాలు తయారుచేయించాడు. ఆ అపరాధానికి 14 సంవత్సరాల జైలు శిక్ష అనుభవించాడు గోపన్న. ప్రభుత్వ సంపదంతా భద్రాద్రి ఆలయంలోనే రత్నాభరణాల రూపంలో ఉందని తెలుసుకున్న దాన్ని కొల్లగొట్టించకపోవడం తానీష మత సహనానికి తార్కాణం. ఇలాంటి ఉన్నత ప్రమాణాలు మన చరిత్రలో మరో చోట కానరాదు. కుతుబ్‌షాహీ ప్రభువులు స్థానికాచారాలను గౌరవించారు. వీరు తెలుగువారి వలె ఉత్తరీయాలను వేసుకున్నారు. ఇరానీ అలంకరణలు మాయమైనవి. గడ్డం తీసివేసిన మొదటి ముస్లిం ప్రభువు మహమ్మద్ కులీకుతుబ్‌షా, ఈ కుతుబ్‌షాను కంటికి రెప్పలా కాపాడినవాడు అశ్వారావు. ఇతని స్వామిభక్తికి మెచ్చి నవాబు మొసలిమడుగు పాలకునిగా ఇతడ్ని నియమించాడు. కొండపల్లి, కోయిలకొండ, కొండవీడు, ఘనపురం, పానుగల్లు, ఖమ్మంమెట్టు మొదలైన ప్రధాన రక్షక స్థావరాల అధిపతులందరూ నాయక జాతికి చెందిన తెలుగువారే. భోగైక జీవి అయిన తానీష 15 సంవత్సరాల గోలకొండ రాజ్యాన్ని శత్రు దుర్భేద్యంగా పాలించగలిగాడంటే దానికి మాదన్న మంత్రి శేముషీ



దురంధరత్వమే కారణం. దక్కనులో మహమ్మదీయ పరిపాలన ప్రారంభం కావడంతో సహజంగా మహమ్మదీయ మత వ్యాప్తికి కూడా కొంతవరకు ప్రోద్బలం కలిగింది. కాని మొగల్ సామ్రాజ్యం మీద తిరుగుబాటుదారులైన ఇక్కడి మహమ్మదీయ రాజులకు స్థానిక ప్రజలతో సత్సంబంధాలు పెంపొందించుకోవడం ఆవశ్యకర్తవ్యమైంది. అందువల్ల వారు బలవంతపు మతాంతీకరణకు అనుమతించలేదు. అంతేకాదు, వారు ముస్లిం సంస్థలతో పాటు హిందూ దేవాలయాలకు, ధర్మ సంస్థలకు కూడా దానధర్మాలు చేశారు. కుతుబ్‌షాహీ సుల్తానందరూ భాషాప్రియులే. ఇబ్రహీం కులీకుతుబ్‌ష రసిక చక్రవర్తి. భాగీరథి దేవి అనే హిందూ వనితను ప్రేమించి, వివాహం చేసుకొని గోలకొండను ఆమె పేర భాగీరథి నగరమని వ్యవహరింపచేశాడని కొందరి అభిప్రాయం. విజయనగరంలో ఇతడు నివసించిన కాలంలో ఆంధ్ర భాష సాహిత్యాలతో ఏర్పడిన పరిచయంతో రాజైన తర్వాత ఆ భాషను పోషించాడు. రాజ సత్కారం పొందిన ఆంధ్ర కవులలో మరింగంటి సింగరాచార్యులు, అద్దంకి గంగాధర కవి. కందుకూరి రుద్ర కవి ముఖ్యులు. అమీన్‌ఖాన్ ఆ స్థానంలో వున్న పొన్నగంటి తెలగన, అచ్చ తెలుగు కావ్యమైన యయాతి చరిత్ర రచించి అతనికి అంకితమిచ్చాడు. తెలుగులో మొదటి యక్షగానమైన సుగ్రీవ విజయం ఇబ్రహీం కులీ కాలంలోనే వెలువడింది. తానీషా ఆస్థానంలో గురుజాల రంగసాయి అనే వాగ్గేయకార చక్రవర్తి బిరుదు గల పదబంధ నిర్మాణకర్త ఉండేవాడు. కుతుబ్‌షాహీ వంశంలో ఐదవవాడైన మహమ్మద్ కులీకుతుబ్‌షా యువరాజుగా ఉన్నప్పుడు మూసీ నది దాటి పచ్చని అడవిలో మృగయావినోదం చేసేవాడు. ఈ వినోదానికి మరో వినోదం తారసిల్లింది. ఆ ప్రాంతంలో నివసించే భాగ్యమతి అనే హిందూ సుందరితో యువరాజుకు స్నేహం కుదిరింది. ఈ రెండు వినోదాలు సంధించిన చోట రాజైన తరువాత కొత్త రాజధాని నగర నిర్మాణం చేశాడు. భాగమతిని పెళ్లి చేసుకుని ఆమె పేరు హైదర్‌మహల్‌గా దాన్ని మార్చాడు. ఆ మార్పుతో రాజధాని నగరం ఆనాడే హైదరాబాద్‌గా మారింది. ఈ నిర్మాణం 1591లో జరిగింది. మహమ్మద్ కులీ ప్రసిద్ధ నిర్మాత. చార్మినార్ ఇతర నిర్మాణమే. దక్కను పాలకులు స్వతంత్రమైన శిల్ప శైలిని సృష్టించారు. ఇది విలక్షణమైన దక్కను శైలి. గోలకొండలోని వారి సమాధులు వీరి శైలికి చిహ్నాలు. ఇది ఢిల్లీ సుల్తాన్ల ప్రత్యేక శైలికి, పర్షియా శైలికి. చార్మినార్, మక్కామసీదు – ఈ రెండు కట్టడాలు వీరి కాలం నాటి శిల్ప వైభవాన్ని వేనోళ్ల చాటుతున్నాయి. విదేశీ వ్యాపారం బాగా అభివృద్ధి చెందిన కాలమిది. మచిలీపట్నం ఆనాడు గొప్ప వ్యాపార కేంద్రం. ఈనాడు ముంబాయ్ రేవుకు ఉన్న ప్రాముఖ్యం ఆ రోజుల్లో మచిలీపట్నంకు లభించింది. అద్దకపు గుడ్డలు, రవి సెల్లాలు, తివాచీలు, ఉక్కు, ఇనుము, వజ్రాలు, ఏనుగు దంతంలో పనిచేసిన నగిషీ సామానులు, నల్లచేవతో తయారుచేసిన కుర్చీలు, బల్లలు మన దేశం నుంచి ఎగుమతి అయ్యేవి. అరబ్, టర్కీ, ఇరాన్ నుంచి వర్తకులు వచ్చేవారు. దేశీయ వ్యాపారాన్ని ప్రోత్సహించడానికి విదేశీ వస్తువుల మీద పన్ను విధించేవారు. గోలకొండ రాజ్యంలోని ఐశ్వర్యమంతా కోలార్‌లోని వజ్రపు గనుల నుంచి వచ్చినదే. కొండపల్లి, నర్సాపురం కూడా ప్రసిద్ధమైన వజ్రపు గనుల కేంద్రాలే. ఒక్క కోలార్ గనులలోనే 30 వేల మంది కార్మికులు పనిచేసేవారు. ఇక్కడ లభించిన కోహినూర్ వజ్రం కోటి ప్రభలతో వెలుగొందుతున్నది. ఈ రాజ్యానికొచ్చే ఆదాయంతో మరొక మార్గం ప్రభుత్వ యాజమాన్యంలోని సారా విక్రయం. భారతదేశంలోని ఇతర నగరాలలో కంటే ఎక్కువ వేశ్యాగృహాలు గోలకొండలో ఉన్నట్లు డెన్నిస్ కిన్‌కైడ్ రాశాడు. ఆనాటి పురుషులు నాలుగైదు గజాల కలికటు రకపు గుడ్డను అంగీగా ధరించేవారు. పొడుగాటి జుత్తు కలిగి స్త్రీల వలె సిగముడి వేసుకునేవారు. స్త్రీలు ముక్కోణాకృతి కల ఊలగుడ్డను తలకు ధరించేవారు. రాజోద్యోగులు వెడల్పు గల ఖడ్గాలను మొల నుంచి వ్రేలాడదీసుకునేవారు. ఇవి పొడవడానికి, నరకడానికి ఉపయోగపడేవి.



www.etelangana.org

జాతీయ పండుగలను ఈ సుల్తాన్లు మహోత్సాహంగా జరుపుకునేవారు. హిందువులకు సంబంధించిన సంవత్సరాది పండగ నాడు మహమ్మద్ కులీ కుతుబ్‌షా తను కూడా రాచనగరులో పండగ జరుపుకునేవాడు. ఆ రోజులలో హిందూ - ముస్లిం భేద భావం లేదు. మతం మార్చుకున్నవారు తమ హిందూ సోదరుల నుంచి పూర్తిగా వేరుపడిపోలేదు. సరికదా, తమ రూపాచారాలను, అలవాట్లను చాలా వరకు పాటిస్తూనే ఉండేవారు. అనేక పండగలను హిందూ ముస్లింలు కలిసి జరుపుకునేవారు. ముస్లింల ముఖ్యమైన పర్వదినం మొహర్రం. ఇదే పీరీల పండగ. ముస్లింల వలె హిందువులు కూడా పీరీలకు దట్టీలు కట్టేవారు. ఊదు, బెల్లం, కందూరులు చల్లడం, అగ్నిగుండాలను తొక్కడం, పులివేషాలు వేసుకుని ఆడేవారు. ఉభయ మత వర్గాల మధ్య ఏ విధమైన పొరపొచ్చాలు లేకుండా కుతుబ్‌షాహీల కాలం సహజీవనంతో గడిచింది. దాదాపు 175 సంవత్సరాలు వైభవోపేతంగా ఆంధ్ర దేశాన్ని పరిపాలించిన కుతుబ్‌షాహీ రాజ్యాన్ని అనేక కుట్రలతో మొగల్ చక్రవర్తి ఔరంగజేబు 1687లో తన రాజ్యంలో కలుపుకొన్నాడు. ఆనాటి నుంచి ఆసఫ్‌జాహీ పాలన మొదలయ్యేవరకు దాదాపు యాభై సంవత్సరాలు ఆంధ్రదేశంలో అరాచకం తాండవ చేసింది. ■

# తెలంగాణ అమ్మీ హమారి

● యండి.యూసుఫ్ అలి

సారె జహాఁ సే అచ్ఛి
తెలంగాణ అమ్మి హమారి హమారి ॥సారె॥

ఆ అమ్మ కన్న ముద్దుబిడ్డలం
తెలుగు గడ్డపై పూసిన పువ్వులం
ప్రాజెక్టుల కోసమై ప్రాణాలు పోసినాం
ఉద్యోగాల కోసమే చాకిరీ చేసినాం ॥సారె॥

ఊదుతాం! ఊదుతాం! ఊదుతాం!
ఊపిరున్నంతవరకూ ఉద్యమ బూర
నడుస్తాం! నడుస్తాం! నడుస్తాం!
అమర జ్యోతుల వెలుగు బాట
పాడుతాం! పాడుతాం! పాడుతాం!
ఆ తల్లి నేర్పిన పౌరుషం పాట ॥సారె॥

ఉరుముతాం! ఉరుముతాం! ఉరుముతాం!
ఉరిమురిమి ఉరిమురిమి ఉరుముతాం
తెలంగీ హై హం! తెలంగీ హై హం! తెలంగీ హైహం!
తెలంగాణ హమార హమార
సారె జహాసే అచ్ఛి
తెలంగాణ అమ్మి హమారి హమారి ॥సారె॥ ■





# మొహర్రం పాట

ఇస్లాం మతస్థాపకుడు మహమ్మదు ప్రవక్త మరణా (క్రీ.శ. 632)నంతరం కొంతకాలానికి ఖలీఫా పదవికి పోటీ ఏర్పడుతుంది. మహమ్మద్ బిడ్డ కొడుకైన, హసన్‌ను ఈ పోటీలో భాగంగా 'మాలియా' అనే అతను కుట్రచేసి విషప్రయోగంచేసి హత్య గావిస్తాడు. తర్వాత అధికారంలోకి వచ్చిన మాలియా తమ్ముడైన యెజిద్ మీద ప్రజలు తిరుగుబాటు చేస్తారు. హసన్ సోదరుడైన హుస్సేన్‌ను తిరుగుబాటుకు నాయకత్వం వహించమని కోరతారు. హుస్సేన్‌నీ అతని వెంట ఉన్న 72 మంది పరివారాన్నీ యెజీద్, బాగ్దాద్‌కు 62 మైళ్ళ దూరంలో ఉన్న 'కర్బలా' ప్రాంతంలో హత్య చేయిస్తాడు. ఆనాటి కర్బలా యుద్ధంలో మరణించినవారి స్మృతి చిహ్నంగా దుఃఖంలో మునిగి ఉండే కార్యక్రమమే మొహర్రం. దీన్నే పీర్ల పండుగ అంటారు. షియాలు ఛాతీని బాదుకుంటూ శోకాన్ని వ్యక్తం చేస్తారు. తెలంగాణాలో గోలకొండ కుతుబ్‌షాహీల (షియాలు) కాలం నుండీ ఈ పండగ ఉన్నది. ముస్లిములు, ముస్లిమేతరులు కలిసే ఈ పండగ చేస్తారు. ఈ సందర్భంగా తెలంగాణా జానపదులు పాడుకునే పాటలనే మొహర్రం పాటలు అంటారు. ప్రవక్తమనుమలైన ఈ హసన్, హుస్సేన్‌లను తలుచుకుంటూ చారిత్రకాంశాలతో కొంత తెలంగాణీకరించి పాడుకునే కథాగేయాన్ని జంగ్‌నామా (కర్బలా యుద్ధ భూమి పేరుతో గలవి) అంటారు. అది ఇక్కడిస్తున్న పాట.

| | |
|---|---|
| మొత్తుల్ల గొట్టిరి మొత్కుల్ల వాపిరి | ఆశన్న ఊశన్నెలాల్ |
| మొత్కుల్ల కడుపుల మౌలాలిపుట్టె | ,, |
| బురుగుల్ల గొట్టిరి బురుగుల్ల వాపిరి | ,, |
| బురుగుల్ల కడుపుల బుబాయిపుట్టె | ,, |
| ఆశన్న ఊశన్న అన్నదమ్ములోయ్ | ,, |
| ఆశన్న ఊశన్న యేడ గూడిరోయ్ | ,, |
| మక్క మసీదు కాడ మధిరేశాలకాడ | ,, |
| ఆశన్న దోతులు ఊశన్న గట్టె | ,, |
| ఊశన్న దోతుల ఆశన్న గట్టె | ,, |
| ఆశన్న వంగీలు ఊశన్న దొడిగె | ,, |
| ఊసన్న వంగీలు ఆశన్న దొడిగె | ,, |



www.etelangana.org

| | | |
|---|---|---|
| ఆశన్న పట్కా ఊశన్న చుట్టే | | ,, |
| ఊశన్న పట్కా ఆశన్న చుట్టె | | ,, |
| ఆశన్న దుప్పటి ఊశన్న గప్పె | | ,, |
| ఊశన్న దుప్పటి ఆశన్న గప్పె | | ,, |
| ఆశన్న దుప్పటి అచ్చుమల్లెలోయ్ | | ,, |
| ఊశన్న దుప్పటి ఊదులాడలోయ్ | | ,, |
| ఆశన్న గుఱ్ఱం ఊశన్న యెక్కె | | ,, |
| ఊశన్న గుఱ్ఱం ఆశన్న యెక్కె | | ,, |
| ఆశన్న గుఱ్ఱం అమడ మెరిసే | | ,, |
| ఊశన్న గుఱ్ఱం ఉరిమిల మెరిసే | | ,, |
| యాడికెల్లి –దామాడి కచ్చిరోయ్ | | ,, |
| తల్లిదగ్గరికి జేరవచ్చిరోయ్ | | ,, |
| తలాలంచి ముర్దాడజేసిరోయ్ | | ,, |
| మొయ్‌మొయ్ కుల్లలు మోటు దొల్లలోయ్ | | ,, |
| లదాయిక్లైనా మేమే షోతమే – అమ్మ బీబీపాత్మా | | 2 |
| వద్దు వద్దురా కొడాకులాల | | ఆశన్న ఊశన్నెలాల్ |
| తాతలు వోయి తిరగలేదురా | | ,, |
| తంఁడ్రులు వోయి మరల లేదురా | | ,, |
| అద్దన్న వోతం పొమ్మన్నవోతం అమ్మాబీబీ పాత్మా | | 2 |
| అద్దద్దు కొడుకా ఈ బుద్దినీకు | | ఆశన్న ఊశన్నెలాల్ |
| నీ తంఁడ్రిమౌలాల్ సచ్చినప్పుడోయ్ | | ,, |
| దంచుకపడ్లు దంచినడ్పినా | | ,, |
| వడకు టోకులు వడికి నడ్పినా | | ,, |
| తవ్వెడు బియ్యం తైద రొట్టెలోయ్ | | ,, |
| మానెడు బియ్యం మాలిద ముద్దాల్ | | ,, |
| సోలెడు బియ్యం సొంగరొట్టెలోయ్ | | ,, |
| ఇవన్ని వెట్టి మిమ్మునడ్పినా | | ,, |
| వద్దనావోతం పొమ్మన్నావోతం అమ్మాబీబీ పాత్మా | | 2 |
| యాడికెల్లి | దామాడి కచ్చిరోయ్ | ,, |
| బాడిషాయలకు | చేరవచ్చిరోయ్ | ,, |
| బొద్దు మలెల్లవీ – | వాల్లెగోసిరోయ్ | ,, |
| దారంలేని | దండలల్లిరోయ్ | ,, |
| అడికెల్లి | దామాడికచ్చిరోయ్ | ,, |
| తల్లిదగ్గరికి | జేరవచ్చిరోయ్ | ,, |
| తలాలంచి | ముర్దాలేజేసిరోయ్ | ,, |
| తల్లిమెడలా | దండలేసిరోయ్ | ,, |
| అడికెల్లి | దామేడికచ్చిరోయ్ | ,, |
| కాపువాడల | జేరవచ్చిరోయ్ | ,, |
| సన్నం బియ్యం | సేతవట్టిరోయ్ | ,, |



| | | |
|---|---|---|
| ఆడికెల్లి | దామేడి కచ్చిరోయ్ | ,, |
| కుమ్మరివాడల | జేరివచ్చిరోయ్ | ,, |
| షెర్వతు బుడ్లు | సేతవట్టిరోయ్ | ,, |
| ఆడికెల్లి | దామేడికచ్చిరోయ్ | ,, |
| కోమాటివాడల | జేరవోయిరోయ్ | ,, |
| లోవానము | ఊదులే దిద్దిరోయ్ | ,, |
| ఆడికెల్లి | దామేడి కచ్చిరోయ్ | ,, |
| గొల్లవాడల | జేరవోయిరోయ్ | ,, |
| సురుకులేని | మేకాల పట్టిరోయ్ | ,, |
| ఆడికెల్లి | దామెడల కచ్చిరోయ్ | ,, |
| బుకోల్ల వాడల | జేరవోయిరోయ్ | ,, |
| బుకాగులాలు | సేతవట్టిరోయ్ | ,, |
| ఆడికెల్లి | దామేడకచ్చిరోయ్ | ,, |
| తమ్మళ్లవాడల | తామేవోయిరోయ్ | ఆశన్న ఊశన్నెలాల్ |
| పూలదండలు | సేతవట్టిరోయ్ | ,, |
| ఆడికెల్లి | దామేడకచ్చిరోయ్ | ,, |
| మాదిగవాడల | జేరవోయిరోయ్ | ,, |
| డప్పులు కోలలు | సేతవట్టిరోయ్ | ,, |
| సుక్క పొద్దున | తామెలేసిరోయ్ | ,, |
| సల్లీల్లతానాలే | చేసిరోయ్ | ,, |
| అల్కుపూతలు | తామెచేసిరోయ్ | ,, |
| అడికెల్లి | దామేడి కచ్చిరోయ్ | ,, |
| తల్లి దగ్గరికి | చేరవచ్చిరోయ్ | ,, |
| మాలిదగూడ | వాల్లె జేసిరోయ్ | ,, |
| మేవీ సచ్చిన | దినాంనాడే అమ్మా బీబీపాత్మా | 2 |
| దండలు తేగి | వొల్లెవడుతాయే | ,, |
| మాలిదవోయి | మన్నుఅవుతదే | ,, |
| షర్బతువోయి | రక్తమయితదే | ,, |
| అమ్మగూడ | శోకంబువెట్టెరా | ,, |
| కూడికంటి | శోకంబుచూదరా | ,, |
| కుంబవర్షమయి | పోతన్నదా | ,, |
| ఎడమకంటి | శోకంబుకూడరా | ,, |
| ఏరులాగా | పారుతున్నదా | ,, |
| అమ్మగెట్టి | జలతారు చీరెరరా | ,, |
| శోకానమే | నానుతున్నదా | ,, |
| అమ్మదాడిగె | వంపూసురైకెరా | ,, |
| శోకానమే | నానుతున్నదా | ,, |
| ఆదికెల్లి | దామేడి కచ్చిరోయ్ | ఆశన్న ఊశన్నెలాల్ |
| తాతగోరికి | జేరవచ్చిరోయ్ | ,, |
| తలాలంచి | ముర్దాలేజిసిరోయ్ | ,, |



www.etelangana.org

ఆడికెల్లి దామేడ కచ్చిరోయ్ ,,
పట్కరివాడల జేరవోయిరోయ్ ,,
పూలవచ్చడం సేతవట్టిరోయ్ ,,
ఆడికెల్లి దామేడి కచ్చిరోయ్ ,,
ముత్తాతగోరికి జేరవచ్చిరోయ్ ,,
పూలపచ్చడం యాడకచ్చిరోయ్ ,,
ఆడికెల్లి దామేడి కచ్చిరోయ్ ,,
కోమాటి వాడల జేరవోయిరోయ్ ,,
లోవాన మూదులే దిద్దిరోయ్ ,,
యాడికెల్లి దామేడికచ్చిరోయ్ ,,
తండ్రి గోరికి జేరవచ్చిరోయ్ ,,
లోవాన ఊదులే కాల్చిరోయ్ ,,
ఆడికెల్లి దామేడి కచ్చిరోయ్ ,,
తండ్రి ఉండే కొరిడి కచ్చిరోయ్ ,,
కొరిడి తాలాలే దీసిరోయ్ ,,
తండ్రివట్టె పైవులే లెంకిరోయ్ ,,
అందులగూడ ఏమనున్నదోయ్ ,,
లడాయిలాడే వంతమున్నదోయ్ ,,
ఆడికెల్లి దామేడికచ్చిరోయ్ ,,
గుఱ్ఱాల కొరిడికచ్చిరోయ్ ,,
గుఱ్ఱాలను సేతవట్టిరోయ్ ,,
ఆడికెల్లి దామేడి కచ్చిరోయ్ ,,
గంగ గడ్డకే జేరవచ్చిరోయ్ ,,
పారే గంగల తానమాడిరోయ్ ,,
యాడికెల్లి దామాడి కచ్చిరోయ్ ,,
బల్లాల కోరిడి కచ్చిరోయ్ ,,
బండెడు బల్లాలు వాల్లె దీసిరోయ్ ,,
పుట్టెడు పూల్వలు వాల్లె నూరిరోయ్ ,,
గుఱ్ఱాలకు గూడాలేసిరోయ్ ,,
నల్లమందు గోలిలేసిరోయ్ ,,
ఎడమసంకకు ఎయ్యినూట బల్లెలు ,,
కూడిసంకకు నూటొక్క బల్లెలు ,,
గూప్పిచ్చి గుఱ్ఱాలే ఎక్కిరోయ్ ,,
దాడించికొడేసి కొట్టిరోయ్ ,,
ఆడికెల్లి దామడి కచ్చిరోయ్ ,,
దండులోవోయి వాల్లె దుంకిరోయ్ ,,
ముందటి దండులు నరుకుతున్నరోయ్ ,,
వెనకదండుకు జాడలంటయోయ్ ,,
వెనక దండులు నరుకుతుంటెనోయ్ ,,
ముందటి దండుకు జాడలంటయోయ్ ,,



చెరుకు నరికిన సందము నరికిరి ,,
ఉల్లి కోసిన సందము గోసిరి ,,
బల్లెము బల్లెము తలుగుతుంటే నోయ్ ,,
ఉక్కుపొడలే రాలుతున్నవోయ్ ,,
కాలు దుమ్ము కైలాసమంటెనోయ్ ,,
యాడికెల్లి దామాడికచ్చిరోయ్ ,,
మక్కకోనేరుకు చేరవచ్చిరోయ్ ,,
ఆందులగూడ లీల్లు తాగిరోయ్ ,,
అక్కడిక్కడా వాల్లెచూసిరోయ్ ,,
శెల్లలుగూడ వరచుకున్నరోయ్ ,,
అందులకూడ వండుకున్నరోయ్ ,,
పాలివారు దవదారులచ్చిరోయ్ ,,
ఊశన్న కిడిసిరి ఇమ్మయిలోన ,,
ఆశన్న కిడిసిరి ఎదురగుండెల ,,
ఆడికెల్లి దామేడికచ్చిరోయ్ ,,
ఇంటివద్దకు చేరవచ్చిరోయ్ ,,
మేము వచ్చినము తలుపుతీయ్యవే అమ్మా బీబీ పాత్మాకి 3
పొదలకు దారామున్నది కొడుకా ఆశన్న ఊశన్నెలాల్
పాలివారు దవదారులొచ్చిరోయ్
ఆడికెల్లి దామాడికచ్చిరోయ్ ,,
బాయిదగ్గరికి జేరవచ్చిరోయ్ ,,
అక్కడ ఇక్కడ వాల్లెచూసిరోయ్ ,,
బాయిలగడ వాల్లెదూకిరోయ్ ,,
పాలివారు దవదారులొచ్చిరోయ్ ,,
ఎనుగుల ఉన్న తొండగూడెనోయ్ ,,
బాయిలోనికి దారిచూపెనోయ్ ,,
బాయిలగూడ వాల్లెదుంకిరోయ్ ,,
జుట్లుపట్టుకుని మీదికి తెచ్చిరి ,,
ఓర్లంగ తలపల్లె గోసిరోయ్ ,,
ఇంటివద్దను ఏమి జరిగెనోయ్ ఆశన్న ఊశన్నెలాల్
దండలు తెగి ఓల్లెవాడేనోయ్ ,,
మాలిదవోయి మన్నువాయినోయ్ ,,
షర్బతువోయి రక్తమాయెనోయ్ ,,
సత్తిర సత్తిర కొడాకులాలా ,,
మీరు సత్తిర కొడాకులాలా ,,
యాడాదికి పన్నెండుదినాలు ,,
మొహర్రంబొబ్బలు వెట్టని కొడకా[1] ,,

(1) నిజామాబాదు జిల్లా మొహర్రం పాటలు –కె.గంగాధర్ (1998)పు.10–19, 34–40. "ముంగిలి" నుంచి



www.etelangana.org

# అద్వాన్నపు తీర్పు

● పసునూరి రవీందర్



వాటాలు పంచే దేశంలో విశ్వాసాలే గెలుస్తాయి
ఆధారాలు హతమవుతాయ్
కోర్టులు చట్టాలు అన్నీ ఉత్తమాటలు
మతం నల్లకోటు ధరించాక
మసీదులు కూలినట్టే
మనుషుల మనుసులు కూలుతున్నయ్

ప్రజాస్వామ్యం పై అత్యాచారం.. చేసి
మెదళ్ళు ట్యూన్ చేస్తారు
న్యాయదేవత కండ్లకు నల్లగంతలు కట్టినోళ్ళే
బొండిగ మీద కత్తులు పెట్టి
అన్యాయాలకు వత్తాసు పలికిస్తారు
అంతా చేసి శాంతి మంత్రం...
కట్టే విరుగొద్దు...పాము చావద్దు
అధికార పీఠం నిలుచుంటే చాలు!

అంతా ప్రశాంతం
రగులుతున్న గుండెల మీద
ఒక అందమైన ముసుగు
నెత్తురు కనిపించకుండా హత్యలు చేసే
హంతకులున్న చోట...
మినార్‌ల మీద పావురాలు బిక్కుమంటున్నయ్

ఔను!
ఒక కొత్త దుర్మార్గపు సంప్రదాయానికి
నిజంగానే తెరలేచింది....
తలా కొంచెం సిగ్గుపడదాం రండి



# మరి ముస్లింలు ఎవరు?



కన్నబిడ్డని సవతి కొడుకుగా / చిత్రించింది చరిత్ర
అన్నదమ్ముల్నించి చీల్చి / నన్ను ఒంటరివాణ్ణి చేసింది చరిత్ర...'

- ఖాదర్ మొహియుద్దీన్

మన దేశంలో 15 నుంచి 20 కోట్లమంది ముస్లింలమున్నాం. ఆంధ్రప్రదేశ్‌లో 90 లక్షలదాకా ఉన్నాం. ఇంత పెద్ద సమూహం ఇవాళ భయంకరమైన సాంఘిక వివక్షకు, దుర్భర దారిద్ర్యానికి, అత్యంత నిరాదరణకూ, నిరక్ష్యరాస్యతకూ గురవుతూ వస్తున్నది. అన్నిరంగాల్లో అట్టడుగునపడి కొట్టుమిట్టాడుతున్నది. ఇవాళ 70 శాతం ముస్లింలు దారిద్ర్యరేఖకు దిగువన ఉన్నారని, వీళ్లలో 18 శాతంమంది మాత్రమే 'అక్షరాస్యుల'నీ, ఆడవాళ్లు మరీ 4 శాతమేననీ, అన్నిరంగాల్లో రెండు, మూడు శాతమో, అంతకన్నా తక్కువో ఉన్నారనీ, ఎస్సీ,ఎస్టీల కన్నా, ఇతర మైనారిటీలకన్నా వెనకబడి ఉన్నారనీ ఎన్నో నివేదికలు చెబుతున్నాయి.

మాకు చదువుల్లేవు.. ఉద్యోగాల్లేవు.. పదవుల్లేవు.. పరిశ్రమల్లేవు. మాకు భూముల్లేవు. ముఖ్యంగా 90 శాతం మందికి ఏ వృత్తులూ లేవు. ఇన్నాళ్లు బిజెపి, ఆరెస్సెస్‌వాళ్లు మమ్మల్ని భారతీయులు కాదంటూ ప్రచారం చేశారు, ఇవాళ కొంతమంది బీసీలు మేం బీసీలు ఎట్లవుతామంటున్నారు. మరి మేం ఎవరం?

మేం ఈ దేశ మూలవాసులం! ద్రావిడులం!

శతాబ్దాల నాడు ఈ దేశంలోని మూలవాసులైన ద్రావిడులమీద ఆధిపత్యం సంపాదించిన ఆర్యులు (బ్రాహ్మణులు, కొన్ని అగ్రకులాలవాళ్లు) ద్రావిడుల్నంతా అంటరానివాళ్లని చేసి పారేశారు. ముడ్డికి తాటాకు కట్టి మీ అడుగుల గుర్తులు కూడా కనబడొద్దన్నారు. మూతికి ముంత కట్టి మీ ఉమ్మి కూడా నేలమీద పడొద్దన్నారు. ఊరికీ, కాటికీ, ఆఖరికి మంచి నీళ్లకూ దూరం చేశారు. వాళ్లొస్తుంటే చెప్పులు విడిచి చేత పట్టుకొని పక్కకు నిలబడాలి. తలకు రుమాల ఉంటే తీసిపట్టుకోవాలి. బడికీ, గుడికీ కూడా అంటరానివాళ్లను చేశారు. అలాంటి ఎన్నో అవమానాలు, హింస అనుభవిస్తూ వచ్చిన ఎంతో కాలానికి సూఫీ ప్రవక్తలు వచ్చి మమ్మల్ని అక్కున చేర్చుకున్నారు. వాడు అసుంట అసుంట అంటే సూఫీలు మాకు అలాయిబలాయి ఇచ్చారు. మా గుండెకు గుండెను కలిపారు. మేము తాగిన గిలాసుల్లో వాళ్లు నీళ్లు తాగారు. మాతోపాటు కూచొని బువ్వ తిన్నారు. అగ్రహారాల వీధుల నుంచి మా శవాల్ని



www.etelangana.org

కూడా తీసుకెళ్లనివ్వని దుష్ట సంస్కృతిని బద్దలు చేస్తూ మా వాళ్ళ శవానికి వాళ్లు భుజం పట్టారు. మేం మజీదుకు వెళ్తే భుజం భుజం కలిపి నమాజు చదివించారు. మా గుండెలు చెరువులయ్యాయి.. మా మనసులు సముద్రాలయ్యాయి.. మేం మా దేహాలతో కాదు, గుండెలతోనే వాళ్లను అలాయిబలాయి తీసుకున్నాం. మేం వాళ్లలో ఒకరమైనాం. మాకు కష్టమొస్తే, నష్టమొస్తే వాళ్లు మంచి మాటల్తో మమ్మల్ని ఓదార్చే, ఆదరించే ప్రవక్తలయ్యారు. మాకు రోగమొస్తే, రొష్టొస్తే తాయెత్తులిచ్చి అభయమిచ్చే దేవుళ్లయ్యారు. మేం అందరం ముసల్మానులమైనాం. మేం ఈ దేశ మూలవాసులం. ద్రావిడులం. మాదిగలం. మాలలం. ఆదివాసీలం. బీసీలం!

మాదిగ వాడలూ తురక బజార్లూ / మురికివాల్వల్నీ 'నీసు కంపు'ల్నీ
ఒక్కలాగే మోస్తుంటాయ్ / వాని గుడిసెలో ఎండు తునకలై
మా సాయమాన్లో కవాబులై / దండేనికి వేలాడే 'కౌసు వాసన'
మా బంధుత్వాన్ని చెబుతోంది —స్కైబాబ

మేం మతం మారినవాళ్లం కాము. మాకు మతం లేకుండె. ఈ దేశంలో ఆదివాసీలకు, దళితులకు, బీసీ కులాలకు మతం లేదు. మాకు ఇష్టమై ఇస్లాం స్వీకరించాం. మాలో కొందరు క్రైస్తవం స్వీకరించారు. ఇస్లాం, క్రైస్తవం స్వీకరించకుండా ఉండిపోయిన మా దళితుల్ని, ఆదివాసీల్ని, బీసీ కులాల్ని ఇవాళ బీజెపి, ఆరెస్సెస్ 'హిందువుల'ంటున్నాయి. మేం హిందువులం కామని బీసీల తరఫున ప్రొ.కంచ ఐలయ్య పుస్తకం రాశాడు. దళితుల తరఫున దళిత కవులు, మేధావులు అంటున్నారు. ఇంకా అంటారు. ఇన్నాళ్లు కప్పిపుచ్చిన నిజాల్ని, కుట్రపూరిత ఆరెస్సెస్ గోబెల్ ప్రచారాల్ని బద్దలు చేస్తారు. రేపటికి రాజ్యానికొస్తారు.

స్వాతంత్ర్యానికి ముందు అగ్రకులస్తులంతా కలిసి మమ్మల్ని మైనారిటీలన్నారు. (ముస్లింలు, క్రైస్తవులు, సిక్కులు, దళితులు, ఆదివాసులందర్నీ మైనారిటీలన్నారు. రిజర్వేషన్లిచ్చారు.) ముస్లింలకు 25 శాతం రిజర్వేషన్లు సాధించుకున్నాం. ప్రత్యేక నియోజకవర్గాలను కూడా సాధించుకున్నాం. స్వాతంత్ర్యం తర్వాత అవన్నీ లేకుంట చేశారు. పాకిస్తాన్‌కన్నా మనదేశంలోనే ముస్లింలం ఎక్కువమందిమున్నాం. 'మతం' మారి ఇస్లాంలో చేరిన బ్రాహ్మణులు, అగ్రకులాలవాళ్లు పాకిస్తాన్ పోయారు. ధనిక ముస్లింలంతా పాకిస్తాన్ వెళ్లిపోయారు. ఇక్కడున్న మేమంతా దళిత ముస్లింలం. పేద ముస్లింలం. ఈ మట్టిమీది ప్రేమతో ఈ గడ్డనే హత్తుకుపోయినవాళ్లం. అట్లాంటి మాకు రిజర్వేషన్లు లేకుండా ఎట్లా చేశారు? 57 ఏండ్ల అన్యాయం చేసింది చాలు! మాకివాళ దక్కాల్సినంత రిజర్వేషన్ ఇవ్వాల్సిందే.

## మేం ఈ దేశ మూలవాసులం! ద్రావిడులం!

మొన్న దస్యుణ్ణి నిన్న ఛండాలుడ్ని / ఇవాళ నా సవాలక్ష గాయాల సాక్షిగా సాయిబుని / నిజానికి నేను దళితుణ్ణి —ఖాజా

కేవలం 2 నుంచి 3 శాతం ముస్లింలు మాత్రమే ఈ దేశంలో బైటి దేశాల నుంచి వచ్చినవారు. మిగతా 97 శాతం ఈ దేశ మూలవాసులే. 'అంటబడనివ్వని' కులాలనుంచీ, 'వెనకబడేయబడ్డ' కులాలనుంచీ ఇస్లాం స్వీకరించినవారే. ఈ విషయాన్ని తొక్కిపెట్టి 'హిందూత్వ'వాదులు కుట్ర చేశారు. మమ్మల్ని బైటి దేశస్తులుగా దుష్ప్రచారం చేశారు. దేశద్రోహులుగా, ఐఎస్ఐ ఏజెంట్లుగా ముద్రలు వెయ్యడానికి ప్రయత్నించారు. కానీ మేమంటున్నాం–

మేం ఈ దేశ మూలవాసులం! ద్రావిడులం!

ఇరానియన్లను, ఈజిప్షియన్లను, అఫ్ఘనిస్తానీలను చూడగానే గుర్తుపట్టవచ్చు. నీగ్రోలను, తెల్లవాళ్లను గుర్తుపట్టవచ్చు. ఆఖరికి మన ఉపఖండంలోనే ఉన్న నేపాలీలను చూడగానే గుర్తుపట్టవచ్చు. వాళ్లు కూడా మమ్మల్ని చూడగానే ఇండియన్లుగానే గుర్తుపడతారు! ఎందుకంటే (ఆంత్రొపాలజీ ప్రకారం) భౌగోళిక ఉష్ణోగ్రతలకు అనుగుణంగా ఈ భుగోళంలోని వివిధ ప్రాంతాల్లో వివిధ రకాలుగా, భిన్నమైన



శరీర నిర్మాణాలతో మనుషులున్నారు. అట్లే మనమంతా ఒక్కలాగే ఉన్నాం. అందుకే ఇక్కడ దళితులూ–మేమూ, బీసీలూ–మేమూ, ఆదివాసీలూ–మేమూ అన్నదమ్ముల్లాగే కనిపిస్తాం. మా ముఖ కవళికలూ, వాళ్ల ముఖాలు (కాపాలాలు, ముక్కులు) ఒక్కతీరుగానే ఉంటాయి. ఎందుకంటే వాళ్లే మేమైనాం కాబట్టి. అందుకే మేం ఈ దేశ మూలవాసులం. ద్రావిడులం.

రండి మాతో.. ఆసవాళ్లు చూపుతం– హైదరాబాదులో ధోబీలు (చాకలి), హజామ్ (మంగలి), ఖసాబ్ (కటిక), సునార్ (కంసాలి), బడయ్ (వడ్రంగి) తదితర వృత్తులు కొనసాగిస్తున్న ముస్లింలున్నారు. నల్గొండ టౌన్‌లో హైదర్‌ఖాన్‌గుడ, మాన్యంచెల్క, జామ మసీదు, అక్కచెల్మలాంటి ప్రాంతాల్లో సగంమంది మాలమాదిగలుంటే సగంమంది ముస్లింలున్నారు. ఇండ్లన్నీ కలిసిపోయి ఉంటాయి (దాన్నిబట్టి ఎవరు ముస్లింలుగా మారారో అర్థమవుతుంది). నల్గొండ జిల్లా కొప్పోల్ దగ్గర ఒక 'గంట ఫకీరోల్ల గూడెం' ఉంది. చీకటితోనే గంట కొడుతూ అడుక్కుంటానికి ఊర్లలోకి వచ్చేవాళ్లు వీళ్లు. బహుశా 'యాచకుల'నుంచి ఇస్లాం స్వీకరించినవారు. అన్ని జిల్లాల మారుమూలల్లో ఎలుగుబంటితో ఊర్లలోకి అడుక్కుంటానికి వచ్చే ముస్లింలున్నారు. ఊరూరు తిరుగుతూ కమ్మరి పని చేసేవారు (లోహార్), విగ్రహాలు పోతపోసే ముస్లింలున్నారు. ఖమ్మం పక్కన 'జింకలోల్లు'న్నారు. కడప జిల్లాలో గారడి వాళ్లున్నారు. పహిల్వాన్ (దొమ్మర?)లున్నారు. వేంపల్లిలో 'బోరెవాలె' (ఈతచాపలు అల్లేవాళ్లు) 300 ఇండ్లున్నాయి. వీళ్లను బొంతలోల్లు అని మన తెలుగోల్లు పిలుస్తారు. ఇప్పుడు ప్లాస్టిక్ చాపలు వచ్చేశాయి కాబట్టి ఈతచాపలు ఎవరూ కొనడంలేదు. వాళ్లు కుట్టిన చాపలు వాళ్లలో ఎవరైనా చచ్చిపోతే చుట్టి బొందపెట్టడానికి పనికివస్తున్నాయి. వాళ్లిప్పుడు దుర్భరమైన దారిద్ర్యంలో మగ్గుతున్నారు. జిల్లావ్యాప్తంగా వీళ్లున్నారు. వేంపల్లిలోనే ఘోడేవాలె (గుర్రాలోల్లు), లకడేవాలె (అడవిలోకెళ్లి కట్టెలు కొట్టుకొచ్చి అమ్ముకొనేవాళ్లు) ఉన్నారు. నల్గొండలో ఊర్లకు ఊర్లు కాశోల్లు (ఫత్తర్‌ఫోడ్) ఉన్నారు. నల్గొండకు దగ్గర్లోనే కాశివారిగూడెం, కాసారం ఉన్నాయి. వీళ్లంతా రాళ్లు కొట్టే ముస్లింలు. రాళ్లు కొట్టడమే తమ పిల్లలకు విద్య. వేరే చదువులు చదివించలేకపోతున్నామంటున్నారు. మాలలనుంచి, పద్మశాలీలనుంచి ఇస్లాం స్వీకరించి రకరకాల పేర్లతో పిలువబడుతున్న దూదేకులవాళ్ల గురించి చాలావరకు అందరికీ తెలుసు. బీడీలు చుట్టే ఆడవాళ్లు, విస్తర్లు కుట్టే ఆడవాళ్లు, మిషిన్లు తొక్కే ఆడవాళ్లు, కూలినాలికిపోయే ఆడవాళ్లు ఎందరో..! ఇట్లా ఎన్నో ఉదాహరణలు.. రాజస్తాన్‌లో రోడ్లపై చెప్పులుకుట్టే ముస్లింలు కనబడతారు. బెంగాల్లో కూడా చెప్పులపని, తోలుపని చేస్తున్నారు. బనారస్‌లాంటి చోట్ల బట్టలునేసే ముస్లింలున్నారు. బీహార్లో పాములు ఆడించే 'సఫేరా'లు ముస్లింలే. ఇట్లా అన్ని రాష్ట్రాల్లో వివిధ వృత్తులుచేసే ముస్లింలు ఆసవాళ్లుగా కనిపిస్తారు. ఆదివాసీ–దళిత– బహుజనుల 60కి పైగా వృత్తుల్లో ముస్లింలు కొనసాగుతున్నారని కొన్ని నివేదికలు చెబుతున్నాయి. దీన్నిబట్టి ఆయా కులాలవాళ్లే ముస్లింలుగా మారారని అర్థమవుతుంది. ఇట్లాంటివాళ్లను రిజర్వేషన్లకు దూరంగా ఎలా ఉంచుతారు?

## న ఘర్‌కా న ఘాట్‌కా!

ఇస్లాం స్వీకరించకముందు మాకు కులవృత్తులుండె. అక్కడా ఇక్కడా నవాబుల పాలన ఉన్న సమయంలో తమది 'నవాబుల మతం'గా ఫీలయి కొంత, ఆయా వృత్తుల్లో కొనసాగుతున్నవాళ్లను ఇతర బ్రాహ్మణ సమాజం 'నీచం'గా చూస్తుండడంవల్ల మరింత ముస్లింలంతా వృత్తులు వదిలేసుకున్నారు. చిన్నాచితక ఉద్యోగాలు సంపాదించుకున్నారు. కొంత భూముల్ని 'పట్టా చేయించు'కున్నారు. వ్యవసాయం చేయడానికి, చేయించుకోనికి వీళ్లేమీ రెడ్లూ, కమ్మలూ, వెలమల్లాంటివాళ్లు కాకపోవడంతో తర్వాతర్వాత ఆ భూములు రెడ్లు, కమ్మలు, వెలమలే సొంతం చేసుకున్నారు. ఇటు వృత్తులు లేకుండాపోయాయి, అటు భూముల్లేకుండా పోయాయి. రెంట చెడ్డ రేవడి బతుకులయ్యాయి. అదనంగా రిజర్వేషన్లు లేకుండా చెయ్యడంతో మా బతుకులు అన్యాయమైపోయాయి. రోడ్డున పడ్డాయి.

ఇవాళ రోడ్ల పక్కన పండ్ల బండ్లన్నీ ముస్లింలవే. రోడ్‌సైడ్ మెకానిక్‌లంతా ముస్లింలే. సైకిల్ గిల్లల పంక్చర్‌లు బాగుచేసేవాళ్లంతా ముస్లింలే. దర్జీలు, గడియారాలు బాగుచేసేవాళ్లు, హారేక్‌మాల్‌బండ్లవాళ్లు,



www.etelangana.org

గరంమిర్చిబండ్లు, చాయ్ హోటళ్లు, చిన్నచిన్న చెప్పుల షాపులు, టెంట్‌హౌజ్‌లు, 'చిల్లర' బేరగాళ్లంతా ముస్లింలే కావడం యాధృచ్ఛికమా? ఆటోవాలాలు, కారు–జీపు–లారీ డ్రైవర్లంతా ముస్లింలే కావడం యాధృచ్ఛికమా? ఇటు చదువుకునే అవకాశాల్లేక, అటు ఓ.సి. కావడంతో ఉద్యోగాలు రాక 'ధోబీ కా ఘుదా న ఘర్‌కా న ఘాట్‌కా' బతుకులైపోయాయ్...

## మేం నవాబులం కాము

మా తాత ముత్తాత లెవరూ నవాబులు కారు. మేం నవాబులం ఎట్లవుతాం? 400 ఏండ్లు పరిపాలించినవాళ్లకు రిజర్వేషన్లెందుకు అంటున్న కొందరి మందబుద్ధిని, సంకుచిత వ్యాఖ్యల్ని మేం ఖండిస్తున్నాం. 90 శాతం మందిమి ఇక్కడి మూలవాసుల్నించి ముస్లింలమైన మేము నవాబులం కామని, మావి నవాబు వంశాలు కావని స్పష్టం చేసున్నాం.

## బీసీ కులాల మిత్రులారా!

బి.సి. అంటే బ్యాక్‌వర్డ్ క్యాస్ట్స్ కాదు బ్యాక్‌వర్డ్ క్లాసెస్ అన్న విషయం గమనించాలని కోరుతున్నాం. కొందరు బిసి మిత్రులు రకరకాల వ్యాఖ్యలు చేస్తున్నారు. తప్పుడు వ్యాసాలు, ఉపన్యాసాలు ఇస్తున్నారు. రాజ్యాంగం ప్రకారం సామాజికంగా, విద్యాపరంగా వెనుకబడి ఉన్న ఏ కమ్యూనిటీనైనా బ్యాక్‌వర్డ్ క్లాస్‌గా పరిగణిస్తూ రిజర్వేషన్ కల్పించవచ్చు. అలా వెనకబడి ఉన్న కమ్యూనిటీ ఒక కులం కావచ్చు, మతం కావచ్చు.

స్వాతంత్ర్యం వచ్చిన 57 ఏళ్లుగా అన్ని రంగాల్లో ముస్లిం సమాజాన్ని అణగార్చడానికి అన్నిరకాల కుట్రలు చేసిన సంఘ్‌పరివార్ ఇవాళ మాకు రిజర్వేషన్ కల్పించడాన్ని వ్యతిరేకిస్తున్నది. దేశంలోని అన్ని పార్టీలు, సంస్థలు, మేధావులే కాక సామాన్య జనం సైతం ముస్లింల దైన్య స్థితిని గుర్తిస్తూ రిజర్వేషన్‌ను సమర్థిస్తుంటే కేవలం బిజెపి మాత్రమే వ్యతిరేకించడం దాని అసలు నైజాన్ని తెలుపుతుంది. ముస్లింలను ఇంకా ఇంకా అణచివేసి దేశంలో ఇంకా కొన్ని గుజరాత్‌లను సృష్టించాలని చూస్తుండడాన్ని అర్థం చేసుకోవాలని కోరుతున్నాం. దేశంలో 15 శాతంగా ఉన్న అతిపెద్ద సమూహం అన్ని రకాలుగా వెనకబడి ఉంటే దేశం ఎలా పురోగతి సాధిస్తుందని మేం ప్రశ్నిస్తున్నాం.

రాజస్థాన్‌లో ఎన్నికలకు ముందు ఇబిసి కింద అగ్రకులస్తులకు, బ్రాహ్మణులకు సైతం రిజర్వేషన్లు కల్పిస్తామని ప్రకటించిన బిజెపి అన్నిరంగాల్లో అట్టడుగున పడివున్న ముస్లింలకు రిజర్వేషన్లు కల్పించడం ఎందుకు సరైన విధానం కాదో పునరాలోచించుకోవాలి. ఎన్నికలకు ముందు టిడిపి సైతం ముస్లింలకు 3 శాతం రిజర్వేషన్లు కల్పిస్తామని ప్రకటించింది. అప్పుడు టిడిపి పొత్తులో ఉండి కూడా చప్పుడు చేయని బిజెపి ఇప్పుడు లొల్లి చెయ్యడం ఏమిటి? మతం ప్రాతిపదికన గొడవలు చేస్తున్నది బిజెపియేననే విషయాన్ని ప్రజలంతా గ్రహించాలని కోరుతున్నాం. సామాజికంగా, విద్యాపరంగా ఎంతో వెనకబడివున్న ముస్లింలకు ప్రభుత్వం కల్పించిన రిజర్వేషన్‌కు ప్రజాస్వామిక వాదులందరూ మద్దతు తెలపాలని కోరుతున్నాం. 1991 జనాభా లెక్కల ప్రకారం 5 శాతం అన్నారు, 2001 జనాభా లెక్కలు కూడా వచ్చి ఉన్నాయి కాబట్టి ప్రస్తుత వెనుకబాటుతనం ప్రాతిపదికగా ముస్లింలకు రిజర్వేషన్ కల్పించాలని బిసి కమీషన్‌ను, ప్రభుత్వాన్ని కోరుతున్నాం.

*ఇయ్యాల ఉరికొచ్చి ఉరికొచ్చి / మనమంతా ఇందుగులం / గంగాసింధు బిందుగులం / అంటే ఎట్టా సామీ / మా తాతల్ని తండ్రుల్ని పంచముల్ని చేసి / గుడికీ బడికీ దూరంగా తరిమితే / మీకు పడని / అలిఫ్–బే–తే–సే–లు దిద్దింది / ఈ మసీదుల్లోనే కదా / ఈ సదువంతా నింపుకుంది / మీరనుకునే పరాయి చర్చిలోదే కదా... / ఎంత విసిగి వేసారితే / మా లచ్చుమయ్యలంతా లతీఫ్‌లయింద్రో / సోమన్నలంతా సామేలులయింద్రో... / అట్టాంటిదిప్పుడు / మా లందె గోళాల్లో / మీ పూలెట్టా వికసిస్తాయి సామీ*     –దున్న యాదగిరి

–'మర్ఫా' ముస్లిం రిజర్వేషన్ మూవ్‌మెంట్






# అగ్నిగుండానికి అంటరానివాడి స్వాగతం

• సి. కాశీం

**నాకు** పదిహేనేండ్లప్పటి మాట. ఇప్పటికీ మారలేదనుకోండి. మా ఊరిలో పది పీర్లుంటాయి. రెండు పీర్లను మినహాయిస్తే మిగతావాటిని బీసీలే ఎత్తుతారు. వాటికి డప్పులు కొట్టేది మాత్రం మాదిగలే. మా వంతుకు నేను కూడా కాసీం పీరుకు డప్పుకొట్టేది. మిగతా కులాల వాళ్లు దూల ఆడేది. మా కులానికి దూల ఆడటం నిషిద్ధం. అలావా (అగ్నిగుండం) గడ్డకు దూరందా ఉండి దరువులు వేసేది. దూల ఆడాలనే మా అంటరాని ఆశ అలావా నిప్పుల్లో కాలిపోయేది. గుడి నుంచి బ్రాహ్మణుడు వెలివేశాడు. అలావా నుంచి శూద్రులు వెలివేశారు. కాని పంచముడి డప్పు మాత్రం అదరికీ అవసరమొచ్చింది. ఈ అరుంధతీ పుత్రుడి మూగవేదన డప్పుపై ముప్పై రెండు కళలను పలికించేది.

ఎద్దును హలాల్ చేసేది ముస్లిం. కోసి కుప్పలేసేది మాదిగవాడు. ఈ కంచం పొత్తుతో ముస్లిం కవులు 'అలావా'కు స్వాగతం పలుతుకుతున్నాను. ముస్లిం సంస్కృతిని ప్రతిబింబించే ఈ నిప్పుల గుండంలో ధప్పును కాపుకున్నట్లు ఈ వెలుగులోనే నా కలాన్ని విస్తరించుకుంటున్నాను. ఈ వెలుగులో ఈ పుస్తకాన్ని పరిశీలిస్తే దాచేస్తే దాగని సత్యాలు బయటికి వస్తాయి. 'అలావా' అంటే కేవలం నిప్పుల గుండమే కాకుండా ముస్లిం సంస్కృతి కవిత్వంగా ఈ కవులు వ్యక్తం చేశారు. అలావా అనే ఈ మాటకు 'ఇన్ అడిషన్' అనే అర్థం కూడా ఉన్నట్లు విన్నాను. ఈ దేశంలో మెజార్టీ ప్రజల జీవితంగా హిందు సంస్కృతి ప్రచారంలో ఉంది. ఇది వేల సంవత్సరాలుగా మరో సంస్కృతిని అంగీకరించడానికి నిరాకరించింది. ఇరవై శాతం ఉన్న ముస్లిం ప్రజల జీవితం తలుపు చాటుననే మగ్గిపోయింది. ముస్లిం ప్రజలలో కూడా సామాజిక అసమానతలు ఉన్నాయి. వీటిపై అంతర్గత బహిర్గత పోరాటం చేస్తూనే హిందు సంస్కృతితో పాటు ముస్లిం సంస్కృతి కూడా ఉందని బలంగా చెప్పటంలో ఈ కవులు విజయం సాధించారు.



www.etelangana.org

హిందు సంస్కృతిగా చెప్పుతున్నది కూడా అర్ధసత్యమే. ఈ సంస్కృతి పేర కేవలం బ్రాహ్మణ సంస్కృతే ప్రచారమయింది. కాకపోతే అగ్రకులాల సంస్కృతి. ఈ అగ్రకులాలు ఏనాడు కూడా ఉత్పత్తి కులాల సంస్కృతిని అంగీకరించలేదు. పైగా చిన్నచూపు చూసి అవమానించారు. కాబట్టి సంస్కృతి ఎప్పుడు కూడా ఏకరూపంగా ఉండదు. అగ్రకులాల సంస్కృతే ఈ దేశప్రజల సంస్కృతిగా నిర్ధారించారు. సాహిత్యం నిండా దానినే నింపారు. స్థూలంగా పరిశీలిస్తే ఈ దేశంలో కనీసం మూడు సంస్కృతులున్నాయి. ఒకటి ఉత్పత్తితో ముడిపడిన దళిత, కింది కులాల సంస్కృతి. రెండు విశ్రాంతిగా జీవించే బ్రాహ్మణ అగ్రకులాల సంస్కృతి. మూడు ముస్లిం మైనార్టీల సంస్కృతి.

అసలు సంస్కృతి అంటూ ఏమిటి అనే విషయంలోనే చాలా భిన్నాభిప్రాయాలున్నాయి. 'మనిషి పుట్టినప్పటి నుంచి మనుగడ సాగించడానికి అవలంబించే విధానాలే సంస్కృతి' అని విశాల అభిప్రాయం ఉంది. ఇట్లా చూసినపుడు కులాలుగా విభజించిన ఈ దేశంలో ప్రతి కులానికి ఒక జీవన విధానం ఉంది. "ఒక సమాజానికి చెందిన భావాలు - విలువలు - ఆలోచనలు - అలవాట్లు - ప్రవర్తన ఆ సమాజపు సంస్కృతి" అని స్విజి చెప్పిన నిర్వచనంలో కూడా ఈ దేశ సంస్కృతి ఇమడదు. ప్రతి సందర్భంలో ఆదిపత్య వర్గాల భావాలే ఒక యుగాన్ని పాలిస్తాయి. ఆ పాలకవర్గాల సంస్కృతినే అందరిపై బలవంతంగా రుద్దటానికి ప్రయత్నం చేస్తారు. ఈ దేశంలో వేల సంవత్సరాలుగా అదే జరిగింది. అందుకే సంస్కృతి విషయంలో ఏ ఇద్దరు అలవాట్లు, కళ, నీతి సూత్రాలు, న్యాయం, ఆచారాలు ఇతర సామర్థ్యాల మొత్తాన్ని సంస్కృతి అంటామని" టేలర్ చెప్పిన అభిప్రాయం కొంతమేరకు ఆమోదించేదిగా ఉంది.

ఈ సంస్కృతే సాహిత్యంలో ప్రతిఫలిస్తుంది. ఈ కోణంలో చూపినపుడు ముస్లిం కవులు అలావా ద్వారా తమ జీవిత మూలాలను వ్యక్తం చేశారు. "మనిషి, మానవ సంబంధాలు, సామాజిక జీవితం దానిలోని సమస్త వైరుధ్యాల కళాత్మక ప్రతిఫలం సాహిత్యంలో వస్తువు అవుతుంది" (పాపినేని శివశంకర్ సాహిత్యం - మౌలిక భావనలు పుట. 78) ఈ దృష్టితో అలావా కవిత్వాన్ని విశ్లేషిస్తే కొన్ని విషయాలు స్పష్టమవుతాయి.

1. ఇది దళితులు, ముస్లింలు ఒకటేనని చెప్పే కవిత్వం.

2. హిందూ మతం కసిరి బుస కొడితే దళితులను చేరదీసిన సూఫీ మతం గొప్పతనాన్ని ఎత్తి పట్టే కవితలు కొన్ని ఇందులో ఉన్నాయి.

3. ముస్లిం జీవితాన్ని ప్రతిబింబిస్తూనే ఆ మతంలోని దుర్మార్గపు విలువలను, స్త్రీల పట్ల చూపే వివక్షను చెప్పే కవితలు మరికొన్ని ఈ సంకలనంలోనే ఉన్నాయి.

4. ముస్లిం ప్రజల అభద్రత జీవితానికి కారణమైన హిందూ మతోన్మాదాన్ని వ్యతిరేకిస్తూ రాసినవి కొన్ని కవితలున్నాయి.

5. ప్రపంచ వ్యాప్తంగా పేద ప్రజల శత్రువైన అమరికన్ సామ్రాజ్యవాదాన్ని ప్రతిబింబిస్తూ రాసిన కవితలు ఉన్నాయి

6. ముస్లింల జీవితం పోరాట, ఆరాటాలతో ఉన్నది. కాబట్టి ముస్లిం సమాజం ఎదుర్కొంటున్న సమస్యలు పరిష్కారం కావాలంటే పోరాటమే మార్గమని ఉత్తేజ పరిచే కవితలు ఇంకొన్ని ఉన్నాయి.

ముస్లింలు ఈ దేశస్థులు కారనే ప్రచారం ఆరెస్సెస్, విహెచ్‌పి లాంటి సంస్థలు చేస్తుంటాయి. కాని ఇది నిజం కాదు. కేవలం రెండు శాతంగా ఉన్నవాళ్ళను మినహాయిస్తే మిగతా 18 శాతం ముస్లింలు ఆ దేశ మూలవాసులు. ఆర్యులు బ్రతుకుదెరువు కోసం వచ్చి ఈ దేశంలో స్థిరపడి ఆధిపత్యం



చెలాయిస్తున్నారు. పైగా ఈ దేశంలో పుట్టి ఇక్కడే పెరిగి ఈ మట్టితో సజీవ సంబంధాన్ని కలిగున్న వారిని విదేశీలనటం రాజకీయ కుట్ర. అందుకే యాకూబ్ పాష

"ఎంతెంత దూరం ఎంతెంత దూరం అంటూ
ఎడ్లబండి కదులుతూనే ఉంది
ముసుగేసుకున్న నల్లదయ్య పత్తిపాక గుట్ట
పిల్లవాండ్ల చడ్డీలు చల్లచల్లగా తడిసిపోయాయి...
దూరంగా 'అల్లాహో' అని వినిపిస్తున్నది...
చెరువు అలలన్నీ 'అల్లాహో' అన్నాయి!

(పుట.21) అంటూ కథనాత్మక శైలిలో చక్కటి దృశ్యాన్ని కళ్ళకు కట్టేలా చిత్రించాడు. జాతరపోయే ఎడ్లబండ్ల రూపాన్ని పాఠకుల మనోరథంపై నిలిపాడు. "చెరువు అలలన్నీ 'అల్లాహో' అన్నాయి"! అనే బలమైన వ్యక్తీకరణ ద్వారా ఇది గొప్ప కవితగా నిర్మాణమైంది. తెలుగు సాహిత్యంలో చారిత్రక స్థలాల గురించి క్షేత్రమహాత్యాలు గుట్టలు గుట్టలుగా వచ్చాయి. అయితే ఈ సాహిత్యం నిండా హిందూ క్షేత్ర మహాత్యాలే ఉన్నాయి. ముస్లిం చారిత్రక స్థలాలు చాలనే ఉన్నాయి. కాని ఒక కావ్యం కూడా రాలేదు. ఆ లోటును భర్తీ చేసే పనిని యాకూబ్ 'జాన్ పాడ్ దర్గా' కవిత చూసింది

"తలలు తెగి యుద్ధం నుంచి
గుర్రాలపై వెనుతిరిగిన మొండాలు
వెనక్కి తిరిగి చూసి
జాన్ పాడ్‌లో ఆ గాయని కథనం
వరసగా సమాధులు
తెల్లని గుర్రాలు తీరిగ్గా గడ్డిమేస్తున్నట్లు

గతాన్ని నెమరు వేసుకుంటున్నట్లు ఉంటాయి. (పుట.43) మతంతో నిమిత్తం లేకుండా ప్రజలందరు ఈ దర్గ ముందు మోకరిల్లే చరిత్రను కవి మన ముందు ఉంచాడు. ముస్లింలను ప్రభుత్వాలు, మీడియా టెర్రరిస్టులుగా ప్రచారం చేస్తున్నాయి. కాని హిందువుగా పుట్టినవాడు ఏ తప్పు చేసినా అందలమెక్కవచ్చు. ప్రధానులు కావచ్చు. దేశ నాయకులుగా చరిత్రలో నిలిచిపోవచ్చు. పాలకులై ఈ దేశాన్ని తాకట్టు పెట్టవచ్చు. వాజ్‌పాయ్ క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని జైలుకెళ్లాడు. తరువాత ఆనాటి ప్రభుత్వాన్ని క్షమించమని కోరి కేసు ఎత్తి వేయించుకున్నాడు. వీరసావార్కర్ అండమాన్ నికోబార్ దీవులలో శిక్ష అనుభవించి క్షమాభిక్ష పెట్టించుకుని బయటికొచ్చాడు. వీళ్ళందరు ఇవ్వాళ దేశ నాయకులు. మనదేశాన్ని విదేశీయుల సూచన మేరకు పాలించే దేశ ద్రోహులున్న ఈ రోజుల్లో మేము నిజమైన దేశభక్తులమని రాజాహుస్సేన్ చరిత్రకు పట్టిన తెగులును కడిగేశాడు.

"స్వార్థం కోసం నీతి తప్పిన కాఫిర్లం కాము
ధర్మం కోసం ప్రాణత్యాగం చేసిన
హసేన్ - హుసేన్ వారసులం..."

అష్ఫాఖుల్లాఖాన్ లాంటి వీరులు గడ్డిపోచలా ప్రాణాన్ని వదిలేస్తే ఈ దేశం మాకేమిచ్చిందని ఈ కవి ప్రశ్నిస్తున్నాడు.



www.etelangana.org

"అనుమానపు నిప్పులపై నడుస్తున్న
ముసల్మాన్ల బతుకే పీర్ల గుండం"
(పుట. 44) చేసిన హిందూ మతోన్మాదాన్ని కడిగేశాడు.

వందేమాతరానికి వందేళ్ళు నిండాయి. అరవై సంవత్సరాలుగా అధికారికంగా జాతీయ గీతంగా వెలుగొందింది. ఆ గీతం నిండా హిందూ మతానికి చెందిన ప్రస్తావనే ఉంటుంది. హిందూ మతదేవుళ్లే ఉంటాయి. పైగా దుర్గను గొప్పగా కీర్తించటం ఉంది. లౌకిక దేశంలో హిందూ జాతీయ గీతం. చరిత్ర పొడుగునా ముస్లిం సమాజం అవమానాలు భరిస్తుంది. అందుకే అఫ్సర్ ఈ అవమానాన్ని ధిక్కరిస్తున్నాడు.

"కాలరాస్తున్నాను
పగబట్టిన పరాయి ముద్రల కింద
వెంటాడి వేధించిన అవమానాల్ని...
నన్నెప్పటికీ నమ్మలేని జాతీయ గీతాల్ని
వందేళ్ళకైనా నమ్మపాడని
వందేమాతరాల్ని" (పుట. 29)

గుడి కట్టింది దళితుడు. కాని గుడిలోకి రావద్దు. అంటరాని పెనుమంట వెంటపడి తరుముతుంటది. ఇవ్వాళ తిరుమల తిరుపతి దేవస్థానం దళిత గోవిందం ఒక ఫ్యాషన్. దళితుడికి ఉద్యోగం లేకుండా చేయటం రాజనీతి. ఉత్సవ విగ్రహాల ఊరేగింపు ఆధునిక మనువు కుట్ర. వేల సంవత్సరాలుగా ఇదే జరుగుతుంది. కాని చరిత్రలో మొదటిసారిగా దళితుల వాకిట్లోకి నడిచొచ్చిన దేవుళ్ళు సూఫీలు.

"తెల్లని షేర్వానీ – ఆకుపచ్చ తలపాగా
దర్పంగా నిలబడి చూస్తుంటది దర్గా!
గుడి అంటని
ఇక్కడి పుట్టిబిడ్డల కాడికే
నడిచొచ్చిన దేవుళ్ళు సూఫీలు!" (స్కైబాబ – పుట . 31)

మనుషులను గుండెకు హత్తుకున్న సూఫీతత్వం కాలగర్భంలో కలిసిపోయింది. హిందూ మతంలో ఉండే తప్పుడు భావజాలం ముస్లిం మతంలో కూడా ఉంది. ఆ మతం స్త్రీకి బురఖాను బహూకరించింది. అందం పేరిట బందీని చేసింది. దర్గాను పూజించవద్దంది. రాత్రి పడకగదిలో తప్ప ఇంకెప్పుడు ఆమెను మనిషిగా చూడలేదు. ఆమెకు హృదయమున్నా స్పందనకు అవకాశం లేదు.

"నిన్న–నేడు–రేపు లేనిదాన్ని
ఒక రాత్రి తప్ప!" అని మున్విరున్నిసా మూగవేదనకు కవిత్వం తోడయ్యింది. ఈ వేదనకు ఏ ఖురాన్ బదులివ్వదు. ఏ శాస్త్రం విశ్లేషించదు.

"ఆమె తలదిండు నడిగి తెలుసుకుంటేనే
మనకామె బాధలు గాథలై వినిపిస్తాయ్"
(ఖలందర్ – పుట. 86) చక్కటి భావచిత్రాలు. హృద్యమైన పోలికలతో స్త్రీ జీవితాన్ని ఈ కవులు కవిత్వంగా అల్లారు.



అమెరికా ఒక ఇనుపడేగ. మట్టికాళ్ళ మహా రాక్షసి. కాగితప్పులి.

"రాక్షస రెక్కలతో తల్లుల్ని తండ్రుల్ని
ఎత్తుకెళ్తున్న నరహంతకుడు" జార్జిబుష్ అనగలిగిన షాజహానాకు అమెరికాను ఎందుకు వ్యతిరేకిస్తున్నామో ఒక స్పష్టత ఉంది. డాలర్‌ను అమెరికాను నాలుగుసార్లు తిట్టి రాస్తే ప్రపంచీకరణ వ్యతిరేక కవిత్వమనుకునే ఈ రోజుల్లో అమెరికా వస్తే ఏం జరగనుందో ఈ కవయిత్రి చెప్పింది.

"మా గంజి నీళ్ల మీద
గద్ద తిరుగాడుతున్నట్లుంది" (పుట. 16) అనే చక్కటి భావం వ్యక్తం చేసింది.

ముస్లిం సమాజంపై అంతర్జాతీయంగా అమెరికా యుద్ధం ప్రకటించింది. ఈ దేశంలో మోడిత్వ భావజాలం త్రిశూలాలను పట్టుకొని తిరుగుతుంది. క్రికెట్ ఒక యుద్ధ క్రీడలా మారింది. అది మానసిక యుద్ధమే. ఇండియాకు పాకిస్తాన్‌కు మధ్య ఆట జరుగుతుందంటే సరిహద్దుల్లో యుద్ధం మొదలైనట్లే ఉంటుంది. ఇండియా వర్సెస్ పాకిస్తాన్ ఆటంటే

"నా పడకింటికి నడిచొచ్చే భయంకర స్వప్నం
క్షమించండి
యుద్ధాన్ని ప్రేమించలేను"
(మహెజబీన్ – పుట. 158) క్రికెట్ కోసం కోట్లాది మంది టీవీ ముందు కూర్చుంటే ముస్లిం జీవితాలలో మాత్రం అది భయంకర స్వప్నం. దానిని భయంకర స్వప్నంలా, యుద్ధంలా భావించిన కవయిత్రి మనల్ని కదిలిస్తుంది.

ఇన్ని రకాల అవమానాలు, అసమానతలు, అనుమానపు చూపులు, ఏమిటి పరిష్కారం? కొందరు వాటికి దర్గా సంస్కృతే సమాధానమంటున్నారు. దీనిపై శాస్త్రీయంగా చర్చ జరగాలి. ఇది ఎక్కడ ప్రారంభమయ్యామో మళ్ళీ అక్కడికి ప్రయాణించటమవుతుంది. భౌతికవాదం వైపు ప్రజలను నడిపిస్తేనే ఏ సమస్యకైనా, ప్రజలకైనా విముక్తి ఉంటుంది. భావవాదం వైపు మళ్లిస్తే ముస్లింలు పెనం మీది నుంచి పొయ్యిలో పడినట్లు అవుతుంది. భావవాదం ఏ రూపంలో ఉన్నా ప్రమాదమే. ఇవ్వాళ సామ్రాజ్యవాదం – భూస్వామ్యం – హిందూ మతోన్మాదం కలిసి నడుస్తున్నాయి. ఈ ముగ్గురు శత్రువులను కూల్చాలంటే త్యాగాలతో కూడుకున్న పోరాటమే మార్గం. ఈ పోరాటానికి భౌతికవాదం ఆలోచననే పునాదిగా ఉండాలి. ఇది ముస్లిం సంస్కృతిలోనే ఉంది. నిజం కోసం నెత్తురోడిన హుస్సేనూ వారసులే నిజమైన ముస్లింలు. ఇతర ప్రజలు తమ సమస్యల పరిష్కారం కోసం చేస్తున్న పోరాటాలతో కలిసి నడిస్తేనే ముస్లిం ప్రజలకు విముక్తి ఉంటుంది. అందుకోసమే అఫ్సర్ పోరాటానికి సిద్ధం చేస్తున్నాడు.

"ఇంక ఏడ్వకండి
కన్నీళ్ళతో నిప్పులు పాదాల కింద
నన్ను మోసుకెళ్లే పాదాల కింద
మీరు పోసే జలధారలన్నీ
నిప్పుల వాగులవుతున్నాయి...
చావుని వెలివేసిన వాణ్ణి
చేతులారా జలసమాధి చెయ్యకండి" (పుట. 29)



www.etelangana.org

# మూడుముక్కలాట

• వి.బి.ఎన్. శ్రీను

తీర్పొంది
అంతా–
తుఫాను ముందరి ప్రశాంతతే!
అవును –
తొవ్విన
పురాకాలం శిధిలాల్లో
ధశరధుని వీర్య శిలాజం దొరికిందా?!
చెల్లాచెదరైన ఎముకల్లో
రాముని DNA దొరికిందా?!

నిప్పుమీద మాయతెరలు కప్పి
ఊహాకు
జన్మభూమి పుట్టించావు
తేనెతుట్టెను కదిపి
92 డిసెంబరు 6
పెళ్ళ పెళ్ళలుగా కూలిన చరిత్ర
గాయాలను గాయంచేసిన
మూడుముక్కలాటలో
మురిగినవి సాక్ష్యాలేనా –
భారతీయ ఆత్మకూడా!

మతరాజ్య వాసనల
అన్యాయ మూర్తీ!
మందిర్ కాదు
మసీదు కాదు
2.77 ఎకరాల్లో
మనిషిని నిలపలేక పోయావ్

బావిలోని కప్పలా
భవిష్యత్తు!?
ఖడ్గఖాలనాల్లో
కాలం నెత్తురు కారని
కరచాలనాలు కావాలిప్పుడు

అహార్యాలతో
ఆహారాలతో
గుర్తించని జీవితం కావాలిప్పుడు

రాళ్ళు ఇటుకలు నిర్మాణాలై
ఏ రాత్రో ఏ పగలో
రక్తాన్ని ముక్కలు ముక్కలు చేసి
మనిషిని
మాంసఖండాలు చేసే హింస!
మతం పునాది మీద
మనిషి నిర్మాణం కాలేదు
మృగం తప్ప!

ఇక ఎంత మాత్రం
అనాధలు కావొద్దు
ఆట బొమ్మల!
జోలపాటే మేల్కొనాలి
ఉయ్యాల్లో!!
మనిషికి మనిషికి
మధ్య
మతం ఇనుపగోడ!

మట్టి మీద చరించే
ఏ మనిషైనా –
సెలయేరో చెరువో సముద్రమో –
ఏ రంగో ఏ రుచో ఏ వాసనో
నీరులోకి నీరులా
ఆకుపచ్చ ఆశల్తో
ఎర్రదామెర కాంక్షల్తో
తెల్లకలువల కలల్తో
మనుషుల్లోకి మనషులు
ప్రవహించాలి
పరిమళించాలి
ప్రభాతమవ్వాలి

మనువు న్యాయం మీద
మతం నెత్తి మీద మనిషి జెండై ఎగరాలి






# హైదరాబాద్ పై ఒక ముస్లిం దృక్కోణం

• తెలుగు అనువాదం : ఏశాల శ్రీనివాస్

*ఈ కింది వ్యాసం హసనుద్దీన్ అహ్మద్ అనే ఐఎఎస్ ఆఫీసరు ఒక పుస్తకానికి రాసిన ముందు మాట. ఆయన నిజాం ప్రభుత్వంలోనూ (1948కు ముందు) తరువాత కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలలో వివిధ స్థాయిల్లో పని చేసారు. 1948కి ముందు, తరువాత జరిగిన అనేక సంఘటనలకు ఆయన ప్రత్యక్ష సాక్షి. కెప్టెన్ లింగాల పాండు రంగారెడ్డి రాసిన "17 సెప్టెంబరు ప్రాముఖ్యత లేని దినం" అనే పేపరుకు ముందు మాట. ఈ (తెలంగాణాకు చెందిన) కెప్టెన్ 1948లో హైదరాబాదు రాజ్యంపై భారత ప్రభుత్వం సాగించిన 'ఆపరేషన్ పోలో'లో పాల్గొన్న 11వ గూర్ఖా రైఫిల్స్ రెజిమెంటులో, ఆ సమయంలో పనిచేసారు. 2008వ సంవత్సరంలో డిసెంబరు 28, 30*

*ల మధ్య కేరళలోని కన్నూరులో జరిగిన "69వ ఇండియన్ హిస్టరీ" కాంగ్రెస్‌లో ఈ పేపరుని ఆయన చదివారు. హైదరాబాదులోని మదీనా ఎడ్యుకేషన్ సెంటరు ఈ పేపరును హసనుద్దీన్ అహ్మద్ ఉర్దూలో రాసిన ముందు మాటతో సహా చిన్న పుస్తక రూపంలో ప్రచురించింది. ఉర్దూ రాని వారి కోసం ఈ ముందు మాటతో సహా చిన్న పుస్తక రూపంలో ప్రచురించింది. ఉర్దూ రాని వారి కోసం ఈ ముందు మాటను ఇంగ్లీషు, తెలుగుల్లోకి అనువదిస్తున్నాం. ఈ ముందు మాటకున్న ప్రత్యేకత సెప్టెంబరు 1948 విలీన సమయంలో గల పరిస్థితుల గురించి ఒక ముస్లిమ్ దృక్పథాన్ని అందించటం. గత అరవై సంవత్సరాల నుండి ఈ దృక్పథాన్ని గుర్తించకుండా ఉద్దేశపూర్వకంగా తొక్కి పెట్టటం వల్ల హైదరాబాదు ముస్లింల పట్ల అనేక అపోహలు, పెద్ద ఎత్తున ప్రబలి పోయాయి. సెప్టెంబరు 17 గురించి ఈ ముస్లిం దృక్పథం ఉందని ఒప్పుకోవటం చాలా మందికి కష్టం. దానికి మేధోపరమైన నిజాయితీ, ధైర్యం చాలా అవసరం. ఈ ధోరణిలోనే, కెప్టెన్ లింగాల పాండు రంగారెడ్డి రాసిన పేపరు ఆర్మీలో పనిచేసిన వారి దృక్పథం నుండి అప్పుడు జరిగిన సంఘటనలను పరిశీలించింది. ఆయన మామూలు పరిశోధకులకు అందుబాటులో వుండని ఆర్మీ పత్రాలను, రికార్డులను ఈ పేపరు కోసం వాడారు. అందువల్ల ఈ పేపరు ముఖ్యమైనది.*



www.etelangana.org

## హసనుద్దీన్ అహ్మద్ గారి ముందుమాట

(ఉర్దూ నుండి ఎమ్.ఎ మొయిద్ ఇంగ్లీషులోనికి అనువదించారు)

ఈ పేపరును ఒక ఆర్మీ ఆఫీసరు రాసారు. దీనిలో ప్రతి పదం, రాజకీయాలు, భావోద్వేగాలు, కమ్యూనలిజాన్ని అధిగమించి నిజాన్ని, నిజాయితీని మనముందు ఉంచుతుంది. ఆయన 11వ రైఫిల్స్ రెజిమెంటులో పనిచేసారు. కానీ ఇప్పుడు గన్ బదులు పెన్ను తీసుకున్నారు. పెన్నుకున్న గొప్పతనం ఆయనకు తెలుసు. ఈ దేశ వర్తమాన చరిత్రను ఎంచుకుని దాని గురించి పేపరు రాసారు.

వర్తమాన చరిత్రను వర్ణించటం చాలా కష్టం. రచయిత 1948లో జరిగిన సంఘటనలకు సజీవ సాక్షులుగా వుండి ఇప్పటికీ జీవించి వున్న తరానికి చెందిన వాడు. ఈ పేపరులో ఆయన హైదరాబాదు రాజ్యంపై జరిగిన మిలటరీ ఆపరేషన్ గురించి ఉద్దేశపూర్వకంగా పరచిన చిక్కని అబద్ధాల ముసుగును ఛేదించారు. పోలీసు చర్యను రాజకీయ రంగుటద్దాలతోనూ, కమ్యూనల్ రంగుల్లోనూ చూస్తున్నారనే రచయిత దృక్పథంతో నేను ఏకీభవిస్తున్నాను. ఆ రాజకీయా లెటువంటివంటే, అవి తొక్కిపెట్టడాన్ని న్యాయంగానూ, అణచివేతను సర్దుకుపోవాల్సిన వ్యవహారంగానూ చూపించేవి. ఈ విషయంలో అత్యంత సంకుచిత ధోరణి, వైషమ్యం కలిసి నిజాలను పూర్తిగా వక్రీకరించాయి. విషయమూల మీద ఎంత చిక్కటి ముసుగు వేయబడిందంటే చివరికి నిజాలను చూసి మనం ఇప్పుడు విస్తుపోయే పరిస్థితులొచ్చాయి.

మీర్ ఉస్మాన్ అలీఖాన్ పరిపాలనా కాలాన్ని తప్పుడు అవగాహనతో చూయిండం, హైదరాబాదీయుల పట్ల పెద్ద నేరం చేసినట్లే. ప్రజాహితం కోరేవాళ్ళు ఇప్పటికైన నిజాలు వెలుగులోకి తేవటం ప్రజలకు లాభదాయకం, మంచిది కూడ. మీర్ ఉస్మాన్ అలీఖాన్ పాలనలోని నిజాలు వెలుగులోకి తీసుకురావాలి. వర్తమాన చరిత్ర రాసిన చాలా మంది మేధావులు, రచయితలు జరిగిన సంఘటనలకు సాక్షీభూతంగా లేరు వారు చరిత్ర పై పొరలను మాత్రమే తట్టగలిగారు. జరిగిన సంఘటనలకు ఇప్పటికే దొరికే రచనల ద్వారా విశ్లేషించే ప్రయత్నం చేసారు. అయితే మనకి ఈ సమయాన్ని గురించి దొరికే రచనలు అన్నీ పాక్షికమైనవే. ఈ నేపథ్యంలో కెప్టెన్ పాండురంగారెడ్డి యదార్థ విషయాలను మనముందుంచినందుకు ఆయన్ని మనం అభినందించాలి.

నేను నిజాంకు బంధువునే గానీ నేను రాజరికాన్ని ఎప్పుడూ సమర్థించలేదు. నాకు రాజరికం కంటే ప్రజాస్వామ్యం పట్ల విశ్వాసం ఎక్కువ. రాజరికం కంటే ప్రజాస్వామ్యమే సమర్థవంతమైన పాలన నందిస్తుందని నేను బలంగా నమ్మాను. కాని పరిస్థితులు ఎంత హాస్యాస్పద స్థాయికి దిగజారాయంటే ప్రజలిప్పుడు ప్రజాస్వామ్యాన్ని నిజాం పాలనతో పోల్చి 'అప్పుడే బాగుండేదేమో' అనుకుంటున్నారు. ఇవాళ ప్రజాస్వామ్యానికున్న పరిమితులను ప్రపంచం మొత్తం మీద ప్రజలు అర్థం చేసుకుంటున్నారు. అదే మనం మీర్ ఉస్మాన్ ఆలీఖాన్ కాలం నాటి హైదరాబాదు రాజ్యాన్ని తీసుకుంటే రాజుపై ఒత్తిడి చేసే మేధావి వర్గం ఒకటి హైదరాబాదులో ఉండేది. వీళ్ళు ప్రజా బాహుళ్యానికి కావలసిన అవసరాలను, కట్టడాలను గుర్తించి రాజుతో చేయించేవాళ్ళు. వీరి ఒత్తిడి వల్ల ప్రజలందరికీ ఉపయోగపడుతూ చరిత్రలో నిలిచిపోయే అద్భుతమైన కట్టడాలు సాధ్యపడినాయి.

అసఫ్ జాహీల జెండాపై ఉన్న రొట్టె గుర్తి తన ఏలుబడిలో ఉన్న అందరికి తిండి పెట్టడం ప్రభుత్వ బాధ్యత అని గుర్తు తెచ్చే చిహ్నం. నాకు తెలిసిన వరకు ఎవరి జెండాపైా కూడా రొట్టె గుర్తు లేదు. కమ్యూనిస్టు దేశాలు కూడ ఇలాంటి గుర్తును పెట్టలేదు. ఇటువంటి ప్రత్యేకత ఒక అసఫ్ జాహీల జెండాకే ఉంది.

దక్షిణాసియా చారిత్రక నేపథ్యంలో హైదరాబాద్ రాజ్యాన్ని మనం చూసినట్లయితే, ఇంత గొప్ప సంస్కృతి, స్వభావాలు గల హైదరాబాద్ 'సమాజం' ఎందుకు అంతమైపోయిందీ అనే ప్రశ్న రాక



తప్పదు. దీని వెనుక చాలా రాజకీయార్థిక కోణాలు ఉండొచ్చు గానీ బహుశా దీన్ని భారతదేశంలో ఆధునిక రాజ్య పరిణామ క్రమంలో జరిగిన మార్పుగా కూడా చూడాలేమో!

హైదరాబాదు విలీన సమయంలో జరిగిన సంఘటనలు, విషయాలు, సమస్యల పరిణామాలని మన దేశం ఇప్పటికీ అనుభవిస్తూనే ఉంది. విలీనం వెనకున్న విషాదత్రయం – వైస్రాయ్, కాంగ్రెస్, ముస్లింలీగు, కాంగ్రెస్ వాదులయిన నెహ్రూ, పటేల్‌లు రెండు జాతుల సిద్ధాంతాన్ని అంగీకరించారు. త్వరగా అధికారాన్ని చేజిక్కించుకుందామనే ఆశ వీరిని దీనికి పురికల్పిందని కొంతమంది భావిస్తే, అప్పుడే వస్తున్న రెండవ తరం నాయకులు తమ అధికారానికి గండి కొడుతారేమోనన్న భయం దీనికి ప్రధ్యులమని మరికొంత మంది అభిప్రాయపడతారు. (చివరికిదే నిజమైంది కూడా!) వీళ్ళిద్దరూ ఏ రకంగానైనా అధికారాన్ని చేజిక్కించుకుని, దేశాన్ని 'సరైన' మార్గంలో పెడదామనుకున్నారు. అయితే హైదరాబాదు రాజ్యం ఈ ద్విజాతి సిద్ధాంతాన్ని ఎప్పుడూ అంగీకరించలేదు. హైదరాబాదు రాజ్యంలో హిందువులు, ముస్లింలతో పాటు అనేక సమూహాలు శతాబ్దాల పాటు శాంతియుతంగా కలిసి జీవించారు.

బ్రిటీష్ పార్లమెంటు ఏర్పడిన తర్వాత కూడా అక్కడ రాణి అధికారంలో ఉన్నప్పుడు హైదరాబాదులో మీర్ ఉస్మాన్ అలీఖాన్ రాజుగా ఎందుకు కొనసాగలేకపోయాడు? ఆయనేమీ విదేశీయుడు కాదు కదా. అప్పటికే హైదరాబాద్ నెమ్మదిగా ప్రజాస్వామ్యం వైపు పయనిస్తోంది. రాజుకు సలహాలివ్వడానికి ఒక మంత్రి మండలి ఏర్పడింది. వీళ్ళు రాజు ఇచ్చిన ఫర్మాన్‌లను 'గౌరవప్రదంగా' చూడాలని భావించారు కానీ వాటిని 'అమలు పరచాల్సినవి'గా భావించేవారు కాదు. మీర్ ఉస్మాన్ అలీఖాన్ ఈ మంత్రి మండలిలో దాదాపు ఒక ప్రతిపక్ష పాత్ర వహించేవాడు. లౌకికవాదం వెలుగులోకి రాకముందే హైదరాబాద్‌లో అది అమలయ్యేది. హైదరాబాదును పాలించిన రాజులుగానీ, రాజ కుటుంబాలు గానీ తమ రాజ్యాన్ని ఎప్పుడూ ఒక మత రాజ్యంగా భావించలేదు. హైదరాబాదు రాజ్యానికి లౌకికత ఒక అవసరం, ప్రత్యేకత, విధానం, ఇంకా చెప్పాలంటే ఒక భూమికగా పనిచేసింది. మీర్ ఉస్మాన్ ‌జీఖాన్ "నా ప్రభుత్వంలో వివిధ మతాలకు చెందిన ప్రజలున్నారు. వారిని, వారి మతాలను రక్షించటం నా రాజ్యాంగంలో భాగం, నా ప్రభుత్వ బాధ్యత" అని ప్రకటించారు కూడా.

స్వతంత్ర్య పోరాటం తర్వాత హైదరాబాద్ రాజ్యానికి చాలా రకాల అన్యాయాలు జరిగాయి

(1) దేశ స్వాతంత్ర్యం, విభజన జరుగుతున్న సమయంలో హైదరాబాద్ రాజ్యానికి ఉన్న ప్రత్యేక ప్రతిపత్తి, చట్ట బద్ధతను గుర్తించలేదు. హైదరాబాదు రాజ్యానికి అన్ని రకాల అగ్రిమెంటులు బ్రిటిష్ ప్రభుత్వంతో నేరుగా ఉండేవి. దేశవిభజన జరుగుతున్న సమయంలో, అప్పటి బ్రిటిష్ పాలకులు ఈ అగ్రిమెంటులను గుర్తించలేదు. అప్పటి వైస్రాయి హైదరాబాద్ రాజ్యాన్ని మిగిలిన సంస్థానాల స్థాయికి దిగజార్చాడు. హైదరాబాద్‌కు ఉన్న ప్రత్యేక ప్రతిపత్తిని గుర్తించకుండా ఉండటం, విషాదకరమైన చర్యేకాక నైతికంగా గర్హనీయం కూడా. ఇది హైదరాబాదుకి జరిగిన మొట్టమొదటి అన్యాయం.

(2) బ్రిటిష్ ఇండియాలో పావు వంతు భూభాగం సంస్థానాల ఏలుబడిలో ఉండేది. వీళ్ళ భవిష్యత్తును వీళ్ళకు సంబంధం లేకుండ నిర్ణయించడమైంది. ఆయా నిర్ణయాల్లో వాటికి ప్రాతినిధ్యం ఇవ్వటం అవసరమని ఎవరూ భావించలేదు. ఇది రెండవ అన్యాయం.

(3) దేశ విభజన (తప్పో, ఒప్పో) మత ప్రాతిపదికపై జరిగింది. ఇదే సూత్రాన్ని సంస్థానాలకు కూడ వర్తింప చేయాల్సింది. ఒకవేళ హిందువులు ఎక్కువగా ఉండే సంస్థానాలు ఇండియాలో కలవాలని, ముస్లిం జనాభా అధికంగా ఉండే సంస్థానాలు పాకిస్థాన్‌లో కలవాలనే నిబంధన ఉండవలిసింది. దీనికి బదులుగా సంస్థానాలకు మూడు అవకాశాలు ఇవ్వడం జరిగింది. (1) తిరిగి స్వతంత్రంగానే ఉండటం (2) ఇండియాలో కలపటం (3) పాకిస్థాన్‌లో చేరటం.



www.etelangana.org

హైదరాబాద్ పాలకులు మొదటి అవకాశాన్నే తీసుకున్నారు. అంటే దీనికి చట్టబద్ధత ఉండింది. హైదరాబాదుకి అప్పుడు కనిపించిన పరిస్థితి ఏంటి? అప్పుడే కొత్తగా రెండు దేశాలు అంటే ఇండియా మరియు పాకిస్తాన్ బ్రిటిష్ పార్లమెంట్ చట్టం ప్రకారం ఏర్పడ్డాయి, ఈ రెండింటి భవిష్యత్తు అనిశ్చితంగా అనిపించింది. ఎందుకంటే అవి పుట్టిన వెంటనే సరిహద్దు అంతటా రక్తపాతం జరిగింది. ఈ సందర్భంలో జరిగిన అల్లర్లు హత్యాకాండలు, దహనాలు, లూటీల కారణంగా హైదరాబాదు రాజ్యంలో ముస్లింలు, చాలా మంది హిందువులు ఇండియాలో చేరటానికి మానసికంగా సిద్ధపడ లేదు. ఇంత జరిగినా, మీర్ ఉస్మాన్ అలీఖాన్ నిర్దిష్ట సమయం లోపల ఇండియాలో చేరడానికి సంసిద్ధత వ్యక్తం చేసాడు. (పాకిస్థాన్‌లో కాదు.) ఈ సంసిద్ధత ప్రాతిపదికన ఇండియా, హైదరాబాద్ రాజ్యాల మధ్య సంప్రదింపులు జరిగి "స్టాండ్ స్టిల్" ఒప్పందం కుదిరింది. ఇలాంటి అగ్రిమెంట్ హైదరాబాదు రాజ్యం పాకిస్తాన్‌తో చేసుకోలేదు.

నిజం ఏమిటంటే హైదరాబాద్ కొంత సమయం కావాలనుకుంది, కాని అవతలి పక్షం, ఇండియా మాత్రం చాలా తొందరలో ఉంది. వాళ్ళు అన్ని సంస్థానాలను వీలయినంత తొందరగా ఇండియాలో కలపాలనుకున్నారు, రెండు ప్రభుత్వాల మధ్య చర్చలు సీరియస్‌గా జరుగుతూ ఉండగానే కాంగ్రెస్ పార్టీ చాలా అసహ్యంగా త్వరపెట్టింది. గాంధీజీ నాయకత్వంలోని కాంగ్రెస్ అహింసా పద్ధతులతో బ్రిటిష్ సామ్రాజ్యం నుండి స్వాతంత్ర్యాన్ని సాధించింది. అదే కాంగ్రెస్ అహింసా పద్ధతులతో బ్రిటిష్ సామ్రాజ్యం నుండి స్వాతంత్ర్యాన్ని సాధించింది. అదే కాంగ్రెస్ పార్టీ పటేల్ ఆధ్వర్యంలో ఆర్.ఎస్.ఎస్. ప్రభావంతో హైదరాబాదు రాజ్యానికి వ్యతిరేకంగా హింసా పద్ధతులు ఆచరించింది. హైదరాబాద్ రాజ్య సరిహద్దుల్లో కాంగ్రెస్, కమ్యూనిస్టులు క్యాంపులు పెట్టారు. నిజాం, ప్రభుత్వ మిలటరీ, పోలీసులకు ఇటువంటి ఆకస్మిక పరిణామాలను ఎదుర్కొనే శక్తి లేకుండా పోయింది. ఇలాంటి పరిస్థితులలో మజ్లిసే – ఇత్తెహాదుల్ – ముస్లిమీన్ స్వచ్ఛందంగా ముందుకు వచ్చి సరిహద్దుల్లో జరుగుతున్న దాడులను ఆపడానికి ప్రయత్నిస్తామని చెప్పింది. మరో దారి లేక, ఒక అత్యవసర, సున్నితమైన పరిస్థితిని సరిదిద్దటానికి, చివరి మార్గంగా నిజాం ప్రభుత్వం దీనికి ఒప్పుకుంది. అసాంఘిక శక్తులు, రాజకీయ కార్యకర్తలు రజాకార్ల డ్రస్సులు తొడుక్కొని గ్రామాలపై దాడి చేసి రజాకార్లను బదనాం చేసినారు. అంతేకాక రజాకార్లకు వ్యతిరేకంగా పెద్ద ఎత్తున ప్రచారోద్యమాన్ని చేపట్టారు. ఆ పదకొండు నెలల్లో, ఒక్క షోయబుల్లాఖాన్ హత్య తప్ప (ఇది కూడా ఒక ఆసక్తికరమయిన కథ), ఎలాంటి హత్యలు, దోపిడీలు జరిగిన దాఖలాలు లేవు.

పండిట్ నెహ్రూ, ఆజాద్‌లు ఆశించినట్లు, హైదరాబాదు ఇండియాలో భాగంగా వుంటూ, తన ప్రత్యేక అస్థిత్వాన్ని కాపాడుకున్నాం, కనీసం అంత హడావిడిగా సైనిక చర్య జరపకుండా వున్నా, హైదరాబాదుకే కాక, దేశం మొత్తానికి మంచి జరిగుండేది. హైదరాబాదు సంస్కృతి, సమాజంలో వున్న అనేక విలువలు, విపరీతంగా బ్రిటిష్ సాంస్కృతిక ప్రభావానికి లోనైన భారతదేశానికి ఉపయోగపడేవి. మీర్ ఉస్మాన్ అలీఖాన్ పాలనా కాలంలో సాధించిన పనులను, అప్పటి ఉన్నత విలువలను మిగిలిన భారతీయుల దృష్టికి తెచ్చి భవిష్యత్ తరాలకు మార్గదర్శకంగా ఉండే విధంగా తెలియచేయడం మన జాతీయ కర్తవ్యం.

కెప్టెన్ పాండురంగారెడ్డి పేపర్ చదివిన తరువాత, నా ఆలోచనలనే ఆయన తన కలంతో రాసాడనిపించింది. బహుశా ఎక్కువ మంది మా దృక్పథంతో ఏకీభవించకపోవచ్చు. కాని ఏది ఏమయినా, మా ప్రయత్నం (రచయిత మరియు నేను) జరిగిన నిజాలు చీకటిలో ఉండరాదనే ఉద్దేశంతో చేసినది.

■



మరో రాబిన్‌హుడ్

# మియాసావు

వనపర్తి సంస్థానంతో సంబంధం గల గేయాలలో ఇది ఒకటి. మియాసావు జన్మస్థలం ఏదుల (గోపాలుపేట సంస్థాన గ్రామం). నివాసం సమీపంలోని పానుగల్లు కోటలో. ఇతను లంబాడి వారితో కలిసిపోయి ధనికులను దోచి తెచ్చిన ధనాన్ని బీదలకును, ప్రజాహిత కార్యాలకును వెచ్చించెడి వాడు. ఇతడు వనపర్తి (మహబూబ్‌నగర్ జిల్లా) పాలకులైన ప్రథమ రామేశ్వరరావు, శంకరమ్మల సమకాలికుడు.

మియాసావు తల్లి హసన్‌బీ, తండ్రి బందిగసావు. ఇతనికి మానవాతీత శక్తులున్నట్టుగా జానపదులు వర్ణించారు. పుట్టిన మున్నాళ్ళకే ఎగిరెగిరి పడుతూ, సద్దిమూట తీసికొని ఇల్లు వదలి పోయాడు. జీవితాంతం దొంగతనాలు చేస్తూ, బీదలకు ఉపయోగ పడే పనులు చేస్తూ పానుగల్లు గుట్టపై తలదాచుకొన్నాడట. ఇతను చేసిన దొంగతనాలు కడప దాకా వ్యాపించినాయట. కానాయిపల్లి శంకర సముద్రం, శ్రీరంగాపురం ఆలయ గోపురం మొదలైన నిర్మాణాలకైన ధనాన్ని మియాసావు ఇచ్చినట్టుగా గేయంలో ఉంది. ప్రథమ రామేశ్వరరావుతో మిక్కిలి స్నేహం కల్గివున్నట్లు తెలుస్తున్నది. శంకరమ్మ చేసిన ప్రజాహిత కార్యక్రమాలలో మియా సావుకు గూడ భాగస్వామ్యమున్నట్లు తెలుస్తున్నది. ఇదే కథగల "మీరేసాబు కథ" గేయాన్ని జయధీర్ తిరుమలరావు సేకరించి అచ్చువేసినారు. ఈ గేయం బాణీ, కథనం వేరు కానీ స్థూలంగా కథ ఒక్కటే. (చూ. జానపద చారిత్రక గేయగాథలు. సం. జయధీర్ తిరుమలరావు –1994. పుటలు 64–78)

వయ్యావయ్యా మియాసావు లేవవయ్య మియాసావు
వయ్యావయ్యా మియాసావు పులివంటి మియాసావు
వయ్యావయ్యా మియాసావు వయోతండ్రి మియాసావు
సుక్కావంటి మియాసావు సూతావన్న కానారాడు
ఎలుమలు[1] లేని ఏదులలోన పుట్టినాడే మియాసావు
పుట్టీ మూడు పొద్దులాయె పురూడన్న ఎల్లాలేదు.
పురూడన్న ఎల్లాలేదు అయ్యోతండ్రి మియాసావు



www.etelangana.org

దుంకీ దుంకీ పడుతాడమ్మ ఎగిరి ఎగిరి పడుతాడమ్మ.....
సుక్కావంటీ మియాసావు వయ్యో తండ్రి మియాసావు
దొంగా గడాన వుట్టీనాడె దొంగావోడె మియాసావు
పొత్తిట్లానే బాలూడైతే క్యా కాలైతె పెట్టినాడు
కన్నాతల్లి వాసన బూవు గాదా గాద వొస్కినాది
ఈదీ యేమి సిత్తూరాము మూడొద్దూల బాలూడమ్మ
మూడొద్దూల బాలూడమ్మ ఎట్టా మాటలాడూతాడు వయో॥
కన్నాతల్లి వాసన బూవు నిన్నూ వొక్క మాటడిగేను
నేనొక్కాను మాటడ్గూత కన్నా తల్లి వాసన బూవు
వయ్యా వయ్యా మీయాసావు వయ్యోతండ్రి మీయాసావు
నీవొక్కాని యింట్లాలోనె నేనుండేది కాలంలేదు
దొంగా గడాన పుట్టీనానె దొంగవోన్ని మీయాసావు
కంకేడంత సద్దీగట్టి కన్నుం కత్తి చేతీ కియ్యి
పట్లాకాల మడిగీనాడె దొంగావోడు మీయాసావు
కన్నాతల్లి వాసన బూవు కంకేడంత సద్దీ గట్టె
కంకేడంత సద్దీమూట వీపూనైతె ఏ సూకోని......
నేనూవోయి వచ్చెదతల్లి నాకూ సెలవు వెట్టా వమ్మ
నాకూ సెలవు వెట్టావమ్మ కన్నాతల్లి వాసన బూవు[2]........
ఆవొక్కాని మీయాసావు యీ బాటాల బట్టీ నాడు
ఎల్లా మోల నల్లామోల బాటాలైతె బట్టీ నాడు
నల్లామోల కొచ్చీనాడు ఏమిద్యాలు నేర్చీనాడు
అర్వై కోట్ల మంతూరాలు నేర్చినాడె మీయాసావు...
మల్లా యాడికొచ్చినాడే దొంగావోడు మియాసావు
ఎల్లామోల కొచ్చినాడే ఏమిద్యాలు నేర్చినాడే
వయ్యా వయ్యా మియాసావు లేవవయ్య మియాసావు
కట్టి సాధన నేర్చినాడు కత్తిసాధన నేర్చినాడు
ఏడు ఒక్కసాధనలైతే ఎల్లా నేర్చె మియాసావు
వయ్యా వయ్యా మియాసావు లేవవయ్య మియాసావు
వాన్నుంటాడ్కి లగూగొట్టి దొంగావోడు మియాసావు
లంబాడొక్క గడ్డలోన లగూగొట్టి మియాసావు
సేటిగొట్టి పిలిచినాడు పన్నుండుమంది లంబాడీల
పన్నుండు మంది లంబాడీల చేర్చీ నాడే మియాసావు



అరిమెగాడు ధర్మిగాడు పెద్దావోడు ధర్మిగాడు వయ్యో
పన్నెండుమంది లంబాడీలు వల్ల శాల వొచ్చినారు
పన్నెండు మంది లంబాడీలు వంగీదండం బెట్టినారు
మములు బిల్చిన పనీయేమి పులివంటి మియాసావు
వపుడు ఇంక మియాసావు ఏమని మాటలంటాడమ్మ
ఓరీ కొడుక ధరిమెగాడ పెద్దావోడ ధరిమెగాడ
బత్తానేను ఇస్తాకొడుక బట్టానేను ఇస్తాకొడుక
నిన్నూనేను సాకేను కొడుకనా ఎమ్మాడి రారా కొడుకా......
పన్నెండు మంది లంబాడిలా వెంటానూన బెట్టూకోని
ముగ్గూరొక్క బోయవల్ల ఎట్లాశాల పిలిచినాడు......
పానుగంటి కిలామీదలగూశాల గొట్టినాడు......
సానుగంటి కిలామీద తావులేరి పరిచినారు
పన్నెండు మంది లంబాడీలాకేమంటాను జెప్పినాడు
ఏమంటాని జెప్పినాడు పులీ వంటి మియాసావు
ఓరి కొడుక ధరిమెగాడా పెద్ద ఓడ ధర్మిగాడ
చుట్టాముట్టు పల్లెలిక పేరుజెప్పి దోయవాలె
పేరుజెప్పి దోయవాలె పెద్దవోడు ధరిమెగాడ  వయా॥
చుట్టు ముట్టు పల్లెలైన మట్టమైన దోసినారు
పన్నెండు మంది లంబాడీలు మరిశాల దోసినారు
పానుగంటి కిలా మీద వారిశాల వెట్టినారు........
పన్నెండు మంది లంబాడీలు వనూపర్తి జొర్రినారు
వనుపర్తి శంకారమ్మ మరియెట్ల వణుకుతాది
గడగద వణకవట్టె వానపర్తి శంకరమ్మ
పేరు జెప్పి వనుపర్తి పట్టపగలు దోపిచ్చాడు
పట్టా పగలు దోపిచ్చిండే దొంగావోడు మియాసావు  వయా॥
వనపర్తి దోసినాడు యాడైతేను వెట్టినాడు
కానాపల్లె గుట్టల నడుమ చెరువులైతె ఏస్తాడమ్మ
చెరువులింక వేయావాలె వనపర్తి శంకారమ్మ
గద్దువాల దోసినాడు గాలిగోపురం గట్టినాడు
పెబ్బేరూను దోసినాడు బిరుదూ(బురుజులు)లేర్పరచినారు
బిరుదూలేరిపరిచినాడు దొంగవోడు మియాసావు  వయ్యా॥
చుక్కావంటి మియాసావు దొంగావోడు మియాసావు



www.etelangana.org

ఇంకోక్కటి పల్లెఇంక దోయావాలె ధరిమెగాడ......
పన్నెండు మంది లంబాడీలు లచ్చింపెల్లి కొచ్చీనారు
లచ్చింపెల్లి కొచ్చీనారు కోమటోల్ల చిట్టిప్పారా
కోమటోల చిట్టిప్పారా మడిగేమీద కూసున్నాడు
వయ్యా వయ్యా చిట్టిప్పారా కోమటోల్ల చిట్టిప్పారా
మియాసావు జెప్పినాడు మాకు బత్త వియ్యావయ్య
మాకు బత్త వియ్యావయ్య కోమటోల్ల చిట్టిప్పార
వానమ్మాని మిండని గంటు నీయమ్మాని మిండనిగంటు
నీయమ్మాని మిండనిగంటు నాయింట్లేమన్న పెట్టినార
కుసున్నాట్టి చిట్టిప్పా లేశి నీల బద్దాడమ్మ
బొట్టు చేత బట్టినాడు శెప్పుశేత బట్టినాడు
పెద్దావోన్ని ధరిమెగాన్ని ఈపులు వల్గదన్నీనాడు
ఏయీా వంత నెత్తురాలు గారావట్టి ధరిమెగాడు
అట్లటి కొట్టుడ గొట్టీనాడు కోమటోల్ల చిట్టిప్పార
పన్నెండు మంది లంబాడీలు ఏడ్సుకుంటు మియాసావు
ఏడ్సుకుంటు వచ్చినారు పన్నెండు మంది లంబాడీలు
ఏమీ కొడుక ధరిమెగాడ ఏడ్సుకుంటు వస్తీవయ్యా
ఏమీ బత్త జెప్పితీవి ఈపులు బగుల గొట్టినాడు
మీయమ్మాని మిండనిగంటు మాయమ్మాది మిండనిగంటు
వానింట్లేమి పెట్టాలేదు వంటాడువాడు మియాపావు
ఈపులంత నెత్తురాలు మాకు యింక కారా వట్టె
అట్టివొక్క మియాసావు కన్నులార శూసీనాడు
కుబీమీస మొడిబెట్టి తొడా జప్పరిచ్చినాడు
ఎట్లానొక్క గుడ్లకైన తెచ్చినాడీ కోపాములు
వయ్యా వయ్యా మియాసావు ఏమేషాము గట్టీనాడు
ఊళ్ళికు వచ్చె భోగమురంగ సానేశాలు గట్టీనాడు
రంగాసాని వేషామైతే గట్టినాడు మియాసావు
ఏషామైతే గట్టినాడు యాడికి లాగు గొట్టీనారు
నేను ముందర పోయెను కొడుక మీరు వెనుక రావాల్యార
వంటానీగ జెప్పినాడు పులివంటి మియాసావు
లచ్చింపెల్లి కొచ్చీనాడె దొంగవోడు మియాసావు
లచ్చింపెల్లి రచ్చామీద ఎక్కినాడే మియాసావు



లచ్చింపెల్లి రచ్చామీద ఎట్లారాగ మెత్తినాడు
రాగామెత్తి పాడవట్టి దొంగవోడు మియాసావు   వయ్యా॥
ఊళ్ళవున్న వక్కా(అక్క) లంత ఎట్లాశాలా అంటారమ్మ
కోమటోల్ల వక్కాగారు కాపులోల్ల వక్కగారు
బలిజే వోరి వక్కాగారు బాపనోళ్ళ వక్కగారు
కరణ మోల్ల వక్కాగారు వెలమవోళ్ళ వక్కగారు
రండి రండి వక్కగారు కొత్తభోగం వచ్చిందట

కొత్తభోగం వొచ్చిందంట చూసొద్దాము రండోయమ్మ
మంచి మంచి శీరాలైతే భామాలైతె గట్టినారు
చింతాపండు వోలె యింక సొమ్ములైతె వెట్టుకోని
వట్లాయింక వక్కాగారు శూడానికె వచ్చినారు
వయ్యావయ్య మియాసావు దొంగావాడు మియాసావు
వచ్చినొక్క వక్కాగార్ని పొరాజూసె మియాసావు
పాడినంత సేపువాడె దొంగవోడు మియాసావు
వంగీ పిడికెడిస్కనైతె చేతానైన బట్టినాడు
ఉస్కెశాల (ఇసుక) వట్టినాడు దొంగావోడు మియాసవు
ముప్పై కోట్ల మంతురాలు మంతారిచ్చె మియాసావు
మంతారిచ్చి మియాసావు మందీమీద వడ జల్లె
మందీమీద వడా జల్లె దొంగావోడు మియాసావు
కోమటోళ్ళ వక్కాగారు బాపనోళ్ళ వక్కాగారు
మంచి మంచి కన్నెలైతె సూడానీకె వచ్చినారు
పెట్టినొక్క సొమ్ములమ్మ కట్టినొక్క చీరాలమ్మ
కట్టినొక్క చీరాలమ్మ ఊశీకింద వడ్డాయమ్మ
ఓయమ్మని ఇది ఎంత చిత్ర మేషమున్నాదమ్మ
మాయారంగసాని ఇంక మోసామింక పాయెనమ్మ
దీనొక్కాను మోసామింక మనంకావపోతీయమ్మ
వెనుక ఒక్క చేయి తల్లి ముందాలొక్క చేయితల్లి
మూసుకోని యిండ్లుల్లాకు వాండ్లు శాలా వెళ్ళినారు.......
అన్నుంటాడికి లాగుగొట్టె దొంగావోడు మియాసావు
కోమాటోల చిట్టిప్పారా మడిగె మీద కూశున్నాడు
మడిగెలోన దుంకీనాడే దొంగావోడు మియాసావు



www.etelangana.org

జుట్టూసేత వట్టీనాడె దొంగావోడు మియాసావు
కూశున్నోడు కూశున్నట్లే మూడు గుద్దులు గుద్దీనాడు
బత్తామాకు యియ్యావంటె ఎన్నిదెబ్బలు గొట్టినాడు
నాయమ్మాని మిండనిగంటు వాళ్ళమ్మాని మిండని గంటు
మాయమ్మాని మిండని గంటు మీయింట్లోను వెట్టినావు
అంటాడమ్మ మియాసావు పులీవంటి మియాసావు
మూడు గుద్దులు గుద్దీనాడు కోమాటోల్ల చిట్టెప్పార
ఎడమచేత గోసిజెక్క కోమటోల్ల చిట్టెప్పారా
కాళ్ళు మొక్కుత మియాసావు కడుపులపుడుతా మియాసావు
అడిగినంత బత్తానీకు ఇస్తాతంౘ్రడి మియాసావు
బత్తానీకు ఇస్తను కొడుక ఉతుకవోకు మియాసావు......
ధనామింక జూవుకొడుక కోమటోల్ల చిట్టెప్పారా.....
జుట్టుసేత వట్టినాడు పులి వంటి మియాసావు
గంటె సేత వట్టినాడు పులివంటి మియాసావు
నరుకవోకు మియాసావు సంపావోకు మియాసావు
దానీనొక్క ధనము కొడుక ఎల్లా జెపుత మియాసావు
ముందూనొక్క దర్వాజాల మూడు బొక్కెన్ల ధానాముపుంది
పన్నెండు మంది లంబాడీలు ధనామైతే తీసీనారు......
బండ్లుశాలా గట్టినారు ధనామింక దెచ్చినారు......
వట్టీఒక్క బండ్లానైతే యాడికెల్ల గొట్టీనాడు
పానుగంటి కొలామీదికి గొట్టినాడే మియాసావు వయో॥
దొంగావోడు మియాసావు మళ్ళీమీగ[3] జేసీనాడు
వనాపర్తి శంకారమ్మ[4] బంగూళాకే వచ్చీనాడు
బంగూళాకు లగూగొట్టె దొంగావోడు మియాసావు
ఏమిఏమి శంకారమ్మ వనూపర్తి శంకారమ్మ
మియాసావును సూసీనాది వనూపర్తి శంకారమ్మ
గదూగాద వణకావట్టె వనూపర్తి శంకారమ్మ
ఏమీ ఏమీ శంకారమ్మ నీవేమేమొ అన్నావంట
పేరు జెప్పి పెప్పేరింక ఎల్లానేను దోసీనాను
వనూపర్తి శంకారమ్మా నడుగావట్టి మియాసావు
నేను యింగ నిన్నూ ఏమి అనాలేదు మియాసావు



సామీతోడు భూమీతోడు నేనింగాను అనాలేదు
వయా వయా మియాసావు దొంగావోడు మియాసావు
వంగీదండం పెట్టీనాది వనూపర్తి శంకారమ్మ
కానాపెల్లి గుట్టల నడుమ చెరువూ లింగ వేయావాలె
చెరువులింగ వేయావాలె సెవలుయియ్యి శంకారమ్మ
నాతో నేమి ధనాముంది దొంగావోడ మియాసావు
యిప్పటి మాట మల్లా అంటె ముక్కు చెవులుకోసెనుబిడ్డ
ముందూగాల వదుర గొట్టి దొంగావోడు మియాసావు
వదురుకోని శంకారమ్మ ఏమని ఆజ్ఞ లిస్తాదమ్మ
సాలీనంత రకం నేను ఎల్లాకడుత మియాసావు
కానాపెల్లె గుట్టల నడుమ చెరువూలైతె ఏపీయయ్య
వంటానీగ జెప్పీనాది వనూవర్తి శంకారమ్మ
హోస్నుంటాడి కొచ్చినాడు దొంగావోడు మియాసావు
కానాపెల్లె కొచ్చినాడు దొంగావోడు మియాసావు
కానాపెల్లె గుట్టల నడుమ దుర్గీనైతే వేసీనాడు
దుర్గీనైతె వేసీనాడు కండ్లాతోటి సూసీనాడు
కండ్లాతోని సూసీనాడు పులీవంటి మియాసావు
వయ్యావయ్యా మియాసావు దొంగావోడు మియాసావు
ఎంతాటీది కరువులోన పులీవంటి మియాసావు
అంతాటీది కరువులోన చెరువు ఎట్ల ఏసాడమ్మ
ముగ్గావోసి మియాసావు బునాదింకా తీయామానె
ఊరీ ఊరి ఒడ్డోల్లాను తోలుకొచ్చె మియాసావు
ఊరీ ఊరి ఉప్పారోల్ల పిలువానంపె మియాసావు
మన్నూ మోసె మందీనంత పిలువానంపె మియాసావు
చుట్టూ క్యాంపు వేయించిండే దొంగావోడు మియాసావు
ఎట్లాటొక్క కూలీ తల్లి ఏరుపాటు చేయించాడు
వట్లాటీది కరువూలోన రూపాయాదిన్నరా తల్లి
కడుపూలున్న బిడ్డాలాకు కూలీనేనుయిచ్చెను బిడ్డ
మీరు యింక కట్టయింగ వేయావాలె చెప్పినాడు
చెయ్యామాని చెప్పినాడు పులీవంటి మియాసావు
వయ్యా వయ్యా మియాసావు దొంగావోడు మియాసావు



www.etelangana.org

సుక్కావంటి మియాసావు నూతావన్న కానారాడే
పట్లాయింక మియాసావు పనూలింగ సూపీనాడు
చేసే నొక్క జనామైతె నారాలన్నీ తేలెను తల్లి
అల్లాగైతె మందీ తల్లి జనాలైతే నల్లాగైరి
అయ్యాఅయ్యా మియాసావు కాళ్ళు మొక్కుతం మియ్యాసావు
నెలా రోజులు కాలేదయ్యా నూకు విట్ల అయినది తండ్రి
అప్పుడైతె మియాసావు మల్లెమిగ జేసినాడు
ముప్పైకోట్ల మంతూరాలు మంతారిచ్చె మియాసావు
మంతారిచ్చి మియాసావు ఏమి ఏరుపరచినారు
మట్టీలొక్క చెరువుమీద కట్టామీది మశమ్మారా
కట్టామీది మశమ్మార నీలవెట్టి మియాసావు

నీలాబెట్టి మియాసావు ఎట్లా శాల జెప్పుతాడు
బిడ్డానాడి మందీ దగ్గర నీవు చాలవస్తావేటికి
మందీ దగ్గర వస్తే బిడ్డ ముక్కు చెవ్వుల్ కోశేనింక
వంటానింక భీతా[5] వెట్టి పులీవంటి మియాసావు
వయా వయా మియాసావు లేవవయ్యా మియాసావు
ఏడు ఏడు తూమూలైతే ఏరుపంచి మియాసావు
మూడేండ్లానులోపాలింక[6] చెరువు తీర్వ జేసీనాడు
చెరువూ తీర్వ జేసీనాడు దొంగావోడు మియాసావు
చేసినొక్క మందికి తల్లి పొట్టా జంపాలేదు తండ్రి
ఏడేండ్లాను కరువూలోన బతికించేను మియాసావు
వయా వయా మియాసావు లేవరయ్యా మియాసావు

1) వెలుమలు 2) హసన్ బీబీ (3) మళ్ళి+ఎమి+ఇగ (4) వనపర్తి సంస్థానపాలకుడు ప్రథమారామేశ్వరరావు భార్య ఈమెయే (5) భయం (6) మూడెండ్లలోపల (ఈ విధంగా మియాసావు సాహస కృత్యాలను గురించి అంతం లేకుండా కొనసాగుతుంది ఈగేయం.)

- సేకరణ డా॥ ఆలేటి మోహన్ రెడ్డి

(రేమొద్దుల (మహబూబ్‌నగర్ జిల్లా) గ్రామస్థులైన ఆత్మకూరి నవారమ్మ, కథల ఎల్లమ్మ, కోడేటి బుడ్డమ్మ, [illegible]యనాగమ్మ మొ॥ పాడగా 24-12-85న పై సేకర్త రికార్డ్ చేసినారు)

'ముంగిలి' నుంచి





ఇద్దరూ ఇద్దరే!

# తుర్రేబాజ్... షోయబుల్లా ఖాన్‌లు!

• సయ్యద్ ఖుర్షీద్

బానిసత్వం నుండి మాతృభూమికి విముక్తిని కలిగించాలనే కాంక్షతో అటు దేశ స్వాతంత్ర్య పోరాటోద్యమంలోను ఇటు తెలంగాణ సాయుధ పోరాటంలోను పాల్గొన్న వారెందరో ఉన్నారు. కుల, మతాలకతీతంగా సాగిన ఈ పోరాటాల్లో ముస్లిం వీరుల త్యాగాలకు మాత్రం సరైన గుర్తింపు లభ్యం కాలేదు. పక్రీకరించబడిన చరిత్ర రచనల నుండి వారి త్యాగాల పుటల్ని వెలుగులోకి తెచ్చిన అవసరం ఉంది. అలాంటి వారిలో తుర్రేబాజ్‌ఖాన్ ఒకరు.

తుర్రేబాజ్ ఖాన్ పరాక్రమాలకు పెట్టిన పేరైన రోహిల్లా సైనిక వీరుడు. తండ్రి పఠాన్ రుస్తుం ఖాన్. ఔరంగాబాద్ బ్రిటిష్ కంటోన్మెంట్‌లో జమేదార్‌గా పని చేసేవాడు. దేశమంతటా బ్రిటిష్ పాలనకు వ్యతిరేకంగా తిరుగుబాటు ప్రయత్నాలు సాగుతున్న తరుణంలో మౌల్వీ సయ్యద్ అల్లావుద్దీన్ చేత ప్రభావితుడైన తుర్రేబాజ్ ఖాన్ తిరుగుబాటుకుపూనుకున్నాడు. బ్రిటిష్ అధిపత్యానికి నిలయమైన హైద్రాబాద్ రెసిడెన్సీ పై 500 మంది సాహసికులతో 1857 జూలై 17న సాయంత్రం దాడికి పూనుకున్నాడు. రాత్రంతా జరిగిన ఈ దాడిలో పలువురు సహచరులను కోల్పోయిన తుర్రేబాజ్ ఖాన్ బ్రిటిష్ - నిజాం బలగాలకు జూలై 22న పట్టుబడ్డాడు. తిరుగుబాటుకు నాయకత్వం వహించడం, ప్రజలను రెచ్చగొట్టడం అనే సాకులతో ఖాన్‌కు ద్వీపాంతరవాస శిక్షను విధించారు. దేశభక్తులైన ఇద్దరు కాపలా దారుల సాయంతో ఖాన్ 1859 జనవరి 18న తప్పించుకున్నాడు. అతడిని సజీవంగా కాని, నిర్జీవంగా కాని పట్టిచిన వారికి 5,000 రూ,ల నగదును బహుమతిగా ఇస్తామని నిజాం ప్రభుత్వం ప్రకటించింది. ఆ రోజుల్లో అది చాలా విలువైన నజరానా! దాంతో అప్రమత్తమైన ఖాన్ రహస్యంగా ప్రజలలో తిరుగుతూ, పాలకులకు సింహ స్వప్నం అయ్యాడు. ఆయనను ఎలాగైనా అంతం చేయాలని బ్రిటిష్ నిజాం సేనలు తీవ్ర ప్రయత్నాలు చేయసాగారు. నిజాం ప్రకటించిన నగదు బహుమతికి ఆశపడిన ఖుర్బాన్ అలీ అనే ద్రోహి ఖాన్ ఆచూకీని పాలకులకు వెల్లడించారు. 1859 జనవరి 24న మెదక్ జిల్లా తూప్రాన్ వద్ద తుర్రే బాజ్ ఖాన్ ఉన్నాడన్న ఆచూకీ తెలిసింది. ఖాన్ మీద బ్రిటిష్ - నిజాం బలగాలు విరుచుకుపడ్డాయి. తప్పించుకోవడం అసాధ్యమైంది. ఖాన్‌ను సైనికబలగాలు కాల్చి చంపారు. తుర్రేబాజ్ ఖాన్ పై ఉన్న కోపం కొద్దీ ఆ యోధుని మృతదేహాన్ని హైద్రాబాద్‌కు తరలించారు. భౌతిక కాయాన్ని సంకెళ్లతో బంధించి హైద్రాబాద్ నగరంలో నగ్నంగా (ప్రస్తుతం సుల్తాన్ బజార్) 2 రోజుల పాటు వేడాడదీయించారు.



www.etelangana.org

ఈ సంఘటనలకు గురుగా, హైద్రాబాద్ నగరం నడిబొడ్డున గల కోఠిలోని బస్టాండ్ వద్ద (అది ఆనాటి రెసిడెన్సీ ప్రాంతం) ఒక స్మారక స్థూపాన్ని నిర్మించారు. ఓ గ్రానైట్ స్థంభం, దానికి నాలుగువైపుల పహారా కాస్తున్నట్లుగా నాలుగు ఏనుగుల శిలా విగ్రహాలతో స్మారక స్థూపం ఏర్పాటయింది. కాని నేడు అది ఆ ప్రాంతంలో ఉందన్న విషయమే మరుగున పడిపోయింది. ఆ స్థూపం చుట్టూ వ్యాపారులు, తోపుడు బండ్ల వ్యాపారులు చుట్టు ముట్టడంతో తుర్రే బాజ్ ఖాన్ సాహసాల చరిత్రతో పాటు ఆ స్థూపం మరుగున పడిపోయింది.

బ్రిటిష్ – నిజాం పాలకులకు వ్యతిరేకంగా, మాతృదేశ విముక్తి కోసం ప్రాణాలొడ్డిన తుర్రేబాజ్ ఖాన్ ధీరత్వం చరిత్ర సృష్టిస్తే, తన అక్షరాలనే ఆయుధాలుగా మలుచుకొని పోరు సాగించిన అరుదైన పోరాట యోధుడు షోయబుల్లా ఖాన్.

1920 అక్టోబర్ 17న ఆనాటి ఖమ్మం జిల్లా మానుకోటలో షోయబుల్లా ఖాన్ జన్మించారు. తండ్రి హబీబుల్లా ఖాన్ పోలీస్ అధికారి. గాంధీజీ పోలికలు తనకుమారునిలో ఉన్నాయని మురిసిపోయిన ఆయన 'షోయబుల్లా గాంధీ' అని తన కుమారుడ్ని పిలుచుకునేవాడు. ఉస్మానియా యూనివర్శిటీ నుండి 'గ్రాడ్యుయేషన్' పూర్తి చేసిన షోయబుల్లా నిజాం సంస్థానంలో మంచి హోదాగల ఉద్యోగం లభించే అవకాశమున్నా, జాతీయోద్యమంలో పాల్గొనాలనే తలంపుతో జర్నలిజంను ప్రధాన వృత్తిగా స్వీకరించారు.

జాతీయ భావాలను, ఆ దిశగా రాయబడిన వ్యాసాలను ప్రోత్సహిస్తున్న 'తేజ్' ఉర్దూ వారపత్రికలో పనిచేశారు. బ్రిటిష్ పాలకులను, నిజాం నవాబును రజాకారుల అమానుష కృత్యాలను ఘాటుగా విమర్శిస్తూ వ్యాసాలను రాసారు. ఆయన అలా రాయడం సహజంగానే పాలకులకు రుచించలేదు. "తేజ్" పత్రికపై నిషేధం విధించారు. అయినా షోయబ్ వెనకడుగువేయలేదు. ముందుముల నరశింగరావు ఆధ్వర్యంలో నడుస్తున్న "రయ్యత్" పత్రికలో చేరి తనదైన మార్గంలో రచనలను చేయసాగారు. చివరికి ఈ పత్రికసైతం నిషేధానికి గురి అయింది. ప్రజల పక్షపాతిగా పని చేయాలనే తపన ఉన్న షోయబ్ తన భార్యా, తల్లి ఆ భరణాలను అమ్మి "ఇమ్రోజ్" (నేడు) అనే ఉర్దూ పత్రికను 1947 నవంబర్ 1న ప్రారంభించారు. అర్థిక ఇబ్బందులు చుట్టుముట్టుతున్నా, పట్టుదలతో దినపత్రికను ఆయన ప్రజల పత్రికగా తీర్చిదిద్దారు. నిరంకుత్వం, మత దురహంకారం, బానిసత్వం తదితర దుర్గుణాలపై రాజీలేని పోరాటం సాగించారు.

1947లో దేశానికి స్వాతంత్ర్యం లభించింది. ఆ సమయంలో నిజాం ఇండియన్ యూనియన్‌లో కలిసిపోవడానికి తిరస్కరించాడు. ఆ నిర్ణయానికి వ్యతిరేకంగా ఉద్యమాలు ప్రారంభమైనాయి. పాలకులు అణచివేత యత్నాలకు పూనుకున్నారు షోయబ్ ప్రజల పక్షం వహించారు. అనేక వ్యాసాలు, సంపాదకీయాలు వ్రాసారు. ఈ రాతలు పాలకులకు కంటక ప్రాయమైనాయి. నయానా, భయానా చెప్పి బెదిరించాలని చూసారు. జాగ్రత్తగా ఉండమని పెద్దలు చెప్పిన హెచ్చరికను సైతం ఆ కాలం వీరుడు షోయబ్ పట్టించుకోలేదు.

1948 ఆగస్టు 21 అర్ధరాత్రి ఆయన, తన సహచరుడు మహ్మద్ ఇస్మాయిల్ ఖాన్‌తో "ఇమ్రోజ్" కార్యాలయం నుండి బయటకు వస్తుండగా, పొంచి ఉన్న కిరాతకులు దొంగదాడి చేసారు. కాల్పుల్లో ఆయన నేలకొరికాడు. ప్రభువులను కూడా భయకంపితులను చేసిన రాతలు వ్రాసిన ఆయన చేతులను దుండగులు నరికి వేసారు. ఆసుపత్రిలో చికిత్స పొందుతూ షోయబుల్లా ఖాన్ 1948 ఆగస్టు తెల్లవారు జామున మృత్యుదేవత ఒడిలో చేరారు.

ఇలా తుర్రేబాజ్ ఖాన్, షోయబ్‌లే కాదు, ఇంకా అనేకానేక మంది ముస్లిం పోరాటయోధులు మాతృ భూమి విముక్తి కోసం, దీనజనుల ఉద్ధరణ కోసం ప్రజల పక్షం వహించి, పోరాటాలు చేసారు. స్త్రీ, పురుషులు అనే తేడా లేకుండా ముస్లిం మహిళలు సైతం ఈ ఉద్యమాల్లో పాల్గొని ప్రాణాలర్పించారు. అలాంటి మహానుభావుల జీవన రేఖలను వెలుగులోకి తేవల్సిన అవసరం ఎంతైనా ఉంది. ■



## ఫ్యూడల్ విధానంపై న్యాయపోరాటం చేసిన తొలియోధుడు

# షేఖ్ బందగీ

• సయ్యద్ ఖుర్షీద్

హైద్రాబాద్ సంస్థానాన్ని పరిపాలించిన 'నిజాం' ప్రభువులు (1724–1948) మతరీత్యా ముస్లింలు. కాని క్రిందిస్థాయిలో అధికారాలు చెలాయించిన దొరలు, దేశ్‌ముఖ్‌లు తదితరులు ముస్లిమేతరులే! ఇక్కడ సమస్య మతానిది కాదు. వ్యవస్థది. 'నిజాం' ప్రభువుల్లో కొందరు తమ అధికారాన్ని నిలుపుకోవడానికి మతాన్ని అడ్డుగా పెట్టుకుంటే. క్రిందిస్థాయిలోని భూస్వాములు, దొరలు నిజాంను అడ్డుపెట్టుకొని తమ ఫ్యూడల్ పీడనను కొనసాగించారు. ఇందుకు చరిత్ర పుటల నిండా మనకెన్నో నిదర్శనాలు కనిపిస్తాయి.

హైద్రాబాద్ సంస్థానంలో ఉన్న దేశ్‌ముఖ్‌లలో విస్నూరు రామచంద్రారెడ్డి ప్రముఖుడు. ఇతడు ఈనాటి వరంగల్ జిల్లా జనగామా తాలుకా సమీపంలోని పాలకుర్తి మండలం 'విస్నూరు'ను కేంద్రంగా తీసుకొని వ్యవహారాలు నడిపేవాడు. సుమారు 60 గ్రామాలను ఏలేవాడు. ఇతనికి కేవలం జనగామా తాలుకాలో 10,000 ఎకరాల భూములుండేవని వినికిడి. ఇతడు రాష్ట్ర రజాకార్ల సంస్థకు ఉపాధ్యక్షుడు (చూడుము మానబత్తిని వెంకటమల్లు రచించిన "స్వాతంత్ర్య సమరయోధుల చరిత్ర" పుట 30) ప్రజలపై ఇతని అగడాలకు అంతేలేదు. ప్రజల మానప్రాణాలతో ఆటలాడేవాడు. వెట్టి చాకిరీ చేయించుకునేవాడు. గృహదహనాలు, లూఠీలకు పాల్పడేవారు. గ్రామగ్రామాలలో తన ఏజెంట్లను నియమించుకొని విస్నూర్‌లో పోలీస్ ఠాణాను ఏర్పాటు చేసుకొని అరాచకాలు కొనసాగించేవాడు. ఇతనే కాదు, ఇతని తల్లి జానకమ్మ, కొడుకు బాబూ సైతం ప్రజలపై ఆధిపత్యం చలాయించేవారు. అగడాలు చేసేవారు.



www.etelangana.org

అలాంటి పరిస్థితులలో విస్నూర్ దేశ్‌ముఖ్ రాంచంద్రారెడ్డి ఆగడాలపై ఒక పేదరైతు న్యాయ పోరాటానికి పూనుకున్నాడు. అతడే షేక్ బందగీ! దేశ్‌ముఖ్‌ల ఫ్యూడల్ విధానాలపై తొలిసారిగా న్యాయపోరాటానికి పూనుకున్నాడు. ఈ సంఘటన 1940 దశకంలో జరిగింది.

షేక్ బందగీ ఒక పేద ముస్లిం రైతు. 1941లో ఇతనికి, ఇతని సోదరుల మధ్య భూవివాదము చెలరేగినది. బందగీ అన్న అబ్బాస్ అలీ విస్నూర్ రామచంద్రారెడ్డి చేతిలో కీలుబొమ్మ. మిగిలిన సోదరులందరూ బందగీ పక్షమే. భూముల పంపకం జరగాలని. తమ్ముళ్లందరూ కోరుతుండగా, అన్న అబ్బాస్ అలీ మాత్రం రామచంద్రారెడ్డి అండదండల్ని చూసుకొని వ్యతిరేకించసాగాడు. అబ్బాస్ అలీని తన చెప్పుచేతల్లో ఉంచుకొని అన్నదమ్ముల్ని చీల్చి తన పబ్బం గడుపుకోవాలని దేశ్‌ముఖ్ రామచంద్రారెడ్డి పన్నాగం.

అప్పటికీ బందగీ వయస్సు 20 సంవత్సరాలు. అందమైన శరీరాకృతి. దేవరుప్పల మండలం కామారెడ్డిగూడెం ఇతని స్వస్థలం. అభ్యుదయ భావాలు కలవాడు నిత్యం ఆంధ్ర మహాసభ, వారి అనునాయులతో తిరిగే వాడు. గ్రామ సమస్యల పట్ల దృష్టి నిలిపే వాడు. తన అన్న అబ్బాస్ అలీ దేశ్‌ముఖ్ పక్షం వహించడం ఇతనికి ఇష్టంలేదు. వీరిద్దరూ సృష్టించే ఇబ్బందులను తట్టుకోవడానికీ బందగీ న్యాయస్థానాన్ని ఆశ్రయించాడు. ఈ వివాదము 3 సంవత్సరాల పాటు సాగింది. చివరికి న్యాయమే గెలించింది. కోర్టు తీర్పు బందగీ పక్షాన వెలువడింది. ఈ తీర్పు విస్నూర్ దేశ్‌ముఖ్‌కు కంటగింపును కల్గించింది. కోర్టులో భూవివాదము ప్రత్యక్షంగా అన్నదమ్ములిరువురి మధ్య జరిగినా పరోక్షంగా అది బందగీ దేశ్‌ముఖ్‌ల పోరాటంగా మారింది. బందగీ న్యాయస్థానంలో పొందిన విజయం దేశ్‌ముఖ్‌కు తలతీసేసినట్లయింది. ఎలాగైనా బందగీ పై ప్రతీకారం తీర్చుకోవాలని పథకాలు వేయసాగాడు.

ఈ మధ్యకాలంలో బందగీ దేశ్‌ముఖ్ ఆగడాలకు, దౌర్జన్యాలకు వ్యతిరేకంగా ప్రజల పక్షాన జరిగే ఉద్యమంలో పెద్ద ఎత్తున పాల్గొన్నాడు. మండలంలోని ధర్మాపురం, దేవరుప్పల, కామారెడ్డి గూడెం, కడివెండి, సీతారాంపురం, నిర్మాల, మరిపడగ, కోలు కొండ తదితర గ్రామాల్లోని ప్రజలు ఉద్యమించారు. ఆయా గ్రామాల్లో పలువురు నాయకులు ఈ ఉద్యమానికి నాయకత్వం వహించారు. కామారెడ్డి గూడెం గ్రామంలో షేక్ బందగీ ఈ ఉద్యమాన్ని ముందుకు తీసుకెళ్ళే బాధ్యతను భుజాన వేసుకున్నాడు.

ఎంతోకాలంగా బందగీపై ప్రతీకారానికి ఎదురుచూస్తున్న దేశ్‌ముఖ్ గుండాలు. అబ్బాస్ అలీ నాయకత్వంలో ఒంటరిగా ప్రయాణిస్తున్న బందగీపై దాడికి పూనుకున్నారు. కర్కశంగా హత్య చేసారు. ఈ దుర్ఘటన 1948 జూలై 26న జరిగింది. ఈ సంఘటనతో ప్రజలు మరింత కోపోద్రిక్తులైనారు. మరింత కసిగా ఉద్యమంలోకి రావడం. ప్రారంభించారు. బందగీ పట్ల తమకుగల ప్రేమాభిమానాలకు గుర్తుగా బందగీ రక్తం చిందిన స్థలంలోనే అతని సమాధిని నిర్మించి నివాళులు అర్పించారు. కామారెడ్డి గూడెం వద్ద ఉన్న బస్టాండ్ సమీపంలోని 'ఖబరస్థాన్' (శ్మశానవాటిక)లో ఈనాటికీ షేక్ బందగీ సమాధి చరిత్రకు సాక్ష్యంగా నిలచి ఉంది. కానీ పట్టించుకునే నాథులే లేదు. అందుకు అతడు అనుసరించిన మతమే కారణమా? ■





# నా శవ పేటికపై ఉత్సవాలా! హైదరాబాద్ విలీన, స్వతంత్రోత్సవాలు - ఎవరి కోసం?

● ఎమ్.ఎ.మాజీద్ (ఉర్దూ డైలీ ఎత్తెమాద్, 28 అగస్టు 2010 ఎడిషన్)

(తెలుగు అనువాదం ఏశాల శ్రీనివాస్)

17 సెప్టెంబర్‌ను 'స్వాతంత్ర్య దినం', 'స్వేచ్ఛా దినం', 'విజయోత్సవ దినం' వంటి అనేక పేర్ల మీద అధికారికంగా జరపాలనే డిమాండు ముందుకు వస్తోంది. కాని ఎందుకు? హైదరాబాద్ ఏమైనా పరాయి పాలన నుండి స్వాతంత్ర్యం పొందిందా? 62 సంవత్సరాల తరావత అధికారికంగా జరపాలనే డిమాండ్ ఎందుకు వస్తోంది? హైదరాబాద్ సంస్థానమొక్కటే ఇండియాలో కలిసిందా? 1998లో బిజెపి హైదరాబాద్ విలీనాన్ని స్వాతంత్ర్య దినోత్సవంగా జరపాలనే "దుష్ట ఆలోచన"ను ప్రచారంలోకి తెచ్చింది. ఆ రోజు అద్వాని సారథ్యంలో నిజాం కాలేజీ గ్రౌండ్స్‌లో జరిగిన సభలో బిజెపి హైదరాబాదు అప్పుడే ఇండియాలో కలిసినట్టుగా ప్రవర్తించింది. 12 సంవత్సరాల తర్వాత ఇదే బిజెపి ఎజెండా అన్ని రాజకీయ పార్టీల ఎజెండాగా మారిపోయింది.

బిజెపి విజయోత్సవదినంగా, స్వాతంత్ర్య దినంగా జరపడం మొదలు పెట్టిన తర్వాత ఇప్పుడు కాంగ్రెస్, టి.డి.పి, లెఫ్ట్ పార్టీలు కూడా ప్రభుత్వమే దీన్ని అధికారికంగా జరపాలని డిమాండు చేస్తున్నాయి. బిజెపి, కమ్యూనిస్టు లీడర్లు ప్రభుత్వానికి ఈ విషయమై ఉత్తరాలు రాస్తున్నారు. వీళ్ళ మధ్య సఖ్యత 'చూడచక్కనిది'గా ఉంది. ఉత్సవాలు జరపడంపై వీళ్ళు కలిసికట్టుగా ఉన్నారు, కాని ఏ ఉత్సవాలు? ఈ ఉత్సవాలు అధికార మార్పిడి జరిగినందుకు కాదు, లక్షలాది స్త్రీ, పురుషుల చావులపై జరిగే ఉత్సవాలు, వేలాది మహిళలపై జరిగిన అత్యాచారాల ఉత్సవాలు, వేలాది ఎకరాలను ఆక్రమించుకొన్నందుకు ఉత్సవాలు, వేలాది మందిని ప్రభుత్వ ఉద్యోగాల నుండి తొలగించినందుకు ఉత్సవాలు, ఒక భాషను విధ్వంసం చేసినందుకు ఉత్సవాలు, స్థానిక భాషలోనే ఉన్నత విద్యను అందించాలనే ఉద్దేశంతో ప్రయోగపూర్వకంగా పెట్టిన యూనివర్శిటీ యొక్క ఉన్నత ఆశయాన్ని చెడగొట్టినందుకు ఉత్సవాలు. ఈ ఉత్సవాలు ప్రతి సంవత్సరం జరుగుతున్నాయి కాని అధికారికంగా కాదు. ఇప్పుడు అన్ని రాజకీయ పార్టీలు దాదాపు ఒక అభిప్రాయానికి వచ్చి, అధికారికంగా ఉత్సవాలు జరపాలంటున్నాయి. తొమ్మిది సంవత్సరాలు ముఖ్యమంత్రిగా చేసిన చంద్రబాబునాయుడు కూడా



www.etelangana.org

ఇప్పుడు హైదరాబాద్ స్వాతంత్ర్యదినోత్సవాలు అధికారికంగా జరపాలంటున్నాడు. ముందు నుండి తెలుగు దేశానికి చెందిన తెలంగాణా నాయకులు కమ్యూనిస్టు, బి.జెపిల కంటే గట్టిగా ఈ డిమాండు చేస్తున్నారు. కాంగ్రెస్ సర్దార్‌పటేల్ వారసులమని చెప్పుకుంటూ డిమాండు చేస్తున్నారు. ఈ బంగారు అవకాశాన్ని ఉపయోగించుకునే వాళ్ళలో టి.ఆర్.ఎస్ ముందు ఉంటుంది. వీళ్ళు బి.జె.పి చేస్తున్న దుశ్చర్యలను మద్దతిస్తారు, 12 శాతం రిజర్వేషన్లు ముస్లింలకు ఇస్తామంటారు. కానీ ఒక్క ముస్లింకు కూడా ఇప్పటి వరకు టికెట్ ఇవ్వలేదు. బయటికి నిజాంని పొగిడినట్లు కనిపిస్తారు కానీ లోపల మాత్రం ద్వేషం తప్ప మరేదీ లేదు.

14 ఆగస్టు 1947 శుక్రవారం అర్థరాత్రి బ్రిటిష్ పాలకుల నుండి భారత స్వాతంత్ర్య ప్రకటన వెలువడినప్పుడు, ఉన్న 543 సంస్థానాలలో మెజారిటీ హిందూ రాజులు, మహారాజులవే. వీళ్ళంతా బ్రిటిష్ అధికారికారానికి అనుకూలంగా ఉన్నవాళ్ళే. బ్రిటిష్ స్వాతంత్ర్య ప్రకటన బ్రిటిష్ పాలన కింద ఉన్న ప్రాంతానికే తప్ప, స్వతంత్రంగా ఉన్న సంస్థానాలకు కాదు. సంస్థానాలకి స్వయం నిర్ణయాధికారం ఇవ్వబడింది. ఇండియాలో చేరడం లేదా పాకిస్థాన్‌లో చేరడం లేదా స్వతంత్రంగా ఉండడం. అప్పటి రాజకీయ పరిస్థితులను గమనించకుండా, 62 సంవత్సరాల తర్వాత హదరాబాద్ స్వాతంత్ర్యం గురించి ఇప్పుడు ఎందుకు ఒత్తిడి తెస్తున్నారు? ఒకవేళ 'విముక్తి' ఉత్సవాలే జరపాలనుకుంటే, స్వచ్ఛందంగానో, బలవంతంగానో విలీనమయిన 543 సంస్థానాలన్నీ కూడా విలీన ఉత్సవాలు జరుపుకోవాలి. హైదరాబాద్ ఒక్కటే ఎందుకు జరుపుకోవాలి? మన దేశం స్వాతంత్ర్యాన్ని పొందినప్పుడు హైదరాబాద్ అతి పెద్ద, సంపద్వంతమైన సంస్థానం. ఈ సంస్థానాన్ని భాషా ప్రాతిపదికపై మూడు రాష్ట్రాలుగా విభజించారు. బ్రిటిష్ వాళ్ళు పరాయి పాలకులు, కాని వాళ్ళకి వ్యతిరేకంగా ఎవరు పోరాడురు, ఎవరు త్యాగాలు చేసారు? వాటికి ఈ భూమే సాక్ష్యం. చివరి నిజాం అయిన మీర్ ఉస్మాన్ అలీఖాన్ విదేశీ పాలకుడా? అతని ప్రభుత్వంపై ఎందుకు అంత ద్వేషం? నిజాం పాలన గురించి మంచి మాటలు ఎందుకు మాట్లాడరు?

హైదరాబాద్ విలీనం జరిగిన విధానాన్ని గమనించండి. ముస్లిం పాలకుడు కాబట్టి ముస్లిం ప్రజలను ఎంత తీవ్రంగా శిక్షించారంటే, ఆ గాయాలు ఇప్పటికీ సజీవంగానే ఉన్నాయి. పాలకుడు ముస్లిం అయితే ముస్లింలందరూ పాలకులు కాదు కదా! పాలితులంతా కేవలం ప్రజలు మాత్రమే. స్వాతంత్ర్య సూర్యుడు ఉదయించిన వేళ ముస్లింలకి అది యుగాంతంగా పరిణమించింది. అందువల్లే ప్రస్తుత ఉత్సవాలు విద్వేషంతో సమానం. స్వతంత్ర్యం రాగానే హైదరాబాద్ రాజ్య భవిష్యత్తు ప్రశ్నార్థకమయింది. విషయం ఐక్యరాజ్య సమితికి వెళ్ళింది. సమితి జోక్యంతో అసఫ్ జాహీ ప్రభుత్వం భారత నాయకులతో సంప్రదింపులు జరిపింది. ఈ సంప్రదింపులు జరిగినంత కాలం, భారత ప్రభుత్వం దాదాపు ఒక సంవత్సరం పాటు హైదరాబాద్ రాజ్యం ఆర్థిక దిగ్బంధాన్ని విధించి ప్రజల పరిస్థితిని దీన, దీన గండంగా మార్చింది. 1948, సెప్టెంబరు 13న మొహమ్మద్ అలీ జిన్నా చనిపోయారు. ఇదే సమయం కోసం భారత ప్రభుత్వం ఎదురు చూస్తుంది. ఒకవైపు జిన్నా అంత్యక్రియలు జరుగుతుండగా మరోవైపు న్యూఢిల్లీలోని హైదరాబాద్ హౌస్‌లో సంప్రదింపులు-జరుగుతున్నాయి. హైదరాబాద్ నుంచి వచ్చిన ప్రతినిధులను సంప్రదిపులతో బిజీగా ఉంచి భారత ప్రభుత్వం మరోవైపు మిలిటరీ ద్వార హైద్రాబాద్ ఆక్రమించుకోవటానికి ఆర్డరులు పాసు చేసింది. దాన్ని నీవు 'ఆపరేషన్ పోలో' లేదా 'పోలీస్ యాక్షన్' ఏ పేరు అయిన పిలువచ్చు గాక ఈ రోజుకూ దాని పేరున జరిగిన విధ్వంసం మన చుట్టూ కనబడుతుంది.

హైదరాబాద్ కేంద్రంగా ఉండిన దక్కన్ అస్థిత్వం ఒకప్పుడు గోల్కొండ రాజ్యంగా వెలుగొందింది. ఇక్కడ చరిత్ర మనకు చెప్పేదేంటంటే తన స్వాతంత్ర్యం విషయంలో దక్కన్ ఎప్పుడూ, ఎవరికీ తలవంచలేదు. ఢిల్లీ నుండి ఆర్కట్ వరకు కాబుల్ నుండి రంగూన్ వరకు విస్తరించిన పదిహేడవ మొఘల్ సామ్రాజ్యానికి ఈ స్వేచ్ఛ, స్వాతంత్ర్యాల గోల్కొండ ఒక ఎగతాలిగా పరిణమించింది. మొఘల్



సామ్రాట్టు దీన్ని భరించలేకపోయాడు. దీన్ని తేలిగ్గా లొంగదీసుకుందామనుకున్నాడు. కానీ చాలా నెలలు పట్టింది. పెద్ద ఎత్తున బలగాలు, అధికారం ఉన్నా ఈ ప్రాంతంలోకి చొరబడలేక పోయాడు. తర్వాత లంచాలు ఇచ్చి, నమ్మక ద్రోహం చేసి బలగాలను లోపలికి (1628 సం) తీసుకువచ్చాడు. అయినా సరే అబ్దుల్ రజాక్ లారీ ధైర్యంగా మొఘల్ సైన్యాన్ని ఎదిరించి పోరాడాడు. తెలంగాణాగా పిలవబడుతున్న ఈ భూమి, విద్యార్థుల ఆత్మహత్యలపై హిస్టీరియా సృష్టించి రాజకీయ బలాన్ని పెంచుకుంటున్న వారిని ప్రశ్నిస్తోంది, "మీకు త్యాగం అర్థం తెలుసా"అని ఎవరయితే ఇతరుల త్యాగాల నుండి రాజకీయ లబ్ది పొందాలని చూస్తారో వారికి ఈ ప్రాంత రాజకీయ భవిష్యత్తును నిర్ధారించే అధికారం లేదు.

ఇతరుల విషాదంపై ఉత్సవాలు జరుపుకోవాలని, ప్రభుత్వానికి అధికారికంగా జరపమని ఉత్తరాలు రాస్తున్న వీళ్ళ ప్రయత్నాల వల్ల ఒరిగేదేమీ లేదు. వీళ్ళకు హైదరాబాద్ కావాలి కాని హైదరాబాదీయులు అక్కర లేదు. వీళ్ళకి ఒక వేళ హైదరాబాదీయులు పట్ల అసక్తి, ప్రేమ ఉంటే ఉత్సవాల గురించి మాట్లాడరు. ముస్లిం నాయకులు తెలంగాణపై తమ స్థానాన్ని స్పష్టం చేసి ఉత్సవాలు వద్దని పదే, పదే వారించారు. అయితే హైద్రాబాద్ విద్రోహులయిన వీళ్ళు ముస్లిం నాయకత్వాన్నే వేలెత్తి చూపుతున్నారు.

ఒకవేళ హైదరాబాద్ విలీనోత్సవం జరపాలంటే 543 సంస్థానాల విలీనోత్సవాలు జరపాలి. హైదరాబాద్ విలీనం తర్వాత గోవా 1961 వరకూ, సిక్కిం 1975 వరకూ స్వతంత్ర్యంగా ఉన్నాయి. హైదరాబాద్ విషయంలో మాత్రమే ఎందుకీ ద్వంద్వ వైఖరి? కాశ్మీర్ కొరకు 370 ఆర్టికల్, ఈశాన్య రాష్ట్రాలు మరియు సిక్కిం కోసం 371 ఆర్టికల్, గోవాకు రాజ్యాంగంలో ప్రత్యేక ప్రతిపత్తి, కాని హైదరాబాద్‌కు రాజ్యాంగంలో ఏమీ లేకపోవటానికి కారణం ఏమిటి? 1948 సెప్టెంబరు 13న అసఫ్ జాహీ ప్రతినిధులకు కాంగ్రెసు ప్రత్యేక రాజ్యాంగ ప్యాకేజీ ఇస్తామని చెప్పి, వాళ్ళు ఒప్పుకున్న తర్వాత మోసం చేసినారు.

ఒకవేళ హైదరాబాద్ విలీనోత్సవాలు జరపాలనుకుంటే స్వామి రామానందతీర్థ చేసేవాడు. ఎందుకంటే నిజాంకు వ్యతిరేకంగా జరిగిన ఉద్యమానికి నాయకత్వం వహించాడు కాబట్టి. మాజీ ప్రధాని పి.వి.నర్సింహారావ్ ఈ నాయకులతోటి మంచి సంబంధాలు ఉన్నవాడు. ఇతను నిజాంను తీవ్రంగా వ్యతిరేకించాడు కాని ఉత్సవాలు జరపలేదు. హైదరాబాద్ విలీనం తర్వాత నిజాంను ఎందుకు 'రాజ్ ప్రముఖ్' చేసారు? ఇలాంటి చాలా ప్రశ్నలకు కెసిఆర్, టి.ఆర్.ఎస్ ల దగ్గర సమాధానాలు ఉన్నాయా?

అధికార బ్రోకర్లు, వారి అనుయాయులు ఈ భూమి పట్ల ఉన్న అభిమానాన్ని, ప్రేమను ఎలా వ్యక్తం చేయగలరు? ఈ భూమి కోసం నిజమయిన ప్రేమకులు ఎప్పుడు కావాలంటే అప్పుడు రక్తం చిందించారు. అబ్దుల్ రజాక్ లారీకి తాను చాలా బలవంతుడయిన, ఖురాను రాసే అత్యంత భక్తిపరుడయిన రాజుకు వ్యతిరేకంగా పోరాడుతున్నానని, తెలుసు. అయితే అతడికి కానీ, గొల్కొండ రాజులకి కానీ ఆ పోరాటం మతానికి, బలగానికి సంబంధించింది కాదు. అది దక్కన్ సంస్కృతి, ఆత్మాభిమానానికి సంబంధించింది. ఇవాళ ఇదే ప్రశ్న ప్రతీ హైదరాబాదీ మనసులో ఉంది. 1948లోతరువాత జరిగిన పరిణామాల్లో మరణించిన వారి శవాల మీద, రక్తపాతం మీద ఉత్సవాలు చేసుకోవటాన్ని ఎలా అంగీకరిస్తాం? అవహేళన చేయటానికో, కించపరచటానికో జరపవచ్చు. కానీ ఈ ఉత్సవాల పేరు మీద వాళ్ళు ఏదైతే సాధిద్దాం అనుకుంటున్నారో అది మాత్రం అసాధ్యం. హైదరాబాద్ విలీనం హైదరాబాదీయులకు మానని గాయం. కాషాయ మరియు ఎరుపు రంగు జెండాలు ఈ విషయంలో ఒకటి కావచ్చు. గోల్కొండను ఓడించిన తర్వాత ఔరంగజేబు మొఘల్ సామ్రాజ్యాన్నే శవ పేటికలో చేర్చాడు. ఇప్పుడు ఎవరయితే విలీనోత్సవాలు జరపాలనుకుంటున్నారో వారికి కూడా ఇదే శాస్తి జరుగుతుంది. ■



www.etelangana.org

# హరిత స్వప్నాలు

• ఇక్బాల్

ఎదమీద ఎడారి
సెగలు పొంగుతూ
పర్చుకున్నది కదా...
మొక్కలు చిగురు తొడక్కుండానే
మోడు బారుతాయిక్కడ!

రక్తపుటేరుల ముట్టడిలో
హరిత స్వప్నాలు
బంధీలై నాయికదా..
కాసిన మొగ్గలు
పూయకుండానే
రాలిపోతాయిక్కడ!

కన్నీటి జలపాతాల్ని
కళ్ళారా చూసి చూసి
భానుడి కళ్ళు చెమ్మతో కమ్మాయికదా...
కారు చీకట్లం తప్ప
సూర్యోదయాలే లేవిక్కడ!

ఇక్కడ.. జీవనదులు..
కడుపులో దుఃఖాన్ని దాచుకొని
బుక్కెడు బువ్వకూ
పక్కెడు నీటికీ
అల్లాడే దృశ్యాలకు తట్టుకోలేక
ముఖానికి కొంగు చిటేసుకొని
నురగలు కక్కుతూ పరుగు తీస్తాయి!

నిజమే...!
యుగాలుగా
రెక్కల కష్టాన్నే నమ్ముకున్న
స్వేద జలాలం మేం!
అలగా జనాలం మేం!!

మా వనరులూ
మా సంపదా
మా సమస్తం
తరాల మీ ఊడిగపో
చితికి పోయినం మేం!
చివికి పోయినం మేం!!

మా మాయి ముంతలు
పొదిగిన మా గడ్డ మీద
మాయమై పోతున్న
మా ఊరి బొంద్రాయి సాక్షిగా...

పొక్కిలి పొక్కిలి తేలిన
మా సొంతింటి ముంగిట్ల
ముంతెడు నీల్లు జల్లి
అలికి ఆరాముగ
సేద దీరుత మిప్పుడు!

ఆకలి గొన్న పేగులు
ఎంతగా అల్లాడినా
కడుపులో కాళ్ళు బెట్టుకొని
దోసెడు నీల్లు దాగి
కాసింత కునుకు దీస్తం!

మా జాగియ్యంటున్నం...!
మా జాగా మాదే అంటున్నం...!
మా అలగ్ జాగా
మాకిచ్చేసి తీరాలంటున్నం...!

అడుక్కోడానికొచ్చి
అధికారం చేజిక్కిచ్చుకున్న బేహారీ
అన్ జాన్ గా అలగైపో...!
బట్టే బాజ్... ధోకేబాజ్....
జేడధులై పో మా గడ్డ మీంచి!!



# పోలీస్ యాక్షన్ : డా. జైమీ జ్ఞాపకాలు

• పరవస్తు లోకేశ్వర్

"సలాం హైద్రాబాద్" నవల రచనా రోజులతో, అనగా ఇప్పటికే పది సంవత్సరాల క్రింద, ఇంకా ఖచ్చితంగా చెప్పాలంటే 15 ఎప్రిల్ 2001 నాడు సమాచార సేకరణ నిమిత్తం Dr. అబ్దుల్ ఖుద్దూస్ జైమీ సాబ్‌ను హిమాయత్ నగర్ గల్లీల ఒక రెండు. అర్రల పెంకల ఇట్ల కలుసుకునే భాగ్యం నాకు దొరికింది. అప్పటికే ఆయన సహస్రచంద్ర దర్శనం చేసి ఎనిమిదేళ్ల ధాటింది. ఎనభై ఎనిమిదేండ్ల ఆ వృద్ధుడు వృత్తిరీత్యా Homeo Doctor. అయినా ఆ వయస్సులో కూడా ఇంకా వైద్యం చేస్తూనే ఉన్నాడు. ఆ పండు ముదుసలి నా కండ్లకు మధ్య ఆసియా మండుటెండల ఇసుక ఎడారిలో నిరంతర సంచారం చేసే ఒక ఒంటరి సూఫీ ఫకీర్‌గా కనిపించాడు. ఆ తెల్లటి పెద్ద పొడుగు గడ్డంలొంచి పువ్వులా పూచే పసిపాపల బోసి నవ్వు నాకు ఇప్పటికీ గుర్తుంది. ప్రథమ దర్శనంలో నన్ను ఆ చిన్నగదిలోని చింపుల చాపపై కూచుండబెట్టి ఇప్పుడే వస్తా అని గూని నడుంతో గుసగుస నడుచుకుంటూ రోడ్డు మీదికి వెళ్లి కొద్ది సేపటికి వణుకుతున్న చేతులలో మటన్ బిర్యానీ పొట్లంతో తిరిగొచ్చాడు. ఒక్క మెతుకైనా తను ముట్టకుండా మొత్తం నాకే తినిపిస్తుంటే మొగమాటంతో నేను మీరు కూడా తినండి అంటే "మేరా ఖానేకా ఉమర్ నహీ.. హై. ఖిలానే కా ఉమర్ హై" అని పెద్దగా నవ్వాడు. ఆ గుబురుగడ్డం ముసలాయన ఒక నడుస్తున్న చరిత్ర. ఆయనను కలవడం అంటే చరిత్రలో కరచాలనం చేయడమే! ఆయన్ని ముట్టుకుంటే పట్టుకునే ముచ్చట్లు. కాల గర్భంలో కలసిపోయిన ఘటనా దుర్ఘటనలకు ప్రత్యక్ష సజీవ సాక్ష్యం. తెగిన ముత్యాల దండలోని ముత్యాలు నేలమీద చెల్లాచెదురుగా దొర్లిపోయినట్లే ఆ తెగిన జ్ఞాపకాల్ని జాగ్రత్తగా పూసగుచ్చగా ఆయన జీవిత శకలాలు, ప్రత్యేకంగా 1948 సెప్టెంబరు 13-17 దుర్దినాల జ్ఞాపకాలు రూపుకట్టినాయి. సహానుభూతి గల సహృదయ పాఠకులు ఆ చారిత్రిక జ్ఞాపకాలలోకి పరకాయ ప్రవేశం చేయగలరని ఆశిస్తూ......

నా వయసిపుడు 88 సంవత్సరాలు. మాది నిజాంబాద్ జిల్లా. అక్కడే ఉర్దూలో నా మున్షీ చదువు పూర్తికాగానే 1930-35 ప్రాంతాలలో ఢిల్లీ వెళ్లి అక్కడే సమీపంలోని షాజహానా పూర్‌లోని యూనివర్సిటీలో ఫార్సీ చదువుకున్నాను. అతీ జాతీయ భావాలు కలిగిన కళాశాల. అక్కడే అరబ్బీ,



www.etelangana.org

ఫార్సీలతో డబుల్ పి.జి. చేశాను. దేశభక్తి, కాంగ్రేసు పట్ల అభిమానం ఆ రోజులలోనే కల్గింది. 1938 లో త్రిపురలో కాంగ్రేసు సభలు జరిగాయి. అక్కడ నేతాజీ సుభాష్ చంద్రబోస్‌కు వాలంటీర్‌గా పనిచేశాను, గాంధీ, నెహ్రూ, జిన్నా, బాబు రాజేంద్ర ప్రసాద్, అలీ బ్రదర్స్‌లను దగ్గరి నుండి చూశాను. గాంధీజీ నిజంగా మహాత్ముడే కానీ, రాజనీతిలో మాత్రం రాజాజీని మించిన వారు లేరు. ఈ సంగతులన్నీ ఆ త్రైపుర్ కాంగ్రేసులోనే గమనించారు.

1942లో క్విట్ ఇండియా ఉద్యమం వచ్చింది. నేనందులో చురుకుగా పాల్గొనే సరికి సి.ఐ.డి.ల దృష్టిలో పడ్డాను. వారిని తప్పించుకోవటానికి లాహోర్ పారిపోయి అక్కడి హోమియోపతి మెడికల్ కాలేజీలో చేరాను. లాహోర్ ఇప్పుడు పాకిస్తాన్‌లో ఉంది. Dr. శర్మగారు ఆ కాలేజీ ప్రిన్సిపాల్. నా నిజాయితీ, కష్టపడే గుణాన్ని చూసి నన్ను తన కొడుకులాగా ప్రేమించాడు. పోలీసులు నన్ను వెంటాడుతూ అక్కడికి కూడా వచ్చారు. ప్రిన్సిపాల్ శర్మగారు నన్ను దాచేసి దొంగ రికార్డులు చూపి ఆ పేరు కలవారు ఇక్కడ ఎవరూ లేరని అబద్ధాలు ఆడి వారిని ఉత్తచేతులతో వాపస్ పంపాడు.

అట్లా డాక్టరీ సనద్ పట్టుకుని చాలా పనులకు మా నిజాంబాద్‌కు వచ్చి ప్రాక్టీస్ శురూ చేశాను. గ్రామాలన్నీ తిరుగుతూ మందులిచ్చేవాణ్ణి. ఆ రోజులలో హోమియో వైద్యం ప్రజలకు కొత్త. తెల్లటి మందుల్ని విచిత్రంగా చూస్తూ వాటిని శక్కరగోలీలు అనుకునేవారు. వీటికి ఇంత ఎక్కువ ధర ఎందుకు? అవే పైసలకు పెద్ద పెద్ద శక్కరగోలీలు వస్తయి కదా అని వాదించేవారు. అవన్నీ అమాయకపు పడ్డి రోజులు.

ఆ రోజులలో అనగా 1944-45 ప్రాంతాలలో మొత్తం నిజాంబాద్ జిల్లాలో జాలేనుఖాయాలు కల్గిన ముస్లింలం ముగ్గురమే ఉండేవారం. మేం ముగ్గురమే బాగా చదువుకున్నవాళ్లం. మిగతా ముసల్మాన్లందరూ నిజాంకు లేదా MIM రజాకార్లకు మద్దతుదార్లు. పేద ముస్లింలు కూడా 'అనల్ మాలిక్' సిద్ధాంతం పుణ్యమో అని సహజంనే సమర్థించేవారు. మేం రాచరికానికి కాలం చెల్లిందని, ప్రజాప్రభుత్వం రావాలని, ప్రజాస్వామ్యం కావాలని ప్రచారం చేసేవారం. మమ్మల్ని తోటి ముస్లింలు కోపంగా చూసేవారు. తిట్టేవారు. మమ్మల్ని ఆ సమాజం నుండి దాదాపు బహిష్కరించారు.

నేను ఉదయం డాక్టరుగా ఉంటూ రాత్రుల్లు చదువు చెప్పేవాణ్ణి. ఉర్దూ, ఫార్సీ భాషలు కూడా బోధించేవాణ్ణి. గ్రామంలోని హిందూ ముస్లిం యువకులందరికీ నీతిగా ఉండాలని హితబోధ చేసేవాణ్ణి. అంటే తాగ కూడదని, అబద్ధాలు ఆడరాదని, స్త్రీలను అక్కచెల్లెల్లాగా గౌరవించాలని, అందరూ అన్నదమ్ములు వోలె కల్సిమెల్సి ఉండాలని, ఇతరుల పొలాల్లోని పంటలను దొంగతనం చేయరాదని చెప్పేవాణ్ణి. అట్ల అనేక గ్రామాలలో నాకు మంచి పేరు, గుర్తింపు, గౌరవం ఉండేవి.

ఆ రోజుల్లో హిందూ ముస్లింలందరం వరుసలు పెట్టి పిలుచుకునే వాళ్లం. అన్నా తమ్మీ మామా బావా చిచ్చా అక్కా చెల్లె అని. ఇప్పటికి నేను ఊరికి పోతే 'వచ్చినవా కొడుకా" అని ముసలమ్మలు కావలిచ్చుకుంటారు. ఊళ్లో వాళ్లందరికీ నేను మాడ్. ఖుద్దూస్ లాగా ఉండాలి అని తల్లులు పిల్లలకు చెప్పేవారు. కొంత మంది తమ పిల్లలకు నా పేరు కూడా పెట్టుకున్నారు.

ఖుద్దూస్ అనగా పవిత్రుడు అని అర్థం. బహుశా మనిషి మీద ఆ పేరు ప్రభావం కొంత ఉంటుందేమో!

1944లో లార్డ్ వేవెల్ కమిటీ మన దేశానికి వచ్చింది. స్వాతంత్ర్యం ఇచ్చే ముందు దేశ పరిస్థితులను అధ్యయనం చేయటమే దాని ఉద్దేశ్యం. అయితే ఈ కమిటీ దేశ విభజనకు తన అంగీకారం ఇవ్వలేదు. భారతదేశాన్ని అఖండంగానే వేసుకున్నాం, అఖండంగానే పరిపాలించాం, అంఖండంగానే వాపసు చేయాలని ఆ కమిటీ అభిప్రాయం తెలిపింది. పైగా దేశాన్ని విభజించారన్న అపవాదు ఇంగ్లాదుకు



రాకూడదని ఆ కమిటీ చెప్పింది. ఈ సలహా బ్రిటిష్ పార్లమెంటుకు నచ్చక దానిని పెడచెవిని పెట్టి లార్డ్ మౌంట్‌బాటెను మళ్లీ పంపారు. అతను దేశాన్ని విభజించాడు అంటూ చరిత్రను వివరిస్తూ పాకిస్తాన్ ఏర్పాటుకు తన విముఖతను తెలియచేశాడు.

ఆ తర్వాత హైద్రాబాద్ సంస్థానం రాజకీయాలు, ఆ నాటి పరిస్థితులు చెప్పసాగాడు.

మా ఊరు కొరట్ పల్లి. అది డిచ్‌పల్లికి దగ్గరగా ఉంటుంది. మా ఊళ్లో 12 ముస్లిం కుటుంబాలు, 500 హిందూ కుటుంబాలు ఉండేవి. అందరం కల్సి మెల్సి ఉండేవారం. ధర్మారెడ్డి నా డిగ్రీ దోస్తు. అతని తండ్రి నర్సింహారెడ్డి మా గ్రామం మలీ పటేల్. వాళ్లు మోటాటి రెడ్లు. రజాకార్ల కాలంలోనే ధర్మారెడ్డి మెట్రిక్యులేషన్ పూర్తిచేశాడు. అతను కాంగ్రేసు వాడు. మంచివాడు, నిజాయితీపరుడు. కాంగ్రేసు వాలంటీరుగా పనిచేయటం వలన మా గ్రామ ప్రజలు అతనిని చోటా గాంధీ అని పిలిచేవారు.

రజాకార్లు మంచి జోరులో ఉన్నపుడు ధర్మారెడ్డి కుటుంబం నిజాంబాద్ పట్నంలో ఉంది. అయితే పట్నంలోని రజాకార్లు వారి ఇంటి మీద దాడి చేసి వారి ఆస్తుల్ని లూటీ చేయటానికి ప్లాన్ వేశారు. ఈ సంగతి కనుక్కున్న ధర్మారెడ్డి నన్ను నిజాంబాద్‌కు పిలిపించి నా సలహా, నా సహాయం అడిగాడు. నేను ఒక టాక్సీకారుకిరాయికి తీసుకు వచ్చి అండ్ల ఆయన పిల్లలను, ఆడ వాళ్లను, డబ్బులను, బంగారాన్ని వేసుకుని, ధైర్యంగా కారులో వారితో పాటు నేను కూడా కూచుని మా గ్రామం కొరట్ పల్లికి వార్ని చేర్పాను అట్లా నా వల్ల వారందరి ధన, మాన, ప్రాణాలు కాపాడబడినాయి.

రజాకార్లు ఊళ్లమీద కొచ్చి దాడులు చేస్తున్నారు. మా ఊళ్లో భగ్వాన్ రావ్ అనే ఒక బాపనాయిన ఉండే వాడు. చాలా పెద్ద కుటుంబం. బాగా చదువుకొన్నోళ్లు, ఆడోళ్లు మొగోళ్లు అందరూ చదువుకొన్నోళ్లే. ఒక రాజు రజాకార్లు రాత్రికి వస్తున్నామని ఇల్లు లూటీ చేసి తగలపెడ్తామని, ఆడవాళ్లను ఎత్కకపోతామని వార్నింగ్ పంపారు. ఆ భగ్వన్‌రావ్ మా ఇంటికి ఉరికొచ్చి సంగతంతా నాకు చెప్పాడు. భయపడకు నేనున్నాను కదా అని ఆయనకు ధైర్యం చెప్పి ఆ రోజు సాయంత్రం నాల్గు గంటలనుండే వారి ఇంటి ముంగల మంచం వేసుకుని కాపలా కూచున్నా. మీరెవరూ ఇవతలికి రాకండ్రి లోపలే ఉండండ్రి అని భరోసా ఇచ్చిన. రాత్రి పది గంటలకు రజాకార్లు వచ్చిండ్రు. తాగి ఉన్నారు. ఎగురుతుండ్రు దుంకుతుండ్రు. పాటలు పాడుతుండ్రు. చేయలల్ల తల్వార్లు, జించియాలు, బందూకులు, గుత్పలు. నేను వాళ్లను ఆపిన. ఎందుకొచ్చిన్రని సవాల్ చేసిన. "తూకోన్ హై జీ. రోక్‌నే వాలా. హిందువోంకే మదద్ కర్తాహై" అని మీది మీది కొచ్చిండ్రు.

"ఈ భగ్వాన్‌రావ్ తన జిందగీల్ ఎప్పుడూ ముస్లింలను సతాయించలే. జులుం చేయలే. దేవుడులాంటోడు. అలాంటి మనిషి మీకేం లుక్సాన్ చేసిండు. ఎందుకు హమ్లా చేస్తుండ్రు. ముందు నన్ను చంపి నా లాష్‌ను తొక్కుకుంట ఇంట్లకు పోండ్రి అని మొండికేసిన వాళ్ల తొవ్వకు అడ్డం పండుకున్న. ఇంతలో మా ఊరి కుర్రోళ్లు కూడా అక్కడికి వొచ్చిండ్రు. బాగా బహెస్ అయ్యింది. ఆ వొచ్చినోళ్లందరూ మా పొరుగూరోళ్లే. ఆఖరికి వాళ్లు ఫిర్ దేఖ్ లేయింగే అనుకుంటు వాపస్ పోయిండ్రు.

తెల్లారంగానే టాక్సీదీసుకొచ్చి ఆ కుటుంబాన్ని భద్రంగా నిజాంబాద్‌లో దించొచ్చినా. ఎందుకైనా మంచిదని!

ఇక ఆ తర్వాత పోలీస్ యాక్షన్ జరిగింది. మిలిటరీ వారి ప్రోత్సాహంతో రెచ్చిపోయి ముస్లింల ఇండ్లను హిందువులు దోచుకున్నారు. పునాదులతో సహా కూలగొట్టి నేల మట్టం చేశారు. స్త్రీలను ఎత్తుకపోయి దూరదూర ప్రాంతాలలో దాచుకున్నారు. నాందేడ్, జాల్నా - పర్భనీ, బీడ్ జిల్లాల నుండి ఎత్తుకొచ్చిన స్త్రీలను నిజాంబాద్ ఇండ్లల్ల దాచుకున్నారు.

పోలీస్ యాక్షన్ జరిగిన తర్వాత చాలా రోజులకు నేను ఒక హిందువుల ఇంటికి వైద్యం చేయటానికి వెళ్లాను. ఆ ఇంట్లో రోగి ఒక స్త్రీ అల్లా అల్లా అని అరుస్తుంది. దానితో నాకు అసలు



www.etelangana.org

సంగతి అర్థం అయ్యింది. రెండు మూడు సార్లు ఆ మరీజ్‌ను ట్రీట్‌మెంట్ చేయటాన్కి వాళ్లింట్లో కల్సిన. ఒకసారి ఎవరూ లేనపుడు ఆమె తన సంగతులన్నీ విప్పిచెప్పింది.

ఆమె దురద్వాడా ప్రాంతానికి చెందిన ఒక ముస్లిం. బీదర్ దగ్గరి ఉద్గీర్ ఆమె స్వగ్రామం. వయస్సు 20-25 మధ్యల ఉంటుంది. వివాహిత భర్త పిల్లలు చక్కటి కుటుంబం. శాంతి సౌఖ్యాలతో ఉండేది. ఇంతల పోలీస్ యాక్షన్ జరిగింది. మిలిటరీ బీదర్ నుండి ఉద్గీర్‌లోకి ప్రవేశించింది. రెండు రోజుల క్రిందనే సైన్యం వస్తుందని పుకార్లు బయలుదేరి చాలా ముస్లిం కుటుంబం మాత్రం అమాయకంగా మేమేం పాపాలు, అన్యాయాలు ఎవరికి చేయలేదు. మాకేం కాదు. మమ్మల్ని ఎవరూ ఏం చేయరు. అని అల్లామీది భరోసాతో ఆమె కుటుంబం అలానే ఉండిపోయింది.

మిలిటరీ ఇంకా పట్టణంలోకి రాకముందే హిందువులు రెచ్చిపోయి గడ్‌బడ్‌లు ప్రారంభించారు. ముస్లింల ఇండ్లను - దుకాణాలను లూటీ చేశారు. తగలబెట్టారు. కనపడిన ముస్లింలందరినీ కత్తులతో పొడిచి చంపారు. శవాలనే కాక బతికున్న వారిని కూడా బావులలో పడేశారు. ఎద్దులబండిలో పరదాలు వేసుకుని రహస్యంగా పారిపోతున్న ఓ కుటుంబం మొత్తాన్ని ఎద్దులు, బండితో సహా మొట బావిలోకి నెట్టేశారు. ఆ బండిలోని స్త్రీలు, పసిపిల్లలతో సహా అందరూ ఆ బావిలోనే చనిపోయారు. ఆ తర్వాత పై నుండి రాళ్లు మట్టి వేసి అ బావిని పూడ్చేశారు. ఉద్గీర్ పట్నం మొత్తం రావణకాష్టంలా రెండుమూడు రోజులు తగలబడుతూనే ఉంది. హిందూ గుండాల ఆగడాలకు, దౌర్జన్యాలకు అంతులేదు. పట్నానికి కొద్ది దూరంలోనే సైన్యం ఉన్న అది లోపలికి ప్రవేశించలేదు. ముస్లింలందరూ నాశనమైనంక తీరికగా పట్నంలోకి సైన్యం ప్రవేశించింది. అది ముదస్తు వ్యూహం పక్షపాత వైఖరి.

ఆ అల్లర్లో ఆ స్త్రీని ఒక గుంపు ఎత్తుకెళ్లి సామూహిత అత్యాచారానికి పాల్పడింది. ఆ తర్వాత ఒక బలశాలి ఆమెను తన బుజాలపై వేసుకుని తన ఇంటికి ఎత్తుకెళ్లాడు. రెండుమూడు రోజులు తనింట్లో బందీచేసి పలుమార్లు అత్యాచారం చేశాడు. చివరికి ఆ ఇంట్లోని స్త్రీలు అతడిని నెట్టటం వల్లన ఆ పోరు భరించలేక ఆమెను ఒకడికి అమ్మేశాడు. ఆమెను కొనుక్కున్న ఆ కర్కటకుడు ఆమెను పేరు తెలియని దూర ప్రాంతానికి తరలించాడు. కొన్నాళ్లకు మొజుతీరి విసుగుపుట్టిన తర్వాత మరొకడికి ఉచితంగా నజరానాగా ఇచ్చాడు. ఆమె అలా అలా చేతులు మారి అంచెలంచెలుగా నిజాంబాద్‌కు చేరుకుంది. దేశం కాని దేశం. భాష కాని భాష, అంతా అపరిచితులు. చివరికి ఈ ఇంట్లో పనిమనిషిగా బానిసగా మారిపోయింది.

ఆమె తన కథ చెప్తునపుడు కండ్లల్లో కన్నీరు కూడా కరువయ్యింది.

"మీ ఇంటికి, అదే, ఉద్గీర్‌కు పోతవా?" అని రహస్యంగా ఆమెను అడిగాను. ఆ కండ్లల్లోకి ప్రాణం లేచివొచ్చి, ఆశ తొణికిసలాడింది.

ప్లాన్ వేశాను. నా అనుచరుడు సంగ్రామ్‌ను పిలిచాను. వాడు ఒకప్పుడు మరాఠా ప్రాంతం నుండి వచ్చిన వాడే. బతకడానికి నిజాంబాద్ వచ్చి ఇక్కడే స్థిరపడినాడు. మరాఠీ భాష, ప్రాంతాలు వాడికి సుపరిచితాలు. విషయమంతా వాడికి వివరించాను. చివరికి 'ఏమంటవ్ రా' అని అడిగాను. ఆ కథకు వాడి హృదయం కరిగింది. ఒక మంచి పనికోసం, సాహసంగా వాడు నడుంబిగించాడు. వాడికి దారిబత్తెం కూడా కూడా ఏర్పాటు చేశాను. అమావాస్య అర్థరాత్రి దాటినాక ఆమె దొడ్డి దర్వాజా దాటి వాడిని గల్లీల కల్సుకుంది. గల్లీ చివర నేను ఏర్పాటు చేసిన ఒక 'టాక్సీ వాళ్లిద్దరి కోసం నిరీక్షిస్తుంది. సంగ్రామ్‌ను జోడిచ్చి ఆమెను ఊరి వెలుపలి వరకూ సాగనంపి, నా ఆశీస్సులతో అల్విదా చెప్పాను.

ఆమె సురక్షతంగా ఉద్గీర్‌లోని. తనింటికి చేరుకుంది. పంజరాన్ని వీడిన పక్షి ఆకాశాన్ని తన ఇల్లులా చేసుకుంది. ■



# ఒక అడుగు ముందుగానే వుంది మా గొంతు

● జనజ్వాల



అందరిలాగే చరితను ముద్దాడినవి
మా పెదవులు -
అందరికన్నా ఒక అడుగు
ముందుగానే వుంది మాగొంతు
వాడు ఎవరైనా సరే...,
మేం మనిషిని ప్రేమించాం
మనిషి మీద హింసను ద్వేషించాం -

జాతి... మతం... కులాలతో
మట్టిని కలుషితం చేసిన -
జద్మాష్‌ల రాజ్యం మీద
మేము ఎప్పుడు
అగ్ని పునీత యుద్ధంలోనే వున్నాం -

తెలివి మీరిన తెల్లోడి
ఉక్కు పాదం మీదా
తెగువతోనే పోరాడాం -

భూస్వామ్య దొర...
జాగీర్ దారు... జమ్మిందార్
రజాకోడు.. పటేలు.. పట్వార్లు... ఒకరా?
పడగ విప్పిన వేయి తలల
విష అలల బుసలకు
పుట్టి శిఖర తలలైనా..,
నైజాం సర్కారోడి హింసలోని
రాజ్య హింసకృతుల మీద కూడా
ఒక అడుగు ముందుగానే వున్నాం
అగ్ని పునీత యుద్ధంలో -

మాపేరు బందగి పోరగాడిని
పోరాటాల జాతి గీతానికి గొంతుక నిచ్చాం -
కవి... కత్తుల వీరుల్నీ... కలం యోధుల్నీ..
మా రక్త స్పర్శల అలల త్యాగాల అమరుల్నీ..
చాందీగా, సూరజ్‌గా చూసుకుంటు
అల్లాగా కొలుచుకుంటున్నాం
ఒక చరిత్ర నిండా -

వాడు ఎవరైనా సరే...,
మేం మనిషిని ప్రేమించాం
మనిషి మీద హింసను ద్వేషించాం -

రేపు ఒక చరిత్ర, చరిత్రాత్మక చరిత్రకు
దాఖలా చేయబోతున్న చార్జిషీటులో
మేము నేరస్తులుగా వుండదల్చుకోలేదు -



www.etelangana.org

మాట వచ్చీ మాట్లడనివాడు
రాసే చేవ వుండి రాయని వాడు...
పాడని వాడు... నడవని వాడు...
నవ్వని వాడు... దుఃఖించనివాడు..,
అవును.., నేరస్థులుగానే నిలబడుతారు
ఒక చరిత్ర నిండా –



ఉక్కు పిడికిళ్ల ఉప్పెనతో ధర్మాగ్రహ యుద్ధంలో
నిలబడదల్చాం
తెలంగాణ ముస్లిం ముద్దు బిడ్డలుగా –
యుద్ధం మాకేం కొత్తకాదు
కొత్త దల్లా తిన్న ఇంటి వాసాలు లెక్క పెట్టి,
లెక్కచెడుతున్న లెక్క తప్పిన కిరాయిదారుడి కుట్రలు.
మా భూముల్నీ... మానీళ్ళను... మాబ్రతుకుల్నీ...
మాకు కాకుండా చేస్తున్న కుట్రలు
వలస కుట్రలు
వలస వచ్చిన సామ్రాజ్యవాద
సంస్కృతి నీడల కుట్రలు –
కుట్రల మీదా పులి పుట్రల మీదా యుద్ధం!
ఇది మళ్ళీ ఒక తెలంగాణ సాయుధ సూర్యోదయం
పవన వీచిక కావాలి –
ఇప్పుడు మమ్మల్ని
గడ్డం వాళ్లన్నా, తురక వాళ్లన్నా
సాయబులన్నా... ముస్లింలన్నా
మేం పోరా యోధులం –

అందిరిలాగే చరితను ముద్దు పెట్టుకున్న
తెలంగాణ ముస్లిం నిప్పురవ్వలం

అందరికన్న ఒక అడుగు
ముందుగానే వుంది మాగొంతు!

రేపటి కొక్కరకో కోడికూతలో కూడా
ముందుగానే వుంటుంది మాగొంతు!

సైకిలు, లారీ మోటర్లు,
కార్ఖానాలు, హోటల్లేకాదు,
చరిత్రను కూడా రిపేర్ చేస్తాం! క్లీన్ చేస్తాం!
కొత్త నడకలతో చరిత్రను నడిపిస్తాం!
భాయి అంటే ప్రాణమిస్తాం.
మేం మనిషిని ప్రేమిస్తాం
మనిషి మీద సైతాన్ని ద్వేషిస్తాం
ప్యారుకు.., మొహబ్బతుకు
అందిరికన్న ఒక అడుగు
ముందుగానే వుంటుంది మాగొంతు!

పువ్వులమీద సీతాకోక చిలుకలం మేం
కొండల బండల మీద తెల్లని నవ్వుల
జలపాత పాటలం మేం
నీలీ మబ్బులు సింగారించుకున్న
సింగిడి కొప్పుల పరిమళాలం మేం
మేం మాట్లాడినా.., మాట ఇచ్చినా
తమల పాకుల తోటలో ఎర్రని పెదవుల
తేనె తుట్టెలవుతవి
తెగించిన.., సాహసించిన..,
సావాసం చెదిరినా
తలవార్ నదుల లందుతవి
అల్లాకా ఖసం భాయి
అందరికన్నా ఒక అడుగు
ముందుగానే వుంటుంది మా గొంతు!

"యుద్ధభూమి మా దేశం నమోనమోహి
మాముకన్న తెలంగాణం స్మారామి" ■





# తెలంగాణలో జాతీయోద్యమం - ముస్లిములు

• డాక్టర్ సుంకిరెడ్డి నారాయణరెడ్డి

ఆంధ్ర చరిత్రకారులు తెలంగాణ చరిత్రను విస్మరించినట్టుగానే ముస్లింల చరిత్రనూ విస్మరించినారు. ప్రభుత్వ సంస్థ అయిన తెలుగు అకాడమీ ప్రచురించిన చరిత్ర గ్రంథాల్లో భారత స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొని అసువులు బాసిన, జైళ్ల పాలయిన ఏ తెలంగాణా ముస్లిం వీరుడి గురించీ రాయనేలేరు అంటే ఇతర చరిత్ర గ్రంథాల గురించి చెప్పాల్సినది లేదు.

తెలంగాణ చరిత్రను వెలికి తీయడంలో భాగంగా జాతీయోద్యమంలో హైద్రాబాద్ ముస్లింల పాత్రను గుర్తు చేసుకోవడం ఈ వ్యాస ఉద్దేశం.

మొత్తం భారతదేశంలో జరిగిన జాతీయోద్యమంలో తెలంగాణ లేదా హైద్రాబాద్ జాతీయోద్యమం భాగమే అయినా ఇక్కడి జాతీయోద్యమానికి స్థానిక కారణమూ, ప్రత్యేకతా, పరిమితీ, నేపథ్యమూ, ఉంది. ఈ దృష్టానే ఇక్కడి జాతీయోద్యమానికి చూడాల్సి ఉంది.

జాతీయ భావన పాశ్చాత్యులు తెచ్చిన అధునికతతోపాటే భారతదేశంలోకొచ్చింది. అట్లా నిజాం రాజ్యంలోకి లేదా హైద్రాబాద్ రాజ్యంలోకీ వచ్చింది.

నిజాం ఉల్‌ముల్క్ దక్కన్ సుబేదార్‌అయిన తర్వాత ఆయనను ప్రసన్నం చేసుకోవటానికి ఫ్రెంచి, బ్రిటీష్ వాళ్ళిద్దరూ ఎన్నో కానుకలు సమర్పించుకోవడంతో హైద్రాబాద్ రాజ్యంతో పాశ్చాత్య సంబంధం మొదలైంది. ఫ్రెంచివారు ఆక్రమించిన తమ మద్రాసును తమకు ఇప్పించమని కోరుతూ క్రీ.శ.1746లో ఇంగ్లీషు ప్రతినిధి గ్రిఫిన్ నిజాంకు ఉత్తరం రాయడంతో దారి పడి క్రమంగా 1759లో జరిగిన ఒప్పందంతో, 12.10.1800న జరిగిన సైనిక సహకార ఒప్పందంతో బ్రిటిష్‌వారు నైజాం రాజ్యంలో పై చేయి సాధించారు. వాళ్లు ఇక్కడ కాలనీలు స్థాపించుకోవడం, విద్యాసంస్థల్ని స్థాపించడం మొదలైన కార్యక్రమాలతో ఆధునికత లేదా పాశ్చాత్యీకరణ వ్యాపించింది. దీంతో పాటుగానే బ్రిటిష్ వ్యతిరేక భావన కూడా మొదలైంది. ఈ బ్రిటిష్ వ్యతిరేక భావనతో అనేకమంది ముందుకు సాగినా ముస్లింల పాత్రకే ఈ వ్యాసం పరిమితం.



www.etelangana.org

పై ఒప్పందంతో సబ్సిడరీ దళాల్లో అసంతృప్తి మొదలైంది. నూర్‌ఉలూమ్ కార్యకలాపాలు అందులో భాగమే.

ఆధునితా స్వీకరణ, జాతీయోద్యమం పక్కపక్కనే ఒకదాన్నొకటి ప్రభావితం చేసుకుంటూ సాగినయి కనుక ఆధునికతను ఆహ్వానించిన ముస్లింలను కూడా జాతీయోద్యమంలో భాగంగానే చూడాలి. అట్లా చూసినప్పుడు ఆధునితను స్వీకరించిన మొదటి ముస్లిం వైతాళికుడు షామ్స్ ఉల్ ఉమ్రా. అయన 1829లో మదరసా (ఫ్రాక్రియా) పాఠశాలలను ప్రారంభించి వాటిలో మత విషయాలతో పాటు భౌతిక, రసాయన శాస్త్రాల వంటి వాటినీ బోధింపింప జేసేవాడు. ప్రపంచ జ్ఞానాన్ని అనువదింపచేయడానికి 1834లో ట్రాన్సిలేషన్ బ్యూరోనూ, ప్రెస్‌ను ప్రారంభించి ఉర్దూ పర్షియన్ భాషల్లో, వైద్య, ఇంజనీరింగ్, మొదలైన వాటికి సంబంధించిన 50 గ్రంథాలను ప్రచురించాడు. ఇట్లా హైద్రాబాద్ రాజ్యంలో ఆధునిక విద్యావ్యాప్తికి ఇతడే మూలం. పైన్నే చెప్పుకున్నట్లు అధునిక వ్యాప్తితో పాటు బ్రిటిష్ వారి పట్ల అయిష్టత పెరిగింది. ప్రముఖ చరిత్రకారుడు పి.శ్రీనివాస్‌చారీ అన్నట్లు "బ్రిటిష్‌వారితో నిజాం పొత్తు అటు నిజాంకి గాని, ఇటు ప్రజలకు గానీ ఇష్టం లేదు. మహీపతిరామ్ పథకం ముబారిజ్ ఉద్దౌలా నాయకత్వంలోని వహాబీ ఉద్యమం ఈ అయిష్టత ఫలితమే."

**భారత తొలి స్వాతంత్ర్య సమరం – వహాబీ ఉద్యమం:**

**ముబారిజ్ ఉద్దౌలా:**

ఉత్తర భారతదేశంలో ముస్లింలలో సాంఘిక సంస్కరణను తీసుకురావటానికి వారి రాజకీయ ప్రయోజనాలు సాధించడానికి ప్రారంభమైన గొప్ప ఉద్యమం వహాబీ ఉద్యమం – క్రమంగా అది పంజాబ్‌లో సిక్కుల ప్రభుత్వం మొత్తం దేశంలో ఇంగ్లీషు ప్రభుత్వం పోవాలనే లక్ష్యాలుగా నడిచింది. అక్కడ దీన్ని ప్రారంభించినవాడు సయ్యద్ అహ్మద్ బ్రయిల్వీ, 1820ల నాటికే ఈ ఉద్యమం బెంగాల్ నుంచి దేశంలోని మిగతా ప్రాంతాలకు పాకింది. 1831లో ఆయన చనిపోయినప్పటికీ ఉద్యమం ఆగలేదు. ఆయన అనుచరులు మౌల్వీ విలాయత్ అలీ సలీంలు 1838లో ఈ ఉద్యమాన్ని దక్కన్‌కు తీసుకొచ్చారు. హైద్రాబాద్‌లో ఈ ఉద్యమానికి ముబారిజ్ ఉద్దౌలా కేంద్ర బిందువుగా మారాడు. ఇతను ఎవరో కాదు, అప్పటి నిజాం రాజు నాసిరుద్దౌలా (1829–1857)కు స్వయానా తమ్ముడు. ఇతణ్ణి దేశ బహిష్కారం చేయకపోతే ఇరవై వేల మంది వహాబీ ఉద్యమకారుల్ని ఎదుర్కోవడం కష్టమవుతుందని బ్రిటిష్ రెసిడెంట్ అనడాన్ని బట్టి ఈ ఉద్యమ తీవ్రత అర్థమవుతుంది. అయితే ఇతణ్ణి బహిష్కరించకుండా అరెస్ట్ చేసి కోటలో బంధించినారు. దీన్ని బట్టి ఇతణ్ణి తెలంగాణాలో తొలి స్వాతంత్ర్య సమరయోధుడిగా భావించవచ్చు. తెలంగాణాలో బ్రిటిష్ వ్యతిరేక ఉద్యమం లేదనేవారికి ఇది ఒక సమాధానం. నిజానికి, 1857 సిపాయిల తిరుగుబాటుకు దీనిని నాంది వాచకంగా భావించవచ్చు.

1857 సిపాయి తిరుగుబాటు సమయంలో రాయలసీమ కోస్తాంధ్రలు మౌనంగా ఉండిపోగా హైద్రాబాద్ అట్టుడికిపోయింది. ఈ అలజడికి సిపాయి తిరుగుబాటు ప్రభావంతో పాటు 1800 ల నుంచి రగులుతున్న బ్రిటిష్ వ్యతిరేకత, 1853లో బీరార్ రాష్ట్రాన్ని బ్రిటిష్ వారు కైవసం చేసుకోవడం వహాబీ ఉద్యమ నాయకుడు ముబారిజ్ ఉద్దౌలా 1854లో జైలులోనే చనిపోవడం, ఒక క్రిష్టియన్ ముస్లిం ఇస్లాంని విమర్శించినందువల్ల బొల్లారం కాంటిజెంట్ సైన్యంలో 1855లో అలజడి చెలరేగి బ్రిగేడియర్ మెకంజా మీద దాడి జరగడం – ఇవన్నీ కారణాలే.

ఢిల్లీలో పెల్లుబికిన యుద్ధ వార్తలు హైద్రాబాద్‌లో గొప్ప ఉద్వేగాన్ని సృష్టించినవి. దీనికి తోడు



జమేదార్ చీదాఖాన్ సిపాయిలతో హైద్రాబాద్‌లో అడుగుపెట్టగానే అరెస్ట్ చచేయడం మరింత ఉద్రిక్తతకు కారణమయింది. బ్రిటిష్ వాళ్లకు వ్యతిరేకంగా తిరుగుబాటు చేయాలని నిజాంను డిమాండ్ చేస్తూ మసీదుల మీద నినాదాలు వెలిసినవి. ప్రవక్త మీకు అండగా ఉంటాడు భయపడొద్దు, భయపడితే గాజులు తొడుక్కుని "ఇంట్లో కూచో" అని నినదించారు. మక్కామసీదులో గుమికూడిన ప్రజలు చీదాఖాన్‌ని అతని అనుయాయుల్ని వెంటనే విడుదల చేయాలని డిమాండ్ చేశారు. నిజాం అందుకు తిరస్కరించడంతో జమేదార్ తుర్రేబాజ్ ఖాన్, మౌల్వీ అల్లా ఉద్దీన్ నాయకత్వంలో 500 మంది రొహిల్లాలు కోఠి మీద (రెసిడెంట్ భవనం) 17-7-1857న దాడి చేసినారు. ఈ దాడిలో వీళ్లు వీరోచితంగా తెల్లవారు జామున నాలుగు గంటల వరకు పోరాడినా ఫలితం దక్కలేదు. అతి కష్టం మీద తుర్రేబాజ్ ఖాన్‌ను అరెస్టు చేశారు. అనంతరం జరిగిన విచారణలో తుర్రేబాజ్‌ఖాన్ ఉదాత్తంగా ధీమంతంగా జవాబులిచ్చినాడు. రెసిడెన్సీ మీద దాడికి నేనే పూర్తి బాధ్యుణ్ణి అని, తన అనుయాయి బుద్ధాఖాన్‌తో సహా ఏ రొహిల్లాలు తనను అనుసరించలేదని, మౌల్వీ అల్లా ఉద్దీన్‌తో కలిసి దాడి నిర్వహించలేదని అసలతనెవరో తనకు తెలువదనీ దాడి బాధ్యతను మొత్తం తన మీదే వేసుకున్నాడు. బ్రిటిష్ వాళ్లను భారతదేశం నుంచి తరిమివేయడానికి మత విశ్వాసంతో తిరుగుబాటు చేశానని దృఢంగా ప్రకటించినాడు. అనంతరం అతనికి జీవిత శిక్ష వేయడం, జైలు నుంచి తప్పించుకోవడం – తిరిగి పట్టుబడడం, బ్రిటిష్ సైనికులు అతణ్ణి దారుణంగా కాల్చి చంపి శవాన్ని సంకెళ్లతో బహిరంగ స్థలంలో వేలాడదీయడం హైద్రాబాద్ ప్రజల్ని కలిచివేసింది. ఖాన్‌తో పాటు కోఠి మీద దాడి చేసిన మరో వీరుడు సూఫీ తత్వవేత్త మత ప్రచారకుడు అయిన మౌల్వీ అల్లా ఉద్దీన్ తప్పించుకునిపోగా అరెస్ట్ చేసి జీవితశిక్ష విధించి 28-7-1859న అండమాన్ జైలుకు తరలించినారు. దేశ స్వాతంత్ర్యం కోసం 25 ఏళ్లు ఆ జైల్లోనే మగ్గి 1884లో మరణించాడు.

కంటింజెంట్ సైన్యం 1858 సంవత్సరం మొత్తం రోహిల్లా తిరుగుబాట్లను అణచివేస్తున్న సమయంలోనే రంగారావు, రాజా దీప్‌సింగ్‌తో పాటు 1000 మంది సైన్యాన్ని సమకూర్చుకుని పెద్ద ఎత్తున తిరుగుబాటుకు పథక రచన మరో స్వాతంత్ర్యాభిలాషి సద్దరుద్దౌలా – అయితే ఇది కార్యరూపం ధరించకముందే ఆంగ్లేయులు వీరిని అరెస్ట్ చేసినారు. సద్దలుద్దౌలాకు జీవితశిక్ష వేసి ఆస్తిని స్వాధీనం చేసుకున్నారు.

ఆంగ్లేయులతో పాటు వారికి వత్తాసు పలికిన సాలార్జంగ్ మీద కూడా ప్రజలు కసిని పెంచుకున్నారు.

1859 మార్చి 15న గవర్నర్ జనరల్ తరఫున కల్నల్ దేవిడ్సన్ నిజాంకు కానుక ఇవ్వడానికి వెళ్లి సాలార్జంగ్‌తో తిరిగి వస్తుండగా రొహిల్లండ్ పటాన్ జహంగీర్‌ఖాన్ వీరిద్దరి మీదా దాడి చేసినాడు. తృటిలో వాళ్లు ప్రాణాలతో బయట పడ్డారు. ఆ ఘర్షణలో గాయపడిన జహంగీర్‌ఖాన్ ప్రాణాలు కోల్పోయినాడు (మళ్లీ 1868 జనవరి 27న మరోసారి సాలార్జంగ్ మీద దాడి జరిగింది. ప్రజలకు సాలార్జంగ్ పట్ల ఉన్న వ్యతిరేకతకు ప్రబల నిదర్శనమిది). అదేవిధంగా బ్రిటిష్ వారి పట్ల శతృత్వం వహించిన అజ్మత్‌జంగ్, మీర్దాచంద్, బాజ్‌ఖాన్, మౌల్వీ ఇబ్రహీంలు జైలు పాలయినారు.

నిర్మల్ వద్ద 1860లో రాంజీగోండు నాయకత్వంలోని 300 మంది గోండులతో 200 మంది రొహిల్లాలు ప్రభుత్వంతో నిర్మల్ వద్ద తలపడ్డారు. ఈ యుద్ధంలో తిరుగుబాటుదారులు అనేక మంది ప్రాణాలు కోల్పోయినారు.

1860 నాటికి ఈ తిరుగుబాట్లను ప్రభుత్వం అణచివేయగలిగినా 1879 దాకా చెదురుమొదురుగా బ్రిటిష్ వ్యతిరేకత వ్యక్తమవుతూనే వచ్చింది. 1879 నుంచి ఈ బ్రిటిష్ వ్యతిరేకత



www.etelangana.org

మరో రూపాన్ని సంతరించుకుంది. ఆకస్మిక చిన్న చిన్న తిరుగుబాట్ల రూపంలో కాకుండా ఆ వ్యతిరేకత లోతుల్లోకి విస్తృత ప్రజానీకంలోకి వెళ్లింది. అది ఆధునిక జాతీయ రూపాన్ని సంతరించుకుంది. దీనికి కొందరు ముస్లిం మేధావులు తాత్విక బౌద్ధిక ప్రాతిపదికను సిద్ధం చేసినారు. వీరి కృషిని కూడా జాతీయోద్యమంలో భాగంగానే చూడాలి.

అలాంటి పని చేసినవారిలో అఫ్ఘనిస్తాన్ నుంచి 1879లో హైద్రాబాద్‌కు వచ్చిన సయ్యద్ జమాలుద్దీన్ ఆఫ్ఘానీ ఒకరు. ఛాందస మౌల్వీల భావాలను వ్యతిరేకించినాడు. కేవలం మత గ్రంథాల అధ్యయనమే కాక ముస్లింలు ఆధునిక ప్రకృతి శాస్త్రాలను, మానవ శాస్త్రాలను నేర్చుకోవాలన్నాడు. అధికార భాషగా దేశ భాష ఉండాలని అన్నాడు (బహుశా ఈ ప్రభావంతోనే 1884లో పర్షియన్ భాష స్థానంలో ఉర్దూ అధికార భాష అయింది). ఈ ఆధునిక విద్యను మాతృభాషలోనే నేర్పాలని అన్నాడు. అందుకు విశ్వవిద్యాలయం నెలకొల్పాలన్నాడు. అట్లా అని జాతీయ వ్యతిరేక పాశ్చాత్యీకరణను కోరుకోలేదు. ఇతని ఆలోచనలు హైద్రాబాద్ మీద గాఢంగా ప్రభావం చూపినవి. ఆఫ్ఘానీ తీవ్రభావజాలాన్ని సహించని ప్రభుత్వం ఆయన్ని 1881లో హైద్రాబాద్ నుంచి వెళ్లగొట్టింది. సయ్యద్‌బిల్ గ్రామీ అభిప్రాయం ప్రకారం ఆఫ్ఘానీ "ఫైర్‌బ్రాండ్ సంస్కర్త". ఆఫ్ఘానీని అందిపుచ్చుకుని మౌల్వీ మొహిబ్ హుస్సేన్ తర్వాత గొప్ప సాంఘిక సంస్కర్త, గొప్ప జర్నలిస్ట్ అయినాడు. ఈయన హైద్రాబాద్‌లో స్త్రీ విద్యకు వైతాళికుడిగా, హైద్రాబాద్ జర్నలిజానికి 'రూపశిల్పిగా పేరుగాంచినాడు. పరదా (బురఖా) పద్ధతిని ఆనాడే వ్యతిరేకించి ఛాందస వాదుల కంట్లో నలుసుగా పరిణమించాడు. సంస్కర్తే కాక గొప్ప జాతీయవాది కూడా. బ్రిటిష్ విధానాల్ని తీవ్రంగా వ్యతిరేకించినాడు.

ప్రజలను సన్నద్ధం చేసిన మరొక సంస్కర్త ముల్లా అబ్దుల్ ఖయూం. విద్యారంగంలో నిర్బంధ విద్యను, స్కాలర్‌షిప్‌లను ప్రతిపాదించిన సంస్కరణాభిలాషి. ఈయన ఉర్దులో రాసిన ఏ ప్లీ ఫర్ కంపల్సరీ ఎడ్యుకేషన్ అనే గ్రంథం హైద్రాబాద్ విద్యారంగ అభివృద్ధిలో ఒక మైలురాయి. 1872లో హైద్రాబాద్‌లో స్టేట్ సెంట్రల్ లైబ్రరీ స్థాపించడానికి మూలకారణం ఇతడే. ఈయన కృషి వల్ల ముస్లిం ప్రజల్లో సాంఘిక విద్యా సంబంధ సంస్కరణల యెడల తహతహ ప్రారంభమైంది.

మౌల్వీ మహ్మద్ ముర్తజా అభివృద్ధికి విద్య మూలమని, అయితే ఆ విద్య ఇంగ్లీషు ద్వారా కూడా ఉర్దూ ద్వారా నేర్పితేనే ఉపయోగమని నిజాంకాలేజీని మద్రాసు విశ్వవిద్యాలయం నుంచి విడదీసి వేరే విశ్వవిద్యాలయాన్ని నెలకొల్పాలని వాదించినాడు.

వీరందరి కృషి వల్లనే తర్వాత ఉస్మానియా విశ్వవిద్యాలయం నెలకొల్పబడింది.

వీరు విద్య, సాంఘిక, పత్రికారంగంలో చేసిన కృషి వల్ల జాతీయోద్యమంలో ముస్లింలు, ముస్లిమేతరులు పాల్గొనడానికి ప్రాతిపదిక సిద్ధమయింది.

ఈలోగా 1885లో జాతీయ కాంగ్రెసు స్థాపించబడింది. దీనిలో తెలుగు, మరాఠీలతో పాటు ముస్లింలు కీలకపాత్ర నిర్వహించారు. దీనిలో ఇతరులతో పాటు ముల్లా అబ్దుల్‌ఖయూం దస్తూర్ ఆసాగిషోషాంగీ లాంటి వారు చేరి జాతీయోద్యమాన్ని పరిపుష్టం చేసినారు.

1888 అక్టోబరు 21న సికింద్రాబాద్‌లో జరిగిన జాతీయ కాంగ్రెస్ సభకు రెండు వేల మంది హాజరయినారు. ఈ సభ నిర్వహణలో ముల్లా అబ్దుల్ ఖయూం కీలకపాత్ర నిర్వహించాడు.

1902లో లార్డ్ కర్జన్ బీరార్ ఒప్పందం మీద సంతకం చేశాడు. ఈ ఒప్పందం జరిగిన తీరు హైద్రాబాద్ ప్రజలకు ఆగ్రహావేశాలు కలిగించింది. దీంతో బ్రిటిష్ ఇండియాలో 1905లో ప్రారంభమైన స్వదేశీ ఉద్యమం హైద్రాబాద్ రాజ్యంలోకి అడుగుపెట్టడానికి ప్రాతిపదిక ఏర్పడింది.



అట్లా అఘోరనాథ్ ఛటోపాధ్యాయ లాంటి వారితో కలిసి ముల్లా అబ్దుల్ ఖయూం అదే సంవత్సరం స్వదేశీ ఉద్యమాన్ని ప్రారంభించాడు. విదేశీ వస్తువుల్ని బహిష్కరించమని పిలుపునిచ్చారు.

"అంజుమన్ ఇక్వాన్-సఫా" అనే సంస్థ ఏర్పడింది. స్వదేశీ ఉద్యమంలో భాగంగా ఉస్మానియా విశ్వవిద్యాలయంలో సమాజ శాస్త్ర ప్రొఫెసర్ బద్రుల్ హసన్ బొంబాయి నుంచి చరఖాలను తెప్పించాడు.

1918లో హైద్రాబాద్ కాంగ్రెస్ కమిటీ ఏర్పడింది. ఇందులో కూడా ముస్లిములు భాగస్వాములయినారు.

1920లో గాంధీ చేపట్టిన శాసనోల్లంఘన, సహాయ నిరాకరణ, సత్యాగ్రహాలతో ప్రభావితమయి విద్యాలయాలను వదిలి డాక్టర్ జయసూర్యతో పాటు మీర్ మహ్మద్ హుసేన్, అక్బర్ అలీఖాన్, మహ్మద్ అన్సారీ, మక్బూల్ అలీ మొదలైనవారు సాంఘిక కార్యక్రమాల్లో పాల్గొన్నారు.

ఖిలాఫత్ ఉద్యమంలో భాగంగా 16-3-1920, 20-3-1920ల్లో జరిగిన సభల్లో పాల్గొన్న ఇరవై వేల మందిలో ముస్లింలు వేలాదిగా ఉన్నారు. ఈ ఉద్యమానికి కేశవరావు కోరట్కర్, నవాబ్ అస్గర్‌యార్‌జంగ్‌లు నాయకత్వం వహించినారు.

1920 నుంచి 1938 వరకు రాజకీయ కార్యకలాపాలు మందకొడిగా సాగినవి. ఈ కాలం ప్రజలను సన్నద్ధం చేయడానికి ఉపయోగపడింది.

1935లో నైజాం రాజ్యంలో బాధ్యతాయుత ప్రభుత్వం ఏర్పడాలనే లక్ష్యంతో నైజాం పౌర సంఘం ఏర్పడింది. ఇందులో ముస్లింలు ముస్లిమేతరులూ ఉన్నారు. దీనికి నిజామతజంగ్ అధ్యక్షుడు. తర్వాతి కాలంలో 'ఇత్తెహాదుల్ ముస్లమీన్' సంస్థ అధ్యక్షుడిగా ఎన్నికైన బహదూర్‌యార్‌జంగ్ వంటి వారూ సభ్యులుగా ఉండడం విశేషం. 1938లో హైద్రాబాద్ స్టేట్ కాంగ్రెస్ ఏర్పడింది. కాని నిజాం ప్రభుత్వం వెంటనే దాన్ని నిషేధించింది. దానికి ప్రతిగా 1938 అక్టోబరు నెలలో సత్యాగ్రహం చేసినారు. ఈ సందర్భంగా అరెస్టయినవారిలో రామానందతీర్థ, బద్దం ఎల్లారెడ్డి, కాళోజీ మొదలయినవారితో పాటు షేక్‌నహీంసాబ్, షేక్ మొహీనుద్దీన్ ఉన్నారు.

అనంతరం క్రిప్స్ ప్రతిపాదనలను తిరస్కరించి కాంగ్రెసు పార్టీ 1942లో క్విట్ ఇండియా ఉద్యమాన్ని మొదలుపెట్టింది.

ఈ సమయంలోనే అంతవరకు సాంస్కృతిక, సామాజిక సంఘంగా ఉన్న "అంజుమన్ - ఇత్తేహాద్ - ఉల్ - ముసల్మాన్" రాజకీయ రూపాన్ని సంతరించుకుని 'రజాకార్'గా మారి జాతీయోద్యమాన్ని సాగనివ్వమంటూ 'స్వతంత్ర హైద్రాబాద్' అనే నినాదాన్ని లేవనెత్తింది.

దీంతో ముస్లింలలో చీలిక వచ్చి కొందరు రజాకార్ల వైపు ఆకర్షితులయినారు. అయినా ముస్లింలు జాతీయోద్యమంలో భాగస్వాములు కావడం మానలేదు. ఆబిద్‌హుస్సేన్, సఫ్రానీ లాంటి వాళ్లు సుభాష్ చంద్రబోస్ స్థాపించిన ఆజాద్ హింద్ ఫౌజ్‌తో చేరడం అందుకు నిదర్శనం. మఖ్దూం మొహియుద్దీన్ బందగీ లాంటి వాళ్లు నిజాం వ్యతిరేక కమ్యూనిస్టు ఉద్యమంలో పనిచేయడం ముస్లింలలో కొందరి లౌకిక దృష్టికి నిదర్శనం. షోయబుల్లాఖాన్ రజాకార్ల చర్యలను గర్హిస్తూ సంపాదకీయాలు, వార్తలు, రాసి ప్రాణాలను కోల్పోవడం రజాకార్ల దౌర్జన్యాలను ఖండిస్తూ బాకర్ అలీ మీర్జా, ముల్లా అబ్దుల్ బాసిత్ సాహెబ్, ఫరీద్‌మీర్జా, నవాబ్‌మంజూర్ జంగ్, నవాబ్ అహ్మద్



www.etelangana.org

మీర్జా, మహ్మద్ హుసేన్ జాఫ్రీ, హుసేన్ అబ్దుల్ మునీమ్ ప్రభుత్వానికి లేఖ రాయడం వారి ప్రజాస్వామిక దృష్టికి జాతీయవాదానికి నిదర్శనం.

1948 సెప్టెంబర్‌లో జరిగిన సైనిక చర్యతో రజాకార్లు అంతర్ధానమయినారు. తిరిగి ముస్లింలు ప్రధాన స్రవంతిలో భాగమయ్యారు. కానీ క్రమక్రమంగా ముఖ్యంగా 1956 ఆంధ్రప్రదేశ్ అవతరణ తర్వాత ప్రాధాన్యతను కోల్పోయి అన్ని రంగాల్లో వెనుకబడిపోయినారు.

(ఈ వ్యాసం సమగ్రం కాక పోయినా ఆ దిశగా కృషి జరగాలనే ఉద్దేశంతో ప్రచురిస్తున్న)

**ఆధార గ్రంథాలు:**


1. ది ఫ్రీడమ్ స్ట్రగుల్ ఇన్ హైద్రాబాద్, వాల్యూమ్ 1, 2, 3, 4.
2. నిజాం – బ్రిటిష్ రిలేషన్స్ (1724 – 1857). డాక్టర్ సరోజినీ రెగానీ.
3. తెలంగాణము – సంపాదకుడు – వట్టికోట.
4. సంగిశెట్టి శ్రీనివాస్ వ్యాసాలు (త్వరలో అచ్చు కానున్నది).
5. తెలంగాణ చరిత్ర ) సుంకిరెడ్డి నారాయణరెడ్డి (త్వరలో అచ్చు కానున్నది).
6. మరికొన్ని గ్రంథాలు


---

# బందగీ సమాధి

● నట్టికొండ రామకోటయ్య

(అదిగో భద్రాద్రి గౌతం బిదిగో చూడండి మాదిరి)
అదిగో సమాధి – బందగి ఇదిగో చూడండి॥

స్వాతంత్ర్యజ్యోతి – ప్రతిభను జిమ్ముచు
సత్పుల వృక్షచ్ఛాయల – వెలిగెడి దదిగో॥

జనగామ ప్రజల – స్వతంత్ర సమర
ఘూట బీజమూ – పూజ్యరక్తకణ మదిగో॥

విసునూరు దొరదగు – పీడనశక్తియె
బందగిలో గల – స్వతంత్ర విప్లవ మదిగో॥

దేశభక్తియను – దీర్ఘతపస్సును
పీడిత జాతికి – వెలుగు నొసంగెడి దదిగో॥

స్వతంత్రబాటను – సాగిరందనుచు
ప్రజలకందరికా – హ్వానంబిచ్చెడి దదిగో॥

– ఆంధ్ర గేయాలు, 1945 నవంబరు నుంచి



# "తెగించిన వాళ్ళం"

● కె. ఇక్బాల్

మనం సిగ్గు లేకుండా
నిగ్గు తేలిన వాళ్ళం
నీతి నిజాయితీ లేకుండా
బతుకుతున్న వాళ్ళం

ఎవడు వచ్చినా
ఎవడు వచ్చినా
ఏడ్చే "దద్దమ్మలం"
తలలూపడం తప్ప
"తలెత్తుకోవటం" అంటూ
చాతకాని "బసవన్నలం"

మన మెడను నరుక్కునేందుకు
మన ఉనికిని కోల్పోయేందుకు
మనల్ని మనం వంచించుకునేందుకు
పరుల చేతిలో "గొడ్డలి కామా"లైనాం




దండెత్తిన ఘజనీకి
ఘనస్వాగతం పలికిన వాళ్ళం
శత్రువుకు "ఉప్పదించిన"వాళ్ళం

నామర్దా లేకుండా దర్జాగా
అలెగ్జాండరుకు వత్తాసు పలికి
అపకారికి ఉపకారం చేసి
"అంబి"లాగా దుందుభి మోగించినవాళ్ళం.

మన భాషను, మన వేషాన్ని
పైగా మన పౌరుషాన్ని
వేళాకోళం చేసిన వాళ్ళకు
నిధులిచ్చి, నినాదాలిచ్చి
అదొక జీవన విధానంగా
పోటీ పడి జేకొట్టిన వాళ్ళం

మన గురించి తేలికగా
మాట్లాడే నాలుకల్ని
తెగ్గొడదాం... రండి.
దొంగలే దొంగ దొంగ అని
పొలికేకలు పెడుతున్న వాళ్ళను
పొలిమేర దాకా వెళ్ళగొడదాం... రండి.
– జై తెలంగాణ

■




www.etelangana.org

# కమ్యూనిస్టులు - తెలంగాణ ముస్లింలు

● కనీజ్‌ఫాతిమా
ముస్లిం ఫోరం ఫర్ తెలంగాణా

తెలంగాణ ఉద్యమం సందర్భంగా చారిత్రక అంశాలపైచర్చ జరుగుతూ ఉంది. అందులో భాగంగా తెలంగాణలోని కమ్యూనిస్టుల పరిణామక్రమంపై వాళ్లలో వచ్చిన మార్పులపై కూడా చర్చించవలసిన అవసరం ఉంది.

కమ్యూనిస్టు పార్టీకి 1939 నాటికి తెలంగాణలో బీజావాపనం జరిగింది. 1940లో నెలకొల్పిన "కామ్రేడ్స్ అసోసియేషన్" దాని తొలిరూపం హైదరాబాద్ కమ్యూనిస్టు పార్టీలో రావినారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి, హి.హనుమయ్య, మగ్దూం మొహియుద్దీన్, రాజబహద్దూర్ గౌడ్, వి.ఆళ్వారు స్వామి, హేమాద్రి, డి.హెచ్.దేశాయ్ ప్రముఖులు. వీరితో పాటుగా, సయ్యద్ హుస్సేన్, జవ్వాద్ రజ్వీ, జహాందర్ అఫ్సర్, ప్రొఫెసర్ ఫారూఖీను (ఈయన ఇప్పుడు అవసాన దశలో ఉన్నాడు) ముస్రత్ మొహిద్దుద్దీన్ లాంటి నాయకులతోపాటుగా అనేక మంది ముస్లింలు ఆనాటి ఉమ్మడి కమ్యూనిస్టుల పార్టీతో కలిసి పనిచేశారు. సమావేశాలు ఎక్కువగా పాతబస్తీలోనే జరిగేవి, ప్రతి ఒక్క కార్యక్రమానికి చార్మినార్ వేదికగా ఉండేది. కామ్రేడ్స్ అసోసియేషన్ మొదటి బహిరంగసభ 'దివాన్ దేవుడి' పాతబస్తీలో జరిగింది. కాని నేడు కమ్యూనిస్టులు పూర్తిగా పాతబస్తీకి దూరం అయిపోయారు ఎందుకని?

1944లో కమ్యూనిస్టు భూస్వామ్య వ్యతిరేక పోరాటాన్ని ప్రారంభించారు. అప్పుడే 1944 నాటికి ఆంధ్ర మహాసభను స్వాధీనం చేసుకున్నారు. 1946 అక్టోబరు నుంచి భూస్వామ్య వ్యతిరేక పోరాటాన్ని తీవ్ర తరం చేశారు. వరంగల్ జిల్లాలోని జనగాం తాలూకాలో, నల్లగొండ జిల్లాలోని



భువనగిరి తాలూకాలో ఉద్యమాన్ని ఉధృత రూపంలో సాగించారు. ఉస్మాన్ షాహీ, అజాంజాహీ మిల్లుల ఉద్యోగులు, నిజాం స్టేట్ రైల్వే ఉద్యోగులు సాగించిన సమ్మెకు బాధ్యులు కమ్యూనిస్టులే.

అప్పటి హైదరాబాద్ రాజ్య కాంగ్రెస్‌లో కమ్యూనిస్టు పార్టీ ఒక ఒడంబడికను కుదుర్చుకున్న ఫలితంగా యునైటెడ్ ఫ్రంట్ రూపొందింది. ఈ సంయుక్త సంఘటన ముసుగులో కాంగ్రెస్ వాలంటీర్లతో కలిసి గ్రామ ప్రాంతాల్లో వాలంటీర్ దళాలను నెలకొల్పారు. ఈ దళాల ద్వారా సంకపు లాణాలను పడగొట్టడంలో, ధనవంతుల నుంచి వసూలు చేయడంలో ప్రగతి సాధించారు. ఈ దళాలు ప్రభుత్వ వ్యతిరేక కార్యకలాపాలకు పాల్పడ్డాయి. ఒక గ్రామాన్ని వశపరుచుకున్న వెంటనే కాంగ్రెస్ జెండా పక్కనే తమ జెండాలను ఆవిష్కరించేవారు. కమ్యూనిస్టులు తమకు ఎక్కువ పలుకుబడి ఉన్న గ్రామాల్లోకి కాంగ్రెస్ వాలంటీర్లను అనుమతించేవారు కాదు. ఇలాంటి పరిస్థితుల్లో ప్రజల్లో గందరగోళం ఏర్పడింది. 1946 అక్టోబరులో నిజాం ప్రభుత్వం కమ్యూనిస్టులపై దాడులు చేసి వి.ఆళ్వారు స్వామి మొదలియార్ నాయకులను అరెస్టు చేసింది. అయితే రావినారాయణరెడ్డి, వెంకటేశ్వరరావు తదితరులు పోలీసుల నుంచి తప్పించుకున్నా. కమ్యూ[illegible] హింసను అరికట్టెందుకు 1946 అక్టోబరులో నిజాం ప్రభుత్వం నల్లగొండ, వరంగల్‌లో [illegible]క శిబిరాలను ఏర్పాటు చేసింది. పరిస్థితులు విషమించడంతో ఆంధ్ర మహాసభ కమ్యూనిస్టుల పార్టీలు తమ ప్రధాన కేంద్రాలను విజయవాడకు తరలించారు. 1946 నవంబరులో నిజాం ప్రభుత్వం కమ్యూనిస్టు పార్టీపై నిషేధం విధించింది. ఈ మొత్తం కాలంలో తెలంగాణ ముస్లింలు కమ్యూనిస్టుపార్టీతో కలిసి పనిచేశారు.

నేటి ప్రజాస్వామ్యంలో సెక్యులరిజం అంటే అన్ని మతాలను ప్రోత్సహించడమే సెక్యులరిజం అయింది. కాని కమ్యూనిస్టు పార్టీకి నాటి నుంచి త్యాగాలు చేసింది ఇక్కడి తెలంగాణా వాళ్లు, ఓట్లు వేసి గెలిపించింది ఇక్కడి వాళ్లు. కాని నాయకత్వ స్థానంలో ఉంది మాత్రం అక్కడి వాళ్లు. కమ్యూనిజంలో సెక్యులరిజానికి సిద్ధాంతపరంగా కచ్చితమైన స్థానం ఉండాలి. కాని ఆంధ్ర అగ్ర వర్ణ నాయకులు ఎప్పుడూ ఇక్కడి తెలంగాణా ముస్లింలను నాయకత్వ స్థానాల్లోకి రానీయలేదు, పైగా 'నిజాం నిరంకుశుడు' అనే బూజుపట్టిన సిద్ధాంతాన్ని పట్టుకుని వేలాడుతున్నారు.

ఈ దేశంలోని రివిజనిస్టు కమ్యూనిస్టులు ఆర్.ఎస్.ఎస్‌ను యాంటి ముస్లింగా మాత్రమే ప్రచారం చేయడంవల్ల హిందూత్వ శక్తుల పట్ల రావలసింత వ్యతిరేకత రాలేదని, హిందూత్వ యొక్క ఫాసిజం ముఖాన్ని ప్రచారం చేయలేకపోయారని – మానవహక్కుల నేత బాలగోపాల్ అంటారు. నిజానికి వీటితో పాటుగా చారిత్ర తప్పిదాలకు అలవాటుపడిన వీళ్లు నిజాం విషయంలో, సెప్టెంబర్ 17 విషయంలో బీజేపీ అభిప్రాయం కలిగి ఉండం దేన్ని సూచిస్తుంది. తెలంగాణా సాయుధ పోరాటం తప్ప చెప్పుకోటానికి ఇంకో పోరాటం లేదు వీరికి. తర్వాతి క్రమంలో వీళ్ళది అంతా ఎన్నికల పొత్తుల కోసం ఆరాటాలు తప్ప, చెప్పుకోదగ్గ పోరాటాలు లేవు.

డిసెంబర్ 2009 నాటి తెలంగాణ ఉద్యమంలో ముస్లింలు క్రియాశీల పాత్ర పోషించి, తెలంగాణాకు పూర్తి వ్యతిరేకంగా ఉన్న మజ్లిస్ లాంటి పార్టీని సానుకూల వైఖరిగా మార్చగలిగారు. కానీ సి.పి.ఎం మాత్రం మారలేదు. ఇక్కడ జరిగే ఉద్యమాన్ని సమర్థించలేని పార్టీలు ఏవయినా సరే రాజకీయంగా సమాధి కాక తప్పదు.

■



www.etelangana.org

**Dr. Rajiv Sharma, I.A.S.,**
Director General, CGG &
Nodal Officer, CCSAP



**Centre for Good Governance**
Road No. 25, Jubilee Hills,
Hyderabad – 500 033.
Ph : 040 – 23541952 (Off)
23541953 (Fax)

Lr. No. CCSAP/ III /2010 Dated: 04-05-2010

To
Sri Sunkireddy Narayana Reddy
Convenor, SINGIDI
(Telangana Writers Association)
202, Prabhath Apartment,
Prabhat Nagar, Chaitanyapuri
Hyderabad

E mail: narayanareddy.sunkireddy@gmail.com
Cell: 9885682572

Sir,

Sub: Visit of Committee for Consultations on the Situation in Andhra Pradesh (CCSAP) – Meeting with the Committee between 4.00 p.m. to 5.00 p.m. on 06-05-2010 – Reg.
Ref: Your Memorandum to CCSAP.

****

The Committee for Consultations on the Situation in Andhra Pradesh (CCSAP) will visit Hyderabad on 6th and 7th May 2010. The Committee under the Chairmanship of Justice Sri B.N. Srikrishna will be pleased to meet you from **4.00 p.m. – 5.00 p.m. on 6th May 2010 (Thursday) at Lake View Guest House, Raj Bhavan Road, Hyderabad.**

You are requested to attend and also communicate the list of delegates attending the meeting immediately by fax to **(040) 2354 1953.**

Received

Yours sincerely,

(RAJIV SHARMA)



## రాష్ట్ర ఏర్పాటే సత్వర పరిష్కారం!

# శ్రీకృష్ణ కమిటీతో 'సింగిడి'

జస్టిస్ శ్రీ కృష్ణ కమిటీ నుంచి వచ్చిన ఆహ్వానం మేరకు 'సింగిడి' తెలంగాణ రచయితల సంఘం వెళ్లి కమిటీని కలువడం జరిగింది. తెలంగాణ రాష్ట్ర అవశ్యకతతో పాటు, యాభై మూడేండ్లుగా సమైక్యపాలనలో జరిగిన అన్యాయాలు, సాహిత్య, సాంస్కృతిక రంగాల్లో ఉన్న వైవిధ్యము తేడాలను కూడా సవివరంగా ఆధారాలతో సింగిడి సంఘం.. శ్రీకృష్ణ కమిటీకి విన్నవించడం జరిగింది. అలాగే ఇదే సమయంలో రాజధాని విషయంలో జరుగుతున్న రాద్ధాంతంలో నిజాలు లేవని, హైదరాబాద్ తెలంగాణలో అంతర్భాగమే తప్ప, వేరే కాదని వివరించి, అందుకు సంబంధించిన రిపోర్టును కూడా అందజేసింది. సింగిడి కార్యవర్గ సభ్యులైన సుంకిరెడ్డి నారాయణరెడ్డి, సంగిశెట్టి శ్రీనివాస్, స్కైబాబ, పసునూరి రవీందర్, ఏలేశ్వరం నాగభూషణాచార్యలతో పాటు ఉస్మానియా విశ్వవిద్యాలయం అధ్యాపకురాలు డాక్టర్ సూర్యా నాయక్‌లు వివిధ అంశాల మీద తమ వివరణలు ఇచ్చారు. జస్టిస్ శ్రీకృష్ణ కమిటీ ముందు వినిపించిన వాదనల్లో కొన్ని కీలకాంశాలు పాఠకుల కోసం అందిస్తున్నాము.

**హైదరాబాద్ మాదే:**

సీమాంధ్ర నేతల మాటల్లో హైదరాబాద్ అందరిదనే వాదన వినిపిస్తున్నది. కానీ, ఇందులో ఎంతమాత్రమూ నిజం లేదు. నాలుగు వందల యేండ్ల కిందట్నే కుతుబ్‌షాహీ నవాబులు నిర్మించిన నగరమిది. ఇప్పుడు ఆంధ్రా పాలకులకు సౌకర్యవంతంగా ఉపయోగపడుతున్న అసెంబ్లీ, ఉస్మానియా విశ్వవిద్యాలయం, ఉస్మానియా దవఖాన వంటి అనేక కట్టడాలన్నీ నిజాం కాలంలో కట్టినవే. ఆంధ్ర రాష్ట్రం 1953లో ఏర్పడ్డ తర్వాత సీమాంధ్రుల పరిపాలనకు, అనుకూలమైన రాజధానిగా కర్నూలు నిలవలేదు. అందువల్ల సీమాంధ్రులు కలిసి హైదరాబాద్ మీద కన్నువేసి ఆంధ్రప్రదేశ్‌ను బలవంతంగా ఏర్పాటుచేశారు. తమ పరిపాలన సౌలభ్యంతో పాటు తెలంగాణ సహజవనరులను తరలించుకుపోయేందుకు ఈ విధంగా మార్గం సులభం చేసుకున్నారు. కానీ అర శతాబ్దం తరువాత మాత్రం హైదరాబాద్ అందరిదంటూ ప్రగల్భాలు పలుకుతున్నారు. బతుకడానికి వచ్చి ఆధిపత్యం చలాయిస్తున్నారు. పైగా అంతా తామే అభివృద్ధి చేశామంటూన్న తీరు "గాడీకే నీచే కుత్తే"



www.etelangana.org

సామెతలాగా ఉంది. కాబట్టి తెలంగాణ రాష్ట్ర ఏర్పాటుతో హైదరాబాద్ కూడా తెలంగాణ ప్రజలకే ఉండాలి.

**సాహిత్య చరిత్రలో తీరని అన్యాయం:**

తెలంగాణను ఆక్రమించుకున్న సీమాంధ్రులు తమను ఏనాడూ అన్నదమ్ముల్లా చూడలేదు. చరిత్రను వక్రీకరించిన కోస్తాంధ్ర పెద్దన్నలు చరిత్రలో, అట్లాగే సాహిత్య చరిత్రలో కూడా తెలంగాణ కనీస స్పర్శకు నోచుకోనివ్వలేదు. తెలంగాణకు భౌగోళికంగా క్రీ.పూ. నుండే కొన్ని వందల యేండ్ల చరిత్ర ఉన్నప్పటికీ ఆంధ్ర చరిత్రకారులు ఆ చరిత్రనంతా కప్పి పెట్టారు. శాతవాహనులు, విష్ణుకుండినులు, బాదామి చాళుక్యులు, వేములవాడ చాళుక్యులు, ఆ తరువాత కాకతీయులు, ముసునూరు పద్మ నాయక రాజులు, కుతుబ్‌షాహీలు, అసఫ్ జాహీలు తెలంగాణను తెలుగులో ఆదికవిగా నన్నయను చెప్పే ఆంధ్రా సాహిత్యకారులకు తెలంగాణ కవులు గానీ, తెలంగాణకు ఉన్న శతాబ్దాల సాహిత్య చరిత్ర గానీ కనిపించలేదు. తెలుగుకు ఆదికవి అని చెప్పుకునే నన్నయ పదకొండో శతాబ్దానికి మాత్రమే సంబంధించినవాడు. కానీ, తెలంగాణ ప్రాంతంలో పదవ శతాబ్దంలోనే పంపన సాహిత్య రచన చేశాడు. ఇప్పటికి ఆ రచనలు లభ్యమవుతున్న ఆంధ్రా సాహిత్య పెద్దలు ధ్రువీకరించడానికి సిద్ధంగా లేరు. కేవలం ఆధిపత్యం కోసం మాత్రమే సీమాంధ్రులు ఇలాంటి దుర్మార్గాలకు ఒడిగడుతున్నారు. కానీ, యావత్ తెలంగాణ బిడ్డలు ఈ ద్రోహాలను ఎంత మాత్రమూ సహించడానికి సిద్ధంగా లేరు. కాబట్టి సాహిత్య సాంస్కృతిక రంగాల్లో ఇంత కాలం జరిగిన అన్యాయం, వివక్ష ఇక ముందు జరుగకుండా ఉండాలంటే తెలంగాణ రాష్ట్రమే దానికి పరిష్కారం.

**ముస్లింలూ తెలంగాణ కోరుకుంటున్నారు:**

తెలంగాణ రాష్ట్రం ఏర్పడడాన్ని ముస్లింలు కోరుకోవడం లేదని కొందరు స్వార్థశక్తులు పెద్దెత్తున ప్రచారం చేస్తున్నారు. కానీ, ఈ ప్రచారంలో ఎంత మాత్రమూ నిజం లేదు. హైదరాబాద్ మీద ఆధారపడి బతుకుతున్న లక్షలాది మంది పేద ముస్లిం జనం అత్యంత దయనీయస్థితిలో బతుకీడుస్తున్నారు. నిరక్షరాస్యత, నిరుద్యోగం, దారిద్ర్యము వంటి దీర్ఘకాలిక సమస్యలతో అభివృద్ధికి ఆమడ దూరంలో మగ్గుతున్నారు. కానీ రాజధాని నగరంలో ఓల్డ్ సిటీకి మాత్రమే పరిమితమైన ఎంఐఎం పార్టీ మాత్రం తమ స్వార్థ వ్యాపార ప్రయోజనాల కోసం తెలంగాణ పట్ల వ్యతిరేకతను ప్రదర్శిస్తున్నది. కానీ మెజారిటీగా లక్షలాది మంది ముస్లింలు తెలంగాణ రాష్ట్రాన్ని కోరుకుంటున్నారు. మరోవైపు ముస్లిం రచయితలు కూడా సమైక్యపాలనలో భాష విషయంలో మరింత ఇబ్బందిని ఎదుర్కొంటున్నారు. తమ ఇంటిలో ఉర్దూ మాట్లాడుతూ, వీధిలో తెలంగాణ తెలుగు మాట్లాడుతూ, బడిలో మాత్రం కోస్తాంధ్రా తెలుగులో చదువుకోవాల్సి వస్తుంది. ఇలా సమైక్యపాలన ముస్లింలను మరింత వెనుకబాటుకు గురిచేస్తున్నది. కాబట్టి తెలంగాణ రాష్ట్రమొస్తే తమ బతుకులు బాగుపడుతాయని బలంగా ప్రకటిస్తున్నారు.

**సాంస్కృతికంగా వివక్షే...!:**

సమైక్య పాలకులు తెలంగాణ భాషా సంస్కృతుల పట్ల కూడా సవతి తల్లి ప్రేమనే కనబరిచారు. కల్చరల్‌గా తెలంగాణకు ఉన్న ఔన్నత్యాన్ని ఏ మాత్రమూ గుర్తించకుండా, తెలంగాణ గొంతుకను నొక్కిపెడుతున్నారు. తెలంగాణలో అతి పెద్ద జాతరగా సాగే సమ్మక్క సారలమ్మ పండుగను మన రాష్ట్రమే కాదు, పొరుగు రాష్ట్రాలు దాటి.. దేశ, దేశాల నుంచి సుమారు రెండు కోట్ల మంది భక్తులు సందర్శిస్తున్నారు. పత్రికలన్నీ ఈ జాతరను దక్షిణ కుంభమేళగా వర్ణిస్తున్నాయి. అయినా ప్రభుత్వం మాత్రం అధికారికంగా ప్రకటించడానికి సిద్ధంగా లేదు. అట్లాగే ఈ పుణ్య క్షేత్రం



ఆదాయానికి సరిపడ అభివృద్ధి మాత్రం జర్గుగడం లేదు. దేవాదాయ శాఖ తన ఖజానా నింపుకొంటూనే, తెలంగాణలోని దేవాలయాల పట్ల చూపుతున్న తీవ్ర నిర్లక్ష్యానికి సమ్మక్క సారక్క జాతరే ఒక ప్రత్యక్ష ఉదాహరణ. కేంద్ర ప్రభుత్వం చేత జాతీయ పుణ్యక్షేత్రంగా ప్రకటించడంలో ప్రభుత్వానికి చిత్తశుద్ధి లేదు. పరిపాలించారు. కానీ చరిత్రలో ఈ వివరాల్ని, ఆధారాలేవీ కనపించకుండా ఆంధ్రా చరిత్రకారులు జాగ్రత్తపడ్డారు. ఇదే కుట్ర సాహిత్య చరిత్రల్లో కూడా జరిగింది.

అట్లాగే పాఠ్య పుస్తకాల విషయంలో కూడా ఆంధ్రా మేధావులు, పండితులు తెలంగాణకు తీరని అన్యాయం చేశారు. అట్లతద్ది గురించి పాఠ్యాంశాల్లో సిలబస్‌ను ఏర్పాటు చేసినవారు బతుకమ్మను మాత్రం దూరం పెట్టారు. వీరుల చరిత్రలో కూడా ఆంధ్రా ప్రాంతం వారికే పెద్దపీట వేశారు. అల్లూరి సీతారామరాజు, టంగుటూరి ప్రకాశంలకు దక్కిన స్థానం చరిత్ర పుస్తకాల్లో కొమురంభీం, బందగీ, దొడ్డి కొమురయ్యలకు దక్కలేదు. ఇలా ఆంధ్రా సంస్కృతిని, చరిత్రను అందరిదిగా చలామణీ చేశారు. ఇలాంటి మోసాలకు అడ్డుకట్ట పడాలంటే కేవలం తెలంగాణ స్వరాష్ట్రమైతే తప్ప మార్గంలేదు.

**అధికారాలు, అవకాశాల్లోనూ వివక్షే:**

తెలంగాణకు గత యాభై యేండ్లుగా అధికారం, ఉద్యోగావకాశాల్లో జరిగిన వివక్ష చెప్పుకోలేని స్థాయిలో ఉంది. సెక్రటేరియట్ ఉద్యోగాల నుంచి మొదలుకొని ముఖ్యమంత్రి పదవి వరకు సీమాంధ్రే అన్ని పదవులను, అధికారాలను, అన్ని అవకాశాలను దక్కించుకుంది. ఇటీవల నిర్మించిన విశ్వ విద్యాలయాలకు కేటాయించిన నిధులే అందుకు ప్రత్యక్ష సాక్ష్యంగా కనిపిస్తున్నది. కడప జిల్లాలో ఉన్న యోగివేమన విశ్వవిద్యాలయానికి కేటాయించిన నిధులు పాలమూరు విశ్వవిద్యాలయానికి గానీ, శాతవాహన, తెలంగాణ యూనివర్సిటీలకు గానీ ఎక్కడా పొంతన లేదు. 1969లో జరిగిన ఉద్యమంలో అసువులు బాసిన అమరుల త్యాగఫలితంగా తెలంగాణ అభివృద్ధి కోసం ఏర్పాటు చేసిన సెంట్రల్ యూనివర్సిటీలో ఆంధ్రా వాళ్లదే అగ్రస్థానం. విద్యార్థుల నుంచి మొదలుకొని, అధ్యాపకుల వరకు స్థానిక తెలంగాణ జిల్లాల ప్రాతినిధ్యం అంతంత మాత్రమే! ఈ యూనివర్సిటీ స్థాపించిన ఆశయం ఒకటైతే, ఆచరణ మాత్రం ఆంధ్రాకు అనుకూలంగా అమలవుతున్నది. ఒక్కో డిపార్ట్‌మెంట్‌లో పన్నెండుమంది అధ్యాపకుల్లో ఒకరో, ఇద్దరో మాత్రమే తెలంగాణ వాళ్ళు కనిపిస్తారు. దేశంలో ఉన్న అన్ని సెంట్రల్ యూనివర్సిటీల్లో స్థానిక కోటా అనే పేరుతో సుమారు 15 శాతం రిజర్వేషన్ ఉంది. కానీ ఇక్కడ మాత్రం ఎలాంటి రిజర్వేషన్ లేకపోగా, ప్రతీయేడు పెంచుతున్న ఫీజుల ధాటికి తెలంగాణ విద్యార్థులు ఇందులో అడుగు పెట్టలేక పోతున్నారు.

**తెలంగాణ భాష వేరు, ఆంధ్ర భాష వేరు:**

భాష విషయంలో కూడా సీమాంధ్రులు తప్పుడు అవగాహనతో ఉన్నారు. తెలంగాణ భాషను మాండలికంగా చూస్తున్నారు. కానీ, తెలంగాణది ప్రత్యేకమైన భాష. ప్రతీ పది మైళ్లకు మాండలికం మారుతుంది తప్ప భాష మారదు. తెలంగాణది మాండలికమైతే కొద్ది అక్షరాల తేడాతో ఆ వస్తువు లేదా పదాన్ని ఉచ్చరించడం ఉండాలి. కానీ పూర్తిగా మార్పు ఉన్నది ఆంధ్రా, తెలంగాణ భాషల్లో గుర్తించ తగిన వైవిధ్యమున్నది. ఇక్కడ ఉన్న పదాలు ఆంధ్రాలో లేవు. వాటి ఉచ్చారణకు, వీటికి ఎక్కడా సంబంధం లేదు. అలాగే తెలుగు భాషకు వర్ణాలు యాభైయారు. కానీ, తెలంగాణ భాషకు ముప్పైయారు మాత్రమే. ఈ విషయాలను ఒప్పుకోని సీమాంధ్రులు తెలంగాణ భాషని సినిమాలకు,



www.etelangana.org

టీవీలకు వాడుకూంటూ కోట్లు సంపాదించుకుంటున్నాయి. పైగా తెలంగాణ భాషను విలన్ భాషగా, జోకర్, కమేడియన్ల భాషగా చిత్రీకరించి అవమానిస్తున్నారు. ఇలా అవమానించే వాళ్లతో కలిసి అన్నదమ్ముల్లా ఎలా ఉండగలం? అందుకే అన్నదమ్ముల భావనతో విడిపోవడమే మేలని భావిస్తున్నాం.

**సింగిడి సమర్పించిన నివేదికలు, పుస్తకాలు:**

తెలంగాణ రాష్ట్ర అవశ్యకతను తెలియజేస్తూ, సింగిడి తెలంగాణ రచయితల సంఘం తయారుచేసిన నివేదికతో పాటు, సింగిడిలోని రచయితలు, కవులు ప్రచురించిన పుస్తకాలను శ్రీకృష్ణ కమిటీకి అందజేయడం జరిగింది. ఇటీవల తెలంగాణ ప్రాచీన సాహిత్య చరిత్రను విశేషంగా పరిశోధించిన డాక్టర్ సుంకిరెడ్డి నారాయణ రెడ్డి గారు వెలువరించిన 'ముంగిలి', సంగిశెట్టి శ్రీనివాస్ సంపాదకత్వం వహించి ప్రచురించిన అరవైతొమ్మిది ఉద్యమ కవిత్వ సంకలనం, సింగిడి మాస పత్రిక, స్కైబాబ ప్రచురించిచన 'జాగో... జగావో', పసునూరి రవీందర్ రాసిన దీర్ఘకావ్యం 'అజాయి'లతో పాటు తెలంగాణ కవులు, రచయితలు, కళాకారులు తెలంగాణ రాష్ట్రాన్ని కోరుతూ చేసిన సంతకాల సంపుటిని ఏలేశ్వరం నాగభూషణాచార్య జస్టిస్ శ్రీకృష్ణకు సమర్పించారు. పుస్తకాలను స్వీకరించిన శ్రీకృష్ణ కమిటీ మధ్య మధ్యలో తమకు ఉన్న సందేహాలను అడిగి తెలుసుకున్నారు. సింగిడి సభ్యుల సమాధానాలకు సంతృప్తి చెందడమే కాదు, రాజకీయ పార్టీల వలె కాకుండా, నిస్వార్థంగా మేధోపరమైన విశ్లేషణలు చేసినందుకు సింగిడి సంఘాన్ని శ్రీకృష్ణ కమిటీ అభినందించిచంది. అధారాలను వివక్ష లేకుండా పరిశీలించి కేంద్రానికి సింగిడి వాదనను వినిపిస్తామని హామీ కూడా ఇవ్వడం జరిగింది. ■

హైదరాబాద్, ఆంధ్రప్రదేశ్ లో ఏర్పడిన పరిస్థితులపై కేంద్రం నియమించిన శ్రీకృష్ణ కమిటీ వద్ద గురువారం సింగిడి తెలంగాణ రచయితల సంఘం ప్రతినిధులు డాక్టర్ సుంకిరెడ్డి నారాయణరెడ్డి, డాక్టర్ సంగిశెట్టి శ్రీనివాస్, నాగభూషణాచారి, స్కైబాబా, సూర్యనాయక్, రవీందర్ తదితరులు తమ వాదనలు వినిపించారు. తెలంగాణ భాష, చరిత్రను వక్రీకరించి, ధ్వంసం చేస్తున్న విషయాలను ఆధారాలతో వివరించినట్లు శ్రీకృష్ణ కమిటీతో భేటీ అనంతరం మీడియా ప్రతినిధులతో అన్నారు. హైదరాబాద్ రాజధాని తెలంగాణ ప్రజలదే ఎలా అవుతుందో తెలియజేశామన్నారు. గత ఐదు వేళ్లుగా ఆంధ్ర, తెలంగాణ ప్రాంతాలు వేర్వేరుగా ఉంటున్నాయని, హైదరాబాద్‌లో భవనాలు, విద్యాసంస్థలు నిజాం కాలంలో ఏ విధంగా నిర్మించారో చెప్పినట్లు వారు తెలిపారు.

ఇరు ప్రాంతాల ప్రజలు మాట్లాడేది తెలుగే అయినప్పటికీ, భాషలో వివక్ష ఎలా ఉంటుందని జస్టిస్ శ్రీకృష్ణ అడిగారు. భాష, యాస, పదాల్లో తేడాలున్నాయని, తెలంగాణ భాషపై వివక్ష ఎలా జరిగిందో ఆధారాలతో సహా చెప్పామని వారన్నారు. తెలంగాణ రచయితలకు సంబంధించిన అంశాలు పాఠ్య పుస్తకాల్లో చేర్చాలని కోరినా పట్టించుకోలేదని చెప్పినట్లు సింగిడి ప్రతినిధులు అన్నారు. ఎంఐఎం మినహా తెలంగాణలోని 15 శాతం ముస్లింలు ప్రత్యేక తెలంగాణ కోరుకుంటున్నారని కమిటీ దృష్టికి తీసుకెళ్లినట్లు వారు తెలిపారు. తెలంగాణ ముస్లింలకు ఎంఐఎం ప్రతినిధి కాదని చెప్పామని అన్నారు. సినీ పరిశ్రమ మొత్తం ఆంధ్ర ప్రాంతానికే చెందిన వారి చేతుల్లో ఉన్నందున సినిమాల్లో విలన్లకు, జోకర్లకు తెలంగాణ భాష అంటగడుతూ రౌడీల భాషగా చిత్రీకరిస్తున్నారని తెలియజేశామని చెప్పారు. పాఠ్యపుస్తకాల్లో అల్లూరి, అల్లూరి సీతారామరాజు కథలు చెప్పారని, కానీ బతుకమ్మ, కొమురం భీమ్ గురించి మాత్రం ఉండదని ఆవేదన వ్యక్తంచేశారు.

కర్టెసీ తెలుగు డైలీ న్యూస్ పేపర్ వార్త



# తెలంగాణ ఏర్పాటు వల్లనే ముస్లింలకు మేలు

● స్కైబాబ (ఎస్.కె.యూసుఫ్ బాబ)
కన్వీనర్, తెలంగాణ ముస్లిం రచయితల వేదిక

మన భూగోళంపై పుట్టిన జీవి ఏదైనా తనకు చేతనైన విధంగా కడుపునకు చాలినంత తిండి సంపాదించుకుంటుంది. కడుపు నిండా తిని నిశ్చింతగా నిద్రపోతుంది. ఆ పూటకు చాలినాక కూడా మరింత దోచి దాచిపెట్టుకోవాలని అనుకోదు. పులి అయినా సింహమైనా తాను వేటాడిన జంతువును తిన్నంత తిని పక్కకు తొలగిపోతుంది. అది ప్రకృతి సహజం. కాని ఆ జీవుల్లోంచే ఎదిగిన మనిషి మాత్రం తనకు చాలినంత సంపాదించుకుని కూడా అత్యాశకు పోయి మరింత కూడబెట్టుకునేందుకు అలవాటు పడ్డాడు. అందులో భాగంగానే వెనకబడ్డ జాతుల్ని, వెనకబడ్డ ప్రాంతాల్ని అభివృద్ధి చెందిన జాతులు, ప్రాంతాల వాళ్లు దగా చేయడం, దోచుకోవడం జరుగుతున్నది. ఇదే అంశం తెలంగాణ విషయంలోనూ, తెలంగాణ ముస్లింల విషయంలోనూ అన్వయించుకోవచ్చు. ఆంధ్రా వారు తెలంగాణను ఆక్రమించుకోవడంలోనూ, ముస్లిమీయత కలగిలిసిన తెలంగాణ సంస్కృతిని ధ్వంసం చేయడంలోనూ ఈ క్రమమే కనిపిస్తుంది. అయితే పైన చెప్పుకొన్నట్టు తెలంగాణవారిలో ప్రకృతి సహజ లక్షణమైన ఎంత వరకు అవసరమో అంతవరకే సంపాదించుకోవడం కనిపిస్తుంది. అది ముస్లింలలో మరింత కనిపిస్తుంది. తెలంగాణ ముస్లిం సంస్కృతిలోనే ఇది ఒక భాగంగా కనిపిస్తుంది. అలాంటివారికి దోచుకుని దాచుకునే స్వభావం కల ఆంధ్రా వారిని కలపడమే చరిత్రలో జరిపిన ఒకానొక తప్పు. అందువల్లనే ఇలా భిన్న సంస్కృతులున్న రెండు జాతుల మధ్య ఘర్షణ నిత్యంగా జరుగుతూ వస్తున్నది. దీనికి పరిష్కారం ఒక్కటే, తెలంగాణ రాష్ట్రం ఏర్పాటు చేయడమే.

తెలంగాణ రాష్ట్రం ఏర్పాటు చేయడం వల్లనే ఇక్కడి ముస్లింలకు మేలు జరుగుతుంది. తెలంగాణను ఆంధ్రలో కలపడం వలన తెలంగాణ ముస్లింలు చాలా నష్టపోయారు. వారు నష్టపోయిన ఒక్కో రంగాన్ని ఇలా విశ్లేషించుకోవచ్చు.

1. సంస్కృతి: తెలంగాణవారు వందల సంవత్సరాలు కుతుబ్‌షాహీలు, అసఫ్‌జాహీల పాలనలో ఉండడం వలన, అదనంగా చుట్టూరా మొగలాయీ పాలన కూడా ఉండడంతో వారి సంస్కృతి అంతా ప్రాచ్య (ఓరియంటల్ దేశాల), ఇరాన్ పర్షియా, ఇరాక్, టర్కీ వగైరా సంస్కృతితో ప్రభావితమైంది.



www.etelangana.org

కాబట్టి ఇక్కడి భాష, వేషధారణ, ఆహారపు అలవాట్లు, నిద్ర, కళలు, సాహిత్యం అన్నీ కూడా ప్రాచ్య దేశాలను పోలి ఉంటాయి. గ్రామాల్లో ఈ ప్రభావం కొంత తక్కువ కనిపించినా పట్టణాలు, ముఖ్యంగా హైదరాబాద్‌లో ఈ సంస్కృతి వేళ్లూనుకునిపోయింది. ఈ సంస్కృతికి భిన్నంగా చివరి 200 సంవత్సరాలు ఆంగ్లేయుల పాలనలో ఉండిన ఆంధ్రా ప్రాంతంవారు పశ్చిమ దేశాల (బ్రిటన్, ఫ్రాన్స్, అమెరికా వగైరా సామ్రాజ్యవాద సంస్కృతికి అలవాటు పడ్డారు. ఈ రెండు సంస్కృతుల మధ్య క్లాష్ ఏర్పడుతున్నది అందువల్లనే.

తెలంగాణ ముస్లింలు భూములు కోల్పోయిన వారిగా, ఆంధ్రా వాళ్లు భూములు ఆక్రమించుకున్న వారుగా మనకు ఎన్నో దాఖలాలు తెలంగాణలోనూ ముఖ్యంగా హైదరాబాద్‌లోనూ, హైదరాబాద్ చుట్టూరా కనిపించడం అందుకు నిదర్శనం.

2. భాష: 200 సంవత్సరాలు నిజాంల పాలనలో ఉండడం వల్ల రాజభాషగా ఉర్దూ ఉన్న కారణంగా తెలంగాణ వారందరూ చాలా వరకూ ఉర్దూ మీడియంలోనే చదువుకున్నారు. ఉర్దూ ప్రభావం వల్ల ఇక్కడి తెలుగు డిఫరెంట్ యాక్సెంట్‌ను తీసుకుంది. వేల ఉర్దూ పదాలు తెలుగైజ్ అయ్యాయి. తెలుగు ఉర్దూ మిక్స్‌డ్ లాంగ్వేజ్‌లో ఇక్కడి వాళ్లు మాట్లాడుకోవడం చూస్తాం. అలా ఆ మిక్స్‌డ్ భాష ఇక్కడి వారి జీవితంలో భాగమైంది.

అయితే హైదరాబాద్ రాజ్యాన్ని విభజించి ముక్కలు చేసి తెలంగాణను ఆంధ్రలో కలపడం వలన భాషా పరంగా ఎనలేని నష్టం జరిగింది.

కిసీ ఖౌమ్‌కో బర్బాద్ కర్నా హైతో
పహ్‌లే ఉస్ కీ జబాన్ ఖీంచ్‌లో...

అన్నట్లుగా తెలంగాణ వారితో పాటు ఇక్కడి ముస్లింల భాషను గుంజుకోవడం, ధ్వంసం చేయడం జరిగింది. ఇంకా ఇంకా జరుగుతున్నది.

ఉర్దూ మీడియం పాఠశాలలన్నీ తెలుగు మీడియం పాఠశాలలుగా మార్చబడ్డాయి. సరే, నాచురల్ అనుకుందాం. కానీ తెలంగాణ తెలుగువారు ఆ పాఠశాలల్లో ఉపాధ్యాయులుగా, అధ్యాపకులుగా నియమించబడితే వారికి ఇక్కడి పరిస్థితుల మీదా మనుషుల మీదా ప్రేమ ఉండి అర్థం చేసుకుని మసిలేవారు. అలా కాకుండా ఆంధ్ర నుంచి వలస వచ్చినా, తీసుకురాబడిన తెలుగువారి వల్ల ఇక్కడి వారు, ముఖ్యంగా ముస్లింలు ఎక్కువగా అవహేళనకు గురయ్యారు. వాళ్లే కాదు, హైదరాబాద్ పనిచేస్తున్న లక్షలాదిమంది ఆంధ్రావారు ఉర్దూ పట్ల, ఉర్దూ కలగలిసిన తెలుగు పట్ల ఏమాత్రం మమకారం లేకుండా ప్రతి మాటలోనూ తెలంగాణవారిని, ముస్లింలను తక్కువచేసి మాట్లాడుతూ అవమానించారు. ఆత్మన్యూనతలో పడవేశారు. ఈ కారణాన తెలంగాణ తెలుగు భాషకు, ఉర్దూకు ఎక్కువ నష్టం జరిగింది. ఉర్దూ అంతర్థానమయ్యే ప్రమాదం ఏర్పడింది.

నిజానికి ఈ తీయని ఉర్దూ సమ్మిళిత తెలుగు వల్ల ఇక్కడి తెలుగువారికి ముస్లింలపై, ముస్లింలకు తెలుగువారిపై అప్రకటిత ప్రేమ, వాత్సల్యం ఉండేవి. అంటే సమ్మిళిత భాష హిందూ ముస్లింల మధ్య సహజీవనానికి తోడ్పడింది. తెలంగాణ ఏర్పడడం వలన మళ్లీ ఆ వాతావరణం వస్తుందని, రావాలని మేం ఆశిస్తున్నాం. ఆంధ్రావారి ఉర్దూ వ్యతిరేకత, ముస్లిం వ్యతిరేకత నుంచి తెలంగాణ ముస్లింలు తప్పించుకోగలుగుతారు.

3. వేషధారణ: పఠానీ సూట్, షేర్వానీ, లాల్చీ పైజమా, చుడీదార్ పైజమా, షట్‌సెల్వార్, పైజమా ఖమీజ్ తదితర వస్త్రధారణ ముస్లింలది. ఇవి తెలుగువారు కూడా ధరించడం అలవర్చుకున్నారు. దానికి భిన్నంగా కోస్తాంధ్రా ప్రాంతం సముద్రం దగ్గరగా ఉండడంతో వారి వస్త్రధారణలో ఎంతో



తేడా ఉంది. ఉక్కపోత కారణంగా వారు లుంగీ కడితే, తెలంగాణ ముస్లింలు పైజమా వేసుకోవడం అలవాటు. ఈ పైజమాలపై, బొందెలపై ఆంధ్రావారు జోకులేయడం మామూలే.

4. ఆహారపు అలవాట్లు: హైదరాబాదీ బిర్యానీ ప్రపంచంలోనే ప్రసిద్ధి. ఆంధ్రాలో పలావ్ అని వండుతారు. మేము ఏ మాత్రం రుచి లేని ఆ పలావ్ తినలేము. రంజాన్ నెల అంతా హలీమ్, హరీస్ హైదరాబాద్‌లోనూ, తెలంగాణ పట్టణాలలోనూ ముఖ్యమైన ప్రత్యేక వంటకంగా విరివిగా అమ్ముడుపోతుంది. రంజాన్ పండుగ రోజు చేసే సేమ్యా అనేది మరో ప్రత్యేక వంటకం. ఆ వంటకం పట్ల ఊర్లలో తెలుగువారు చాలా ఆసక్తి చూపుతారు. ముస్లింలు కూడా తెలుగువారిని ప్రత్యేకంగా ఆ రోజు ఇంటికి పిలిచి సేమియా ఇస్తారు. ఇవాళ ఈ వంటకం తెలంగాణలో దాదాపు అందరూ చేసుకుంటున్నారు. అలాగే ఆనపకాయ (సొరకాయ)తో చేసే 'దాల్చ' ముస్లిం ఇండ్లల్లో ప్రత్యేక వంటకం. పెళ్లిల్లోలో ఇది తప్పనిసరి. దీనికి ప్రతిగా ఆంధ్రాలో సాంబార్ అనే వంటకం చేస్తారు. ముస్లింల వల్ల అలవాటైన నాన్ వెజ్ వంటకాలు తెలంగాణాలో ఎక్కువ. వాటిలో రకాలు ఎన్ననేది లెక్కించలేం.

అట్లే పానీయాల విషయంలోనూ తేడా వుంది. తెలంగాణలో చాయ్ (టీ) తాగితే, ఆంధ్రాలో కాఫీ తాగుతారు. ఆంధ్రా టీకి తెలంగాణ టీకి తేడా ఉంటుంది. ఇరానీ చాయ్‌కి ఈ ప్రాంతం ప్రసిద్ధి. పౌనా, మలయ్ చాయ్, ...... తదితర రకాలు ఇక్కడ దొరుకుతాయి.

6. కళలు సాహిత్యం: కళలు, సాహిత్యం విషయంలోనూ చాలా తేడా ఉన్నది. ఉర్దూ ముషయిరాలు రాత్రి అన్నం తిన్న తర్వాత మొదలై రాత్రంతా నడిచే సంస్కృతి ఇక్కడ ఉన్నది. ఉర్దూ కవులు, రచయితలు తెలంగాణ అంతటా ఉన్నారు. హైదరాబాద్‌లో ఎక్కువగా ఉన్నారు. ఖవాలీ ప్రోగ్రాములు కూడా ఇక్కడ ఎక్కువే. ఆంధ్రా ప్రాంతంలో ఇవి కనిపించవు. ఇలా ఇంకా ఎన్నో వషయాలలో తేడాల వల్ల వారికీ వీరికీ పొసగని పరిస్థితి ఉంది. ఆంధ్రా వారి డామినేషన్ ఎక్కువ కావడంతో ముస్లిం కల్చర్‌లోని ఇలాంటి విభిన్న సాంస్కృతిక విషయాలు వివక్షకు గురవుతున్నాయి. ఆంధ్రావారికి తెలంగాణ ముస్లింలపై ఏ మాత్రం ప్రేమ లేదు. పైగా చిన్న చూపు. వెకిలిచూపూ. తమ ఆంధ్ర సంస్కృతి నుంచి ప్రతిదాన్నీ చూస్తూ ముస్లిం సంస్కృతుల్ని, అది మిళితమైన తెలంగాణ సంస్కృతిని చులకన చేస్తూ వస్తున్నారు. మాకు సంస్కృతీ సాంప్రదాయాలు, భాష రాదని, తాము వచ్చి అన్నీ నేర్పామని, నేర్పుతున్నామని నిజమైన సంస్కృతి నేర్పుతున్నామని అహంభావాన్ని ప్రదర్శిస్తుంటారు. ముఖ్యంగా ముస్లిం సంస్కృతి అంటే అదేదో పరాయి సంస్కృతి అన్న ఏహ్యభావం చూపుతుంటారు. వీటివల్ల వారికి తెలంగాణ ముస్లింలపై ఏనాడూ ప్రేమ లేదు.

విద్యలో ముస్లింల శాతం చాలా తక్కువగా వుంది. దాని గురించి ఆంధ్రా ప్రభుత్వాలు పట్టించుకోవడం లేదు. ఉద్యోగాల్లోనూ ముస్లిం శాతం హైదరాబాద్ రాజ్యం ఉన్నప్పటికీ ఇప్పటికీ చాలా తగ్గిపోయింది. వీటి గురించి కూడా ప్రభుత్వాలకు చింత లేదు. ఆర్థికంగా కూడా ఆంధ్రా వారి వల్ల తెలంగాణ ముస్లింలు బాగహా నష్టపోయారు. రోడ్‌సైడ్ చిల్లర వ్యాపారాల్లోనే ముస్లింలు ఎక్కువగా ఒదిగిపోతున్నారు. డబ్బు సంచులతో వలస వచ్చి పెద్ద పెద్ద షాపులు, మాల్స్, ఫ్రూట్ మార్కెట్స్ తెరిచే ఆంధ్రావారితో చిన్న సన్న ముస్లిం వ్యాపారస్తులు పోటీపడలేక ఎంతో నష్టపోతున్నారు. నిజానికి రాష్ట్రంలో ఒక పెద్ద సమూహం (దాదాపు 15 నుంచి 20 శాతంగా ఉన్న సమూహం) అన్ని రంగాల్లో వెనకబడి ఉంటే రాష్ట్రాభివృద్ధి ఎలా సాధ్యం?

ఆంధ్రావారు వచ్చాకే మత ఘర్షణలు: ఆంధ్రావారు వచ్చాకే హైదరాబాద్‌లో మత ఘర్షణలు జరిగాయి. అంతకు ముందు వందల ఏళ్లుగా తెలంగాణలో హిందూ ముస్లింలు కలిసిమెలిసి సహజీవనం కొనసాగిస్తున్నారు. ఆంధ్రా రాజకీయ నాయకులు ముఖ్యమంత్రుల్ని మార్చడానికి హైదరాబాద్‌లో మత ఘర్షణలు సృష్టించిన చరిత్ర అందరికీ తెలిసిందే. తెలంగాణలోని తెలుగువారికీ, ముస్లింలకూ



www.etelangana.org

మధ్య సహజీవనం పెంపొందించుకోవాలన్నా వీలైనంత త్వరగా ఆంధ్రావారి నుంచి విడిపోయి తెలంగాణ ప్రత్యేక రాష్ట్రం ఏర్పడడం అవసరం.

చారిత్రకంగా, సాంస్కృతికంగా ఉన్న భావ సారూప్యత, సాంస్కృతిక సారూప్యత వల్ల ఒకరినొకరు అర్థం చేసుకోవడం, శాంతిని స్థాపించుకోవడం ద్వారా సహజీవనం సాగించే అవకాశం ఉంది.

అలాగే తెలంగాణలో ముస్లిం జనాభా పరంగా అధిక శాతంగా ఉంటారు. ఇక్కడ ఎస్సీ, బీసీలూ ఎక్కువే. కాబట్టి ముస్లింల ప్రాతినిధ్యం అన్ని రంగాలతోపాటు రాజకీయంగానూ ఎస్సీ, బీసీలతో పాటు భాగం పంచుకునే అవకాశం ఉంటుంది. ఇలా ఏ రకంగా చూసినా ముస్లింలకు తెలంగాణ ఏర్పడడం అవసరం. చైతన్యవంతులైన ముస్లిం రచయితలుగా మేమంతా, మా సంఘం తరపున తెలంగాణకు మద్దతు తెలుపుతున్నాం. ■

---

# సింగిడి నెలనెలా సమావేశాల రిపోర్ట్

సింగిడి నెలనెలా మొదటి ఆదివారం హైదరాబాద్ లక్డీకపూల్ జెన్ కాలేజీలో సాహిత్య సమావేశాలు జరుపుతూ వస్తుంది. ప్రతి సమావేశంలో ఒక అంశంపై చర్చ అనంతరం కవితా పఠన కార్యక్రమాలు నిర్వహిస్తుంది.

- మొదటి సమావేశం జూన్ 5 ఆదివారం నాడు "తెలంగాణ ఉద్యమం సాహిత్యకారుల బాధ్యత" అనే అంశంపై జరిగింది.
- రెండవ సమావేశం జులై 3 ఆదివారం నాడు "ఉపఎన్నికలు-విభిన్న వాదనలు" అనే అంశంపై జరిగింది.
- మూడవ సమావేశం అగష్టు 7 ఆదివారం నాడు "ఉపఎన్నికల ఫలితాలపై విశ్లేషణ" అనే అంశంపై జరిగింది. ఈ సమావేశానికి ముఖ్యఅతిథిగా జె.ఏ.సి. నాయకులు మల్లేపల్లి లక్ష్మయ్యగారు ప్రసంగించారు. ఉప ఎన్నికలలో ప్రజలు ఎలా స్పదించారో రాజకీయాలకు అతీతంగా ఎలా స్పదించారో వివరించారు. ఎన్నికలలో జె.ఏ.సి నిర్వహించిన పాత్రపై విశ్లేశించారు.
- నాల్గవ సమావేశం సెప్టెంబర్ 9 ఆదివారం నాడు "కొమ్రన్న సంస్మరణ సభ"గా జరిగింది. ఈ సమావేశంలో ముఖ్యవక్తగా డా॥ జిలుకరశ్రీనివాస్ మాట్లాడుతూ బాబాసాహెబ్ అంబేద్కర్ కులనిర్మూలన గ్రంథంలో "ఏ దేశ భవిష్యత్తు అయిన ఆ దేశంలోని మేధావులపైనే ఆధారపడి ఉంటుంది" అన్నారు కాని ఈ దేశంలో మేధావులు బ్రాహ్మణులు కాబట్టి ఈ దేశంలో బ్రాహ్మణులు భాధ్యతగా ప్రవర్తించలేదు. అంబేద్కర్ చెప్పిన నాగరిక సమాజం స్వేచ్ఛ, సమానత్వం సాధనకు దళిత బహుజన సమాజ మేధావి వర్గం నుండి రావాల్సి ఉంది. కొంతమంది మధ్యలోనే మనలిని వదిలివెల్లడం బాధాకరం అని అన్నారు. తెలంగాణ ఉద్యమం కొరకు దళిత బహుజనుల స్వేచ్ఛ సమానత్వం కొరకు పోరాడిన కొమ్రన్నకు నివాళులు అర్పించారు. ఈ సమావేశంలో స్కైబాబా, సంగిశెట్టి, పసునూరి రవీందర్, లోచన్, పరస్తు లోకేశ్వర్, షాజహానా, ఊడులవేణు, జూపాక సుభద్ర, ప్రేరణ, కట్ట కవిత తదితరులు పాల్గొన్నారు.

10-3-2010న బాబ్రీ మసీదు తీర్పుపై కొల్లూరి చిరంజీవి ముఖ్యఅతిథిగా చర్చాగోష్ఠి జరిగింది. దీనికి పసునూరి రవీందర్ అధ్యక్షత వహించాడు, పరవస్తు లోకేశ్వర్, జితేంద్రబాబు, మాధవ కృష్ణా రెడ్డి, సుంకిరెడ్డి నారాయణరెడ్డి, స్కైబాబ తదితరులు పాల్గొన్నారు.





# హైదరాబాద్ సాంస్కృతిక చిహ్నం

• సంగిశెట్టి శ్రీనివాస్



హైదరాబాద్ సంస్కృతిలో విడదీయలేని భాగంగా ఉన్న నృత్యం, గాత్రం, సంగీతం, సాహిత్యం సీమాంధ్రుల పాలనలో విస్మరణకు గురయ్యాయి. మొత్తం తెలుగు సాహిత్యంలో మొట్టమొదట కవిత రాసిన కుప్పాంబిక ఎలా నిరాదరణకు గురయ్యిందో హైదరాబాద్ సంస్కృతిలో అవిభాజ్యమైన మా లిఖాబాయి చాందా కూడా అంతే విస్మరణకు గురయ్యింది. ప్రత్యేక తెలంగాణ ఉద్యమం ఉధృతమైన తర్వాత మిత్రుడు లోకేశ్వర్ రాసిన 'సలాం హైదరాబాద్' లో నవలలో తప్ప మరెక్కడ ఆమె గురించిన ప్రస్తావన లేదు. ఆమెపై ఉర్దూలో ఐదారు జీవిత చరిత్రల పుస్తకాలు వచ్చిన విషయం గానీ, అంతర్జాతీయ స్థాయిలో ఆమెపై పరిశోధనలు జరిగిన అంశాలు కానీ తెలుగు పాఠకులకు అంతగా తెలియదు. ఉర్దూలో ప్రచురితమైన పుస్తకాలు కూడా చాలా పాతవి కావడంతో ఇప్పటి తరానికి ఆ భాష అర్థం కావడం కూడా సమస్యగా మారింది. ఏది ఏమైనా హైదరాబాద్ ఔన్నత్యాన్ని దశ దిశలా చాటిన ఆమె గురించి క్లుప్తంగా తెలపడమే ఈ వ్యాసం ఉద్దేశ్యం. హైదరాబాద్ సంగీతాన్ని, నృత్యాన్ని, గాత్రాన్ని, సాహిత్యాన్ని దేశం నలుమూలాల ప్రఖ్యాతిలోకి తీసుకు వచ్చిన ఘనత మా లిఖాభాయి చాందాది. ప్రపంచంలో మొత్తం ఉర్దూ సాహిత్యంలోనే రచనలు చేసిన మొట్టమొదటి మహిళ చాందా. సంగీత సామ్రాట్టు తాన్‌సేన్ శిష్యుల దగ్గర సంగీతాన్ని అభ్యసించింది. తన ఆట, పాటలతో నిజాం పాలకులను, ప్రజలను మెప్పించింది. మైమరిపించింది. దానగుణంలో తనకెవ్వరూ సాటి రారని నిరూపించుకుంది. ఇప్పుడు ఉస్మానియా విశ్వవిద్యాలయం ఉన్న ప్రాంతమంతా ఒకప్పుడు ఆమె జాగీరులో భాగమే. మా లిఖాభాయి చాందా పూర్వీకులు గుజరాత్‌లోని కచ్ ప్రాంతంలో నివసించేవారు. ఆ తర్వాత అక్కడి నుండి నిజాం యిలాకా లోని ఔరంగాబాద్‌కు ఆ తర్వాత నిజాం రాజ్య రాజధాని హైదరాబాద్‌కు తమ మకాంని మార్చుకున్నారు.

మా లిఖాభాయి చాందా 1767 లో (18, జీకద్, 1181 హిజ్రీ) నిజాం ప్రభుత్వ ఉద్యోగి (పేమాస్టర్) బసాలత్ ఖాన్ బక్షి, రాజ్‌కన్వర్ భాయి (మెహుదా బీబి) దంపతులకు ఔరంగాబాద్ లో జన్మించింది. 1776 లో నిజాం అలీఖాన్ తన రాజధానిని హైదరాబాద్ కు మార్చడంతో చాందా కూడా హైదరాబాద్‌కు చేరుకుంది. రాజ్‌కన్వర్ ఆమె సోదరీమణులు నూర్ బీబి (బ్రిజ్ కన్వర్), మెహ్తాబ్ బీబీ (మెహ్తాబ్ కన్వర్ బాయి)లు కూడా సంగీతంలో విశేష నైపుణ్యాన్ని సంపాదించారు. వీరందరూ తమ అసలు పేర్లు బయటికి రాకుండా ఉండేందుకు గాను మారు పేర్లను పెట్టుకున్నారు. పిల్లలు లేని మెహ్తాబ్ కన్వర్‌బాయి చాందాను పెంచి పెద్ద చేయడమే గాకుండా విద్యాబుద్ధులు కూడా చెప్పించింది. ఆమె ప్రోద్బలం, ప్రోత్సాహం మేరకు చాందా సంగీతాన్ని, నృత్యాన్ని నేర్చుకుంది. స్వయంగా అత్యంత ప్రతిభావంతురాలు కావడంతో ఆమె సాహిత్యంలో కూడా తనకంటూ ఒక స్థానాన్ని ఏర్పర్చుకుంది.



www.etelangana.org

అందం, అభినయం, ప్రతిభ కలగలిసిన చాందాబీబి 1782 లో తన 15వ యేట నిజాం అలీఖాన్ ఎదుట ప్రదర్శనలిచ్చింది. నిజాం అలీఖాన్ తో పాటుగా కొలాస్ యుద్ధంలో పాల్గొన్నది. ఆ యుద్ధంలో గెలుపొందిన తర్వాత నిజాం ఆమెకు "మా లిఖా" (చంద్రవదన) అనే బిరుదునిచ్చాడు. చాందాబీబి తల్లి రాజ్‌కన్వర్‌కు కూడా "మా దో అఫ్తా" (పున్నమి) అనే బిరుదు ఉండింది.

గులాం మెహ్దీ (కిన్‌ష్లీఖాన్) 1780 ఆ ప్రాంతంలో మొత్తం భారతదేశంలోనే ప్రఖ్యాతి చెందిన గాయకుల్లో ఒకరు. ఈయన స్వయంగా ఉత్తర భారతదేశానికి చెందిన సంగీత సామ్రాట్టు తాన్‌సేన్ ప్రియ శిష్యుడు. ఈ గులాం మెహ్దీ గాత్రంలో చాందాబీబికి శిక్షణ ఇచ్చాడు. రెండో అసఫ్‌జా నిజాం దగ్గర ఉద్యోగం చేసిన ప్రఖ్యాత నృత్యకారుడు 'పన్నా' నృత్యంలో మెళుకువలు నేర్పించాడు. చాందాబీబి తన గురువులను ఏనాడు విస్మరించకుండా వారి బాగోగులను జీవితాంతం చూసుకున్నది. సంగీతం, నృత్యం, గాత్రం, సాహిత్యం కలగలిసిన చాందాబీబి పేరు ప్రఖ్యాతులు హైదరాబాద్ రాజ్యంలోనే కాకుండా ఇతర ప్రాంతాల్లో కూడా బహుళ ప్రచారంలో ఉండేవి. పూణె గవర్నర్, అక్కడి ఉన్నతోద్యోగులు మా లిఖాభాయి చాందా నృత్యమంటే బాగా అభిమానించేవారు. మీర్ ఆలమ్, మహారాజ చందూలాల్ అందరూ ఆమె పట్ల అభిమానంగా ఉన్న వారే. చందులాల్ సోదరుడు గోవింద్ బక్ష్ (రోష్ని), రాజారావు రంభాలు చాందాబీబి గానా, బజానాలో ప్రత్యేక అతిథిగా ఉండేవాడు.

చందూలాల్ ఆమె గురించి చెప్పిన కవిత్వమే అందుకు రుజువు
"నహీ హై చైన్ బిన్ దేఖే తేరా / యే మహాలిఖా ముజ్‌కో
దర్స్‌కా మైతో ప్యాసా హు / దర్స్ అపనా దిఖా ముజ్ కో"

నిజాం ప్రభుత్వంలో నృత్యకారిణిగా ప్రవేశించిన చాందా అనతి కాలంలోనే పెద్ద పదవులను అలంకరించింది. దాదాపు ఇదే కాలంలో వెంకట నర్సి అనే ప్రఖ్యాత నృత్యకారిణి ఉండేది. అయితే చాందాబీబి రాకతో ఆమె ప్రాభవం అంతరించింది. పూణె గవర్నర్ మాధవరావు వివాహానికి చాందాబీబి ప్రత్యేకంగా హాజరై తన ప్రదర్శన నిచ్చింది. లలితకళల్లో ఆమె నిపుణతో బాటు ఉర్దూ సాహిత్యంలో కూడా ఆమె తనకంటూ స్థానాన్ని ఏర్పర్చుకుంది. ఆమె గజల్స్ విశేష ప్రాచుర్యం పొందాయి.

బాబర్ అలి లాడ్లే చాందాబీబికి ప్రతి రోజు ఉదయం ప్రార్థనల తర్వాత ఖురాన్‌ను బోధించేవాడు. కొంత సేపు ఖురాన్ విన్న తర్వాత సాయంత్ర వేళ తన జాగీరు లెక్కలు చూసుకునేది, రాత్రి ప్రార్థనల అనంతరం గానా, బజానా, నృత్యం, సంగీతం, సాహిత్యం అర్ధరాత్రి వరకూ కొనసాగేవి. చాందాబీబి ఉర్దూలో రాసిన కవితల్ని నసీరుద్దిన్ ఖుద్రత్ అనే అతను మొట్టమొదటి సారిగా సంకలనం చేశాడు. ఆమెకు శిక్షణనిచ్చి, మా లిఖాభాయి చాందా ఇద్దరు అమ్మాయిల్ని దత్తత తీసుకుంది. హుస్న్ అఫ్తాబ్‌బాయి, హుసేన్ లిఖాభాయి వారి పేర్లు. 1824 లో చాందా బీబి మరణానంతరం వారిద్దరు ఆమె ఆస్తికి వారసులయ్యారు. హైదర్‌గూడా, అడిక్‌మెట్, (బలాదుల్ జామియా), ఉప్పల్, చందాపేట్, జామె ఉస్మానియా, మౌలాలి మొదలైన ప్రాంతాలన్నీ ఒకప్పుడు చాందాబీబి జాగీరు ప్రదేశాలే.

చాందాబీబి సమాధి మౌలాలిలో ఇప్పటికీ ఉంది. ఎన్నూలో (యూనివర్సిటీ) ఆమె నిర్మించిన బావి అలాగే ఉంది. ఆమె స్మారకాల్ని కాపాడుకునేందుకు ఆమె అభిమానుల పూనిక మేరకు అమెరికా ప్రభుత్వం ఆర్థిక సహాయం చేయడానికి ముందుకు వచ్చింది. ఈ కార్యక్రమం ఇప్పుడు కొనసాగుతుంది. ఆమె పూర్తి జీవిత చరిత్ర, రచనలు తెలుగు, ఇంగ్లీషుల్లో వెలువడినట్లయితే చాందాబీబి గురించి మరిన్ని కొత్త విషయాలు వెలుగులోకి వచ్చే అవకాశముంది. ఆ పని మిత్రుడు ఏశాల శ్రీనివాస్ తదేక దీక్షతో చేస్తున్నాడు. అందుకు అయనకు అభినందనలు.

(ఈ వ్యాసానికి ముడిసరుకును అందించిన ఏశాల శ్రీనివాస్, దాన్ని ఉర్దూ నుంచి తర్జుమా చేసిన మిత్రుడు ఫార్సీ, అరబ్బీ, ఉర్దూ, ఆంగ్ల భాషల్లో అందెవేసిన చేయి అహ్మదుల్లా ఖురేషికి కృతజ్ఞతలతో)



# తుల్జాబాయీ! తుఝే సలాం!

• అబ్దుల్ రజాక్




బైంసాకి బడీ ఖాలా
తుఝే సలాం
తుల్జాబాయి.. తుఝే సలాం
పంజేషాగల్లిలో పరిమళించిన మాతృమూర్తి
తుఝే సలాం...
మతరక్కసి కోరలు పీకి
మానవత్వం చాటిన
తుల్జాబాయి.. తుఝే సలాం
పంచభూతాల సాక్షిగా
పసిడికాంతుల వెలుగులో
పంచ ప్రాణాలకు
తన ప్రాణాన్ని పణంగా పెట్టి
మానవత్వపు మల్లెపూల వనంలో
నీడనిచ్చి వెలుగు నింపిన
తుల్జాబాయి.. తుఝే సలాం!
కలిసిమెలిసిన పేదబతుకులు
అలైబలై తీసుకుంటే
వెర్రెక్కిన
మతరక్కసి మారణహోమంతో
ముందుకొస్తే తల్లడిల్లిన తుల్జాబాయి
బతుకమ్మరూపం దాల్చిన తుల్జాబాయి
బతుకుబరోసా ఇచ్చిన తల్లీ!
మా.. తుఝే సలాం
వందే మాతరం వందే మాతరం
పంజేషగల్లికో మా వందనం
తుల్జాబాయికో మా వందనం...

*(10-10-2008న బైంసా ఘర్షణల్లో మంటల్లో చిక్కుకున్న ఐదుగురు కుటుంబ సభ్యుల్ని కాపాడిన తుల్జాబాయికి..)*



www.etelangana.org



# ముస్లింలకు తెలంగాణ కావాల్సిందే

● ఖాజా

తెలంగాణ రాష్ట్ర సాధన 90 శాతం తెలంగాణ ప్రజల డిమాండు. భౌగోళికంగా పది జిల్లాలలో విస్తరించి ఉన్న తెలంగాణలో వివిధ సామాజిక సమూహాల మధ్య అనేక అంతరాలున్నాయి. వీటిలో ముస్లిం సామాజిక సమూహాన్ని ప్రత్యేకంగా చూడాల్సిన అవసరం ఉంది. హైదరాబాద్ సంస్థానం ముస్లింల ఏలుబడిలో ఉన్న కారణంగా ముస్లిం సమాజమంతా అభివృద్ధి చెందిన నవాబుల సమాజమనే అపోహ ఉంది. 50 ఏళ్ళ విశాలంధ్రలో తెలంగాణ ముస్లిముల సంస్కృతి, భాష, విద్య ఘోరంగా అణచివేయబడ్డాయి. ఫలితంగా ముస్లిం సమాజం మిగతా అన్ని వర్గాల కంటే ఎన్నో రెట్లు నష్టపోయింది. ఒంటరి సమూహంగా తనలోకి తాను ముడుచుకుపోయి నిరంతర అభద్రతలోకి జారిపోయింది. అమెరికన్, హిందూ సామ్రాజ్యవాదాల ముస్లిం వ్యతిరేక ప్రచారంతో తెలంగాణ ముస్లింలను అభివృద్ధికి మరింత దూరం చేస్తున్నాయి. ఇటువంటి చారిత్రక పరిస్థితుల్లో తెలంగాణాలోని పట్టణ, గ్రామీణ ప్రాంతాల ముస్లింలు ప్రత్యేక తెలంగాణా రాష్ట్రాన్ని కోరుకుంటున్నారు. తెలంగాణ రాష్ట్ర సాధన ద్వారానే తమ అభివృద్ధి, భవిష్యత్తు ముడిపడి ఉందని నమ్ముతున్నారు.

ప్రత్యేక తెలంగాణ కోసం నడుం బిగించిన తెరాస వైఖరి కూడా ముస్లిములను కలుపుకు పోయే విషయంలో అనుకూలంగా ఉన్నట్లు కనిపించడం లేదు. తెరాస భౌగోళిక తెలంగాణను కోరుతుందే తప్ప సామాజిక న్యాయం, సెక్యులర్ కార్యాచరణలు తెరాసలో నామమాత్రమేనని దాని ఆచరణ స్పష్టం చేస్తుంది. స్వయంగా చంద్రశేఖర్ రావు చేస్తున్న యజ్ఞాలు చండీ యాగాలు కూడా వీటికి తోడవడంతో తెరాస లౌకిక భావన లేని పార్టీగా కనిపిస్తుంది. వీటితో పాటు బిజెపి తెలంగాణ



ఉద్యమంలో ఉండడం, అవసరమైతే ప్రత్యేక తెలంగాణ కోసం బిజెపి సహకారాన్ని తీసుకుంటామని ఆ మధ్య తెరాస ప్రకటించడం ముస్లిములకు ఆందోళన కలిగించే విషయం. ఇక్కడ హిందువులైన వారు తెలంగాణకు నాయకత్వం వహించడం పట్ల ముస్లింలకు అభ్యంతరం లేదు కాని వారు హిందూత్వ ఎజండాను రహస్యంగా, బహిరంగంగా కలిగి ఉన్నవారిని ఏ షరతులు లేకుండా కలుపుకుపోవడం మాత్రం ముస్లిములకు, తమ జీవితానుభవం నించి తీవ్రమైన అభ్యంతరకరమైనదవుతుంది. తెలంగాణ ఉద్యమంలో హిందూ మతతత్వ శక్తులు అగ్రగామిగా ఉండటం ముస్లిముల కోణం నుండి చూస్తే ఉద్యమానికి పెద్ద పరిమితి అవుతుంది. ఈ రీత్యా చూసినపుడు ప్రత్యేక తెలంగాణ ఉద్యమం మొత్తం తెలంగాణ లోని 40 లక్షల మంది ముస్లింల తమ జీవితానుభవం నించి చూస్తే ఉద్యమానికి పెద్ద పరిమితి అవుతుంది. ఈ వాస్తవాన్ని సాకుగా చూపి మజ్లిస్ తన తెలంగాణా వ్యతిరేక వాదాన్ని బలపరుచుకుంటున్నదనిపిస్తుంది. ఈ రీత్యా చూసినపుడు ప్రత్యేక తెలంగాణ ఉద్యమం మొత్తం తెలంగాణ లోని 40 లక్షల మంది ముస్లింల ప్రాతినిధ్యం భాగస్వామ్యంతో సమగ్రమయ్యే కార్యాచరణను రూపొందించుకోవటమెలాగో ఉద్యమ శక్తులు, మేధావులు ఇప్పటికైనా ఆలోచన మొదలు పెట్టాల్సివుంది.

ఇప్పటి వరకు తెరాసలో ముస్లింల నాయకత్వం నామ మాత్రంగా కూడా లేదు. తెరాస నుండి లోక్‌సభకు, అసెంబ్లీకి ఎన్నికైన నాయకుల్లో ముస్లింల ప్రాతినిధ్యం సున్న, కాగా గత లోక్‌సభ, అసెంబ్లీ ఎన్నికల్లో తెరాస పోటీకి నిలిపిన ముస్లిముల సంఖ్య అత్యల్పం. ఇప్పటికైనా తెలంగాణావాదులు ప్రత్యేక తెలంగాణ రాష్ట్రం సెక్యులర్ రాష్ట్రంగా వుంటుందని, ముస్లింలకు తగిన ప్రాతినిధ్యం, అవకాశాలూ కల్పించబడతాయని స్పష్టమైన హామీ వుండే విధంగా దాని కార్యాచరణ రూపొందించాల్సి వుంది.

ఇక కాంగ్రెస్, తెలుగు దేశం, సిపియం వంటి పార్టీలకు చెందిన ముస్లిం నాయకులు తెలంగాణా విషయంలో పార్టీలు తీసుకున్న నిర్ణయాల మేరకే మాట్లాడుతున్నారు తప్ప, నిజంగా తెలంగాణ ముస్లింల మనోభావాలకు అద్దంపట్టే విధంగా మాట్లాడుతున్నట్లు అనిపించడం లేదు. ముస్లింల పక్షాన వీళ్ళు వెలువరించే ప్రకటనలన్నీ ఆయా పార్టీల సిద్ధాంతాలనో లేదా ఉన్నత వర్గ నగర ముస్లింల ప్రయోజనాలనో కాపాడటానికి చేస్తున్నవే తప్ప ఇవి ఎంత మాత్రం తెలంగాణా గ్రామీణ, పట్టణ ముస్లింలకు సంబంధించినవి కావనేది స్పష్టం.

ఇప్పటికైనా తెలంగాణ వాదులు, తెరాస నాయకులు ముస్లిముల నమ్మకాలకు, ప్రాతినిధ్యానికి విలువనివ్వడం వలన ఉద్యమం మరింత బలోపేతం అవుతుంది. అదే విధంగా మజ్లిస్ తెలంగాణ ముస్లిములు ఏం కావాలని కోరుకుంటున్నారో తెలుసుకుని నిర్ణయాలను ప్రకటించడం మంచిది.

తెలంగాణ రాష్ట్ర సాధన ఉద్యమం నేడు మరింతగా ముందుకొస్తున్న చారిత్రక సందర్భంలో కేవలం భౌగోళిక ఎంజెండాతే పరిమితం కాకుండా, తెలంగాణ ప్రజలందరినీ ముఖ్యంగా ముస్లిములను భాగస్వాములను చేసే విధంగా, సామాజిక న్యాయం, సెక్యులర్ అవగాహనలతో కూడిన ప్రణాళికా బద్ధమైన కార్యాచరణ చేపట్టాల్సి వుంది. దీనికి తెలంగాణలోని సామాజిక న్యాయ, తెలంగాణ ఉద్యమ శక్తులు, మేధావులు భూమికను రూపొందించడం ఒక చారిత్రక అవసరం. ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర ఉద్యమాన్ని మరింత బలోపేతం చేయడానికి తెలంగాణలోని ముస్లిములు కోరుకుంటున్నది ఇదే. ■



www.etelangana.org

# ద రివైండ్ - యాదికొస్తున్నయ్!

● రత్నశ్రీ




చెట్టు మీదనే పండిన చింతపలక్కాయల్ని
చితికిపోకుండా పైలంగ తెంపి
ఒరం గట్టుమీద కూసొని
ఒక్కొక్క గింజ ఒలుసుక తిన్న జ్ఞాపకం
ఇప్పటికీ నా నాల్కెకు
తియ్యగ సప్పగ తాకుతనే ఉంటది

పగటీల...
చిక్కటి పెరుగ్గలిపిన పజ్జొన్న గట్క జుర్రుకుంట
మజ్జె మజ్జెలో ఉల్లిపాయ పచ్చిమిరగ్గాయ
కర్రకర్ర నముల్తాంటె
కంట్లె నీల్లు తిరిగిన అనుభూతి
యాదికొచ్చినప్పుడల్లా
నాకు పొరబోతాంటది

అప్పుడే దుస్సిన శనిక్కాయల్ని
ఒరిగడ్డికింద కాల్చి
అపురాపురని తింటాంటె
పంటికి పరుక్కున తాకిన మట్టిపెల్ల

ఇంకా నా మతిల్నే ఉంది
జజజ
పొద్దుగుంకంగనె
నాయన వాడిక కల్లు తేవడానికి
సైకిల్‌కి లొట్టి కట్టుకుని
కాంచి తొక్కుకుంట
యాదయ్య మావ చెట్ల కాడికి పోతే
పోరడు లావటోడె అని సంబురపడి
మావ పోసిన వడకల్లు గురుతొచ్చినప్పుడల్లా
కడుపుల తియ్యటి పుల్లటి బేగులు వస్తనే ఉంటయ్
జజజ
పీరీల పండుగనాడు
పిల్లపీరి మదార్‌గాడు ఎత్తుకుని
తల్లిపీరి నేనెత్తుకుని
మాన్కోట్ బీస్కోట్ అనుకుంట
కుడుక దండలతో బరువెక్కిపోయిన పీరీల్ని
మోసుకుంట తిరిగిన రోజులు
యాదికొచ్చినప్పుడల్లా
అస్సై దూలా పాటలు
చెవుల్లో రింగుమంటయి ■






## హైదరాబాద్ దురాక్రమణతో

# ముస్లింల అస్తిత్వానికి ఎసరు

● జిలుకర శ్రీనివాస్

హైదరాబాదు రాజ్య దురాక్రమణ జరిగిన నాటినుండే తెలంగాణ స్వతంత్రం, స్వాభిమానం, ప్రగతి కోల్పోయింది. ముస్లిం ప్రజలు కూడా ఇవన్నీ కోల్పోయారు. తెలంగాణ పోరాటం ఉధృతమైన ఈ నేపథ్యంలో ముస్లిం ప్రజలు అనేక విధాల ఆలోచిస్తున్నారు. తెలంగాణ స్వతంత్ర రాజ్యంగా బ్రిటీష్ సామ్రాజ్యంలో విలసిల్లిన నాటి వైభవం నేడు లేదు. ముస్లింలు అనుభవించిన హక్కులు, అధికారాలు అన్నీ పోయాయి. తెలంగాణాతోపాటే ముస్లిం కూడా ఈ దేశంలోని బ్రాహ్మణ పాలకులకు, తెలంగాణ రాష్ట్రాన్ని ఆక్రమించుకున్న ఆంధ్ర పాలకులకు బానిసలయ్యారు. అవును. తెలంగాణ నేడు ఒక బానిస. అందులో ముస్లింలు అందరితో పాటు బానిసలు. ఒక నాటి పాలక ప్రజలు పరాజితులై బానిసలు కావడమే చరిత్ర తిరోగమనానికి నిదర్శనం.

తెలంగాణ ఉద్యమ నేపథ్యంలో 17 సెప్టెంబర్ గురించి చర్చ జరిగింది. తెలంగాణకు స్వతంత్రం 17, సెప్టెంబర్ నాడు వచ్చింది. కాబట్టి ప్రభుత్వమే అధికారికంగా ఉత్సవాలు నిర్వహించాలని టీఆర్ఎస్, బీజేపీ, సీపీఐ వాదించాయి. కందిమల్ల ప్రతాపరెడ్డి నిజాంను విమర్శిస్తూ విమోచన దినం ప్రభుత్వమే అధికారికంగా జరపాలని డిమాండ్ చేస్తూ ఒక వ్యాసం ప్రచురించారు. విమోచన దినంగా టీఆర్ఎస్, బీజేపీ పార్టీలు జరుపుకోగా సీపీఎం మాత్రం తెలంగాణ సాయుధ పోరాట అనుభవాలను స్మరించుకునే ఒక సందర్భంగా భావించింది. అంబేద్కర్ దృక్పథంతో పని చేస్తున్న అంబేద్కర్ విద్యార్థి సమాఖ్య, తెలంగాణ మూలవాసీ జాక్ వంటి సంస్థలు తెలంగాణ దురాక్రమణ జరిగిన దినంగా నిరసన కార్యక్రమాలు జరిపాయి. దురాక్రమణ దినం జరిపినందుకు బ్రాహ్మణ మనువాదులైన బీజేపీ, దాని అనుబంధ సంస్థల నాయకులు అంబేద్కర్ విద్యార్థి సమాఖ్య నాయకుల మీద భౌతిక దాడులకు పాల్పడ్డారు. కొన్ని వామపక్ష భావజాలం వున్న సంస్థలు విద్రోహ దినంగా జరుపుకొన్నారు. కంచె అయిలయ్య, బెల్లయ్య నాయక్ వంటి కొంత మంది సాధారణమైన దినంగా పరిగణించాలనీ, ఎలాంటి ప్రాధాన్యం ఈ తేదీకి ఇవ్వరాదనీ పిలుపునిచ్చారు. ఈ మొత్తం వ్యవహారంలో ముస్లింలు తటస్థ వైఖరి తీసుకున్నారు. తెలంగాణ దురాక్రమణ గురించి జరిగే చర్చను వారు ఆహ్వానించారు. తెలంగాణ రాష్ట్రం కొరకు తీవ్రంగా కృషి చేస్తున్న నాయకత్వానికి 17 సెప్టెంబర్, 1948 సంఘటనను ఏ విధంగా అర్థం చేసుకోవాలనే విషయంలో అస్పష్టత ఉంది.



www.etelangana.org

పాకిస్తాన్ విభజనకు హైదరాబాద్ రాజ్యం దురాక్రమణ జరగడానికి సంబంధం ఉంది. నిజాం రాజ్యం ఆక్రమణకు ఆంధ్ర ఆధిపత్య దురాక్రమణకు సంబంధం ఉంది. ఈ రెండింటిని అర్థం చేసుకుంటే తెలంగాణ ప్రజలకు ఏది విమోచనో, విముక్తో బోధపడుతుంది. హైదరాబాద్ రాజ్యం సువిశాలమైంది. ఉత్తర భారతానికి, దక్షిణ భారతానికి మధ్య వారధిగా హైదరాబాద్ రాజ్యం ఉండేది. అది ప్రపంచంలోని అనేక దేశాల కన్న విశాలమైంది. అభివృద్ధి, నాగరికత, విలువ పరంగా బ్రిటీష్ సామ్రాజ్యానికి ధీటుగా వున్న దేశం హైదరాబాద్ రాజ్యం. బ్రిటీష్ సామ్రాజ్యానికి కొన్న ప్రాంతాలను దానం చేసి స్వతంత్ర రాజ్యంగానే అది చివరి వరకూ కొనసాగింది. బ్రిటీషు ప్రభుత్వం చేసే చట్టాలు, తీర్పులు హైదరాబాద్ రాజ్యానికి వర్తించేవి కావు. శాసన వ్యవస్థ, న్యాయ వ్యవస్థ, కార్యనిర్వాహక వ్యవస్థ, సమాచార వ్యవస్థ అనేవి ఎవరి ఆధీనంలో ఉంటే వారిదే రాజ్యం. ఆ ప్రకారంగా హైదరాబాద్ రాజ్యం అన్ని వ్యవస్థలను తన ఆధీనంలోనే ఉంచుకుంది. బ్రిటీషు ఇండియా రాయబారి సైతం నిజాం రాజ్యంలో ఉండేవాడు. పాలన విషయంలో సూచనలిచ్చే అధికారమే తప్ప నిర్ణయించే అధికారం లేదు. ఈ స్వతంత్రం నిలుపుకోవడానికే బ్రిటీషు వారికి కప్పం చెల్లించేవాడు.

ఈ దేశంలోని బ్రాహ్మణ రాజకీయ వ్యవస్థ ఆది నుండి ముస్లింలకు, అణగారిన వర్గాలకు వ్యతిరేకంగా వ్యవహరించింది. వలస పాలన కాలంలోని రాజకీయ చరిత్ర అందుకు నిదర్శనం. మెజార్టీ ప్రజలైన పీడిత కులాల మీద ఆధిపత్యం చెలాయించడానికి బ్రాహ్మణులు వలస పూర్వ కాలంలో మాదిరిగానే వలస పాలనలోనూ కుయుక్తులు పన్నారు. 1848లో మహాత్మ జ్యోతిరావు పూలే తొలి సారి విప్లవ కార్యక్రమం ప్రారంభించారు. విద్య పరివ్యాప్తం చేయడం ద్వారా బహుజనులను సమీకరించారు. 1873లో ఆయన నాయకత్వంలో సత్యశోధక్ సమాజ్ ఏర్పాటయ్యింది. దీనిలో మాతంగ్, మహర్, చమర్, భంగీ, కుంభీ వంటి బహుజనులతో పాటు ముస్లింలు, సిక్కులు, క్రైస్తవులు, జైనులు, బుద్ధిస్టులు క్రియాశీలంగా పని చేశారు. బ్రాహ్మణులే మూలవాసీ బహుజనులకు ప్రథమ శత్రువులని మహాత్మ జ్యోతిరావ్ పూలే ప్రకటించారు. బ్రిటీషు సహకారంతో బ్రాహ్మణుల నుండి విముక్తి సాధించాలని ఆయన పిలుపునిచ్చారు. మహారాష్ట్ర కేంద్రంగా ఆయన సాగించిన ఉద్యమం 1860 నాటికి దేశ వ్యాప్తంగా మూలవాసీ ఉద్యమాలకి మూలమైంది. ఈ రాజకీయ చైతన్యాన్ని అణచివేయడానికి 1875లో ఆర్య సమాజం, 1885లో కాంగ్రెస్ పార్టీలు ఏర్పాటయ్యాయి. బ్రాహ్మణ రాజ్య నిర్మాణమే ఈ సంస్థల ఆశయం. మూలవాసీ రాజ్యం నిర్మాణ ఆశయానికి ఈ సంస్థలు వ్యతిరేకం. మహాత్మ జ్యోతిరావు పూలే ఉద్యమాన్ని ఎదుర్కోవడానికి ఈ రెండు సంస్థలు చివరి వరకూ కృషి చేశాయి.

బ్రిటీషు పాలనలో అన్ని అధికారాలు, హక్కులు, అవకాశాలు బ్రాహ్మణులు మాత్రమే అనుభవిస్తున్నారని మహాత్మ జ్యోతిరావు పూలే విమర్శించారు. అన్నింటిలో జనాభా ప్రాతిపదికన ప్రాతినిధ్యం కల్పించాలని ఆయన డిమాండ్ చేశారు. బ్రిటీషు ప్రభుత్వం విద్య, ఉద్యోగం, చట్ట సభల్లో తొలిసారిగా ముస్లింలకు 1892లో ప్రాతినిధ్యం కల్పించింది. కాంగ్రెస్ పార్టీ బ్రాహ్మణులకు ప్రాతినిధ్యం కల్పించాలని పోరాటం చేసింది. బాలగంగాధర్ తిలక్ స్వరాజ్య నినాదం బ్రాహ్మణులకు బ్రిటీష్ ప్రభుత్వంలో వాటా కావాలని మాత్రమే. 1916 నుండి ఆయన నడిపిన స్వరాజ్య ఉద్యమ లక్ష్యం బ్రిటీష్ వారిని ఈ దేశం నుండి తరిమేయడం కాదు. బ్రిటీషు పాలనలోని చట్ట సభలు, కార్యనిర్వాహక, న్యాయ వ్యవస్థలో బ్రాహ్మణులకు ప్రాతినిధ్యం కల్పించాలని ఆయన డిమాండ్ చేశారు. స్వరాజ్యం నా జన్మహక్కు అంటే బ్రిటీషు పాలనలో బ్రాహ్మణులకు వాటా జన్మతా సిద్ధించేది అని అర్థం. తిలక్ కోరిన స్వరాజ్యంలో బ్రాహ్మణేతరులకు స్థానం లేదు. నూనె పిండుకునే వారికి, బట్టలుతుక్కునే వారికి, మట్టి పిసుక్కునే వారికి, కుంబీ కులస్తులకు చట్ట సభల్లో పనేమిటని తిలక్ ఎద్దేవా చేశాడు. చట్ట సబలు



పొలాలు అనుకుంటున్నారా, నాగలి దున్నడానికి అని హేళన చేశాడు. అందువల్ల స్వరాజ్యం అంటే బ్రాహ్మణ రాజ్యమని ఆయన భావన. ఇదే భావనను గాంధీ నాయకత్వంలో జరిగిన కాంగ్రెస్ పార్టీ చివరికంటూ కొనసాగించింది. తిలక్ మరణం తర్వాత రాజకీయ అరంగేట్రం చేసిన గాంధీ బ్రాహ్మణ ధర్మం పట్ల అచంచల విశ్వాసం ప్రకటించాడు. సనాతన ధర్మ పరిరక్షణకు కట్టుబడిన గాంధీ అణగారిన వర్గాలకు వ్యతిరేకంగా అనేక రాజకీయ కుట్ర పన్నాడు. గాంధీ కోరిన స్వరాజ్యంలో బ్రాహ్మణ వర్గాలకు అపరిమిత అధికారాలు ఉంటాయి. అందరూ అనుకుంటున్నట్టు గాంధీ సంపూర్ణ స్వతంత్రం ఏనాడూ కోరలేదు. ముస్లింలు మాత్రమే మొదటి నుండి సంపూర్ణ స్వతంత్రం కోరుతూ వచాఃఉచరు. ఈ దేశాన్ని బ్రాహ్మణ రాజ్యంగా నిర్మించాలనే ఆశయం ఉంది. కాంగ్రెస్ పార్టీ అన్ని రకాలుగా బ్రాహ్మణ వర్గాల ప్రయోజనాలు కాపాడేందుకు ఉపయుక్తమయ్యే ఒక సాధనంగా ఆయన తీర్చిదిద్దారు. 'బాధ్యతాయుతమైన ప్రభుత్వం' బ్రిటీష్ ఇండియాలో ఏర్పాటు చేసేందుకు చట్ట సభల్లో మతాల వారి ప్రాతినిధ్యం ఇవ్వడానికి బ్రిటన్ పార్లమెంట్ ప్రకటించింది. కాంగ్రెస్ పార్టీ దాన్ని ఆహ్వానించింది. అయితే, ముస్లింలకు ప్రత్యేక నియోజక వర్గాలను ఇవ్వడం పట్ల విముఖత ఉన్నప్పటికీ రాజకీయ ప్రయోజనాల కొరకు అంగీకరించింది. ప్రత్యేక నియోజక వర్గాల వల్ల ముస్లింలు అత్యధికంగా వున్న బెంగాల్, సింధు, బెలుచిస్తాన్, పంజాబ్ వంటి ప్రాంతాల్లో బ్రాహ్మణుల కన్నా ఎక్కువ ముస్లింలు గెలిచే వారు. ముస్లిం లీగ్ అనేక రాష్ట్రాలలో ప్రభుత్వం ఏర్పాటు చేసింది.

ముస్లింలు అత్యధికంగా వున్న ప్రాంతాలకు ప్రత్యేక రాష్ట్రాలుగా ఏర్పాటు చేయాలని 1928లో మోతిలాల్ నెహ్రూ ప్రకటించిన నివేదికలో ఉంది. కాంగ్రెస్ పార్టీ నెహ్రూ ప్రతిపాదనను సమర్థించింది. 1938లో జవహర్‌లాల్ నెహ్రూ ముస్లిం రాష్ట్రాలను కలిపి పాకిస్తాన్ ఏర్పాటు చేసేందుకు సంసిద్ధతను వ్యక్తం చేశారు. ముస్లింలకు వున్న ప్రత్యేక నియోజక వర్గాలను వదులుకుంటేనే పాకిస్తాన్ ఏర్పాటుకు కాంగ్రెస్ అంగీకరిస్తుందని అలీ జిన్నాకు రాసిన లేఖలో పేర్కొన్నాడు. గాంధీ అణగారిన వర్గాలకు ప్రత్యేక నియోజక వర్గాలు ప్రకటించిన బ్రిటీష్ ప్రభుత్వాన్ని నిందించాడు. 1932లో ఆయన ఆమరణ నిరాహార దీక్ష చేశారు. ఆ సందర్భంగా కాంగ్రెస్ పార్టీ జాతీయ అధ్యక్షుడి స్థానంలో అస్పృశ్యులలో అత్యంత వెనుకబడిన భంగీ కులస్తుడిని కూర్చుండబెడుతానని ప్రకటించాడు. బాబాసాహెబ్ అంబేద్కర్ ఆ మాటలను ఏనాడూ విశ్వసించలేదు. శూద్రుడైన వల్లభాయి పటేల్‌ను జీవితంలో ఏనాడూ కాంగ్రెస్ పార్టీ అధ్యక్షుడిగా నియమించలేదు. సుభాష్ చంద్రబోస్‌ను కాంగ్రెస్ పార్టీ జాతీయ అధ్యక్ష పదవికి రాజీనామా చేసేలా వేధించిన ఘనత గాంధీది. బ్రాహ్మణ రాజ్య నిర్మాణానికి ముస్లిం ఆధిక్య ప్రాంతాలు అడ్డుగా ఉన్నాయి. వాటిని వదిలించుకోవడానికి గాంధీతో పాటు ఇతర బ్రాహ్మణ నాయకులు సిద్ధంగా ఉన్నారు.

1942లో క్రిప్స్ ప్రతిపాదనలు వచ్చాయి. అధికార బదలాయింపు అంశం ముందుకు వచ్చింది. బ్రిటీషు ఇండియాలోని ప్రజలకు నూతన రాజ్యాంగ నిర్మాణం అనేది వీటిలో ముఖ్యమైంది. నూతన రాజ్యాంగాన్ని అంగీకరించలేని సంస్థానాలు, రాజ్యాలకు స్వేచ్ఛగా ఉండే హక్కును కూడా ఈ ప్రతిపాదనలు గుర్తించాయి. నిజాం రాజు క్రిప్స్‌ను కలిసి తాను స్వతంత్ర రాజును అని, నూతన రాజ్యాంగ పరిధిలోకి తన రాజ్యం రాలేదని స్పష్టం చేశాడు. క్రిప్స్ ప్రతిపాదనలు బ్రాహ్మణులకు అనుకూలంగా ఉన్నాయని వాటిని అంగీకరించేది లేదని డాక్టర్ అంబేద్కర్ స్పష్టం చేశాడు. వాటిని వీలైనంత మేరకు ప్రతిఘటిస్తామన్నాడు. అధికారంలో అణగారిన వర్గాల వాటా తేల్చాలనీ, నూతన రాజ్యాంగ నిర్మాణంలో అణగారిన వర్గాకు జనాభా ప్రాతిపదికన ప్రాతినిధ్యం కల్పించాలని కోరాడు. కాంగ్రెస్ అంబేద్కర్ వాదనలను తిరస్కరించింది. స్వతంత్ర పోరాటం చేస్తామని అంబేద్కర్ ప్రకటించగానే గాంధీ క్విట్ ఇండియా నినాదం ఇచ్చాడు.



www.etelangana.org

రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత మౌంట బాటన్ గవర్నర్ జనరల్‌గా వచ్చారు. స్వతంత్రం ఇస్తే అధికారం బ్రాహ్మణులకు ఇవ్వడానికి అంగీకరిస్తే పాకిస్తాన్ ఏర్పాటుకు ఒప్పుకొంటాసని మౌంట్‌బాటన్‌తో గాంధీ ఒప్పందం కుదుర్చుకున్నాడు. బ్రాహ్మణ రాజ్య నిర్మాణం కొరకు పాకిస్తాన్ విభజనకు గాంధీ అంగీకరించాడు. కాంగ్రెస్ పార్టీ వర్కింగ్ కమిటీలో స్వయంగా గాంధీజీ పాకిస్తాన్ ఏర్పాటు కొరకు తీర్మానం ప్రవేశపెట్టాడు. అధికారం బ్రాహ్మణులకు అప్పగిస్తూ స్వతంత్ర ప్రకటన వెలువడింది. రాజ్యాంగ నిర్మాణ చర్చలు కాన్‌స్టూయెంట్ అసెంబ్లీలో జరుగుతున్న రోజుల్లోనే విభజన ప్రకటన వెలువడింది. అప్పటి వరకు మైనార్టీలకు బ్రిటీష రాజ్యంలో వున్న హక్కులు ఉండాలా వద్దా? అనే చర్చ జరిగింది. కాని, పాకిస్తాన్ విభజన తర్వాత ముస్లింలు, సిక్కులు, పార్శీలు, క్రిష్టియన్లకు వున్న ప్రత్యేక నియోజకవర్గాలు రాజ్యాంగ సభ రద్దు చేసింది. 27, 28 ఆగస్టు తేదీలలో జరిగిన చర్చల్లో ప్రత్యేక నియోజక వర్గాలను రద్దు చేస్తూ సభ తీర్మానం చేసింది. అప్పటి వరకు విద్య, ఉద్యోగ, రాజకీయ రంగాలలో ముస్లింలు, క్రిష్టియన్లు అనుభవించిన చట్టబద్ధమైన ప్రాతినిధ్యం కాలరాయబడి సంపూర్ణంగా బ్రాహ్మణులకు అధికారం లభించింది.

బ్రిటీష్ ఇండియా బ్రాహ్మణుల హస్తగతమైంది. కాని హైదరాబాద్ రాజ్యం, కాశ్మీర్, జునాగడ్‌లు మాత్రం స్వతంత్రంగా ఉన్నాయి. వీటిని ఆక్రమించుకోకుండా బ్రాహ్మణ రాజ్యం నిర్మాణం చేయడం వీలు కాదు. అందుకే ముస్లిం పాలనలో వున్న హైదరాబాద్ మీద దండెత్తి వచ్చిన బ్రాహ్మణ సైన్యం 17సెప్టెంబర్ ఆక్రమణకు పాల్పడింది. పాకిస్తాన్ విభజన జరక్కపోతే దురాక్రమణ జరిగేది కాదు. పాకిస్తాన్ కలిసి ఉంటే చట్టబద్ధంగా ప్రజాస్వామ్య ప్రక్రియ ద్వారా బ్రాహ్మణులు అధికారంలోకి రాలేరు. హైదరాబాద్ స్వతంత్ర రాజ్యంగానే విలసిల్లే అవకాశం ఉండేది. హైదరాబాద్ దురాక్రమణ జరిగిన తర్వాత బ్రాహ్మణీకరణ క్రమం హింసా రూపం తీసుకుంది. 1946లో బీఎస్ వెంకట్రావు, శ్యాంసుందర్ వంటి అణగారిన నాయకుల పిలుపుతో ముస్లింలుగా మారిన మాదిగ, మాల, సూదరి కులాల ప్రజలను ఊచకోత కోశారు. సుందర్‌లాల్ కమిషన్ రెండు లక్షల మందిని భారత సైన్యం ఊచకోత కోసిందని నిర్ధారించింది. వారంతా మతం మారిన మూలవాసీ ప్రజలే. వెలమ, రెడ్డి భూస్వాములకు వ్యతిరేకంగా ఆయుధం పట్టిన బహుజనులను కమ్యూనిస్టుల పేరుతో హతమార్చిన బ్రాహ్మణ పాలకులు బ్రాహ్మణ రాజ్యాన్ని నిర్మించారు. ఆంధ్ర, తెలంగాణ ప్రాంతాలకు బ్రాహ్మణులే ముఖ్యమంత్రులయ్యారు. ఇద్దరు బ్రాహ్మణ ముఖ్యమంత్రుల ఒప్పందంతో తెలంగాణ ఆంధ్ర దురాక్రమణకు గురైంది. తెలంగాణ అన్ని రకాలుగా అన్యాయం పాలుకావడానికి కేంద్రంలోని బ్రాహ్మణులు, రాష్ట్రంలో కార్యనిర్వాహక, న్యాయ, సమాచార వ్యవస్థలను ఆక్రమించుకున్న బ్రాహ్మణులే కారణం. తెలంగాణ రాకుండా కేంద్రంలో కుయుక్తులు పన్నుతుంది కూడా వారే. చివరికి తెలంగాణ ఏర్పాటు చేయాలో వద్దో నిర్ణయించే కమిషన్ కూడా వారిదే. అందువల్ల బ్రాహ్మణులు దురాక్రమణ చేసిన రోజు 17 సెప్టెంబర్. పాలకులైన ముస్లిం, అణగారిన ప్రజలను బానిసలను చేసిన దురాక్రమణ దినం మనల్ని ఆలోచింప చేస్తుందని భయపడే విమోచన దినం అంటున్నారు. దేశ విభజన, నిజాం రాజ్య దురాక్రమణ, ఆంధ్రప్రదేశ్ అవతరణ అంతా బ్రాహ్మణవాదుల కుట్ర. ■

గమనిక:

* 'చిన్ని చిన్ని ఆశ' కథకులు దిలావర్. పొరపాటున షాజహానా పేరు పడింది.
* 'ముస్లింలకు తెలంగాణ అత్యవసరం' అనే స్కైబాబ వ్యాసం 'తెలంగాణ ముస్లిం రచయితల వేదిక' తరపున శ్రీకృష్ణ కమిటీకి సమర్పించిన పత్రం.
* 'అహమదొద్దీన్ ఆత్మతత్వాలు' రచన నీలా జంగయ్య.
* చివరి 20పేజీలు విషయసూచికలో చేరలేదు.






'జాగో..జగావో'

# అక్షరాయుధాగారం

• లోచన్

తెలంగాణ ఉద్యమం నడుస్తున్న సమయం. వరంగల్‌లో 'జాగో... జగావో' ఉద్యమ కవితా సంకలనాన్ని ఆవిష్కరించడానికి హైదరాబాద్ నుండి బయలుదేరి వరంగల్ వస్తుంటే రోడ్ల పొడవునా తెలంగాణ ఆటలే.. పాటలే..! రోడ్డే ఒక దీర్ఘ కవితలా.. పొడగాటి పాటలా.. లాంగ్ మార్చ్‌లా.. మార్చింగ్ సాంగ్‌లా.. అనిపించింది. వెంటనే ఈ సంకలనం చివర్న గార్డ్‌లా నిలుచున్న స్కైబాబ గుర్తొచ్చాడు. రోడ్డు అతడి - తెలంగాణ కవి - నాడీమండలం.. అతనికి రోడ్డు మీద నడవకుంటే రక్తచలనముండదు. గుమిగూడందే.. గుంపులో కలవందే దినం గడవదు.. రోడ్డు అతని అడ్డా - అవును, ఇప్పుడు ఈ భూమి, ఆకాశం యీ సారా జహాఁ మన అడ్డా - మన అడ్రస్.

రోడ్డే కాదు, ఏ ఊరు చూసినా ఏ వాడ విన్నా తెలంగాణనే. తెలంగాణ జనం - అందునా యువజనం. కళ్లు మూసినా, కళ్లు తెరచినా, కూచున్నా నిలుచున్నా కూడు నములుతున్నా కునికిపాట్లు పడుతున్నా తెలంగాణ కలవరింతలే. ఆ కలవరింతలే 'జాగో.. జగావో' నిండా.

ఇప్పుడు తెలంగాణ మన వాన, మన తుఫాన్.. మన ప్రాణంలో ప్రాణం.. మన అర్జెంట్ ప్రయాణం.. మన ఇంజన్.. మన ఎనర్జీ. మన అణువణువూ.. అంతరంగం. మనలో క్షణం, క్షణం కదిలే ముల్లు. జవనాశ్వం, యవ్వనం. మన ఉదయాలూ సాయంత్రాలూ.. మన టైం టేబుల్. ఈ క్షణం తెలంగాణ most vibrant, vigilant, A Must. Nothing short of 'TELANGANA' - వేరే మాటలేదు. వేరే బాట లేదు - సిర్ఫ్ తెలంగాణ. నేలా నింగీ నిండుకున్న రంగుల కల - సింగిడి, సింఫనీ దిగంతాల మీద రాసుకున్న మనం అతి త్వరలో చేరనున్న గమ్యం. కళ్లముందు కదులుతున్న నాలుగుకోట్ల ప్రజల కారవాన్ - 'జాగో.. జగావో' నిండా.

ఇందులోని కవితలు వలస పాలకుల వంచనా శిల్పంమీద విసిరిన కాగడాలు. ఈ అక్షరాల నిండా దగాపడ్డ తెలంగాణ గుండెల తడి.. గుండెల నుండి దూకే ఆవేశాల మత్తడులున్నవి. ధోకా



www.etelangana.org

తిన్న వేలాది బర్బాద్ జిందగీల కహానీలున్నవి. సలసల కాగే నెత్తుటి కన్నీళ్లున్నవి. అగ్గి ఉన్నది. ఆగ్రహమున్నది. తగిల్తే పేలిపోయే యువకుల కోపాలున్నవి. ఇందులోనివన్నీ ప్రతి కవీ గాయకుని గుండె గాయాల నుండీ, చిట్లిన నరాల నుండి ప్రవహించిన రక్తాక్షరాలే. అందుకే ఈ పుస్తకమే మీతో మాట్లాడుతుంది. మీతో ఆడుతుంది. పాడుతుంది. చిందులేస్తుంది. చిరుతలు మోగిస్తుంది. బాగోత మాడుతుంది. బతుకమ్మై పాడుతుంది. కోలాట మాడుతుంది. కోటిగొంతుల నినాదమౌతుంది. మీ దారి పొడుగునా అక్షరాల అగ్గిపూలు చల్లుతుంది. అసైదులా ఆడి ఆడి ఆకాశమంతా నిండుతుంది.

ఇది కేవలం కవితల సంకలనం కాదు – most inflamable ఇది అక్షరాయుధాగారం. ఇది యుద్ధ సన్నాహం. దిక్కులు దద్దరిల్లే అక్షర విస్ఫోటనం. నాలుగుకోట్ల ప్రజల దిల్ కీ ధడ్కన్. దిగంతాలు ఎరుపెక్కిన జనాగ్రహం.

ఇందులోని కవితల్ని చదువుతుంటే ఆగిపోయిన ఆజంజాహీ మిల్లు సైరన్ మళ్లీ మోగుతుందా అనిపిస్తున్నది. నిద్రలేచిన వేలాది కార్మికులు బిలబిలా కదలిపోతూ మనతో కరచాలనం చేస్తారా అనిపిస్తున్నది. వాటికింద పచ్చని పొలాల నుండి చల్లని పరిమళాలు మళ్లీ వీస్తాయా అనిపిస్తున్నది.

ఈ పుస్తకం పేజీలు తిరగేస్తుంటే డేగలను తరిమే పావురాల రెక్కల రెపరెపలు కనిపిస్తాయి. నిద్ర పోనివ్వని నినాదాలు వినిపిస్తాయి. నిజంగానే ఈ పేజీలు తిరగేస్తుంటే అక్షరాల విద్యుత్ షాక్ తగులుతుంది. ఎక్కడిదీ విద్యుత్తు? ఆగని ఈ అనంత శక్తి?

– మోసపోయిన తెలంగాణ మట్టి నుండి మోడైన చెట్లనుండి ఎండిన చెరువుల గుండె పగుళ్ల నుండీ, నేలతల్లి ఎదలో యింకిన కన్నీటి ఏరుల నుండి, బూడిదైన బొగ్గు బతుకుల నుండి, ఖాళీ అయిన ఇళ్ల నుండి, ఊళ్ల నుండి, వాడల నుండి, దుబాయి దారుల్లో దొర్లిపడ్డ బతుకుల ధూళి నుండి, పూర్‌ఫెలోల పూరిగుడిసెల బాధామయ గాధల నుండి, నాలుగుకోట్ల ఎదల నుండి, పరాభవించబడ్డ యీ నేల ప్రతి అణువు నుండి వెలువడిన కోటి మెగావాట్ల విద్యుత్తు ఇది.. యుద్ధ గీతమిది!

118 మంది కవుల, వాగ్గేయకారుల ఈ సాముహిక గొంతుకను మనసారా ఆహ్వానించండి. ఆవాహన చేసుకోండి. గుండెలకు హత్తుకోండి. 'హైదరాబాద్ హమారా హై.. హమారా హీ రహేగా!' అంటున్న కవితలు, ఉద్యమంలో ఉర్రూతలూగించిన పాటలు, ఉద్యమ కవితలు ఎవరు రాసినా చదివిన వారికి నేనే రాశానని, నేనే పాడానని ఒక ఫీలింగ్ తెలంగాణ కోరుకునే ప్రతి పాఠకునిలో కలగజేయడమే 'జాగో.. జగావో' విజయం!

ఉద్యమంలో భాగమవుతూనే, ఉద్యమ కవిత్వం రాస్తూనే, ఉద్యమ సాహిత్య సభలు నిర్వహిస్తూనే ఉద్యమ సందర్భానికి అందేలా యింత అర్థవంతమైన ఉద్యమ కవితా సంకలనాన్ని కూర్చి మన చేతికి అందించిన ప్రధాన సంపాదకులు స్కైబాబకు, సంపాదకులు పసునూరి రవీందర్, షాజహానా, గోగు శ్యామల, అన్వర్, వేముగంటి మురళీకృష్ణ, అన్నవరం దేవేందర్‌లకు తెలంగాణాపూర్వక అభినందనలు.

*జాగో.. జగావో*
*తెలంగాణ ఉద్యమ కవిత్వం*
*వెల /- 30*
*స్కైబాబ 10-9-693, చింతల్‌బస్తీ, ఖైరతాబాద్, హైదరాబాద్-4*
skybaaba@gmail.com



# అలయ్ బలయ్

● అమ్మంగి వేణుగోపాల్




"హలో!"

"కౌన్ బాత్ కర్రే"

"అక్బర్ భాయితో మాట్లాడాలె"

"మాట్లాడుతున్నా"

"అదాబ్. నేను భాయీసాబ్, చాకూ పహిల్వాన్‌ను"

"ఆదాబ్ పహిల్వాన్, చాలా దినాలయింది"

"అవును, నువ్వు రూట్ మార్చినవుగద"

"సంగతేంది చెప్పు"

"చెప్త. అన్న షేర్‌ఖాన్ మాట్లాడ్తాడంట, నీతోటి"

"మాట్లాడుమను"

"హలో అక్బర్, సల్లపూసవైనవ్ నాలుగేండ్ల సంది"

"నేను సేఠ్ చరణ్‌దాస్ జువెలరీ షాపుల పనిచేస్తున్న షేర్‌ఖాన్ సాబ్"

"తెలిసింది. ఆ మక్కీ చూస్‌గాడిచ్చే దానికన్న నేను డబులిస్త, వచ్చెయ్"

"ఇంకా రెండేండ్ల ఒప్పందమున్నదన్నా కుదరదు"

"నేను ఒక ఫోన్ గొడ్తినంటే ఉచ్చపడతడి నీ సేఠ్‌కి"

"పరిస్థితి ముందటి లెక్క లేదన్నా, సేఠ్ కొడుకులు మంచి పొజిషన్ల ఉన్నరు."

"అవన్నీ చెప్పకు. మన మీద దాడులు జరుగుతయ్. వాటిని తిప్పిగొట్టాలంటె నీ అసుంటి గరమ్‌ఖూనున్న జవాన్‌లు కావాలె"

"నాలుగేండ్ల కింద నీవు పెట్టుమన్న చోట పెట్టిన. నలుగురు సచ్చిన్రు. ఇద్దరు మనోల్లె"



www.etelangana.org

"ఒక్కొక్కసారి అట్లయితది అక్బర్"

"మాఫ్‌కర్న షేర్‌ఖాన్‌సాబ్, నేనీ పని చెయ్యలేను"

"ఆలోచించుకో, నా దగ్గర అప్పటి ఫొటోలున్నయ్"

"నా దగ్గర గూడ సాక్షాలున్నయ్"

"బెదిరిస్తున్నవా అక్బర్"

"నీ ముంగట నేనెంత భాయిసాబ్, పిల్లలను ఇస్కూల్‌కు తీస్కపోవాలె. మల్ల మాట్లాడుత"

"పిల్లలను ఇస్కూల్‌కు పంపొద్దు, మన మదర్సాలకు పంపాలె"

"నువ్వు పంపితె నేను పంపుత"

"నాతో బరాబరి జేస్తున్నవ"

"నేను చదువుకోనందుకు ఈ గలత్ దంధాలల్ల ఇరుక్కున్న. నా పిల్లలకు ఈ నౌబత్ రావద్దు"

"మన వర్గం కోసం అమరులైతె దేవుడు సంతోషిస్తడు అక్బర్"

"గరీబోల్లమే మన వర్గం కోసం ఖుర్బానైతున్నం. మీ లీడర్ల పిల్లలు, బంధువుల పిల్లలెవరైన అయిన్రా?"

"ఎక్కువ మాట్లాడుతున్నవ్, సరే, రాత్రికి ఖబరస్తాన్ దగ్గరి రూంకు రా"

"టీవీల వస్తున్నది షేర్‌ఖాన్. ఆ రూం మీద పోలీసోల్లు దాడి చేసి నలుగుర్ని అరెస్టు చేసిన్రంట"

"అరే"

***

దర్వాజ టకటక

"ఎవరూ?"

"నేను యాదన్నా! ఈరేష్ దాదాను"

"అరే, నువ్వా తమ్మీ. శానొద్దులయింది"

"నన్ను లోపలేసిన సంగతి తెల్సు గదనే"

"తెలుసు, జేల్‌కెల్లి ఎప్పుడొచ్చినవ్"

"పద్దినాలయింది యాదన్నా!"

"ఏం సంగతి ఈరేశ్"

"ఏం లేదు, మొన్నటి సంది అవతలి వర్గమోల్లు నాఖుష్ వున్నరంట ఆల్లేమైన దాడులు చేస్తె మనం గూడ తయార్‌గ వుండాలంటున్నడు మన అన్నా పహిల్వాన్"

"సూడు తమ్మీ ఆల్లు జేసినా మనం జేసినా, సూస్తుకునెటందుకు పోలీసోల్లున్నరు, పబ్లికున్నది"

"అన్నా పహిల్వాన్ దగ్గర పైసల్ రెడీగున్నయి. ఎంతడిగితె అంతిస్తడంట యాదన్నా!"

"ఖూన్ ఖరాబా నా తోటి కాదన్నా. నువ్వు గూడ ఈ ఖతర్నాక్ దందాలకు బోకు"

"మల్లెట్ల పిల్లలు, బ్యాకలు, సంసారం"



"పనిజెస్కో. సలీం క్లాత్‌స్టోర్‌ల పనికి కుదిరినంక పిల్లలు మంచిగ ఇస్కూల్‌కు బోతున్నరు. నీ సెల్లెలు డిపార్ట్‌మెంట్ స్టోర్‌ల పనికి కుదిరింది నీకు కావాలంటె చెప్పు"

"అన్నా పహిల్వాన్ ఏమంటడో"

"సూడు ఈరేష్, అన్నా పహిల్వాన్ జేయబట్టే నువ్వు కేసుల ఇరుక్కున్నవ్. జేల్ల కటేయించినవ్. మల్ల ఆ పాముల పుట్టల యెందుకేలుబెడ్తవ్"

"పైసల్ బాగనే ఇస్తుండు యాదన్నా"

"పైసలమొకం జూడకు, పెండ్లాం పిల్లల మొకం జూడు తమ్మీ"

"మల్ల మన వర్గమోల్లకు నష్టమైతె యెట్ల?"

"యేంగాదు తమ్మీ. ఇప్పుడే ఆల్ల మనిషే ఫోన్ జేసిండు. ఆల్ల లీడర్లు ఖూన్ ఖరాబా చెయ్యమని మస్తు దబావ్ తెస్తున్నరంట. కాని ఎవ్వరు గూడ బకరాలయెటందుకు రెడీగ లేరు"

"అవును మనలెక్క గుడ్డిగ గుండంల దుంకుమంటె దుంకెటోల్లు కనిపిస్తలేరు"

"మన లీడర్లేం తక్వతిన్నరా, ఇండ్ల జాగలిప్పిస్తమని, లోన్ లిప్పిస్తమని పిల్లలకు నౌక్రీలిప్పిస్తమని ఆశ జూపిస్తున్రు. కాని యెవ్వరు యింటలేరు"

"నీకెట్ల తెలిసింది యాదన్నా?"

"పొద్దుగాలనె మన సత్యం దాదా, ప్రకాశ్ పహిల్వాన్ ఫోన్ జేసి చెప్పిన్రు"

"అవును! పాతబస్తీల చదువుకున్నోల్లు పెరిగిపోతున్నరు"

"అగో టీవీ జూడు, పక్క జిల్లా మన లీడర్లిద్దర్ని పోలీసులు అరెస్టు జేసింద్రంట"

"అరే!"

***

ఆ రాత్రి చాకూ పహిల్వాన్, ఈరేశ్ దాదా పీర్లు కూర్చునబెట్టే చబూత్రల కలుసుకున్నరు. అలయ్ బలయ్ తీసుకున్నరు. ఇరానీ హోటల్ల ఉస్మాన్ బిస్కెట్లతోటి చాయ్ తాగి ఎవరింటికి వాళ్లు వెళ్లిపోయిన్రు. హనుమాన్ వ్యాయామశాల దగ్గర యాపచెట్టుకింద అక్బర్, యాదన్న కలుసుకున్నరు. అలయ్ బలయ్ తీసుకున్నరు.

"గణపతి బొప్పా బోరియా" అన్నాడు అక్బర్.

"ఈద్ ముబారక్" అన్నాడు యాదన్న

పాతబస్తీకి చాలా దూరంలో స్టార్ హోటల్ రూంలో విదేశీ మద్యం సీసా సాక్షిగా, ఇరు వర్గాల లీడర్లు విచారంగా కూచున్నారు. షేర్‌ఖాన్ చూపుల్లో నిరాశ వుంది. అన్నా పహిల్వాన్ బట్టనెత్తిమీద చెమటలు కమ్ముకొస్తున్నయి.

"పబ్లిక్‌ల చేంజ్ వచ్చింది భాయి సాబ్"

"యెనకటి పద్ధతి లాభంలేదు"

"కొత్త చాల్ అవసరం"

"లేకుంటే మనకు లక్షలల్ల లాసుంటది"

సీసా ఖాళీ అయ్యేకొద్దీ వాళ్ల మెదళ్లు బాంబుల కర్మాగారాలుగా మారిపోసాగిన్నై.



www.etelangana.org

# మీడియాలో ముస్లింలపై వివక్ష

● ఎం.ఎం.రెహామాన్

హైదరాబాద్‌లో పుట్టిన స్వదేశీ భాష ఉర్దూ మాయమైపోతున్నది. హైదరాబాద్ సంస్థానాన్ని ఆంధ్రలో కలిపినంక మా భాష పోయింది. మా యాస పోయింది. ఏకంగా మా సంస్కృతే పోయింది. 42 శాతం ఉద్యోగాలు చేసిన మేము 2% ఉద్యోగులుగా మారిపోయినం. పూలమ్మిన చోటనే కట్టెలు అమ్ముకునే పరిస్థితి ముస్లిం మైనారిటీలది. విశాలాంధ్రలో అన్నింట్ల ఆంధ్రోళ్లదే పెత్తనం అయినట్లు మీడియా కూడా వారి ఉక్కు పిడికిళ్లలోనే. తెలంగాణోళ్ళంటే ముందే చిన్నచూపు. తెలంగాణ ముస్లిం జర్నలిస్టులంటే పురుగులకంటే హీనం.మరీ చిన్నచూపు. దమ్మున్న స్టోరీలకు, సాహసోపేతమైన స్టోరీలకు తెలంగాణ ముస్లిం జర్నలిస్టులు ముందున్నరు. ఖాకీలు దూరని కారడవులు గూగల్ మూడోకంటికి దొరకని మావోయిస్టు స్థావరాలు ప్రపంచ పటంలో కనిపించని అబూజ్‌మడ్ అడవులకు కత్తులవంతెన దాటుకొని వెడితే డేర్‌డెవిల్ ఆపరేషన్‌గా ప్రచారం. 38 సంవత్సరాల తరువాత గణపతిని చూపెడితే ప్రోమోలు. ప్రాణాన్ని పణంగా పెట్టి యుద్ధక్షేత్రాలకు వెళ్తున్నది తెలంగాణ మైనారిటీ జర్నలిస్టులే. పనికి పనికొచ్చేవాడు ఇన్‌చార్జీగా పనికిరాడు. ఎవరి ఎదుగుదల అయినా అతని ప్రతిభపై ఆధారపడిలేదు. అతను ఏ కులంలో పుట్టాడన్న దానిపైన్నే ఆధారపడి ఉంటున్నది. ఇన్‌చార్జీలుగా మాత్రం అప్పటి వరకు తెలియనివాడు, ఆ వ్యవస్థలో తోకలున్నవాడిని దొరికినవాడు పేరు చివర తీసుకొచ్చి నియమిస్తారు. ఆదినుంచి ముస్లిం మైనారిటీ జర్నలిస్టుల తెగువకు ఈ గడ్డన కొదవలేదు. నిరంకుశ పాలనకు దేశ్‌ముఖ్‌ల అగడాలకు వ్యతిరేకంగా గొంతెత్తి తన కలాన్ని, గళాన్ని వినిపించి దారుణ హత్యకు గురైన షోయబుల్లాఖాన్ పై మట్టి కప్పిందెవరు? లలితకళాతోరణానికి పేరు మారిస్తే గగ్గోలు పెడుతున్నవారు, తెలుగు నాటకమాడుతున్నవారు వందల ఏళ్ళ చరిత్ర ఉన్న హైదరాబాద్ స్వదేశీ భాషను రద్దు చేసి ఉన్న పళంగా ఉద్యోగాలు పీకేస్తే ముస్లింలెంత బాధపడి ఉంటారో గ్రహించలేరా? బీట్ రిపోర్టర్‌లు, బ్యూరో రిపోర్టర్‌లు చీఫ్‌లు అయిపోతారు. ప్లాట్‌ఫాం మారితే మూడింతల జీతాలకు చేరిపోతరు. విషయ పరిజ్ఞానం లేకున్నా ఆన్‌స్క్రీన్ పై మిడిమిడి జ్ఞానంతో వార్తలు విశ్లేషిస్తారు. ఉదాహరణకు పత్రికల్లో వచ్చిన ఓ వార్త విశ్లేషణలో వాస్తవ వార్తను వక్రీకరించిన తీరు యధాతథంగా మీ ముందుంచుతున్నాను. పాతబస్తీ ఉగ్రవాది వికారుద్దీన్ అరెస్ట్ అయినప్పుడు బెయిల్‌పై విడుదల అయ్యే అవకాశం ఉంది. ఇతన్ని ప్రభుత్వం కఠినంగా శిక్షించాలి అన్నాడు. అంటే దాని అర్థం వికారుద్దీన్‌ను ఎన్‌కౌంటర్ చేయాలన్నది అతని ఉద్దేశ్యం. ఇదే చర్చలో మరో అడుగు ముందుకు వేసిండు. మక్కా మజీద్ బ్లాస్టింగ్‌లో నిందితునిగా వికారుద్దీన్‌ను గెస్టులకు పరిచయం చేసిండు. జ్వాలాముఖి అనే గెస్టు అవును నిజమే అంతటి నేరానికి పాల్పడ్డ వికారుద్దీన్‌ను కఠినంగా శిక్షించాల్సిందే అన్నడు. నిజానికి





మక్కా మజీద్ కేసులో వికారుద్దీన్ నిందితుడు కానేకాదు. వికారుద్దీన్ నిజానికి మక్కా మసీద్ పోలీసు కాల్పుల్లో మరణించిన ముస్లింల తరుపున మాట్లాడుతున్నవాడు. ఆ ఘటనపై న్యాయ విచారణ జరపాలని డిమాండ్ చేస్తున్నవాడు. షబ్బీర్ అలి లాంటి కాంగ్రెస్ నేతలు పాతబస్తీలో ఇలాంటి వారిని విడిపిస్తున్నరని, గతంలో కూడా ఇలానే జేసింద్రన్నరు. అంటే ముస్లింలను ఎవరూ విడిపించకూడదు. వారి గురించి నిజానిజాలు మాట్లాడకూడదు. కానీ ఓ భయంకరమైన నిజం హైదరాబాద్ పోలీసులు ఛేదించింద్రు. మక్కామజీదు బ్లాస్టింగ్‌లో పాల్గొన్నది హిందూ టెర్రరిస్టులు అని తేల్చి వారిపై కేసులు నమోదు చేసి నాంపల్లి కోర్టుకు హాజరుపర్చింద్రు. ఈ విషయం సదరు యాంకర్‌కు తెలియకుండా వార్తా పత్రికల విశ్లేషణ జరుపుతున్నాడా? లేకపోతే నిజాలపై మట్టి కప్పుతున్నడా అని ఓ మైనారిటీ జర్నలిస్ట్‌గా నా రక్తం సలసల కాగింది. హక్కులనేత దివంగత బాలగోపాల్ చెప్పినట్లు మనకు తెలియకుండానే హిందూయిజం మన మెదళ్ళమీద పనిచేస్తున్నది. ఇది అక్షరాలా నిజం అనిపిస్తున్నది కదా!

మక్కా మజీదు బ్లాస్టింగ్ తరువాత వందల మంది ముస్లిం మైనారిటీ యువకులను పట్టుకెళ్లి చిత్రహింసలపాలు చేసి ఆ కుటుంబాలకు నరకం చూపెట్టింద్రు. బ్లాస్టింగ్‌కు వెనుక బిలాల్ ఉన్నడని, ఇంకెవరో ఉన్నరని పుంఖాను పుంఖాలుగా వార్తలు ప్రసారం చేసిన సీమాంధ్ర మీడియా ఒక్కరోజైనా దాని వెనుక ప్రజ్ఞాసాధ్వి బంటులున్నరని, కాషాయ టెర్రరిస్టులున్నరని ఒక్కరోజు కూడా చర్చ పెట్టలేదు. ఇది కాదా వివక్ష? ఇది కాదా మోసం? హైదరాబాద్ అంటే టెర్రరిస్టుల అడ్డా అనే పదేపదే చెప్పే మీడియా మక్కా మజీదు పేలుళ్ళకు కారణం ముస్లింలు కాదని, హైదరాబాద్ ముస్లింలది గంగా జమున కల్చరని చెప్పడానికి ముందుకు రావడం లేదు. పత్రికా స్వేచ్ఛకోసం భారతదేశంలోనే మొట్టమొదట ప్రాణత్యాగం చేసిన ఇమ్రోజ్ పత్రికా ఎడిటర్ షోయబుల్లాఖాన్ గురించి చెప్పరు. సాయుధ తెలంగాణ రైతాంగ పోరాటంలో పోరాడి నేలకొరిగిన షేక్ బందగీ గురించి ఒక్క యాంకర్ బైట్ విజువల్ కూడా ఉండదు. హైదరాబాద్ నగర శివారుల్లో సీమాంధ్ర రాబందులు చేస్తున్న కబ్జాలపై తన కలం గళమెత్తిన సాహస జర్నలిస్టు గులాం రసూల్‌ను బూటకపు ఎన్‌కౌంటర్‌లో చంపేసింద్రు.

ఇప్పుడున్న ఏ చానల్లో తెలంగాణ ముస్లిం మైనారిటీ జర్నలిస్టు ఏ ఒక్క విభాగానికి ఇన్‌చార్జీగా లేడు. ఆన్‌స్క్రీన్‌కు పనికిరాడు. ఆన్‌డ్యూటీలో దాడులు జరిగినా యాజమాన్యాలు పట్టించుకోలేదు. గతంలో ఒక టి.వి.లో ఆర్‌ఎస్‌ఎస్‌లో పనిచేసిన ఓ బ్రాహ్మణ ఇన్‌పుట్ ఎడిటర్– 'నీకు అద్భుతమైన ప్రతిభ ఉంది. ప్రతిభ ఒక్కటే ఉద్యోగానికి ప్రామాణికం కాదు. నిన్ను తీసుకోను' అంటే ఆ మైనారిటీ జర్నలిస్టు హెడ్స్ అందరిని ఏకం చేసి పంచాయితీ పెట్టి అపాయింట్‌మెంట్ తీసుకొని గెలిచి జాయిన్ కాకుండా వెళ్ళిపోయిండు. పిసిఆర్‌లో ముస్లిం జర్నలిస్టు ముఖం కనపడితే అతన్ని లైవ్‌లో తీసుకోనని ముఖంపైనే చెప్పి లైవ్‌లు కట్ చేసిన చేదు అనుభవాలెన్నో.

మరొక ముఖ్యమైన అంశం– ఈ మధ్యకాలంలో కొన్ని సీమాంధ్ర చానెల్‌లు ఉర్దూ బులిటెన్‌లను ప్రసారం చేస్తున్నాయి. ఉర్దూ జర్నలిస్ట్‌లకు ఇస్తున్న జీతంలో కూడా వివక్ష ఉన్నది. ఇతర జర్నలిస్టులకు ఇస్తున్న జీతంలో సగం జీతం కూడా వారికి ఇవ్వడం లేదు. తెలుగు విభాగంలో పనిచేసే ముస్లిం మైనారిటీ జర్నలిస్ట్‌లకు తమ జూనియర్ల కన్నా తక్కువ జీతం ఇచ్చి అవమానపరుస్తరు.

ముస్లింలు అన్నా, గిరిజనులు అన్నా సాహస సాయుధ సమూహం. ఇప్పుడు జరుగుతున్న పోరాటంలో మనం వెన్ను చూపొద్దు. డిసెంబరు మహా సంగ్రామానికి షోయబుల్లాఖాన్, షేక్ బందగి, గులాం రసూల్ వారసత్వంతో ముందుకు సాగుదాం. తెలంగాణా తెచ్చుకుందాం. తెలంగాణా వాదులు కూడా ముస్లిం మైనారిటీ జర్నలిస్టులను విశాల దృక్పథంతో కలుపుకుపోవాలి. ■



www.etelangana.org

# వీరుడా.. ఈ వెలుగంతా నీదే!

● పి.వేణుగోపాలస్వామి



అర్ధరాత్రి ఉలిక్కిపడి లేచాను
అంతరిక్షంలోకి వెలుగులు జిమ్ముతూ
తారాజువ్వ దూసుకుపోతున్నది

అది అంతరిక్షాన్ని చేరి అగ్ని గోళమైంది
ఆ వెంటనే తెలంగాణ రాశిని చేరి
కరచాలనం చేస్తున్నది

అమర వీరులతో ఆప్యాయంగా
అలాయ్‌బలాయ్ అనంతరం
అరబ్బు రాశి వైపుగా దూసుకుపోతున్నది

సాహసవీరుడా, అరబ్బు సూర్యుడా
ఆ మెరుపును చూడగానే పోల్చుకున్నాను
అది అచ్చంగా నువ్వే నువ్వే

అరబ్బు అగ్ని గోళమా
నీ ఆగ్రహం దిగ్దిగంతాలను వేడెక్కిస్తున్నది
నీ ప్రజ్వలనం అనంత విశ్వానికి
వెలుగు నందిస్తున్నది

మతోన్మాద శునకాలతో
పిల్లిమొగ్గలు వేయించావు
ప్రకృతి వనరుల పెత్తనం
ప్రజల చేతికిచ్చావు

స్వేచ్ఛను మించిన సౌఖ్యమేముంది
పోరాడడం కన్న జీవితమేమున్నది
లొంగకపోవడం కన్న విజయమేముంది

పీతిరి గద్దను ఎదిరించిన పిచ్చుకవు
ఆత్మగౌరవానికి ప్రతీకవు
మానవజాతికే వెన్నెముకవు

బుద్ధిజీవులున్న ప్రతి గ్రహంపైనా
నీ స్థూపం కట్టి స్మరించుకుంటారు
నీ ధాతువును బంగారు గురిగిలో పెట్టి
గుండెకు హత్తుకుంటారు

నీ త్యాగాల్ని బతుకమ్మ పాటగా పాడుకుంటాం
మా పిల్లలకు నీ పేరు పెట్టుకుంటాం
కొత్త దంపతులకు ఇక నిన్నే చూపిస్తాం
నీ వంటి బిడ్డను కనమంటాం

సాహసవీరుడా, అరబ్బు సూర్యుడా
ఆ మెరుపును చూడగానే పోల్చుకున్నాను
అది అచ్చంగా నువ్వే నువ్వే!

(అమెరికా కూటమి దురాక్రమణ సైన్యానికి వ్యతిరేకంగా పోరాడుతూ ప్రాణాలు కోల్పోతున్న ప్రతి అరబ్బు యోధునికి అంకితం)



పెద్దగుట్ట దర్గా-అలైబలై సంస్కృతి

# తెలంగాణ ముషాయిరా

● ఎస్.కె.యూసుఫ్ బాబ



పెద్దగుట్ట.. షాదుల్లా బాబా దర్గా! ఎంత ఇంట్రస్టింగ్ స్టోరీ! మనకు రామదాసు గురించి తెలుసు. అలాంటిదే కానీ అందుకు భిన్నమైన ఈ చారిత్రక కథ ఎందుకు తెలీదు?

తెలియకపోవడం వెనుక – అర్థం చేసుకోవాల్సింది ఎంతో వుంది. తానీషాల కాలంలో రామదాసు భద్రాచలంలో ప్రజల నుంచి వసూలు చేసిన కప్పం రాజుకు అప్పజెప్పకుండా రామాలయం కట్టించాడు. అందుకు జైలుశిక్ష అనుభవించాడు. మరి పెద్దగుట్ట ఏరియాలో నిజాంల కాలంలో షాదుల్లా అనే మహానుభావుడు వసూలైన కప్పం కూడా రాజుకు అప్పజెప్పకుండా కష్టాల్లో ఉన్న పేదలకే పంచిపెట్టాడు. వసూలు చేయడం దాటవేశాడు. దాంతో రాజుకు కోపం వచ్చింది. ఒక్కరిని ఇలా వదిలిపెడితే అందరూ రక రకాల కారణాలు చెప్పి ఇలా ఏదో ఒకటి చేసే అవకాశం ఉందని షాదుల్లాను పట్టుకురమ్మని సైనికులను పంపించాడు. షాదుల్లాకు సైనికులకు మధ్య యుద్ధమే జరిగింది. బహుశా షాదుల్లాను వాళ్ళు చంపి ఉంటారు! కాని ప్రచారంలో ఉన్న కథ మాత్రం – సైనికులతో షాదుల్లా ఒక కర్రతో యుద్ధం చేశాడని, చివరికి ఆ కర్రను భూమి మీద కొట్టడంతో భూమి రెండుగా చీలిందని, అందులోకి దూకి మాయమయ్యాడని చెబుతుంది. జానపద కథల్లో హీరో గానీ హీరోయిన్ గాని చనిపోవడం ఉండదు. అలాంటి పరిస్థితే వస్తే వాళ్లు మాయమయ్యారని చెబుతారే తప్ప చనిపోయారనో, చంపబడ్డారనో చెప్పడానికి జానపదులు ఇష్టపడరు. (ఉదాహరణకు సమ్మక్క సారక్క) బహుశా షాదుల్లా విషయంలోనూ అదే జరిగింది. షాదుల్లా మీద ఇలాగే కొన్ని కథలు ప్రచారంలోకి వచ్చాయి. కాకపోతే పెద్దగుట్ట మీద షాదుల్లా మజార్ (సమాధి) ఉంది. దాని పక్కన కొంచెం ఎడంగా ఆయనకు పాలు పోసే సాలప్ప సమాధి కూడా ఉంది. కాని విషాదం ఏమంటే – అంత పెద్ద గుట్ట ఎక్కి షాదుల్లాను దర్శనం చేసుకున్నాక – అక్కడ వసతులేమీ లేకపోవడం బాధేస్తుంది. అది పెద్దగా జనం రాని పుణ్య క్షేత్రమా అంటే అదీ కాదు. ఆ చుట్టుపక్కల నుండి, పక్కనే ఉన్న కర్ణాటక ప్రాంతం నుంచీ పెళ్లయిన ప్రతీ జంట షాదుల్లా ఆశీస్సుల కోసం దర్గాను దర్శనం చేసుకుంటుంది. పెళ్లి కాని అమ్మాయిలు పెళ్లి కావాలని మొక్కుకుంటానికి వస్తుంటారు. రాత్రిళ్లు వచ్చి అక్కడ నిద్ర చేస్తారు. చుట్టుపక్కల చాలా దూరాల నుంచి తమ కోర్కెలు తీరుతాయో లేదో తెలుసుకోవడానికి ఎంతో మంది వచ్చి అక్కడ నిద్ర చేస్తారు. రాత్రి కలలో కనిపించి షాదుల్లా బాబా తాము అనుకున్న పని అవుతుందో కాదో, లేదా ఇంకా ఏదో ఒక విషయం చెబుతాడు. ఆ పని కాదనుకుంటే అసలు షాదుల్లా బాబా కలలోకే రాడు అని వారందరి నమ్మకం.

శుక్రవారం న్యాజ్ (కందూరు) చేయడానికి ఎన్నో బృందాలు అక్కడికి వస్తుంటాయి. ప్రతి సంవత్సరం అక్కడ పెద్ద ఎత్తున ఉర్సు (జాతర) సాగుతుంది. వేరసి మొత్తంగా ప్రతి ఏడాది వక్ఫ్ బోర్డు పాడే పాటలో ప్రస్తుతం కోటి నలభైరెండు లక్షలకు ఎవరో ఒకరు దర్గా రాబడిని పాడుకుంటారు. అంటే కోటి నలభైరెండు లక్షలు వక్ఫ్‌బోర్డుకు చెల్లించి ఆపైన వచ్చే ఆదాయాన్ని పాడినవారు ఉంచుకుంటున్నారంటే ఎంత ఆదాయమొస్తుందో ఊహించుకోవచ్చు. అంత డబ్బు ఆదాయంగా వచ్చినప్పటికీ షాదుల్లా బాబా దర్గా పరిసరాల్లో వసతులేమీ లేవు. మంచి నీళ్లు కూడా కొనుక్కొని తాగాల్సిందే. గుట్ట మీద ఒక్కటంటె ఒక్క సిమెంట్ కప్పు లేదు. దర్గాకు కూడా పైన కప్పు లేదు. రేకులు



www.etelangana.org

ఉన్నాయి.. ఇదేమి చిత్రం! ఇదంతా మాకు ఎలా తెలిసిందంటే.. ఏప్రిల్ 18వ తారీకున నిజామాబాద్ జిల్లా పెద్దగుట్ట (బడా పహాడ్)లో ఉర్దూ – తెలుగు ముస్లిం కవులతో 'తెలంగాణ ముషాయిరా'కు వెళ్లాం. గుట్ట పరిసరంలో ఓ పెద్ద టెంటు వేసి ముషాయిరా జరిపారు నిర్వాహకులు సీహెచ్ మధు, నరహరి, మామిళ్ల సాయిరెడ్డి తదితరులు. నాళేశ్వరం శంకరం, స్కైబాబ కలిసి హైదరాబాద్ నుంచి ప్రత్యేక వాహనంలో ఉర్దూ – తెలుగు కవుల్ని తీసుకెళ్లారు. బహుశా తెలంగాణ చరిత్రలో తెలంగాణ ముషాయిరా జరగడం ఇదే మొదలు కావచ్చు. ఉర్దూ కవులు వేరే లోకంగా ఉండదం, వారితో తెలుగువారికి ఏమీ సంబంధాలు లేకపోవడం తెలిసిందే. వారిని కలుపుకొని తెలుగు ముస్లిం కవులతో ముషాయిరా జరగడం, అదీ ఒక దర్గా దగ్గర జరగడం విశేషం. ఎందుకంటే – ఈ మధ్య కాలంలో దర్గా సంస్కృతిపై నీలినీడలు అలుముకుంటున్నాయి. హిందూత్వవాదం చాపకింద నీరులా పెరుగుతుండడంతో దర్గాల దగ్గరికి వచ్చే కొందరు హిందువులు తగ్గిపోతున్నారు. అట్లే ముస్లింలకు సంబంధించి కొన్ని మత సంస్థలు (జమాత్‌లు) దర్గాల దగ్గరికి పోవడం సరైంది కాదంటూ ప్రచారం చేస్తుండడంతో కొందరు ముస్లింలు కూడా వెళ్లడంలేదు. దీనివల్ల దర్గాలకు వెళ్లే హిందూ – ముస్లింల కలగలుపు సంస్కృతి తగ్గిపొయ్యే ప్రమాదం ఏర్పడింది. దర్గాలు ఈ దేశంలో హిందూ – ముస్లింల మత సామరస్యానికి ఒక ప్రతీకగా నిలిచి ఉన్నాయి. ఈ సంస్కృతిని కాపాడుకోవాల్సిన అవసరముంది. ముందు ముందు దర్గాల దగ్గర సభలు, సమావేశాలు జరుపుకోవాలని 'హర్యాళి' ముస్లిం రచయితల వేదిక గతంలోనే ఒక నిర్ణయం తీసుకొని ఉంది. స్కైబాబ సంపాదకత్వంలో తీసుకువచ్చిన 'అలావా' ముస్లిం సంస్కృతి కవితా సంకలనంలోనూ దర్గా సంస్కృతికి సంబంధించి చాలా కవితలున్నాయి. అందుకే పెద్దగుట్ట దర్గా దగ్గర ఈ ముషాయిరా జరగడం విశేషమే.

ఇదొక చారిత్రక ముషాయిరా అని వక్తలు మళ్లీ మళ్లీ పేర్కొన్నారు. వెళ్లినవారిలో మగ్దూం మొహియుద్దీన్ కొడుకు నుస్రత్ మొహియుద్దీన్ ఉండడం విశేషం. ఉర్దూ కవి అయిన నుస్రత్ ఈ ముషాయిరాలో ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. ఆయన్ను చూస్తుంటే మగ్దూంను చూస్తున్నట్లే ఉందని ఫీలయ్యారు నిర్వాహకులు, సభికులు. అలాగే హైదరాబాదీ ఫేమస్ పెయింటర్ సయ్యద్ బిన్ మొహమ్మద్ కుమార్తె జమీలా నిషాత్ పాల్గొనడం మరొక విశేషం. ఆమె జాతీయంగా, అంతర్జాతీయంగా ఉర్దూలో ప్రముఖ కవయిత్రి. వీరిద్దరితోపాటు స్కైబాబ, నిసార్, అలీ, మాజీద్, అహ్మద్ పాషా, సిరిసిల్ల గఫూర్ శిక్షక్ తదితర ఉర్దూ – తెలుగు ముస్లిం కవులు పాల్గొన్నారు. అట్లే నాళేశ్వరం శంకరం, సీహెచ్ మధుతో పాటు దేవకీదేవి, కందుకూరి శ్రీరాములు, సీహెచ్ ప్రకాశ్, సూరారం శంకర్, జనజ్వాల తదితర తెలుగు కవులు పాల్గొన్నారు. ఇంకా చాలామంది తీవ్రమైన ఎండ కారణంగా రాలేదు. ముషాయిరాలో జమీలా నిషాత్ దక్కనీ తరహా కవితను గానం చేశారు. దానిపై సభికులు ఎంతో ఫిదా అయ్యారు. బగార అన్నం, యాట కూరతో మధ్యాహ్నం దావత్ అదిరింది. ముషాయిరా ముగిశాక అందరం పెద్దగుట్ట ఎక్కడానికి వెళ్లాం. కొందరు కింద ఆగిపోగా ఎక్కువమందిమి ఆడుతూ పాడుతూ గుట్ట ఎక్కాం. పైన చెప్పుకొన్న విషయాలన్నీ తెలిశాయి. చీకటి పడుతుంటే గుట్ట దిగుతుంటే నిద్ర చేయడానికి ఎంతో మంది గుట్ట ఎక్కుతూ కనిపించారు. ఒక పది, పదిహేను మంది సెల్వార్ ఖమీజ్‌లు ధరించిన ముస్లిం అమ్మాయిల గుంపు ఒకటి టార్చ్‌లైట్లు పట్టుకొని పైకి ఎక్కుతుండడం కనులవిందు చేసింది.

విషాదం ఏమంటే – గుట్ట పైకి మెట్ల దారిలో అటువైపు ఇటువైపు చిన్న చిన్న గుడిసెలు.. అందులో ఉన్న మనుషులు.. ఎక్కువ గుడిసెల్లో ఒక్కొక్కరే ఉండడం ఆశ్చర్యం వేసింది. పరిస్థితిని అర్థం చేసుకుంటే ఎక్కడలేని బాధేసింది. చాలా గుడిసెల్లో ఏ ఆధారమూ లేని ముసలివాళ్లు. తమ బిడ్డలు పోషించలేక వదిలేస్తే అక్కడ పడి ఉన్నవాళ్లు, ఏదో ఒక రోగంతో బతుకీడుస్తున్నవాళ్లు గుడిసెల బయట కూర్చుని అడుక్కుంటున్నారు. కొందరు అలా పడుకోబెట్టి ఉన్నారు. దిక్కులేని వారికి దేవుడే దిక్కు అంటే ఇదే కావచ్చు.. వారి దీనమైన ముఖాలు.. వారి ఒంటరితనం.. లోకుల బాధ్యతారాహిత్యం.. ఆ కొద్ది సమయంలో ఏం చేయాలో తెలియని.. గుండెల్ని పిండేసే బాధ మనసుల్లోకి ప్రవేశించి అలాగే మస్తిష్కాలపై గూడు కట్టుకొని నిలిచిపోయింది! ■



www.etelangana.org